# గబన్

ప్రేమ్‌చంద్







విశాలాంధ్ర ప్రచురణాలయం
ఏలూరు రోడ్డు : : విజయవాడ

# గబన్

(నవల)

రచయిత :

ప్రేమ్‌చంద్

అనువాదం :

ఆలూరి భుజంగరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ–2

# అంకితం

అనేక దుర్దినాల్లో సంవత్సరాలతరబడి దీర్ఘంగా
వెంటాడే నా రోగాల్లో నన్ను కాపాడుకోవడమే
తన సర్వస్వం అనుకుని సేవచేసిన, యింకా
చేస్తున్న మాతృదేవత అయిన
ఆలూరి శీతారామమ్మ గారికి
నా అనువాదాన్ని సమర్పిస్తున్నా.

— ఆలూరి భుజంగరావు

5

# 1

శ్రావణమాసం వచ్చింది. ఆకాశమంతా వెలిమబ్బులు కమ్ముతున్నాయి. ఆగి ఆగి సన్నని తుంపర్లు పడుతున్నాయి. మూడుగంటలకే సొద్దుగూకుతోందా అన్నట్లుంది.

ఈ శ్రావణమాసంలో స్త్రీలు; తమ యౌవనపు ప్రథమానుభూతుల్ని ఒకసారి నెమరువేసుకుంటూ వుంటారు. ఊరిచివరవున్న మామిడితోపులో వుయ్యాలలు వేశారు. ఊగడానికి చాలమంది పిల్లలూ, నడివయస్సు స్త్రీలుకూడా వచ్చారు. అందరూ చక్కగా అలంకరించుకున్నారు. యౌవనప్రాంగణంలో నుంచి నిష్క్రమించబోతున్న ఈ స్త్రీల రంగురంగు అలంకారాలను చూస్తుంటే, వాడిపోయిన పూలు తిరిగి వికసించబోతున్నయ్యా! అనిపిస్తుంది.

సరీగా అదే సమయాన, ఒక గిల్టునగలవ్యాపారి, పెట్టెనిండా రకరకాలైన వస్తువుల్ని పెట్టుకుని అక్కడికి వచ్చాడు. అతన్ని చూడగానే చిన్నా పెద్దా అందరూ, వుయ్యాలలు దిగి, వేలంవెర్రిగా చుట్టూ మూగారు. చుట్టూ మూగిన స్త్రీలకు తన దగ్గిరవున్న ఒక్కొక్కవస్తువునూ వివరంగా చూపుతున్నాడు. ఉంగరాలు, లోలకులు, పిల్లలు ఆడుకునే బొమ్మలు అనేకం చూపిస్తున్నాడు. అక్కడవున్న పిల్లలందరూ తల్లుల్ని వేధించి ఎవరికి కావల్సినవి వాళ్ళు కొనుక్కుంటున్నారు. ఆ పిల్లల్లో ఒక పిల్లమాత్రం నిమ్మకు నీరెత్తినట్లు దూరంగా నిలబడివున్నది. ఆ అమ్మాయి కళ్ళు చలాకీగా, విశాలంగా, ఆకర్షణీయంగా వున్నై. తోటిపిల్లల సందడి అంతా అణిగిపోయిన తరువాత అతని దగ్గరకు వచ్చింది. ఆ పిల్లతోబాటు తల్లికూడా ముందుకు నడిచింది.

ఆ అమ్మాయి తన చిన్ని చేతుల్తో పెట్టెలోవున్న సామాన్లను ఒకటి రెండుసార్లు అటూ ఇటూ తిరగేసి చూసింది. ఏదీ నచ్చినట్టు లేదు. ఏం తీసుకోనుః అన్నట్టు తల్లిముఖంలోకి చూసింది ఒకమాటు. తల్లి ఏదో ఒకటి తీసుకోమని కండ్లతోనే సౌంజ్ఞ చేసింది. తరువాత మెల్లగా పెట్టెలోనుంచి ఒక చంద్రహారాన్ని బయటికి తీసింది.

కూతురు చేతిలోవున్న చంద్రహారాన్ని వ్యాపారికి చూపుతూ, "దీని ధర ఎంతని చెప్పావుః" అన్నది.

వ్యాపారి హారాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు. పై గుడ్డతో తుడుస్తూ, "రూపాయిపావులా చెబుతున్నాను; తరువాత తమ దయ" అన్నాడు.

"రూపాయి పావులా? చాలా ఎక్కువ చెబుతున్నావు! నాలుగురోజుల్లో ఈ తళుకంతాపోయి బొగ్గులా తయారౌతుంది" అన్నది తల్లి.

"వ్యాపారి ఒకసారి అమ్మాయివంకచూసి నవ్వుతూ, "నాలుగురోజుల తరువాత ఈ హారపు మెరుగు పోయినా ఫరవాలేదమ్మా! అప్పుడమ్మాయిగారికి అసలు హారమే వస్తుంది. దీని మెరుపుంటే ఎంత, లేకపోతే ఎంత!" అన్నాడు.

తల్లి ఎందుకనో మారుమాట్లాడకుండా వ్యాపారి చెప్పిన ధరను యిచ్చి హారాన్ని తీసుకున్నది.

దాన్ని చూసుకుని కూతురు మహాసంబరపడింది. దాన్ని మెళ్లో వేసుకుని వూరంతా తిరిగింది. తోటి స్నేహితురాండ్రందరకూ ఆప్యాయంగా, గర్వంగా చూపించింది.

ఆ అమ్మాయి పేరు జాలప. తల్లి పేరు మానకి.

# 2

దీనదయాళుడు ప్రయాగకు దగ్గర్లోవున్న ఒక చిన్న గ్రామంలో నివసిస్తూ వుంటాడు. అత డా గ్రామ జమీందారుగారి పెద్ద గుమాస్తా. అతనికి పొలమూ, పుట్రా ఏమీలేవు. అయినా వ్యవసాయంలో ఎలుపు సులువులన్నీ తెల్సు. ఊరి రైతుల్లో ఎక్కువగా లావాదేవీలు వుంటూ వుంటాయ్. కనుక జమీందారుకన్నా వూళ్లో పలుకుబడి అతనికే ఎక్కువ. ఇంటిముందు ఎప్పుడూ నలుగురు నౌకర్లు హాజరు. అందంగా అలంకరింపబడిన ఒక గుఱ్ఱపుబండి హమేషా సిద్ధంగా వుంటుంది. గొడ్లచావట్లో నాలుగు బర్రెలూ; రెండు ఆవులూ కళకళ్లాడుతూ కనిపిస్తుంటయ్యి. ఇవన్నీ అతని హోదాకు గీటురాళ్ళు. ఇంత దర్జాగా జీవితాన్ని గడిపే అతనికి జమీందారుగారు ఇచ్చే జీతం నెలకు అయిదు రూపాయలంటే చాలా ఆశ్చర్యం వేస్తుంది. ఆ అయిదురూపాయలు, అతని పొగాకు ఖర్చుకుకూడా చాలవు. మరి ఇంత అట్టహాసంగా బ్రతకడానికి ఆదాయం ఎక్కడినుంచివస్తుందో భగవంతుడికే తెలియాలి!

జాలప ఈ దీనదయాళుడి కూతురే. అతనికి ఈ పిల్లకుముందు ముగ్గురు మగపిల్లలు పుట్టారు. కానీ, వాళ్ళెవరూ యిప్పుడీ లోకంలో లేరు. ఎవరైనా జాలపను మీ అన్నలు ఏరని అడిగితే, "చాలాదూరం ఆడుకోడానికి పోయారు. ఇక ఎప్పుడూ రారు" అని అమాయకంగా సమాధాన మిస్తుంది.

దీనదయాళుడి ముగ్గురు మగపిల్లలు ఒకరితరువాత ఒకరుగా ఒకే సంవత్సరంలో చనిపోయారు. ఇది జరిగిన తరువాత అతని మనస్తత్వంలో కొంత మార్పు వచ్చింది.

అతను సాధారణంగా ముక్కుకి సూటిగా పోయే వ్యక్తి. పన్నులు వసూలు చేయడంలో దయాదాక్షిణ్యాలు చూపడం జమీందారీ విధానానికే దెబ్బ అని అతని నిశ్చితాభిప్రాయం. పన్నుల వసూళ్ళకాలం వస్తే చాలు, ఊళ్ళో పేదప్రజానీకానికి ఇతనంటే సింహస్వప్నమే. ఒక సంవత్సరం ఒక ఆసామి పన్ను చెల్లించకపోతే దీనదయాళుడు ఆ ఆసామిని కొరడాలతో బాదించాడు. అతనా దెబ్బలకు తాళలేక హరీ అన్నాడు. సరీగా అదే సంవత్సరం దీనదయాళుడి ముగ్గురుకొడుకులూ వరుసగా చనిపోయారు. అప్పటినుంచీ కొంచెం వెనకముందు లాలోచించసాగాడు. పాప, పుణ్యాల తారతమ్యం గురించి తలపోయ సాగాడు.

ఇతను తరచుగా ప్రయాగకు వెళ్తూవుంటాడు. వెళ్ళినప్పుడల్లా కూతురు కోసం ఏదో ఒక క్రొత్త నగ కొనుక్కు వస్తూవుంటాడు. నగలమీదకన్నా ఆట వస్తువులమీద పిల్లలకు ఎక్కువ మక్కువ వుంటుందని అతని కెన్నడూ తోచ లేదు. ఒకవేళ తోచినా, కూతురుకంటూ ఎన్నడూ ఆటవస్తువులు పట్టుకురాలేదు. అట్లాగని జాలప ఆడుకోవడమూ మానలేదు. తండ్రి తెచ్చిన నగల్నే ఆట బొమ్మలుగా ఆడుకుంటూ వుండేది.

చంద్రహారం వచ్చినప్పటినుంచీ జాలప తన నగలన్నింటినీ దూరంగా నెట్టివేసింది.

ఒకరోజు దీనదయాళుడు ప్రయాగనుంచి వస్తూ భార్యకోసం అసలైన బంగారపు చంద్రహారాన్ని పట్టుకువచ్చాడు. ఎంత హీనపక్షంలోనైనా దాని ఖరీదు ఆరువందలరూపాయలకు తగ్గదు. డాబు దర్పాలతో సాగిస్తున్న సంసారపు ఖర్చులుపోను ఆరువందలరూపాయలు వెనకవేయటం అంటే అంత సాధ్యమైన విషయమా? అయినా పెళ్ళాంపోరు పడలేక ఎలాగో ఆ సొమ్ము వెనకేశాడు.

తల్లికి తెచ్చిన హారం చూసింతరువాత జాలపకు తన గిల్టు హారంమీద మోజు పోయింది. ఒకరోజు తండ్రిదగ్గరకు పోయి, "నాకుకూడా అల్లాంటి హారమే తెచ్చిపెట్టవు నాన్నా?" అంటూ గారాబంగా అడిగింది.

దీనదయాళుడు నవ్వి, "సరే" అన్నాడు.

"ఆఁ! ఎప్పుడేమిటి తెచ్చేది?"

"తొందర్లోనేనమ్మా!"

తండ్రి మాటల్లో నమ్మకం చాలక జాలప నేరుగా తల్లిదగ్గరకు పోయి అడిగింది.

"అమ్మా! నాకూ అలాంటి హారం చేయించవూ?"

"ఇలాంటిదే కావాలంటే ఎల్లాగమ్మా? ఇది చాలా ఖరీదు అవుతుందాయె!"

"ఆఁ ఆఁ నువ్వుమటుకు చేయించుకున్నావు. నాకుమాత్రం ఎందుకు చేయించకూడదేం?"

తల్లి చిరునవ్వు నవ్వి అన్నది: "నీకు పెండ్లిఅయితే, నీ అత్తగారు దీన్ని మించిన ఖరీదైనది తెచ్చి పెడతారు."

జాలప సిగ్గుపడి అక్కడినుంచే వెళ్ళిపోయింది. కానీ, తల్లి అన్న మాటలు ఆమె హృదయంలో గూడుకట్టుకున్నై.

పెళ్ళయితే బంగారు చంద్రహారం వస్తుందనే వూహ ఆ పిల్లకు కొంత సంతృప్తినీ, ఆనందాన్నీ కలిగించింది. సహజంగా పెళ్ళిమీదా, అత్తవారింటి మీదా వుండే ఏదో చెప్పనలవికాని విముఖత్వం ఆమెలో క్రమేణా పోసాగింది.

పుట్టింటికంటే అత్తవారిల్లే నయంకాబోలు అనుకుంది. కనుకనే వాళ్ళు, వీళ్ళు ఇవ్వలేని విలువైన వస్తువులు ఇస్తున్నారని హృదయాన్ని సమాధాన పరచుకునేది.

కానీ, అత్తవారుకూడా చంద్రహారాన్ని చేయించకపోతే! తను చూస్తుండగానే ముగ్గురు స్నేహితురాండ్రకు పెళ్ళిళ్ళు జరిగినయ్యి. వారిలో ఎవ్వరికీ చంద్రహారాలు రాలేదు. ఒకవేళ తనక్కూడా అల్లాగే జరిగితే? అంతగా అయితే అప్పుడు అమ్మ తన హారాన్ని ఈయదా? ఎందుకీయదు? ఇస్తుంది.

ఈ విధమైన రకరకాల ఆలోచనల్తో, నవ్వుల్తో, ఆటల్తో, జాలప తన కౌమారాన్ని గడిపి యుక్తవయస్కురాలైనది. సంబంధంకోసం ప్రయత్నాలు సాగిపోతున్నాయి.

# 3

దీనదయాళుడి పరిచయులందరిలోను దయానాథుడు ముఖ్యుడు. సహృదయుడు, సదాచారి కావడంవల్ల దీనదయాళుడికి అతనంటే ఎంతో అభిమానం. దయానాథుడు ప్రయాగ కచ్చేరీలో ఒక చిన్న గుమాస్తా. కచేరీ వ్యవహారాలతో ప్రారంభమైన వారిద్దరి పరిచయం ప్రగాఢమైత్రిగా మారింది.

దీనదయాళుడికి నిత్యం కచ్చేరీలో ఏదో ఒక పని వుంటూనే వుంటుంది. అతని దగ్గర దయానాథుడే గనక లంచం గుంజదల్చుకుంటే, వేలకువేలు వెనక వేసుకోగల్గేవాడే. కానీ, ఒక్కదమ్మిడీకూడా పుచ్చుకోలేదు.

దయానాథుడి ప్రవర్తన ఒక దీనదయాళుడి విషయంలోనే ఇలా వుంటుందనుకునేరు? ఆతను ఎవ్వరిదగ్గరా లంచం పుచ్చుకోడు. ఎంత అపరిచితులు వచ్చినా లంచానికి ఆశించకుండా పనిచేసిపెడతాడు. జీతపురాళ్ళతో ఇల్లు గడవక నానాబాధలూ పడుతుంటాడు. కానీ లంచంరూపంలో చిల్లిదమ్మిడీగూడా ఇంటికి తీసుకురాడు.

అతను గొప్ప ఆదర్శాలుగల వ్యక్తి కావడంవల్ల లంచాలు పుచ్చుకోడు గావును, అనుకునేరు! అతను తన యాభై సంవత్సరాల జీవితంలోనూ, లంచంవల్ల కలుగుతూన్న దుష్ఫలితాల నెన్నిటినో చూశాడు. విన్నాడు. అందువల్లనే ఇలా మారాడు. ఎవరైనా ఈ విషయంలో కదిలిస్తే, "పాపిష్టి సొమ్ము పాపిష్టిగానే పోతుంది" అంటూవుంటాడు.

దయానాథుడికి వచ్చే జీతం యాభై రూపాయలు సంసారానికి చాలక నానా బాధలూ పడుతుంటాడు. మొత్తం ఐదుజీవులూ ఈ జీతపురాళ్ళల్లో బ్రతకాలి. పిల్లలు మంచి బట్టలకూ, పుష్టికరమైన ఆహారానికీ మొహంవాచిపోయారు. భార్య నగలకోసం ఎప్పుడూ నిష్ఠూరాలు ఆడుతూనే వుంటుంది. పెద్దకొడుకు రెండునెల్లు మాత్రమే కాలేజీలో చదివి జీతం కట్టలేక చదువు చాలించాడు. ఇంత అయినా దయానాథుడు చలించలేదు.

పెద్దకొడుకు రమానాథుడు కాలేజీమాని, పనీపాటా లేకుండా తిరుగుతున్నాడు. ప్రొద్దున్నే తిండితిని పోయినపోవడం రాత్రికిగాని ఇంటికి రాడు. ఈ మధ్యసమయంలో స్నేహితులదగ్గిరకూర్చుని పేట్లాడటం, చదరంగం ఆడటం అదీకాకపోతే బడాయిలు కొట్టుతుండటం – యిదీ ఆయన దినచర్య. ఇంటి ఆర్థిక సమస్యలు అతనికి బొత్తిగా పట్టవు. పదిమంది స్నేహితులున్నారు. పదిమంది

దగ్గిరా తలా ఒకలాగూ ఒకచొక్కా ఎరువు పుచ్చుకుంటాడు. ఇంకేం! బట్ట మాయకుండా తిరుగుతుంటాడు.

దీనదయాళుడు తన కూతురు జాలపని ఈ రమానాధుడికే ఇయ్యా నిశ్చ యించాడు.

రమానాధునికి ఇప్పుడే పెండ్లిచేయడం తండ్రి దయానాధుకు ఏమాత్రం ఇష్టంలేదు. పెండ్లికి కావలసిన డబ్బు ప్రస్తుతం దగ్గిర లేదు. తీరా చేశాడే అనుకో; ఇంకొక వ్యక్తినికూడా పోషించడానికి తగిన ఆదాయమేది? ఎక్కువగా శ్రమించి ధనోపార్జన చేద్దాం అనుకుంటే శరీరంలో శక్తికూడా వుడిగిపోయింది. పోనీ, కొడుకయినా బుద్ధికలిగి నాలుగుడబ్బులు సంపాయిస్తాడనే ఆశ అతని కేమాత్రం లేదు.

అతను చప్పున పెండ్లికి ఒప్పుకోలేదు. కొడుకు నాలుగుడబ్బులు సంపాయించుకునే స్థితికి వచ్చేవరకూ పెండ్లిచేయకూడదని అతని అభిప్రాయం.

కానీ, ఈ విషయంలో రమానాధుడి తల్లి రాజేశ్వరి అభిప్రాయం దయానాధుడి అభిప్రాయానికి పూర్తి వ్యతిరేకం. కొడుక్కి పదహారోఏడు వచ్చినప్పటినించీ ఆమె కోడలి రాకకోసం ఎదురుచూస్తూ వున్నది. తన కండ్లముందు గోచీలు పెట్టుకోకుండా తిరిగిన వాళ్ళంతా బిడ్డతండ్రు లౌతున్నారనీ, తనకొడుక్కి ఆలూపోలూ లేదనీ దిగులుతోవుండేది. చాలా రోజులనుంచీ ఎల్లాంటి సంబంధం వచ్చినా తలవంచుకు చేసేసుకుందాం అని ఎదురు చూస్తున్నది. కానీ, రమానాధుడు ఆటకాయితనంగా తిరుగుతుంటటంవల్ల రాజేశ్వరి కోరిక నెరవేరలేదు. ఎల్లాగో భగవంతుడి దయవల్ల ఒక్క సంబంధం వచ్చింది. దాన్ని పోనిస్తుందా మరి!

రాజేశ్వరి ఈ పెండ్లి తప్పనిసరిగా జరగాలని పట్టుబట్టింది.

"ఇదిగో! నా దగ్గిర డబ్బులేదు. ఎలా లేదన్నా రెండువేలైనా కావాలి. అదీకాక తనపొట్ట తనే పోషించుకోలేనివాడికి పెళ్ళిచేయటం నాకేమాత్రం ఇష్టం లేదు" అన్నాడు దయానాధుడు.

ఆర్థికరూపంలో వున్న ఈ అభ్యంతరాన్ని రాజేశ్వరి చిటికెల్తో ఎగరగొట్టేసింది.

"ఎందుకు మీరలా డబ్బులేదని నిరుత్సాహపడతారు? వాళ్ళు కొంత ఇస్తారు కదా?"

"నేను ఇంకోళ్ళ దగ్గరకుపోయి దేబిరించే రకం కాదు."

"మీ రసలు నోరుతెరచి అడగవల్సిన పనేలేదు. మీ రడక్కుండానే ఇస్తారు. కాకపోయినా ఆడపిల్ల పెళ్ళిలో డబ్బుకు వెనకాడతారా? అదీ ఒక్కతే కూతురైనప్పుడు?"

దయానాధుడికి ఇంకేం మాట్లాడాలో తెలియలేదు. అర్ధాంగికారాన్ని సూచిస్తూ ఇలా అన్నాడు :

"ఇదిగో! వాళ్ళు ఇస్తారా? వద్దనను. ఇవ్వరూ! నోరుతెరచి అడిగేదిలేదు. తీరాముగిసి వాళ్ళివ్వకపోతే, పట్టుపట్టుమని అప్పుతెచ్చే స్థితిలేదు. ఒకవేళ తెస్తానే అనుకో, తీర్చే వుపాయంమాత్రం ఏముంది?"

"వాళ్ళు తాంబూలాల్లో వెయ్యి రూపాయలైనా ఇస్తారని నా నమ్మకం. తాంబూలాలలో వెయ్యి ఇచ్చినవాళ్ళు, అలకలోనూ, చదివింపుల్లోను కలిపి ఇంకో వెయ్యిరూపాయలైనా ముట్టచెప్పకపోతారా? మొదటివెయ్యి మీ ఖర్చులకు-మర్యాదలకూ అట్టహాసాలకు వాడుకోండి. రెండోవెయ్యికి నగలు పట్టుకురాండి. కాకపోతే, ఏ షరాబుదగ్గరైనా, ఒకవారం గడువుపెట్టి అప్పు పట్టుకురండి. అలక డబ్బు చేతికిరాగానే తీర్చవచ్చును. అంతగా ఒకటి రెండువందలు మిగిలివుంటే నిదానంగా తీర్చుకోవచ్చు. మూడుముళ్ళూపడి, నాలుగురోజులు గడిచిన తరువాత ఏదో ఉద్యోగం చూసుకుంటాడు."

"ఆఁ ఉద్యోగం చూసుకుంటాడు! వాడేమో, వాడిస్నేహితులేమో. వాడికి ఉద్యోగం గొడవ పట్టేడిసింది?

రాజేశ్వరికి తన పెళ్ళినాటి విషయాలు జ్ఞాపకానికి వచ్చినయ్. పెండ్లి కాక ముందు దయానాధుడుకూడా రికామిగా బజార్లవెంట తిరుగుతూ వున్నవాడే. ఆ నాలుగు అక్షతలు నెత్తినపడ్డ నెలలోపే ఉద్యోగంలో ప్రవేశించాడు.

"పెండ్లాంవచ్చి, అవి కావాలి, ఇవి కావాలి అంటూంటే వాడే చూసుకుంటాడు. ఇంతెందుకు మీ విషయం చెప్పండి? పెండ్లి అయిన నెలకే ఉద్యోగం సంపాయించుకున్నారా, లేదా? పెండ్లనే గుదిబండ మెడనుకట్టేవరకే, ఈ తిరగడాలూ, పోచికోలు కబుర్లూను! ఆ కొంచమూ జరిగిందా అన్నీ పోతయ్."

రాజేశ్వరి భర్త కండ్లలోకి ప్రశ్నార్థకంగా చూసి నవ్వింది.

దీనితో, దయానాధుడు పూర్తిగా ఓడిపోయాడు. మారుమాట్లాడకుండా దినపత్రికను చదువుతున్నట్టు నటిస్తూ కూర్చున్నాడు, తన ఓటమిని కప్పిపుచ్చుకోవడానికి.

13

# 4

దీనదయాళుడు మంచివాళ్ళదగ్గిర అతి మంచిగా ప్రవర్తిస్తాడు. అవతలి వాడు ఏమాత్రమైనా కరుగ్గావున్నట్టు తెల్సిందా, అంతు తెల్సుకునేదాకా వదలడు. దయానాధుడేగనక అవికావాలి, ఇవికావాలని పేచీలు పెట్టినట్లయితే, ఆజన్మాంతం జ్ఞాపకం వుండేటట్లు శాస్తిచేసేవాడే! కానీ దయానాధుడి ఆడంబరరహితమైన సహజ స్వభావం అతన్ని బాగా వశీభూతుడిని చేసుకుంది. మొత్తం అన్ని లాంఛనాలకూ కలిపి వెయ్యిరూపాయలు ఇద్దాం అనుకున్న అతను, తాంబూలాల్లోనే వెయ్యి యిచ్చివచ్చాడు.

ఈ విషయమే మాట్లాడుతూ మానకి ఇలా అన్నది.

"మరి తాంబూలాల్లోనే వెయ్యి యిచ్చినప్పుడు, ఎల్లాలేదన్నా ఇంటిదగ్గిరో వెయ్యిరూపాయలైనా ముట్టచెప్పవద్దా? ఇంతడబ్బు ఎక్కడనుంచి వస్తుంది?"

దీనదయాళుడు విసుగ్గా అన్నాడు.

"వాళ్ళు మనతో మర్యాదగా వ్యవహరించినప్పుడు, మనంమాత్రం మన మర్యాదను నిలబెట్టుకోవద్దా? వాళ్ళేగనక బెట్టుచేసి గొప్పలకు పోయినట్టయితే, నేను తడాఖా చూపేవాడిని. ఇక భగవంతుడే వున్నాడు!"

దీనదయాళుడు ఈ విధంగా వెయ్యిరూపాయలు ఇచ్చిపోవడంతో, దయానాధుకి బరువు, బాధ్యతలు తగ్గడానికి బదులు ఎక్కువైనయ్. ఎంతో పిసినిగొట్టుతనంగా వ్యవహరిద్దామనుకున్న అతను, ఇంత సహృదయుడైన వియ్యంకుడి మనస్సు ఎక్కడ కష్టపడుతుందోనని గుప్పెడ పూర్తిగా తెరవడానికీ, భారీగానే ఖర్చుపెట్టడానికి నిశ్చయించుకున్నాడు.

మొదట్లో ఆటలూ, పాటలూ తదితర వినోదకార్యక్రమాల నన్నింటినీ బందుచేద్దాం అనుకున్నాడు. కానీ దీనదయాళుడి సహృదయత ఇతనిలోని శృంఖలాలను తెంపివేసింది. ఏర్పాట్లన్నీ బ్రహ్మాండంగా చేయించాడు. ఒకినగలకే మూడువేలు ఖర్చుపెట్టాడు. వాళ్ళు ఇచ్చిన వెయ్యి, తన దగ్గిరవున్న కొంత డబ్బు పోను నగలషరాబుకు ఒక వెయ్యిరూపాయలు ఈయవలసివస్తే వారంరోజుల్లో ఇస్తానని ఒప్పించాడు.

ఇంతచేసినా దయానాధుడికి రత్నాల చంద్రహారం తీసుకుని, ఆడపెండ్లివారిని విభ్రాంతుల చేయకపోతినే అనేబాధ వుండనే వున్నది. అక్కడికీ ఏమైతే అయిందని ఇంకోవెయ్యి అప్పుచేసి చంద్రహారం తీసుకోవడానికి సిద్ధంఅయ్యాడు.

కానీ భార్య రాజేశ్వరి యింత అప్పుచేయడానికి సమ్మతించలేదు. దానిమీద ఇద్దరూ ఘర్షణపడ్డారుకూడాను.

"నీకేం, యింట్లో కూర్చుని లక్షకబుర్లు చెబుతావు. చంద్రహారం వద్దంటావు. ఇంకా మాట్లాడితే అసలు నగలే వద్దంటావు! నలుగురిలో నగుబాట్లయేది నేనుగా?"

"నలుగురూ నవ్వుతారని కొండయెత్తి నెత్తిన పెట్టుకుంటారా? మన శక్తికిమించిన పనులు చేయడం దేనికి? ఒకవేళ అప్పు తెస్తారే అనుకోండి, తీర్చేదెల్లా?"

"ఇంకో వెయ్యిరూపాయలు వాళ్ళు యిస్తారుకదా?"

"రుచి మరిగావు....?"

దయానాథుడు కొంచెంగా సిగ్గుపడ్డాడు.

"అదికాదు; ఎంతోకొంత వాళ్ళనుంచే రాకపోతుందా అని."

"పేరుప్రతిష్టలు నిలబడేది నగలవల్లకాదు; దానధర్మాలవల్ల. వాళ్ళు యిచ్చిన నాలుగుడబ్బులూ నగలకు ఖర్చుపెడితే, ఇంటికి వచ్చినవాళ్ళకు ఏం పెడతారు? ఎవ్వరికీ ఏమీ పెట్టకపోతే మనింట్లో పెండ్లి జరిగిందనైనా అనుకోవద్దా?"

దీనితో దయానాథుడు లొంగిపోయాడు. చంద్రహారం తీసుకోవడం విరమించుకున్నాడు.

దయానాథుడు ఎంత ఆడంబర రహితుడో రమానాథుడు అంత డాంబికుడుకూడ. రమానాథుడికి షోకులూ, టాకులూ, వేషభాషలే జీవితం. మగపెండ్లివారు అతి అట్టహాసంగా వెళ్ళాలనీ, ఆడపెండ్లివాళ్ళు దిగ్భ్రమచెందాలనీ అతని వుద్దేశ్యం. ఆ వుద్దేశ్యంతోనే తండ్రి నిర్ణయించిన పల్లకీ పనికిరాదని చిన్న కారును తెప్పించాడు.

దయానాథుడు మితభాషి. అతని కా వూర్లో చెప్పుకోదగ్గ మిత్రులెవ్వరూ లేరు. కానీ, రమానాథుడు ఈ విషయంలోనూ, తండ్రికి పూర్తి వ్యతిరేకే. అతను బహు కలుపుగోలుతనంకల వ్యక్తి. అతనికి వూరంతా స్నేహితులే! అందరూ వచ్చారు. తలా ఒకచేయి వేశారు. మందుగుండుసామాను స్వయంగా తయారుచేశారు. ఆటలకూ, పాటలకూ, రకరకాలైన వినోదాలకూ కావల్సిన ఏర్పాట్లన్నీ చేసేస్తున్నారు. ఈ ఆర్భాటం చూస్తుంటే. దయానాథుడి గుండెలు బేజారైపోతున్నై. అయినా ఎలా వద్దనడం?

# 5

దయానాధుడు మహా అట్టహాసంతో ఆడపెండ్లివారింటికి బయలుదేరాడు. రమానాధుడు చిన్నకారులో అలంకరించుకుని ఠీవిగా కూర్చున్నాడు. కారుకు ముందు బాండువాయిద్యాలు చెవులను గింగురుమనిపిస్తున్నై. మందుసామాన్ల విషయం చెప్పనే అవుసరంలేదు. వూరివాళ్ళంతా విస్తుపోతూ చూస్తున్నారు. అర్థరాత్రి పట్టపగలుగా మారిపోయింది.

అంతవరకూ ఆ వూరికి ఇంత ఆడంబరంగా ఏ పెళ్ళివాళ్ళూ రాలేదుట! దయానాధుడు 'ఔ' నని అనిపించుకున్నాడు.

వీళ్ళు ఇంత ఆడంబరాలూ, అట్టహాసాలూ చేసినా జాలప హృదయం ఈషణ్మాత్రమైనా కదలలేదు. ఈ బాండువాయిద్యాలూ, మందుసామాన్లూ ఆ అమ్మాయి హృదయాన్ని తాకలేకపోయినై. సంతోషంగానీ, ఆనందంగానీ ఆ అమ్మాయి ముఖంలో కనుపించడంలేదు. తనకు సంబంధంలేని ఏదో విషయం జరుగుతున్నట్టు పట్టీపట్టనట్టు వున్నది.

ఆ అమ్మాయికి కావలసినవీ, ఆనందాన్నిచ్చేవీ, రెండే రెండు విషయాలున్నై. ఒకటి భర్త ఎలా వుంటాడో చూడటం; రెండోది తనకు చంద్రహారం తెచ్చారో లేదో తెల్సుకోవడం.

భర్త కాబోయే రమానాధుని ఎల్లాగయినా ఒక్కసారి చూద్దామని ఎంతో ప్రయత్నం చేసింది జాలప కానీ, లాభంలేకపోయింది. చివరకు ద్వారపూజ దగ్గిర స్నేహితురాండ్రందరూ కల్సి బలవంతాన భర్త యెదుటికి తోసుకుపోయి నిలబెట్టారు. ఒక్కసారి క్రీగంటితో భర్త ముఖంలోకి చూసింది. చిరునవ్వు పెదాలమీద తొలకరిలా మెరిసింది.

తరువాత అందరూ విడిదిగృహాన్ని చేరుకున్నారు. ఫలహారాలు పంచుతున్నారు. కావల్సినవాళ్ళు తింటున్నారు. కొంతమంది పాటలూ, పద్యాలూ పాడుకుని వినోదంగా కాలక్షేపం చేస్తున్నారు.

పదిగంటలకు వరపూజ ముగించి పెండ్లికొడుకుని పీటలమీదికి తీసుకుపోయారు. మేళాలు గందరగోళంగా మోగుతున్నై. సన్నాయివాయిద్యం శ్రావ్యంగా మైలుదూరంవరకూ వినవస్తున్నది. పెండ్లియిల్లు పెద్ద హంగామాగా వుంది. ఎవరికివారు ఎప్పుడు తమ చేతుల్లో పనులు అవజేసుకునిపోయి పెండ్లికొడుకుని చూద్దామా అని ఆదుర్దాపడుతున్నారు. ఇక దీనదయాళుడికీ అతని భార్యకూ ఊపిరి పీల్చుకోవడానికి తీరికలేకుండా వుంది.

పెండ్లికూతురుకు తెచ్చిన నగలన్నీ పిల్లతల్లి చేతిలో పెట్టారు. మానకి లోపలికి తీసుకుపోయి ఒక్కొక్క నగే వివరంగా చూడసాగింది. ఆమెచుట్టూ ఒక డజనుమంది పిల్లలూ, పెద్దలూ, వృద్ధులూ పోగయ్యారు. తలాఒక వస్తువు తీసుకుని విమర్శించడం ప్రారంభించారు. ఒకరు గాజుల్ని మెచ్చుకుంటే ఇంకోరు జడకుప్పెలను మెచ్చుకుంటున్నారు. ఒకరు పనితనాన్ని మెచ్చుకుంటే ఇంకోరు బంగారపు వన్నెను మెచ్చుకుంటున్నారు. ఈ విధంగా రకరకాలైన అభిప్రాయాలను వెలిబుచ్చుతున్నారు.

ఇంతలో గుంపులోనుంచి ఒక ముత్తయిదువ ఇలా అంది : "ఇంతకీ చంద్రహారం పెట్టలా?"

"లేదు" మానకి దిగులుగా అన్నది.

ఇంకొక ఆమె, "ఏమిటీ? చంద్రహారం పెట్టలా?" అన్నది.

దూరంగా కూర్చుని ఇదంతా వింటున్న దీనదయాళుడు అందుకున్నాడు.

"ఇవన్నీ తెచ్చారు చాలదూ? చంద్రహారం లేకపోతే యేం?"

మొదటి ఆమె, "చంద్రహారం లేకుండా ఇవన్నీ దేనికీ? ఇన్ని తెచ్చినా అది లేనిలోటు లోటే!" అన్నది.

మానకి పెద్దగా నిట్టూర్చి, "ఇంతకూ దానికి గీత లేదు" అన్నది.

జాలప వీళ్ళకు కొద్దిదూరంలో తలవంచుకు కూర్చున్నది. చంద్రహారం రాలేదని నిక్కచ్చిగా తెలిసేసరికి ఎవరో బలంగా గుండెల్లో గుద్దినట్లయింది. కళ్ళు చీకట్లు కమ్మినయ్యి. ఏడుసంవత్సరాలనుంచీ అతి జాగ్రత్తగా పెంచుకు వస్తున్న ఆశాలత పెనుగాలికి మొదలంటా, వేళ్ళతో సహా పెరుక్కుపోయింది!

రెండుక్షణాల తరువాత జాలప మామూలు స్థితికి వచ్చింది. శోకసంతప్తమైన ఆమె హృదయంలో అనేక వూహలు మొలకెత్తినయ్యి. అసలా నగల వంక కన్నెత్తి అయినా చూడకూడదనుకున్నది. తనకు భగవంతుడిచ్చిన అందం వుండనేవుంది! అందవికారులకిగాని నగలఅవసరం, తన కెందుకు? ఈ నగలు తన అందాన్ని చెడుస్తయ్యేగానీ, ఇనుమడింపచేయలేవు! గాడిదమోలు కడితవద్దై తే మాత్రం దేనికి? అవసరమైంది లేనప్పుడు ఈ చెత్తనగలు తగలేయనా?

ఇదే సమయంలో కొంతమంది స్నేహితురాండ్రు వచ్చారు దగ్గరకు.

జాలపా! నీవు చాలా అదృష్టవంతురాలివే, ఎంచక్కని నగలే!" అన్నదో స్నేహితురాలు.

జాలప తన విశాలమైన కనురెప్పల్ని పైకి ఎత్తింది. కళ్ళల్లో నిరాశ ఎర్రని చారలుగా అలుముకున్నవి.

"అవును" అన్నది నిట్టూరుస్తూ.

జాలప ఆకారంలోనూ, స్వరంలోనూ కనిపిస్తున్న మార్పు స్నేహితురాండ్రకు అర్థంకాలేదు. ఒక్కక్షణం ఆగి ఇంకో స్నేహితురాలు అన్నది.

"ఎవరో ఆ నగలు చేసింది. ఎంత చక్కగా చేశారసీ? వాళ్ళకు ఏమి ఇచ్చినా రుణం తీరదు."

"అవును. అల్లాంటివే తేవాలి; తెచ్చినా తెచ్చినందం" ఇంకొక స్నేహితురాలు అన్నది.

మొదటి స్నేహితురాలు అందుకుంది :

"మీ అత్తగారు చాలా తెలివికలదిలా వుంది. పేరుపేరు వరసనా, అన్నీ పట్టుకువచ్చింది.

జాలప ముఖం చిట్లించి ముక్తసరిగా అన్నది.

"అట్లాగే వున్నది."

దూరంగావున్న ఒక ముత్తైదువ "అన్నీ తెచ్చారు. చంద్రహారం మాత్రం తేలేదు" అన్నది.

"ఒక్క చంద్రహారమేనా! లేకపోతే ఏంలే, దానికి బదులు ఒంటిపేట గొలుసు తేనే తెచ్చారాయె!" అన్నది మరో ముత్తైదువ.

"అవునులే! పెండ్లికూతురుకు కండ్లులేకపోతేమాత్రం ఏం? మిగిలిన అవయవా లెటూ వుండనే వున్నయ్!" అన్నది జాలప వ్యంగ్యంగా.

ఒక్కొక్కసారి జీవితానుభవం ఏమాత్రంలేని పసిపిల్లలు గంభీరం అయిన సత్యాలను మాట్లాడితే, విని నవ్వుతాం. అల్లాగే జీవితానుభవాన్ని ఇప్పుడే సంపాయిస్తున్న స్నేహితులూ, పూర్తిగా సంపాయించి చేతులు కడుక్కున్న వృద్ధ ముత్తైదువులూ జాలప అన్న పై మాటలకు పకపక నవ్వారు.

అందరూ నవ్వారు. కానీ, శాహజాదీ (జాలప స్నేహితురాండ్లల్లో ముఖ్యురాలు) మాత్రం నవ్వలేదు. ఇంత చిన్న హృదయంలో బలీయంగా వున్న ఈ ఆభరణాసక్తి ఏ అశుభానికి దారితీస్తుందోనని క్షణం యోచించింది.

జాలప మనస్సు తెలుసుకుందామని ఇల్లా అన్నది :

"అరెరె....వీళ్ళంతా ఎంత తెలివితక్కువవాళ్ళు! అసలు చంద్రహారం లేకుండా ఎల్లా వచ్చారు? నగల కది రాజులాంటిదికదా? అది లేకుండా పెండ్లి ఎలా చేద్దామనుకున్నారు? సరే, ఆ దయానాథుడిగారినే రానీ, ముఖాన అడిగేస్తాను!"

శాహజాదీ మాటల్లో వ్యంగ్యాన్నికానీ, హాస్యాన్నికానీ జాలప ఏమాత్రం అర్థం చేసుకోలేదు. వాటిని యథాతథంగా స్వీకరించి "అడిగిమాత్రం ఏం ప్రయోజనం? జరగవల్సింది ఏదో జరిగిందికదా!" అన్నది నిరాశగా.

"నేను వూరికే మర్యాదగా అడగను. మళ్ళీ ముఖం ఎత్తుకోకుండా అడుగుతాను. నా పెండ్లి కేమైందో తెల్సా? గాజులు పట్టుకురాలేదు. నేను నీకుమల్లే వూరుకున్నానా? గాజులు తెచ్చి చేతికి తొడిగేవరకూ ఒక్క నగ ముట్టుకుంటే ఒట్టు! అప్పటికప్పుడు క్షణాలమీద తెచ్చారంటే నమ్ము!" శాహజాదీ లోలోన నవ్వుకుంటూ అన్నది.

"అయితే, ఇక దీనికి చంద్రహారం చేయించరంటావు?" ఒకామె శాహజాదీకి ఊతాన్నిచ్చింది.

"ఆఁ చేయిస్తారు! తాత చచ్చి, అవ్వ ముండమోసినప్పుడు! అదునుకు లేంది, తరువాత చేయించేం, చేయించకేం?"

"ఈ అదును తప్పితే, ఇక వాళ్ళు చేయిస్తారా? నా జీవితంలో ఆ అదృష్టం లేదుగావును" జాలప నిరాశగా అన్నది.

"నీ వలా నిరాశపడకూడదు జల్లా! నీవు అక్కడికి పోయినతరువాత నేను చెప్పినట్లు చెయ్యి. చంద్రహారమే కాదు; దాని తాతగూడ ఓగివస్తుంది. మొట్ట మొదట ప్రతి సందర్భంలోనూ నీకు చంద్రహారం లేదనే విషయం అత్తమామలకు తెల్సేట్టుగా ప్రవర్తించు. కొంచెం అభిమానస్తులైతే వెంటనే తెచ్చిపెడతారు. ఒకవేళ వాళ్ళు వినిపించుకోక నిర్లక్ష్యంచేసేటట్లుంటే, మూలవిరాట్టయిన భర్తగారితో నాలుగురోజులపాటు మాట్లాడడం మానెయ్. ఇంకెందుకులే! ఠకీమని వచ్చిపడుతుంది. ఒకవేళ వాళ్ళు ఎంతకీ లొంగిరాకపోతే, ఇక చిట్టచివరి ఆయుధంగా నిరశనవ్రతం ప్రారంభించడమే! ఒక్కటిమాత్రం జ్ఞాపకం వుంచుకోవాలి. ఎంత తియ్యనిమాటలు చెప్పినా మెత్తపడకూడదు."

చుట్టూవున్న స్నేహితురాండ్రు నవ్వాపుకోలేకపోయారు. పెద్దగా నవ్వి, "ఇదుగో, జల్లీ! నీవల్లకాకపోతే, దీన్ని తోడు పిల్చుకో. పదవే ఇక ఇంటికి, ఉపదేశం చేసినవరకూ చాలు" అని మళ్ళీ నవ్వారు.

"పోవచ్చులేవోయ్! అంత ముంచుకుపోయే పనులేమున్నై గనుక? సరే గానీ, జల్లీ! ఒకవేళ వాళ్ళు చేయించరే అనుకో, అప్పుడు మీ అమ్మ తన హారం ఇస్తుందా? ఎందుకివ్వదులే!" అన్నది శాహజాది.

జాలప పెద్దగా నిట్టూర్చి "ఇస్తుందనే ఆశ నా కేమీలేదు" అన్నది.

"అయినా, అడిగి చూడకపోయా?"

"బాగుండదు."

"పోనీ, నే అడగనా?"

"నన్ను చంపుకున్నట్టు, అడగవద్దు."

ప్రక్కనవున్న స్నేహితులు విసుగ్గా శాహజాదీని చేయిపుచ్చుకు లేవదీస్తూ "అబ్బ.... ఇంటికి నడవ్వే!" అన్నారు.

శాహజాదీ వెళ్ళిపోవడానికి లేచి నిలబడింది. కానీ జాలప వెళ్ళనీయలేదు.

"మరి ఏం చేయను? నీకు నే నేదో విషం నూరిపోస్తున్నట్టు భావిస్తున్నారు" అన్నది శాహజాది.

ఇంతలో జాలప తల్లివచ్చి, అందరినీ పెండ్లిపందిట్లోకి తీసుకుపోయింది.

# 6

పెండ్లికి ఎంత ఉత్సాహంతో పోయాడో తిరిగివచ్చి అంత నిరుత్సాహంలో పడ్డాడు దయానాధుడు. దీనదయాళుడు కట్నాలూ, కానుకలూ బాగానే ఇచ్చాడు. కానీ, ఏం ప్రయోజనం? వాటన్నిటినీ, ముందాలోచన లేకుండా ఆటలకూ పాటలకూ ఖర్చుపెట్టడం జరిగింది. దయానాధుడు ఇల్లాంటి సందర్భాలలో, డబ్బు విషయంలో బహు జాగ్రత్తగా వుంటాడు. అయితేనేం? రమానాధుడి పుణ్యమా అంటూ చేయిదాటిపోయింది ఖర్చు. అసలు పై మెరుగులకు డబ్బు ఖర్చుపెట్టడం అతనికి ఏమాత్రం ఇష్టంలేదు. అంతగా అయితే, ఊళ్ళోవాళ్ళు పిసినిగొట్టు అనుకొనేవాళ్ళు! అంతేనా? అలా కాకుండా బండిని దారితప్పించడంవల్ల ఇప్పుడేమయింది? కుడితిలోపడ్డ ఎలుకలా తన్నుకోవల్సివచ్చింది!

నగలతాలూకు దిగబడ్డ వెయ్యిరూపాయలూ, పెండ్లి అయిన ఏడవరోజుకల్లా ఇస్తానని దయానాధుడు షరాబును ఒప్పించి నగలు పట్టుకువచ్చాడు. పెండ్లిలోవచ్చిన డబ్బును షరాబుకు సర్దవచ్చునని అతని ఉద్దేశ్యం. కానీ డబ్బు రావడమూ ఖర్చయిపోవడమూ రెండూ అయిపోయాయి తనకు తెలీకుండానే.

చెప్పిన గడువుప్రకారం ఏడవరోజుకు ఠంచనుగావచ్చి కూర్చున్నాడు షరాబు. ఎన్నడూ అప్పుచేయకపోవడంవల్ల, అప్పుపెట్టిన ఆసాముల్ని ఎల్లా ఒకటికి నాలుగుసార్లు ఇంటిచుట్టూరా తిప్పించుకోవాలో దయానాధుడికి బొత్తిగా తెలియదు. ఒక్క వారం గడువీయమని ఎంతో బతిమలాడాడు. లాభం లేకపోయింది. చివరకు మూడురోజుల్లోపల బాకీ అయినా తీర్చేట్టూ లేదా బాకీకి సరిపడే నగలైనా తిరిగి ఇచ్చేట్టూ ఏర్పాటు జరిగింది.

చూస్తూవుండగానే మూడోరోజు వచ్చింది. దయానాధుడు దీర్ఘాలోచనామగ్నుడయాడు.

"వంట తయారై చాలాసేపయింది. చల్లారిపోతున్నది. తినివచ్చి కూర్చోకూడదూ!" అన్నది రాజేశ్వరి.

"మీరు తినండి. నాకేమీ ఆకలిగాలేదు" మెల్లిగా తలయెత్తి అన్నాడు దయానాధుడు.

"ఆకలిగా లేకపోవడమేం? రాత్రికూడా ఏమీ తినలేదుగా? యిలా దిగులుపడి అన్నం, నీళ్లూ మానుకుంటే అప్పులు తీరుతయ్యా?"

"ఇవ్వాళ షరాబు వస్తాడు. అతనికి ఏంచెప్పడమా అని ఆలోచిస్తున్నాను. అనవసరంగా ఇప్పుడీ పెండ్లి తలపెట్టుకుని చిక్కుల్లో పడ్డాను. పోనీ, కొన్ని నగలు ఇచ్చెయ్యమని కోడల్నే అడిగితే? ఇస్తుందా? అడగడంమాత్రం ఎల్లా? గడపలో కాలుపెట్టి రెండురోజులైనా కాలేదు. నగలు తీసి ఇయ్యమనడం ఎల్లా?"

"ఎల్లా ఎల్లాగని ఈ అభిమానపడడం, చేతులు నలుపుకోవడం నాకేమీ బాగాలేవు. అవుసరం వచ్చినప్పుడు అడక్క తప్పుతుందా? అందుకనిగాదూ సంసారం యీకాడికొచ్చింది? ప్రాణంమీదికి వచ్చినా మడివిప్పనంటారాయె! సత్యదేవుడు మీతోపాటు ఉద్యోగేనా. చూడండి! సుక్షేత్రంలాంటి పదెకరాల పొలం కొనుక్కున్నాడు. మేడకట్టుకున్నాడు. ఆమాత్రం నేర్పువుంటే, ఇవ్వాళ బాధ ఎందుకు వస్తుంది?"

"అవును, అవును, అంత నేర్పు వాడిలో వుండబట్టే చేతికి అక్కరకు వచ్చిన ఇద్దరుబిడ్డలూ గుటుక్కుమన్నారు."

"దానికీ దీనికీ సాపత్యమా? లంచం తీసుకున్నవాళ్ళు చచ్చి, లంచం తీసుకోనివాళ్ళు బ్రతుకుతారా? ఇంత దేనికి, మీరు నిజంగా తల్చుకుంటే ఆరు నెలల్లో ఈ బాకీని ఎత్తేయగలరు."

"మూడువంతుల జీవితం గడిపిన తరువాత, ఇవ్వాళ ఈ క్రొత్తమార్గాన నడవడం నా వల్లకానిపని. ఒకవేళ చేయాలనుకున్నా చేయలేను. ఇంతఎందుకు కోడలితో మాటమాత్రం అనరాదూ?"

"నావల్లకాదు బాబూ! కావాలంటే నీవే అడుగు."

ఇంతలో రమానాధుడు వచ్చాడు. చేతిలో టెన్నిస్‌రేకెట్టు వుంది. వైట్ పేంటూ, షర్టూ వేసుకున్నాడు. అప్పుడే టెన్నిస్ ఆడివస్తున్నట్టుగావుంది అతని వాలకం.

చేతిరుమాలులో కట్టుకువచ్చిన మల్లెపూలు తల్లీదండ్రీ చూడకుండా పుండేట్టు చాటుకు పెట్టుకుని మేడమెట్లు ఎక్కుతున్నాడు.

"చూడు నాయనా!" మేడఎక్కుతున్న రమానాధుడు ఠకీమని ఆగిపోయాను. తల్లి చెప్పడం ప్రారంభించింది: "నీ వరకు నీవు, హద్దూపద్దూ లేకుండా డబ్బు ఖర్చుపెట్టించావు. వెయ్యిరూపాయల అప్పు నెత్తినపడింది. నగల షరాబు డబ్బయినా ఇయ్యండి లేకపోతే, నగలైనా వాపసు చెయ్యండని కూర్చున్నాడు. ఏం చెయ్యడం చెప్పు?"

రమానాధుడు ఒక్క క్షణకాలం మెట్లమీద నిలబడి తల్లి అంటున్న మాటల్ని విన్నాడు. తండ్రిమీదకు వచ్చిన అప్పులబాధకు విచారపడ్డాడు. కానీ, దోషమంతా తన నెత్తికి రుద్దడాన్ని సహించలేకపోయాడు.

"అదేమిటి, ఖర్చంతా నేనే పెట్టానంటారు? నాన్న యిష్టంలేకుండా నేను పెట్టిన ఖర్చుమాత్రమేం వుంది? నాన్న చేతిమీదుగానేకదా డబ్బు నాకు ఇచ్చింది?" అన్నాడు.

రమానాధుడు అన్నదికూడా నిజం కాదనలేం. తండ్రి యిష్టంలేకుండా అతను కానీకూడా ఖర్చుపెట్టలేదు. అల్లా తండ్రిని వ్యతిరేకించి ఖర్చుపెట్టడం అతని వల్లకానిపనికూడాను।

"ఆ మాట నిజమేలేరా! డబ్బంతా నా ఇష్టంమీదనే ఖర్చయింది. అయిం దేదో అయింది. ఆ విషయం పోనియ్యి. ఇప్పుడు నెత్తిన వచ్చిపడ్డ ఆపదను గురించి ఆలోచించు. షరాబువచ్చి పీకమీద కూర్చుంటాడు. అతనికి డబ్బయినా కట్టాలి. లేదా నగలైనా తిరిగి ఇచ్చుకోవాలి. ఏం చేసేట్టు?" అన్నాడు తండ్రి.

జాలిగొలిపే తండ్రి మాటలు విని రమానాధుడు మెత్తబడ్డాడు. పైగా తననే సలహా అడుగుతున్నందుకు సిగ్గుపడ్డాడుకూడాను.

"నన్నేం చెయ్యమంటారు? నగలంటే పడిచస్తుంది. చంద్రహారంకోస రమే ఇంకా గునుస్తున్నది చంద్రహారం వచ్చేవరకూ మిగిలిన నగలేమీ ముట్టు కోనని పంతం పట్టుక్కూర్చున్నది. ఇప్పుడు ఆ నగల్నికూడా ఎల్లా అడగడం?" అన్నాడు రమానాధుడు.

"అదే నేను అడిగేదీని! ఎల్లా అడగడం? అడిగామే అనుకో ఇస్తుందా?" అన్నది తల్లి.

"సంతోషంగా ఎటూ ఇయ్యదు. పోతే బలవంతాన తీసుకోవాలి. ఇక అక్కడినుంచీ ఏడుపులూ, పస్తులూ మొదలు. నలుగురిలో నగుబాట్లపాలు" అన్నాడు రమానాధుడు.

"బలవంతాన తీసుకోవడం ఎందుకూ? మన పరిస్థితిని వివరంగా చెప్పి ఇష్టంమీదనే తీసుకునేది. అదీకాక మన సంసార పరిస్థితి వింత త్వరగా ఆ అమ్మాయికి తెలిస్తే అంత మంచిది" అన్నాడు తండ్రి.

తండ్రి చెప్పిన ఈ ఉపాయం రమానాధుడికి ఏమాత్రం నచ్చలేదు. సంసా రపు ఆర్థికస్థితిని భార్యకు తెలియజేయడం అనేమాట అతనికి మంచనిపించలేదు.

నచ్చకపోవడానికి కారణంకూడా వుంది. అతను యువకుడు. యువ కుల్లోవుండే సాధారణమైన స్వభావాలు అతనిలోకూడా హెచ్చుతగ్గులుగా వున్నై. మొట్టమొదటిరోజునే తన గొప్పతనాన్ని చాటుకుని భార్య మనస్సును వశపర్చు కోవాలనే కోర్కె కలిగిందతనికి. అందుకని, తమకో చిన్న జమీందారీ వున్న దనీ, దానిమీద సంవత్సరానికి ఐదారువేలు ఆదాయం వస్తుందనీ, బాంకులో

కూడా కొంతడబ్బు వున్నదనీ దానిమీద వడ్డీ వస్తూ వుంటుందనీ, భార్యదగ్గర కోసేశాడు.

నిన్నకాక మొన్న భార్యదగ్గిర ఇన్ని గొప్పలు చెప్పి, తిరిగి వెంటనే దేబి ముఖం వేయడం అతనికి మనస్కరించలేదు.

"మీరన్నట్లు, ఇవాళకాకపోతే రేపయినా మన సంసార పరిస్థితి దానికి తెలియక మానదు. కానీ, ఇంత త్వరలో తెలియడంమాత్రం నాకిష్టంలేదు. మనం దరిద్రులమని తెలిస్తే ఎంత బాధపడుతుందో ఆలోచించుకొనండి. అది కాక రేపు పుట్టింటికి పెట్టిన నగలనుకూడా అమ్ముకున్నారని ఉత్తరం రాస్తే మన పరువు ఏం కావాలి?" అన్నాడు రమానాధుడు.

"వాళ్ళకు తెలుస్తుందని బాధపడతావేమిటి? తెలిస్తే తెలియనియ్యి! వాళ్ళ కేమన్నా నేను లక్షాధికారినని చెప్పానా?" అన్నాడు తండ్రి.

"నిజమే! కానీ, నగలు ఎరువు పట్టుకువచ్చాము. నాలుగురోజులువుంచి తిరిగి వారివి వాళ్ళకు ఇచ్చేస్తామని మాత్రం చెప్పారా? పైగా మీరు చేసిన భారీ ఏర్పాట్లకూ, కాల్చిన మందుసామగ్రికీ అర్థం ఏమిటి? నోటితో చెప్పకపోయినా పరోక్షంగా మేము స్థితిపరులమని చెప్పకోవడమేనా!" అన్నాడు కొడుకు.

"అయితే, ఆ నగలను ఇంకేదైనా వంకతో తీసుకోవాలి" అన్నాడు తండ్రి.

రమానాధుడు ఏమీ మాట్లాడకపోవడంచూసి తల్లి అందుకున్నది. "ఇంకేం వంకపెట్టి అడిగి తీసుకునేట్టు? ఒకవేళ ఎవరికైనా ఎరువు కావల్సి వచ్చినయ్యి అని అడిగితే ఇస్తుందా? ఇచ్చినా నాలుగురోజుల్లో గొంతుమీద కూర్చోదూ?" అన్నది.

ఒక్క క్షణకాలం ఆగి, దయానాధుడిలా అన్నాడు : "పోనీ, ఆ నగలు తీసుకుని, అలాంటివే నీరుపోసినవి పట్టుకువస్తే? ఛస్....బాగాలేదు. నీరు పోగానే మన బండారం బయటపడిపోతుంది. వీటన్నింటికంటే ఆ అమ్మాయికి విషయాన్నంతా చెప్పేయడమే ఉత్తమం. భవిష్యత్తులోకూడా ఏ పొరపూ వుండదు. కాకపోతే నాలుగురోజులు ముఖం ముడుచుకు కూర్చుంటుంది. మనస్సుకు అశాంతిగా వుంటుంది. అయినా అంత్యనిష్ఠూరంకన్నా ఆదినిష్ఠూరమే మేలు!"

దయానాధుడు చెప్పింది చాలా యధార్థమే అయినా, కొడుక్కి నచ్చలేదు. ఈ మార్గం బాగా ఇరుకున పడేసేట్టుగా తోచింది అతనికి. తన జమీందారీని గురించీ, బ్యాంకి ఎకౌంటును గురించీ ప్రశ్నిస్తే తనేం సమాధానం చెప్పేట్టు.

ఏమీ లాభంలేదన్నట్టు తలవూపి, "మీదంతా పిచ్చిగాని అల్లా చెప్పినందు వల్ల ఫలితం లేకపోగా, అనవసరంగా అవమానాన్ని కొనితెచ్చుకోవడం అవు తుంది!.... ఒక్క ఆరునెల్లు ఎలాగయినా అతన్ని ఆపలేరు? ఈలోపు ఎల్లాగో తీర్చివేయవచ్చు!" అన్నాడు కొడుకు.

"అప్పటికిమాత్రం ఏది దారి?"

కొడుకు ఏదో కొత్త ఉపాయాన్ని ఆలోచించాడేమోనని ప్రశ్నించాడు దయానాథుడు.

"మీ తోటి గుమాస్తాలంతా వేలకువేలూ సంపాయించడంలా? అల్లాగే మీరు సంపాయించి తీర్చండి!"

"అది నావల్లకాదు. ఆకలికయినా ఆగుతానుగానీ, విషం కలిపిన అన్నం మాత్రం తినను."

దయానాథుడు తన తుదనిర్ణయం చెప్పేశాడు. పోతే ఆ నిర్ణయం రమా నాథుడికి సుతరాము నచ్చలేదు. తండ్రి సూచించిన మార్గాన కొడుకు నడవడు. ఆ విషయంకూడా తేలిపోయింది. రాజేశ్వరికి భర్తగారి ఈ మొండిపట్టు ఏమీ నచ్చలేదు. సమస్య పరిష్కారం కావాలంటే ఎల్లాగైనా భర్త తన నిర్ణయాన్ని మార్చుకుని, లంచాలూ అవీ తీసుకోవడం ప్రారంభించాలని ఆమె అభిప్రాయం. రమానాథుడు తండ్రి చెప్పిన మార్గానికీ, తనకూ మధ్యనున్న అంతరాన్ని వివిధ దృక్కోణాలనుంచీ యోచించసాగాడు. 'నిజంగా తండ్రిగారు చెప్పిన మార్గం వుత్తమమైనదే. కానీ, దాన్నే అనుసరిస్తే తన పరువు ఎల్లా దక్కడం?' అని తనలో తనే అనుకున్నాడు.

జాలప తండ్రి దీనదయాళుడి నెలజీతం అయిదురూపాయలే అయినా ఆమె అతి సుకుమారంగా పెరిగింది. చీపురు పట్టుకు చిమ్మి ఎరగదు. అల్లాంటి సుకుమారి తనకు భార్యగా లభిస్తే, ఎల్లాగ సుఖపెట్టడం, తృప్తిపరచడం? అని దీర్ఘంగా యోచించి, చివరకు అతిశయోక్తుల్ని అండగా తెచ్చుకున్నాడు రమా నాథుడు. తాము వుంటున్న ఇంటికి యాభైరూపాయలు నెలకు అద్దె అన్నాడు. వాస్తవంగా దానికి ఇచ్చేది ఐదురూపాయలు. పిల్లల చదువుకు నెలకు యిరవై రూపాయలు ఖర్చు అవుతయ్యన్నాడు. బస్తీలలో పనివాళ్ళంతా దొంగలై వుంటారు గనుక పనిమనుష్యుల్ని పెట్టుకోలేదన్నాడు. ఒకటేమిటి అనేకం చెప్పాడు.

ఇవన్నీ చెప్పేప్పుడు బాగానేవుంది. ఒకప్పుడు వీటి నిజానిజాలు బయట పడుతయ్యని అతనికీ తెలుసు. కానీ ఇంత త్వరలో బైటపడుతై అనుకోలేదు. తను పన్నిన వలలో తనే చిక్కుపడవల్సి వస్తుందనేవూహ అతనికి తట్టలేదు.

ఎన్నో ఉపాయాలు యోచించిన తరువాత, ఒక ఉపాయం అతనికి అన్నిటికంటే ఉత్తమమైనదిగా తోచింది. ఎంత గొప్ప ఆలోచన!.... మరు క్షణంలో ముఖం మలినం అయింది. పెండ్లిచేసుకున్న భార్య దగ్గిర అల్లా నీచంగా ప్రవర్తించడాని కతనికి మనస్కరించలేదు.

ఒక్క రెండు క్షణాల తరువాత యోచనామగ్నతలోవున్న కొడుకుని తండ్రి ఇల్లా ప్రశ్నించాడు :

"ఏదైనా ఉపాయం ఆలోచించావా?"

"నా కేమీ తోచడంలేదు నాన్నా."

"ఏదైనా దోవచూడకపోతే ఎల్లా?"

"మీరే యోచించండి?"

"నేను చెప్పేది ఒకే ఒక్కటి. అది చెప్పాను. మళ్ళీ కావాలంటే చెబుతాను. నీవు చెప్పే అభ్యంతరాలు నాకు అభ్యంతరాలుగా కనిపించడంలేదు. ఆ అమ్మాయిని బిడియం విడిచి అడగడమే వుత్తమం."

"నిజమే. నేను మాత్రం అడగలేను."

"పోనీ నే నడగనా?"

"వద్దు."

"ఏమిటీ? విచిత్రంగా మాట్లాడతావు? నీవూ అడగవు, నన్నూ అడగనీయవు. నీవు గనక అడిగి నగలు తేకపోతే, అతను కోర్టుదాకా పోతాడు. నేను జైలుకు పోవల్సివస్తుంది. నీ కొద్దిపాటి గౌరవ మర్యాదలకోసం, మూడు వంతులు జీవితం గడిచి వృద్ధుడినైన నన్ను జైలుకు పొమ్మంటావా? ఇలా ఐతే మాత్రం మర్యాద పోదా? తప్పదు. నీవు అడక్క తప్పదు. ఇందులో ఇక ఆలోచించవలసిన పనిలేదు."

రాజేశ్వరి అవునన్నట్లు తలవూపి "అవునురా బాబూ! మీ నాన్నగారిని బాధపెట్టడం ఉచితంగాదు. పోయి ఆవిడను అడుగు. నీకు సిగ్గెందుకురా? మహా మహావాళ్ళకే అవసరం వస్తూవుంటుంది. మరి అవసరం వస్తే భార్యని అడగకూడదని ఏ శాస్త్రంలో వుంది? అసలు భర్త అడగాలీ, భార్య ఇవ్వాలీను! అల్లా ఇచ్చిగాదూ ఈ నాటికి మొండిచేతుల్తో తిరుగుతున్నాను? పెళ్ళిలో పెట్టిన ఐదు వేలరూపాయల నగలూ మీ నాన్నగారికే ఇచ్చాను. తప్పులేదు నాయనా పోయి అడుగు" అన్నది.

దయానాధుడు తన మాటలకు బలం దొరకడంవల్ల మళ్ళీ అందుకున్నాడు. "అబ్బాయ్, నీవు సిగ్గనీ, అదనీ, ఇదనీ సాకుచెప్పి ప్రయోజనంలేదు. అడక్క తప్పదు."

రమానాథుడు ఒక్కక్షణం మౌనంగా వున్నాడు. తనేదో అనుచితమైన మాట చెప్పబోతున్నట్టు అతని ముఖాకృతి వెగటుగా మారింది. తల వంచుకుని అస్పష్టంగా ఇలా అన్నాడు: "అడిగి తీసుకురావడం మాత్రం నా వల్లకాదు. కావాలంటే అడక్కుండా, దొంగతనంగా పట్టుకు వస్తాను" అతని గొంతులో విచిత్రం అయిన దృఢత్వం ధ్వనించింది.

దయానాథుడు వక్కసారి విభ్రాంతుడైపోయాడు.

"ఏమిటీ? చెప్పకండా....దొంగతనంగా తెస్తావా?"

"అవును."

దయానాథుడికి దీర్ఘనిద్రలోనుంచి మేల్కొన్నట్టయింది.

"ఛీ....ఛీ.... నే నలాంటి పనిమాత్రం నీ చేత చేయించను. నువ్వీపని చేస్తావని తెలిస్తే, ఆ అమ్మాయి ఎంత బాధపడుతుందో యోచించు? నా జీవితంలో ఇంతవరకు ఇతర్లని మోసగించలేదు; ఖర్మంచాలక కోడలినే మోసగించాలా? కాకపోయినా మామూలుగా జరిగిపోయేదానికి యింత రాద్ధాంత మెందుకు?"

"రాద్ధాంతమో - సిద్ధాంతమో? అవన్నీ మీకు అనవసరం. మీకు కావాల్సింది నగలు. తెచ్చి ఇస్తాను తీసుకోండి. కాకపోయినా డబ్బులేనప్పుడు యిన్ని నగలెందుకు తెచ్చారు? మీరు మహా తెగింపుగా నగలు తీసుకుంటుంటే, ఏమో డబ్బు వున్నదిగామాలనుకున్నాను. ఇల్లా నా నెత్తికి చుడతారని తెలిస్తే, ఇన్ని నగ లెన్నటికీ తేనిచ్చేవాడినికాదు."

"ఇంకా చంద్రహారం లేదని నలుగురూ నాలుగురకాలుగా అనుకున్నారు. మరి యీ మాత్రమైనా పెట్టకపోతే ....?"

"ఆఁ పెట్టకపోతే, మన పరువు నిలబడుతుందా? అంటారు. ఔనా? ఇంత కష్టపడి తీసుకుపోతే అనకుండా మానారా! కాకపోతే ఇంకా నాలుగనుకునే వాళ్ళు. అంతేనా!"

జీవితంలోని అపజ[illegible]న్ని, ఎదురుదెబ్బల్ని [illegible]పోవడానికి దయానాథుడు ఉత్తమమైన ఒక సాధనాన్ని కనిపెట్టాడు. కొడుకుచేత నాలుగుమాటలూ పడి, ఆ బాధని మర్చిపోవ[illegible] గ్రంథాలయానికి పోయాడు. ఇల్లాంటి సందర్భాలలో పత్రికా పఠనం [illegible]కి అండ.

రమానాథుడు పైకి [illegible]సండా మధ్య గదిలోకి పోయాడు. అక్కడ అతని తమ్ములు గోపీ, విశ్వంభర[illegible] చీట్లాడుకుంటున్నారు. అన్నను చూడగానే గజగజా వణుకుతూ, చీట్లను కూర్చున్న గోనెపట్టా క్రిందకు తోసి, ఆదరా బాదరా పుస్తకాలు తెరుచుకు ముందు పెట్టుకున్నారు. పుస్తకాలైతే తెర్చుకుని ముందు పడివున్నై కానీ, వాళ్ళు వాటిల్లో అక్షరాలను చదవడంలేదు. తమ వీపులమీద పడబోయే దెబ్బలను తప్పుకోవడానికి బలాన్ని కూడగట్టుకుంటున్నారు.

రమానాధుడు బాగా దగ్గరకు వచ్చి "బజారు చివరనున్న మిఠాయికొట్టు మీకు తెల్సునట్రా" అన్నాడు.

తమ్ముళ్ళ ప్రాణాలు కుదుటపడ్డయి. గోపీ మహా సంతోషంతో సమాధానం ఇచ్చాడు :

"నాకు తెల్సు."

"ఇదిగో, ఈ రూపాయి పట్టుకుపోయి ఒక బేడకు మిఠాయి పట్టుకురా" అంటూ రూపాయి ఇచ్చాడు తమ్ముడికి.

రెండు నిమిషాల్లో మిఠాయి వచ్చింది. పొట్లాం తీసుకుని రమానాధుడు జాలప గదివైపుకు పోయాడు.

# 7

రాత్రి పదిగంటలైంది. జాలప మేడమీద మంచం వేసుకుని పడుకున్నది. వెన్నెల పిండారబోసినట్టుగా వుంది. దూరంగా కనిపిస్తున్న గుళ్ళ గోపురాలూ, అంతస్తులూ వృక్షాగ్రాలూ స్వప్నలోకాలని జ్ఞప్తికి తెస్తున్నై. జాలప త్వరత్వరగా పరుగెత్తే చంద్రుడివంక తదేకంగా చూస్తూ ఏవేవో ఆలోచిస్తున్నది. తల్లీ, తండ్రీ, తన స్నేహితురాండ్రు — అందరూ జ్ఞాపకం వస్తున్నారు.

రమానాధుడి అడుగుల సవ్వడికి జాలప ఆలోచనలు చెదరిపోయినయ్యి. అతని చేతిలోని పొట్లాన్ని చూసి "ఏమిటా పొట్లాం?" అన్నది.

"తెల్సుకో చూద్దాం?"

"ఊఁ. హుఁ. మీరే చెప్పండి."

"అట్లాకాదు. నీవు తెల్సుకోవాలి!"

"అయితే .... పూ ...."

"ఆఁ. చెప్పు."

"లు."

"బలే తెలివితేటలు" అంటూ రమానాధుడు తన చేతిలోవున్న పూల పొట్లాలను జాలప చేతికి ఇచ్చాడు.

జాలప రకరకాల పూలనూ చూసి సంతోషపడింది. కొన్ని పూలను పక్కమీద చల్లి, కొన్నింటిని సిగలో తురుముకున్నది. పూవులతో ద్విగుణీకృతం అయిన తన సౌందర్యాన్ని తలఎత్తి భర్తకు చూపుదాం అనుకున్నది. కానీ, సిగ్గుతెర! ఎలా చూపడం! ఏవో నూతనమైన ఆవేశాలూ, ఆనందాలూ ఆమెలో ప్రవేశించినయ్యి. ఒకమాటు లోపలికిపోయి అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నది. తిరిగివచ్చి నిశ్శబ్దంగా భర్తకు ఆకులందించడం ప్రారంభించింది.

రమనాధుడు నిర్మలంగావున్న జాలప ముఖంలోకి తదేకంగా చూస్తున్నాడు. అతని బుర్రలో ఆలోచనలు కట్టలు తెంపుకుంటున్నై. ఇంత అమాయకంగా ప్రగాఢమైన విశ్వాసంతో ప్రేమించే భార్యను మోసగించి, నగలు దొంగి ంచడం ఎల్లా? అసలు తనలో ఈ ఆలోచన ఎల్లావచ్చింది? తను తండ్రిదగ్గర ంగతనం అయినా చేసి నగలు ఎందుకు ఇస్తానన్నాడు? నా వల్లకాదని నిష్క-

ర్షగా చెప్పితే ఎంతబాగుండేది? అని ఆలోచించాడు. ఈ ఆలోచనలో అతని బుర్ర వేడెక్కింది. జాలప దగ్గిరనుంచి లేచి పిట్టగోడదగ్గిరకు పోయాడు.

నిర్మలమైన జాలప ప్రేమకూ, తను చేయసంకల్పించిన ఈ నీచమైన అవిశ్వాసపూర్ణమైన పనికీ అంతరాల్ని కొలిచి చూసుకొని ఒక్కసారిగా ఆవేశ పూరితుడైనాడు. భార్యకు జరిగిందంతా చెబుదామని ఒక అడుగు ముందుకు వేశాడు. కానీ, చెప్పలేకపోయాడు. నిజంగా చెబితే, తన్ను ఇంత ప్రేమగా చూస్తుందా? ఈ భక్తీ శ్రద్ధలూ వుంచుతుందా? ఎన్నటికీ వుంచదు. తను మహా చులకనైపోతాడు. ఈ ఆలోచన రాగానే ముందుకు పడ్డ అడుగు వెనక్కి తీసుకున్నాడు.

పిట్టగోడ దగ్గిర నిలబడ్డ భర్తవంక ప్రేమపూర్వకంగా చూస్తూ ఇల్లా అన్నది జాలప:

"మొదట మా నాన్నగారు మిమ్మల్ని చూసివచ్చి, అమ్మదగ్గర మహా గొప్పగా పొగిడేశాడు. అప్పుడు మీ రెలావుంటారో చూడాలని తహతహలాడాను. మిమ్మల్ని రకరకాలుగా చిత్రించుకున్నాను."

భార్య మాటలు జాగ్రత్తగా విని సమాధానం యీయకుండా గట్టిగా నిట్టూర్చాడు రమానాధుడు.

"మీరంటే మా స్నేహితురాండ్రకు కూడా బహు ప్రీతి. శాహజాదీ వున్నది చూశారూ? అది మీరున్న గది కిటికీని వదిలేదేకాదు. ఒక్కసారి మీతో మాట్లాడాలని ఎంత ప్రయత్నం చేసిందనుకున్నారూ? మీరు చూడలేదా దాన్ని."

ఈ సారికూడా రమానాధుడు మాట్లాడలేదు.

"అరె....మీకు జ్ఞాపకం రానట్టుంది! మా స్నేహితురాండ్రందరిలోకీ అదే అందంగా వుంటుంది. ఆ మాట మీరుకూడా ఒకసారి నాతో అన్నారు. ఎర్రగా, పొడుగ్గా వుంటుంది. చెక్కిలిపైన పుట్టుమచ్చ వుంటుందే! అదే!"

రమానాధుడు ప్రవాహంలోపడి కొట్టుకుపోయేవాడిలా "నాకు జ్ఞాపకం రావడంలేదు" అన్నాడు.

"సరే, అలాగయితే, ఈసారి మనం పోయినప్పుడు చూపిస్తాను. అది సరే గానీ, ఇవాళ మీరు బజారుకు వెళ్ళరా?"

"తీరికేదీ?"

"పొండి, నే నసలు మీతో మాట్లాడను. రోజూ ఏదో ఒకవంక చెబుతున్నారు. సరే, రేపు పట్టుకు వస్తారుకదూ?"

ఈ మాటలు విని రమానాధుడి హృదయం బాధగా మూలిగింది. చంద్ర

హారం లేకపోగా, ఇచ్చిన సర్వం లాక్కోవలసివచ్చినందుకు చింతించాడు. ఇల్లా అమాయకమైన భార్యను మోసగించే బ్రతుక్కంటే చావే మేలు అనుకున్నాడు.

* * *

అర్థరాత్రి అయింది. ఆకాశంలో చంద్రుడు మబ్బులచాటునుంచి దొంగలా తొంగి చూస్తున్నాడు. - జాలప నిద్రావస్థలో భర్త మెడచుట్టూ చేతులను పెన వేసుకుని పడుకునివున్నది. రమానాథుడికి ఇంకా నిద్రపట్టలేదు. జాలప నిద్ర పోయిందని గట్టిగా నమ్మకం కలిగింతర్వాత, మెల్లిగా మెడలమీదనుంచి ఆమె చేతుల్ని తీసి మంచం దిగాడు. అతనెంత జాగ్రత్తగా దిగినా, భార్యకు మెలుకువ రానే వచ్చింది.

"ఎక్కడికి వెళ్తున్నారు? తెల్లవారిందా?"

"లేదు .... ఇంకా వైముంది."

"మరి ఎందుకు లేచారు?"

"మంచినీళ్ళకు"

జాలప నిదానంగా భర్తను పక్కలోకి తీసుకుని! ఆసక్తిగా అతని కండ్ల లోకి చూస్తూ, "ఏమిటలా చూస్తారు? అందుకనే వాసంతి, మొగవాళ్ళు మహా మంత్రగాళ్ళు; కళ్ళతోనే మంత్రాలు పెడతారు అంటుంది" అన్నది.

"నా కళ్ళల్లో నీకు మంత్రాలూ, మాయలూ కనుపిస్తున్నయ్యా? కాదు. వాటికి దాహం తీరుస్తాను."

తరువాత ఇద్దరూ నిద్రపోయారు. నెల క్రుంకింది. తెల్లవారవస్తున్నది. ఉదయపు శీతలవాయువులు జీవితాలకు క్రొత్తమధువును అందిస్తున్నై.

రాత్రంతా రమానాథుడికి నిద్దరే పట్టలేదు. ఎట్లాగా నగలు తీసుకు పోవటం అని ఆలోచిస్తూ పడుకున్నాడు. అప్పుడే కునుకుపట్టింది. కానీ వ్యాకులంగావున్న అతని హృదయం అరవిడిచి నిద్రపోనీయలేదు. కళ్ళు తెరచి చూసే సరికి తెల్లవారవస్తున్న లక్షణాలు కనిపిస్తున్నై. దూరంగా ఎక్కడో గడియారం నాలుగుకొట్టిన శబ్దం వినిపించింది. ఇక జాగుచేస్తే లాభం లేదనుకున్నాడు. మెల్లిగా లేచి గదిలోకి పోయి నగలపెట్టెను చంకలో పెట్టుకుని, పిల్లిలా క్రిందికి దిగిపోయాడు. భార్య ఎక్కడ మేల్కొని తన దొంగతనాన్ని కనిపెడుతుందోనని భయంతో ఆపాదమస్తకం వణికిపోయాడు.

తండ్రి క్రిందివరండాలో నిద్రపోతున్నాడు. హడావిడిగా వచ్చిన కొడుకు రాకతో త్రుళ్ళిపడి లేచాడు. "ఎవరు?" అన్నాడు ఆదుర్దాగా.

రమానాథుడు ముక్కుమీద వేలువేసుకుని నిశ్శబ్దంగా వుండమని సంజ్ఞ చేసి "నేనే....! ఇదిగో నగలపెట్టె! దగ్గిరవుంచండి" అన్నాడు.

అంతవరకూ దయానాధుడికి నిద్రమగత పోలేదు. నగలమాట వినగానే మత్తు పూర్తిగా పోయింది. ఆశ్చర్యంతో నోట మాటలేక చూస్తూ వుండిపోయాడు. మొదట నగలు దొంగతనం చేసుకువస్తానని కొడుకు అంటే, వట్టి మాటలు అనుకున్నాడు. కానీ, నిజంగా చేస్తాడని అనుకోలేదు. ఇల్లాంటి దౌర్భాగ్యమైన పనిలో తనుకూడా భాగస్వామికావడం అతని హృదయాన్ని కొరకసాగింది. కొంతసేపటికి తెప్పరిల్లుకుని "వీటి నెందుకు తెచ్చావురా?"

"మీరేగా తెమ్మన్నది?"

"ఛా...."

"అయితే అక్కడే పెట్టి రమ్మంటారా?"

కొడుకువేసిన ఈ ప్రశ్న దయానాధుడిని సందిగ్ధంలో పడేసింది. సిగ్గుపడుతూ ఇల్లా అన్నాడు : "ఒకవేళ ఆ అమ్మాయి కంటపడితే, లేనిపోని అప్రతిష్ట. ఆ బుద్ధి మొదట్లోనే వుండాలి. మెదలకండాపోయి నా పెట్టెలో పెట్టిరా. జాగ్రత్త. ఎవ్వరికీ తెలియనీయకోక!"

కొడుకు నగలు భద్రంచేసి, వెళ్ళి జాలప పక్కలో కూర్చున్నాడు. ఆ కదలికకు జాలప త్రుళ్ళిపడి లేచింది.

"ఎందుకల్లా తుళ్ళిపడ్డావు?" రమానాధు డడిగాడు.

జాలప నాలుగువైపులా ఒకసారి కలయజూసింది. తరువాత ధైర్యాన్ని తెచ్చుకున్నట్టు గట్టిగా శ్వాసవదిలి "ఏమీ లేదు; ఒక పాడు కల వచ్చింది. తెల్లవారిందా?" అన్నది.

రమానాధుడు "తెల్లవార వస్తున్నది. ఏం కలో?" అన్నాడు.

"ఎవరో దొంగ నా నగలపెట్టెను ఎత్తుకుపో...." ఆపైన చెప్పలేకపోయింది.

రమానాధుడి గుండెలు కొట్టుకోసాగాయి. తనను చూసిందేమో? అదే కల అనుకుంటున్నదేమో అనుకున్నాడు. ఏమైతేయినా మంచిదని పిట్టగోడ మీద నించి క్రిందకి చూస్తూ "ఎవరా పోయేది?....ఎవరో దొంగలానే వుంది దొంగ....దొంగ...." అని గట్టిగా అరిచాడు. గొంతులో పారిపోతున్నాడు, పట్టుకోండి అనే భావం ధ్వనింపింది.

క్రింద పడుకున్న దయానాధుడు కొడుకు ఎత్తును అర్థంచేసుకున్నాడు. "దొంగ....దొంగ...." అని అరిచాడు.

జాలప నిద్రమగతలో భర్తగుండెల్లో తలపెట్టుకుని కునుకుతున్నదల్లా తృళ్ళిపడి లేచింది. గదిలోకి పోయి అలమారా తీసి చూసింది. నగలపెట్టె కనుపించలేదు. నోట మాటలేకుండా కొయ్యబారిపోయింది.

# 8

తెల్లవారి సందడి కొంత అణిగిన తరువాత, దయానాధుడు నగలు తీసుకుని షరాబుదగ్గరకు పోయాడు. షరాబు మంచి తెలివైనవాడు. దొరికిన అవకాశాన్ని జారిపోనిచ్చే ఘటంకాదు. నగలన్నింటినీ పాతనగలకింద కట్టి సగానికి సగం ధరలు వేశాడు. నగలన్నీ యిచ్చినా ఇంకా యాభైరూపాయల బాకీ మిగిలే వున్నది. దయానాధుడి పని కన్నంలో తేలుకుట్టినట్టయింది. చేసేదిలేక చేతులు నలుపుకుంటూ ఇల్లు చేరాడు.

పై విషయంగా చాలారోజులు తండ్రి కొడుకులు కళ్ళెర్రచేసుకున్నారు. తండ్రి తెలివితక్కువకు దయానాధుడు చాలా కించపడ్డాడు. తమలో తాము ఎంత మధనపడ్డా, జాలపదగ్గిరమాత్రం బయటపడనీయలేదు. ఇక దొంగల్ని వెదకడం అనవసరం అనీ, పోలీసురిపోర్టువల్ల ప్రయోజనంలేదనీ చెబుతుండేవారు.

జాలపకు ఈ ప్రపంచంలో నగలకంటే మరో ప్రీతికరమైన విషయం లేదు. అల్లా కావడానికికూడా కారణాలు వున్నై. చిన్నతనంనుంచీ ఆమె తన ఊహాప్రపంచంలో నగలుకాక మరేమీ చూడలేదు. అసలు చూడటానికి అవకాశంకూడా దొరకలేదు.

తనకు మూడేళ్ళ వయస్సులో తండ్రి బంగారు గాజులజతను పట్టుకు వచ్చాడు. తనకు ఐదవఏడు వచ్చేవరకూ ఆ గాజులజతను గురించీ, తన సౌందర్యాన్ని గురించీ చుట్టుపక్కలవాళ్ళల్లో చర్చలు జరుగుతూవుండేవి. చర్చ తన గాజులమీద ప్రారంభం అయినా, అంత్యం మాత్రం 'స్త్రీకి నగలే ప్రాధాన్యం' అనేదాకావచ్చి జరిగేది. ఈ చర్చలు దాదాపుగా రోజూ జరుగుతూ వుండేవి. వీటన్నిటికి మూలం వాళ్ళ నాయనమ్మ.

ఐదవ ఏటినుంచి బొమ్మలపెళ్ళి చేయనారంభించింది. ఆ పెళ్ళిళ్ళలో పెళ్ళికొడుకు బొమ్మ బహు చక్కని నగలు తెచ్చేది. పెండ్లికూతురు బొమ్మ మహా సంతోషపడేది. ఒక్కొక్కసారి పెళ్ళికొడుకుబొమ్మ నగలు తెచ్చేది కాదు. ఇంకేముంది పెళ్ళికూతురుబొమ్మ నానాభీభత్సం చేసేది. ఆ భీభత్సానికి హడలిపోయి పెళ్ళికొడుకుబొమ్మ అడిగిన నగలన్నీ తెచ్చిపెట్టేది.

మరికొన్నాళ్ళకు జాలప యువతుల దగ్గిరా, కొంచం వయస్సు ముదిరిన వాళ్ళదగ్గిరా కూర్చుని, వాళ్ళ యీ మాటల్ని వింటుండేది. వాళ్ళకు నగలు మినహా వేరే లోకమే లేదు. ఏ యమ్మ ఏ నగలు చేయించుకుంది? అవి గట్టివా? బోలువా? బంగారం మంచిదేనా? కాదా? ఇవే వాళ్ళ మాటల సారాంశం.

చిన్నతనంనుంచీ వస్తున్న ఈ వాతావరణం కారణంగా జాలపకు నగలను మించి ఆలోచించవలసిన విషయం వేరే లేకుండా పోయింది.

నగలుపోయి నెలరోజులైంది. ఈ నెలరోజులనుంచి జాలప బయటికి రాదు. ఎవ్వరితోనూ సరీగా మాట్లాడదు. ఆహారంకూడా సమయానికి పుచ్చుకోదు. పూర్వంలా సవ్యంగా వుండమని, ఎంతోమంది ఎన్నోవిధాల చెప్పారు. కానీ, ప్రయోజనం లేకపోయింది. తండ్రికూడా వచ్చి చెప్పాడు. ఉఁహుఁ; ప్రయోజనం శూన్యం. అందరూ చంద్రహారంతో సహా కొద్దిరోజుల్లో నగలన్నీ చేయిస్తామని మాట యిచ్చారు. జాని జాలపకు వాళ్ళమీద నమ్మకం పోయింది. ఇన్నాళ్ళనుంచీ ఇల్లా బాధపడుతూంటే చేయించలేనివాళ్ళు ఇక చేయిస్తారనే నమ్మకమేమిటి? వాళ్ళకు తన ప్రాణాలకన్నా బ్యాంకులో డబ్బే ఎక్కువ విలువైంది. అందరూ తనను నిర్లక్ష్యంగానే చూస్తున్నారు. చివరకు భర్తకూడా నిర్లక్ష్యంగా చూస్తున్నందుకు ఆమె హృదయం క్షోభించింది. తత్ఫలితంగా భర్త మీద కోపం, ద్వేషం ప్రజ్వరిల్లినయ్యి. ఏదైనా మాట్లాడటానికివచ్చినా, చెప్పడానికివచ్చినా, భర్తను దొంగలాగానో, ఖూనీకోరులాగానో చూడసాగింది. విదిలించేది లేకపోతే ఏమీ చేయలేని అసమర్థుడిని చూసినట్టు చూసేది.

రమానాధుడి పరిస్థితి విచిత్రంగా మారింది. ఎవరు తీసుకున్న గోతిలో వారే పడతారనే సామెత అతనిపట్ల చరితార్థం అయింది. అతని హృదయంలో తీవ్రమైన వేదన గూడుకట్టుకుంటున్నది.

ఇదివరకు పగలంతా స్నేహితులతో హాయిగా నవ్వుతూ తిరుగుతుండేవాడు. ఇప్పు డదంతా మానేశాడు. ఉద్యోగ ప్రయత్నంలో మునిగిపోయాడు. ప్రేమతో తూగాడుతూ వుండే అతని హృదయం అగ్నిపర్వతంలా తెర్ల నారంభించింది. తన మధురమైన ప్రణయజీవితంలో యింత త్వరలో విషబీజాలు మొలకెత్తడం గురించే ఎప్పుడూ ఆలోచిస్తూ వుండేవాడు. తండ్రి వీటి పరిష్కారాన్ని యోచించకుండా ఉదాసీనత చూపుతున్నందుకు తండ్రిమీద కోపగించుకునేవాడు. 'నిజంగా తల్చుకుంటే, రెండుమూడు నెలల్లోనే ఈ నగలపేచీని పరిష్కరించగలడు తండ్రి. కానీ, వెధవపట్టుదలలు పట్టుక్కూర్చున్నాడు. ఈయన ఆదర్శంకోసం తమ జీవితాలు నాశనం కావలసిందేనా? ఈయనతో పాటుగావున్న గుమాస్తాలంతా ఇల్లాగే వున్నారా? పోనీ, తనకైనా ఉద్యోగం దొరికితే ఎంత బాగుండు! ఒకవేళ దొరికినా మూడువేలు పోగుచేయడానికి అధమం మూడుజన్మలైనా పడుతుంది. పోనీ, ఏదయినా లాటరీ అయినా వస్తే ఎంత బాగుండు!" అనుకుంటూ వుండేవాడు అప్పుడప్పుడూ.

రమానాధుడు ఒకనాడు ఉదయంనుంచీ సాయంత్రంవరకూ నౌకరీకోసం తిరిగాడు. చదరంగపు ఆటలో మేటి కావడంవల్ల అతనికి పెద్ద పెద్దవా రెంతో మంది తెలుసు. వాళ్ళంతా అతన్ని గౌరవంగా చూస్తూవుంటారు. వాళ్ళల్లో ఏ ఒక్కరి దగ్గిరైనా తనకు నౌకరీ కావలసిన విషయం అంటే, ఏదో ఒక నౌకరీ దొరకకపోదు. కానీ, వాళ్ళను యాచించడం అతనికి ఇష్టంలేదు. తను తెల్లని బట్టలు వేసుకుని ఏ చింతా చీకూ లేనివాడిగా హుషారుగా, స్వతంత్రంగా కను పిస్తుండటంవల్లనే వారి గౌరవం తనకు దక్కుతున్నది. తనకు నౌకరీ వెతుక్కో వలసిన గతి పట్టిందని - అదీ వాళ్ళదగ్గిరే - తెలిస్తే ఇక వాళ్ళ స్నేహానికీ గౌర వానికీ ఆశ వదులుకోవల్సిందే!

ఈ కారణంవల్లనే అతను తన పరిస్థితిని ఏ మిత్రుడికీ, పరిచయుడికీ చెప్పలేదు. తను చెప్పకుండానే తన బాధల్ని తెలుసుకుని సాయపడే మిత్రు డొక్కడూ లేకపోయెనే అని బాధపడ్డాడు. అల్లాంటి మిత్రులు అతని జీవితంలో ఒక్కళ్ళూ తగలకపోవడానికి కారణం పూర్తిగా మిత్రుల్దే కాదు. అతనిదికూడా కొంత వుంది. తన యథార్థమైన ఆర్థిక పరిస్థితిని ఏ మిత్రుడికీ ఈనాటివరకు చెప్పలేదు. పైగా బడాయిలు కొట్టేవాడు. అందువల్ల మిత్రులెవ్వరూ అతని బాధల్నిగురించి యోచించేవారు కాదు. ఇప్పుడు యకాయకిని చెప్పడానికికూడా అందువల్లనే సంకోచంగా వుంది.

ఈ విధంగా రమానాధుడు ఆ రోజు వూరంతా నౌకరీకోసం సర్వే చేసి సాయంత్రానికి కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరాడు.

రాజేశ్వరి కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళు తెచ్చియిచ్చి, "అన్నానికి పద. పొద్దున్నెప్పుడో తిన్నావు" అన్నది.

రమానాధుడు మెదలకండా నీళ్ళు అందుకుని కాళ్ళు కడుక్కుంటున్నాడు. ఇంతలో జాలప రివరివా వచ్చింది. తీవ్రస్వరంతో ఇల్లా అన్నది :

"నన్ను మా యింటికి పంపండి. యివ్వాళే, ఇప్పుడే!"

రమానాధుడు చేతిలోవున్న చెంబును క్రిందపెట్టి, అయోమయంగా ఏమీ అర్థంకానట్టు భార్యముఖంలోకి చూస్తూ నిలబడ్డాడు.

ఇంతలో రాజేశ్వరి అందుకున్నది :

"ఏమమ్మా జాలపా! ఏమిటిది? ఇట్లా సమయంకాని సమయంలో పుట్టిం టికి పోతానంటే ఎల్లా? వూళ్లో ఇంతమంది కోడళ్ళు వున్నారు. ఎవరైనా ఇల్లా అంటున్నారేమో కనుక్కో?"

"నేను అందరి కోడళ్ళలాంటిదాన్ని కాను. నా ఇష్టంవచ్చినప్పుడు వెళ్తాను. నా ఇష్టంవచ్చినప్పుడు వస్తాను. నన్ను వద్దనిగానీ, రమ్మనిగానీ అన డానికి ఎవ్వరికీ అధికారం లేదు. ఆదరణ లేనిచోట అధికారంమాత్రం యెలా

వుంటుంది? నేను చచ్చినా బ్రతికినా మీకు పట్టనప్పుడు నా విషయాలు మీ కన వసరం. మీ రెవ్వరూ స్టేషన్‌దాకా రాకపోతే, నేను ఒక్కతెనైనా వెళ్తాను. న న్నేపులీ ఎత్తుకుపోదులే!"

"ఇంతకూ ఇప్పుడిలా వెళ్ళవల్సిన అవుసరం ఏమిటో చెబితే మాకయినా తెల్సివుంటుందిగా!" అడిగాడు రమానాథుడు.

"నా ఇష్టం. వెళ్ళాలనిపించింది."

"ఇల్లా, ఈ ఆకారంతో వెళ్ళితే మీవాళ్ళు ఏమనుకుంటారో, కొంచమైనా ఆలోచించావా?"

"ఆఁ, హాఁ. బాగా ఆలోచించాను. ఇక ఆలోచించనవుసరంలేదు. నేను పోయి గుడ్డలు సర్దుకుంటున్నాను. ఈ బండికే వెళ్తాను!" అంటూ జాలప పైకి పోయింది. రమానాథుడుకూడా దీర్ఘ యోచనామగ్నుడై వెనక నడిచాడు.

జాలప పైకిపోయి ప్రక్కగుడ్డలు సర్దుతుండగా రమానాథుడు, ఆమె చేయి పుచ్చుకుని అతి వినయంగా ఇల్లా అన్నాడు :

"నా మాట విను, వెళ్ళకు. వెళ్తే నన్ను చంపుకున్నట్టే!"

జాలప కళ్ళెర్రచేసి "మంత్రాలకు చింతకాయలు రాలవు. మాటలతో మనుషులు చస్తారా?" అంటూ చెయ్యి విదిలించుకుని పక్కచుట్టింది. పెట్టి సర్దుకున్నది. ఇక బయలుదేరడమే ఆలశ్యం! కానీ, లేవలేకండా వున్నది. భర్త పెట్టిన ఒట్టు నిదానంగా ఆమెలో పనిచేయసాగింది. పక్కచుట్టమీద చతికిలపడి కూర్చుంటూ, "ఎందుకంత వట్టువేసుకున్నారు?" అన్నది విసుగ్గా.

"ఒట్టుపెట్టుకోక ఇంకేంచేయను? ఈ పరిస్థితిలో నిన్ను ఆపడానికి అంతకు మించిన సాధనంలేదు" రమానాధుడి గొంతులో ఆశ తొంగిచూసింది.

"అయితే, నేను ఇక్కడిలా కుమిలి చావాలనేనా మీ వుద్దేశ్యం?"

"ఎందుకలా అశుభాలు మాట్లాడుతావు? నిన్ను పంపించడానికి నా అభ్యంతరం ఏమీలేదు. పోయి మామగారికి, అత్తగారికి చెప్పిరా! పెద్దవాళ్ళాయె!"

జాలప ఒక్కసారిగా ఉద్రిక్త అయింది. "పెద్దవాళ్ళయితే అవుగాక, నేను చస్తే వాళ్ళకు చెప్పను. వాళ్ళకు నాకు సంబంధం ఏమిటి?"

"ఏమీ సంబంధం లేదా?"

"లేదు....మువ్మాటికీ లేదు! వుంటే బాంకులో డబ్బు పెట్టుకొని నాగతి ఆలోచించకుండా వూరుకుంటారా? నేను ఈ మొండిచేతుల్తో ఒత్తిమెడతో ఎవ్వరికీ కనుపించకుండా ఈ గదిలో మ్రగ్గి చస్తున్నాను. చూడటానికి ఎవరైనా వచ్చినా సిగ్గూ. ప్రాణం పోతున్నది. నా అతీ, గతీ కనుక్కోని వీళ్ళు మామా కాదు, అత్తాకాదు. అయినా ఎల్లా కనుక్కుంటారులే! ఇంకా ఇద్దరుండె,

వాళ్ళకుకూడ పెట్టవద్దూ?" చివరిమాట లనేప్పుడు జాలప గొంతు వ్యంగ్యంగా మారింది.

రమానాధుడు, తన కల్పన జాలపలో గట్టిగా పనిచేసినందుకు సంత సించాడు. అతని ముఖం కొంచెం వికసించింది.

"నిజం జాలపా! నువ్వన్నది ముమ్మాటికీ నిజం!! నాన్నగారిదగ్గిర డబ్బులేదనా? బాంకిలో మూలుగుతున్నది. వూరికే పొద్దుపోకకు ఈ వుద్యోగం చేస్తున్నారు."

"డబ్బు వుండగానే సరా! ఖర్చుపెట్టుకోడం చేతగావద్దూ! ఒట్టి పిసిని గొట్టు."

"పిసినిగొట్టు కాకపోతే, ఇంత డబ్బెలా కూడబెట్టాడనుకున్నావ్?"

"ఆయనకు వుంటే వుంచుకోనియ్యి! మే మేం మొఖంవాచి కూర్చోలేదు మాకూ ఇంటిదగ్గిర పాడీ పంటా అన్నీ వున్నై!"

"అవున్లే, నీవరకూ నీవు అమ్మగారింటికి పోతావు. కానీ ఇక్కడ నా పరి స్థితి ఎల్లా వుంటుందో ఆలోచించావా? నీ సాధారణమైన కోర్కెనుకూడా తీర్చ లేకపోయానే అని నే నెంత కుమిలిపోతానో తెల్సా? నమ్ముతావో నమ్మవో యిప్పటికి లక్షసార్లయినా; నీ నగలవిషయం అమ్మా, నాన్నా దగ్గిర హెచ్చ రించాను. అదీకాక నీవు లేకపోతే, ఇక నా గతి ఆలోచించేవాళ్ళు ఇక్కడెవ రున్నారు చెప్పు? అమ్మా, నాన్నకూ నా విషయం అసలు పట్టనేపట్టదు.

"అల్లాగయితే, మీకు ఉద్యోగం దొరికిన తరువాత తిరిగివస్తాను."

"నేనూ అదే ప్రయత్నంలో వున్నాను. పెద్దపెద్దవాళ్ళతో పరిచయం వుంది. కానీ, వాళ్ళను ఉద్యోగం అడగటం బాగుండదు. అందుకని ఆలో చిస్తున్నాను."

జాలప రెండుక్షణాలు ఆగి, "మీకు నౌకరీకూడా లేదాయె! ఇలాగయినా చేస్తే ఈ పీడ వదుల్తుందేమో అనుకుంటున్నారు అత్తా మామాను. అల్లాగైతే నేను అసలు పోనే పోను! పోనీ, మీ మిత్రులతో ఎవరితోనైనా నౌకరీ విషయం అడిగి చూడకపోయారా?" అన్నది.

"ఎందుకు అనకూడదూ? నాకే సిగ్గుగా వుంటుంది. అందువల్ల ఇంత వరకూ ఎవ్వరితోనూ అనలేదు."

"పోనీ ముఖాన అడగడం మీకు కష్టంగావుంటే, ఒక ఉత్తరం రాసి అడగండి."

ఇంత చక్కని వుపాయంవిని రమానాధుడు ఎగిరిపడ్డాడు. ఇంత సహజ మైన వుపాయం ఇన్నాళ్ళనుంచీ తనకు తోచనందుకు నవ్వుకున్నాడు. "చాలా చక్కని ఉపాయం చెప్పావు. రేపే ఒక ఉత్తరంరాసి పడేస్తాను."

"నన్ను దిగవిడిచి వచ్చింతరువాత రాసుకుందురు గానిలెండి."

"సరే, నీవు వెళ్ళింతరువాత ఇక నౌకరీ చూసుకున్నట్టే! నీ గురించిన ఆలోచనల్తోనే సరిపోతుంది. పైగా ఇక్కడ నా మంచిచెడ్డలు చూసేవాళ్ళు ఎవరుంటారు చెప్పు? ఇదిగో! నా మాట విను. వెళ్ళడం మానుకో! పక్కచుట్ట విప్పనా?"

"అట్లాకాదు. మీకు ఉద్యోగం దొరకంగానే ఒక్క ఉత్తరంముక్క రాసిపడేయండి రెక్కలు కట్టుకు వాల్తాను."

రమానాథుడు మెల్లిగా బెడ్డింగు విప్పుతూ "ఇవన్నీ యిక్కడిమాటలే! అక్కడికి పోయింతరువాత నీవేమో, నీ స్నేహితురాండ్రేమోగా వుంటారు. ఇదిగో నిజం చెబుతున్నాను. నీవు గనక లేకపోతే నే నీ యింట్లో కాలయినా పెట్టను."

జాలప కృతజ్ఞత తెలియచేసే చూపులు చూస్తూ, "ఎందుకండీ మీరు కట్టిన బెడ్డింగును విప్పారు? ఈపాటికి నేను హాయిగా స్టేషన్‌దగ్గిరకు పోయేదాన్ని కదా?....సరే, రేపటినుంచే ఉద్యోగంకోసం ప్రయత్నం చెయ్యండి. ఇక ఇల్లా వుంటే కుదరదు."

"ఓ తప్పకుండా! రేపటిదాకా ఎందుకు? ఇప్పుడే నాలుగు ఉత్తరాలు రాసిపారేస్తాను" రమానాథుడు చాలా సంతోషంగా బయలుదేరాడు.

"అరె.... అప్పుడే వెళ్తారా? కొంచెం కూచుని పోగూడదేవిఁటి?"

రమానాథుడు లోపలికిపోయి కాసేపు కూర్చుని, ఆకులు వేసుకున్న తరువాత, నౌకరీకి అప్లికేషన్‌లు రాయడం ప్రారంభించాడు. కానీ, ఏదో ఆలోచించుకుని మధ్యలోనే లేచిపోయాడు.

# 9

రమానాధుడి ముఖ్యమైన స్నేహితుల్లో రమేశ్‌బాబు ఒకడు. అతను మునిసిపల్‌బోర్డులో హెడ్‌క్లర్క్. వయసు నలభై దాదాపు వుంటుంది. అయినా మంచి హుషారుగా వుంటాడు. ఆటపాటల్లో వయస్కులకన్న మిన్న. చదరంగపు ఆటలో కూర్చుంటే ఎటువంటివాళ్ళను చిత్తుగా ఓడిస్తాడు. ఒంటరిగాడు. వెనకా ముందూ ఎవ్వరూ లేరు. వయస్సులోనే భార్య పోయింది. అయినా ద్వితీయ వివాహం చేసుకోలేదు. ఆఫీసు సమయం పోను మిగిలిన సమయాన్ని వినోదాల్తో గడుపుతూ వుంటాడు. లంచం తీసుకునేపక్షంలో లక్షలు గడించే వాడే. కానీ, పుచ్చుకోడు. 'ఆ నెత్తురుకూడు మనకెందుకూ!' అంటూ వుంటాడాయన.

రమానాధుడంటే రమేశ్‌బాబుకు ఎంతో ఇష్టం. ఇద్దరూ రోజూ గంటల తరబడి చదరంగం ఆడుతూ వుండేవాళ్ళు. కానీ, నెలరోజులనుంచీ రమానాధుడు ఇక్కడికి రావటంలేదు. రమేశ్‌బాబుకు రెండుమూడుసార్లు బజార్లలో కనిపించాడు. ఇంటికి తీసుకువచ్చి చదరంగం ఆడమని బలవంతంచేశాడు రమేశ్‌బాబు. కానీ రమానాధుడు పనుందని వెళ్ళిపోయేవాడు. రమేశ్‌బాబు మెదలకుండా వూరుకునేవాడు. అవునుమరి! యువకుడు. పైగా కొత్తభార్య. ఇంకా చదరంగాలు ఆడుతూ కూర్చుంటాడా అర్ధరాత్రివరకూ?

రమేశ్‌బాబు పొద్దుపుచ్చుకోడానికి కొన్నాళ్ళు నవలలూ అవీ చదవడం ప్రారంభించాడు. కానీ, కాసేపట్లో తల నొప్పిపుట్టి అవతల పారేసేవాడు. ఎన్నడూ సినిమాలకు పోడు. అల్లాంటివాడు సినిమాలక్కూడా పోసాగాడు.

రమేశ్‌బాబు గుడ్డలు వేసుకుని సినిమాకు బయలుదేరబోతూ వుండగా రమానాధుడు గదిలో కాలు పెట్టాడు.

రమానాధుని చూడగానే ఆనందంతో పొంగిపోయి, "రా....రా....ఎన్నాళ్ళకు? అసలీ ముసలివాడు వున్నాడో పోయాడోకూడా కనుక్కోవడం మానుకున్నావు? అవునులే నూతన వధూవరులాయె! సరేగాని, నగలసంగతేమైనా తెల్సిందా?" అన్నాడు రమేశ్‌బాబు.

"లేదు."

"స్టేషన్‌లో రిపోర్టు చేయకుండా వుండటం మంచిపని చేశారు. ఒక్కవేళ చేసినట్టయితే, నగలు దొరక్కపోగా వాటికితోడు వందా రెండువందలు చేతివి వదిలేవి. ఆ అమ్మాయి పాపం చాలా బాధపడుతూవుండి వుండాలి!"

"దాని విషయం మహాగొడవగా వుందిలెండి. ఆ రోజునుంచీ అన్నం, నీళ్ళు ముట్టుకోకుండా వ్రతం పట్టుకూర్చున్నది. మా తండ్రిగారా ఏమాత్రం పట్టించుకోవడంలేదు. మధ్యలో నా ప్రాణానికి వచ్చింది. నిజం చెబుతున్నాను; ఎటైనా పారిపోదామా అనిపిస్తున్నది."

"మీ నాన్నగారిని అని ప్రయోజనం యేమిటిలే! వారు మాత్రం ఏం చేయగలరు? కొద్దో గొప్పో మూలధనం వుంటే దాన్లో నీ పెళ్ళికి కొంత ఖర్చు అయిందా? మిగిలిందాన్లో కడం ఇద్దరిపిల్లలకూ మంచిచెడ్డలు చూడాల్నా? మరాయ నేం చేయగలడు?"

"అది కాదండీ! హాయిగా తినితిరిగేవాడిని; దిగులూ, చింతా లేకుండా వుండేవాడిని; నేను ఇరుకున పడ్డానుకదా? ఇక ఎక్కడైనా ఉద్యోగం చూసుకోక తప్పేట్టులేదు. మీ ఎరికిన ఎక్కడైనా వుద్యోగం వుంటే చూద్దురు!"

రమేశ్‌బాబు అటికమీదనుంచి చదరంగపుబల్లా, పావులూ తెచ్చి "సరే, మొదట రెండు ఆటలు కానియ్యి, తరువాత నీ వుద్యోగం విషయం ఆలోచిద్దాం. అదీకాక ఉద్యోగంకోసం ఉబలాటపడుతున్నట్టుంది. నీ వనుకున్నంత సుఖంగా వుండదు. ఇప్పటికీ మేమే మోకాటిచిప్పలు తొలిగిపోయేట్టు ఎదురుదెబ్బలు తింటుంటాము."

"ఏమైనాకానీ, ఉద్యోగం కావాలి. అది దొరికేవరకూ నాకు మనస్సు స్థిమితముగా వుండదు. ఈ చదరంగం నేను ఆడలేను బాబూ!"

రమేశ్‌బాబు పావుల్ని సర్దుతూ "సరేలే, ఆలోచిద్దాము రా!" అన్నాడు.

"ఊఁ-హూ-నా మనస్సు కేమీ వుత్సాహంగా లేదు!"

"కొంచం ఆటలో దిగావా, ఇక ఉత్సాహ మేమిటి? దాని తాతకూడా దిగి రావాలి! పైగా బుద్ధి తీక్షణతకూడా పెరుగుతుంది. ఊఁ-రా!"

ఆట ప్రారంభం అయింది. నాలుగు నిమిషాలు మామూలుగానే గడిచింది. తరువాత రమేశ్ అసాధారణమైన చాకచక్యంతో రమానాధుడి ఆట కట్టించాడు.

"అరె.... రె ఘోరపాటు పడ్డాను....ఆఁ....ఏసుగుని....!" అన్నాడు రమానాధుడు.

విజయగర్వంతో రమేశ్ కండ్లు సారాతాగినవాడి కండ్లలా ఎర్రబడ్డాయి. నిజంగా చదరంగపు ఆటలో సారాలోవున్నంత మత్తు వుంది!

"శభాష్! మంచి బోణి అయింది" ఒక్క త్రుటికాలం ఆగి, "ఒక ఉద్యోగం వుంది. కానీ, అదినీకు తగినదికాదు. జీతం. ముప్పై రూపాయలే! ఇప్పుడో ముసలాయన చేస్తున్నాడు. చాలాకాలంగా చేస్తున్నాడు. పైగా పిల్లలు కలవాడు. అందుకనే ఇన్నాళ్ళువుంచాము. ఇక వుంచటానికి వీలులేదు. అతనివల్ల

ఇక ఆ పనికాదు. కావాలంటే నీకు ఇప్పించగలను. కానీ, నీకు తగినపని కాదే అని సంశయిస్తున్నాను...." అంటూనే రమేశ్‌బాబు రమానాధుడి గుర్రాన్ని చంపేశాడు.

రమానాధుడు తిరిగి తన గుర్రాన్ని బ్రతికించుకోవడానికి ప్రయత్నం చేస్తూ, "మీరు నన్ను మాటల్లో పడేసి, పావుల్ని అన్నింటినీ కాజేస్తున్నారు. నా గుర్రాన్నిఇుతెండి!" అన్నాడు.

"ఇదిగో! బ్రదర్. నీ వలా మొండి చేయవద్దు. నే నేమైనా నీ గుర్రాన్ని బలవంతాన లాక్కున్నానా? సరేగానీ, నీకు ఉద్యోగం ఇష్టమేనా?"

"జీతం ముప్పైయ్యా?"

"అవును జీతం తక్కువే! అయినా, నా ఉద్దేశ్యంలో చేయడమే మంచిది. ముందు ముందు అభివృద్ధి కావడానికి మంచి అవకాశాలు వున్నై. పైగా పై ఆదాయం కూడా వుంటుంది!"

"సరే, మీ సలహానే అనుసరిస్తాను."

"మంచి ఆదాయంకలనౌకరీ. ఈ ఉద్యోగంతోనే అతను ఇద్దరు కొడుకులను బి. ఎ; యల్. యల్. బి; వరకూ చదివించాడు. ఇంకో ఇద్దరు కొడుకులు కాలేజీలో చదువుతున్నారు. ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేశాడు .... కానీ, కొంచెం జాగ్రత్తగా మసులుకోవాలి!"

"పై ఆదాయాన్ని గురించి నేను ఎన్నడూ ఆలోచించను. లంచం అంత మంచి పద్ధతికాదు"

"అవును ...మంచిదికాదు, నిజమే! మరి పిల్లలు కలవాడు లంచం తీసుకోకండా ఎల్లా బ్రతుకుతాడు? నా వరకూ నాకు వంటరిగాడినైనా నెలకు వంద రూపాయలకుపైన ఖర్చవుతున్నదే! అల్లాంటప్పుడు పిల్లా జల్లాకలవాడు, పెళ్ళిళ్ళూ పేరంటాళ్ళూ చేయవల్సినవాడు, ముప్పై రూపాయల్లో ఎల్లా బ్రతుకుతాడు? క్రింది ఉద్యోగస్తుల జీవితప్రమాణం పెరిగేవరకూ లంచం అనేది ఆగదు" అంటూనే రమేశ్‌బాబు ఇంకో ఏనుగును చంపాడు.

రమానాధుడికి బాగా రోషం వచ్చింది. "మీరు మాట్లాడకుండా ఆడేట్టయితే, నేను ఆడతాను. లేకపోతే, ఇక ఆడను. నన్ను మాటల్లో పడేసి పావులన్నీ కాజేస్తున్నారు" అన్నాడు.

"సరే, బాబూ! అల్లాగయితే, ఇక నేను నోరు కదపను! — ఇదిగో! రాజును ముందుకు జరిపాను....సరే,! రేపు అర్జీ పెడతావుకదూ? తప్పకుండా నీకు ఖాయం అయ్యే ఏర్పాటు చేస్తాను. ఐతే ఒకషరతు. ఉద్యోగం ఖాయం అయిన మొదటిరోజు రాత్రంతా కన్ను ముయ్యకుండా ఆట ఆడాలి. సరేనా?"

"ఆఁ. మీరు మహా ఆడేట్టుగా! చెయ్యి గెలుపులోవుంటే సరే, ఆడుదాం అంటారు. రెండాటలు గనక పోయినయ్యా? ఇక ముఖం వేళ్ళాడవేస్తారు!"

"అరె....ఆ రోజులు పోయినయ్యోయ్! వెనుకటిలా నీవు నన్ను ఓడించ లేవు! ప్రస్తుతం మన రాసికి చంద్రబలం అధికంగావుంది. అంచేత ఇక నన్ను ఓడించడం వెనకటంత తేలికకాదు."

"ఒక పందెం గెలిచినంతమాత్రాన అలా అనబోకండి. ఆలస్యం అవు తుందని చూస్తున్నానుగానీ, లేకపోతే, మిమ్మల్ని ఓడించడం .... (గుటకమింగి) ఓడించిగాని కదిలేవాడిని కా"దని అన్నాడు రమానాధుడు.

"ఆలస్యమా? మహా అయితే, ఇప్పుడు తొమ్మిదవుతుంది. పోనీ, ఆడు, నన్ను ఓడించినవాడివయినా అవుతావు!"

"ఇవ్వాళ కాదులెండి రేపు. రేపు పేరుచెప్పి ఓడిస్తాను. లేకపోతే మారు పేరున పిలవండి!"

"పోవోయ్! రేపుమాత్రం నన్నేం ఓడిస్తావు? అంత నేర్పేవుంటే ఇప్పుడు చూపరాదూ?"

"ఏమంటున్నారూ? నేను మిమ్మల్ని ఓడించలేనా? పందెం వేసుకు ఆడదాం? ఇదిగో; ఒక షరు. ఒకటి, రెండు ఆటలంటే నేను ఒప్పుకోను. కనీసం ఐదు ఆటలైనా ఆడాలి. సరేనా?"

"ఓ....ఐదు కాదు. పదాడతాను. కావాలంటే రాత్రంతా కూర్చుంటాను. ఐతే, ఒక పని చెయ్యి! నీ భోజనం ఇక్కడే కానియ్యి. మీ ఇంటికి నీవిక్కడ వున్నావనీ, ఎదురు చూడవద్దనీ కబురు పంపుతాను. ఇక మనం వెనకచింత లేకుండా ఆడుకోవచ్చును!"

ఇద్దరూ భోజనం చేసివచ్చి మళ్ళీ పావుల్ని చేపట్టారు. మొదటి పందెం రమేశ్‌బాబే గెలిచాడు. రెండో పందెంకూడా అతనే గెలిచాడు. మూడోపందెం దగ్గిరకు వచ్చేసరికి రాత్రి రెండయింది.

రమానాధుడు కళ్ళు నులుముకుంటూ "ఇక పడుకుందాం. నాకు నిద్ర వస్తున్నది" అన్నాడు.

"అల్లాగయితే, లోపల సోడాలు వున్నై. ముఖం కడుక్కువచ్చి కూర్చో. నిద్రమత్తు పోతుంది. ఐదు పందాలు కాకుండా నిన్ను నిద్రపోనీయకేం!"

రమేశ్‌బాబు వరుసగా మూడు పందేలు గెలిచాడు. మూడు పందేలు గెల వడం — అందులోనూ ఒక సామాన్యమైన ఆటగాడిమీద — ఏమంత గొప్ప విషయం కాదు. కానీ, రమేశ్‌బాబు ప్రాణానికి ఇదే మహా గొప్పగా వుంది. నిజంగా తన అదృష్టరాశుల్లో ప్రబలమైన పరివర్తన జరిగిందని నమ్మాడు.

కానీ, నాలుగో పందెం అనుకోకుండా ఓడిపోయాడు. అదృష్టం మీది

నమ్మకం ఛిన్నాభిన్నమైంది. ఇక వర్సన ఓడిపోతానేమో అనే అభిప్రాయం కూడా అతనిలో కలక్కపోలేదు.

"ఇక పడుకోవాలి!" ఒళ్ళు విరుస్తూ అన్నాడు రమేశ్‌బాబు.

"ఏం? అయిదు పందేలూ కానీయండి?"

"ఆc. రేపు ఆఫీసుకు పోవద్దూ? ఇంకా నిద్రమేల్కొంటే....!"

రమానాధు డేమీ ప్రతివాదన చేయలేదు. ఇద్దరూ పడుకుని నిద్దర పోయారు.

రమానాధుడు మామూలురోజుల్లోనే ఎనిమిదిగంటలకుగానీ నిద్రలేవడు. మూడుగంటలవరకూ నిద్రలేకుండా ఆడుతూ కూర్చున్నాడేమో ఇవ్వాళ పదిగంట లకు లేచినా లేచినట్టే! రమేశ్‌బాబుమాత్రం మామూలుప్రకారం 5 గంటలకే నిద్ర లేచి, స్నానం సంధ్యా మొదలైన నిత్యకృత్యాలను తీర్చుకుని, బయటికి షికా రుకు వెళ్ళాడు. తిరిగి ఎనిమిదిగంటలకు వచ్చేసరికి రమానాధు డింకా నిద్ర పోతూనే వున్నాడు. అప్పుడు నిద్రలేవకపోయినా, పదిగంటలకు ఆఫీసుకు పోయేప్పుడు లేపక తప్పలేదు. బలవంతాన నిద్రలేపాడు.

కళ్ళు నులుముకుంటూ విసుగ్గా, "అనవసరంగా కమ్మని నిద్ర పాడు చేశారు" అన్నాడు రమానాధుడు.

"అదికాదోయ్....! అప్లికేషన్ పెడతానంటివిగా, మరెప్పుడు?"

"అబ్బ....మీరే పడేయండి."

"మనిషి యేడీ అంటే, ఆకాశాన్ని చూపనా?"

"మీ యిష్టం అల్లాగే కానీయండి!" అంటూ రమానాధుడు మళ్ళీ నిద్రకు ఉపక్రమించాడు. రమేశ్ మారుమాట్లాడకుండా పోయి భోజనంచేసి, బట్టలు వేసు కుని బయలుదేరబోయే సమయానికి రమానాధుడు తృళ్ళిపడి లేచి, "పదండి నేనూ వస్తున్నాను" అన్నాడు.

"సరే, త్వరగా కాళ్ళూ చేతులూ కడుక్కో."

"ఒక చెంప మీరు వెళ్తుండిరాయె!"

"లేదులే, ఇంకా 20 నిమిషాల టైము వున్నది. త్వరగా కానియ్యి."

"నేను సిద్ధం. మళ్ళీవచ్చి భోంచేస్తాను."

"ఎందుకు ఆత్రం? ఇంకో అర్ధగంట ఎటూ వుంటాను. భోంచేసే బయలుదేరు."

రమానాధుడు ఐదునిమిషాల్లో భోజనాది కార్యక్రమాలను ముగించి, రమేశ్ బాబుతో బయలుదేరాడు.

దారిలో రమేశ్‌బాబు నవ్వుతూ, "రాత్రంతా ఎక్కడికి పోయావని ఇంటి దగ్గర అడిగితే, ఏం వంక చెప్పాలో ఆలోచించావా?" అన్నాడు.

"రమేశ్‌బాబు రానీయలేదంటాను."

"అవునులే! నన్ను తిట్టించాలని నీ వుద్దేశ్యం! ఒకటి మాత్రం జ్ఞాపకం వుంచుకో. ఇక మీ శ్రీమతిగారు ఈ ఛాయల రానీయదు నిన్ను."

"ఒస్....అంతేనా! నేను మరీ అంత దాసుడిని కానులెండి, గిరిగీటల్లో వుండటానికి. పరేగానీ, అర్జీ తీసుకుని ఆఫీసరుగారి ఎదుటికి నేనే పోవాల్నా?"

"మరి? ఇంట్లోకూర్చుంటే అదే వస్తుందనుకొన్నావా? నౌకరీకోసం ఎన్ని పాట్లుపడాలో నీకేం తెల్సు?"

"అప్లికేషన్ పట్టుకుని వెళ్ళి చేతులు నలుపుకుంటూ నిల్చోవడం అంటే, నాకు మహా రోతగా వుంటుంది. పైగా విదిలించి పారేస్తారేమోనని భయంగా వుంటుంది. నాకు ఈ బాధకన్నా నౌకరీ ఆశే వదులుకోవడం సులభం అని పిస్తుంది."

"అవును. వుద్యోగం అంటే ఏమిటి? అవసరమైతే, విదిలింపులూ, చీవాట్లూ అన్నీ తినాలి! పైగా ఇతను కొంచం కరుగ్గాకూడా వుంటాడు."

"అయితే, ఇక నేను ఇంటికి పోతాను. చీవాట్లు తినడంమాత్రం నా వల్ల కాదు."

"మొదట్లో అందరూ నీలాగే భయపడతారు. తరువాత అలవాటు పడి పోతారు చీవాట్లకు. నేను మొట్టమొదట నౌకరీలో చేరేప్పుడు నీ యీడువాడినే. అప్పటికి పెండ్లయి మూడునెల్లు అయింది. అధికారిదగ్గిరికి ప్రధమంగా పోయి నప్పటి నా పరిస్థితి నిజంగా వినతగ్గది. జ్ఞాపకంవస్తే ఈనాటికీ నవ్వు వస్తుంది. అతనితో మాట్లాడినంతసేపూ వురివుచ్చుల్లో మెడ ఇరికించినవాడికన్నా ఎక్కువ బాధపడ్డాను....అయితే, నీవంత బాధపడనవసరంలేదులే, నేను వున్నానుగా. అంతా సరిచేస్తాను."

"అయితే మీరు 20, 22 ఏళ్ళనుంచీ ఈ ఉద్యోగం చేస్తున్నారన్నమాట?"

"ఇప్పటికి సరీగా ఇరవై అయిదేళ్ళనుంచీ చేస్తున్నాను. నా భార్య చని పోయే ఇరవై ఏళ్ళు గడిచిపోతున్నై."

"మరి అప్పటికి మీరు వయసులోనే వుండి వుంటారనుకుంటా! రెండో పెళ్ళి ఎందుకని చేసుకోలేదండీ?"

రమేశ్‌బాబు నవ్వుతూ చెప్పాడు : "పాయసం తిన్నతరువాత గంజినీళ్ళు తాగడానికి ఎవరిష్టపడతారు చెప్పు? ప్రేమ ఆత్మకు సంబంధించిన విషయం. అది ఒక్కసారిగా వెలిగిందా, ఇక జీవితాన్నంతా వెలిగిస్తూనే వుంటుంది. ఇన్ని సంవత్సరాలల్లో ఏ ఒక్కరోజూ నాకు రెండోపెళ్ళి చేసుకోవాలనిపించలేదు. ఆ వెనుకటి జ్ఞాపకాలే నాకు చాలు!"

ఇద్దరూ ఈవిధంగా మాట్లాడుకుంటూ ఆఫీసుకు పోయారు.

# 10

రమానాథుడు మునిసిపల్ ఆఫీసునుంచి ఇంటికి బయలుదేరేసరికి దాదాపుగా సాయంత్రం నాలుగుగంటలు కావచ్చింది. ఆషాఢమాసంకావడంచేత అంతవరకూ కాస్తున్న ఎండ క్షణంలో అదృశ్యమై ఆకాశంలో మేఘాలు ముసురుకున్నాయి. పెద్ద చినుకులు పడసాగినై. ఎక్కడైనా కాసేపు ఆగి వర్షం తగ్గింతరవాత ఇంటికి వెళ్ళేంత మనస్థిమితం అతనికి లేకపోయింది. వర్షంలో తడుస్తూనే ఇంటికి పోసాగాడు.

దారిపొడుగునా, తన ఉద్యోగం, నెలకువచ్చే ఆదాయం, దానిలో ఎంత వెనకవెయ్యడానికి వీలుండేదీ, అలా నియమంగా వెనకేస్తే ఎన్ని నెలల్లో భార్యకు చంద్రహారం చేయించగలిగేదీ, మొదలైన విషయాలను ఆలోచిస్తూ తడిసి ఇల్లు చేరుకున్నాడు.

నౌకరీని గురించిన శుభసమాచారాన్ని తెలియజేయడానికి తడిగుడ్డలైనా యిప్పకుండా నేరుగా జాలపవున్న గదిలోకి పోయాడు.

జాలప భర్తను చూడగానే, "ఏమిటిలా తడిశారు? రాత్రంతా ఎక్కడేమిటి మకాం?" అని అడిగింది.

"ఆఁ నౌకరీగురించి మాట్లాడటానికి రాత్రి ఒకచోట వుండాల్సివచ్చింది. ఎట్లా అయితేనేం! చివరకు మున్సిపాల్టీలో వుద్యోగం కుదిరింది."

జాలప ఒక్కసారిగా ఎగిరిపడి, "నిజంగా? జీతం ఎంతేమిటి?" అన్నది.

భార్యతో యధార్థాన్ని చెప్పడానికి కొంచెం సంకోచించాడు. స్వల్పంగా కల్పననికూడా తోడు చేసుకున్నాడు. "ప్రస్తుతం నలభై. ముందుముందూ బాగా అభివృద్ధికి పోవచ్చును. పై ఆదాయంకూడా బాగా వుంటుంది" అన్నాడు.

తన భర్తకు ఏదో గొప్ప ఉద్యోగం వస్తుందని కలలు కంటున్న జాలప ఈ మాటలు విని ఒక్కసారిగా నిరుత్సాహపడిపోయింది. "అయ్యో! అరవై డెబ్భై అయినా లేకుండా నలభైయేనా?" అన్నది.

"కావాలంటే వందరూపాయల ఉద్యోగం అయినా దొరక్కపోదు. కానీ ఇక్కడవున్న గౌరవమూ, హాయీ అక్కడ లభించవు. అదీకాక ఎటూ పై ఆదాయం ప్రతినెలా అరవైడెబ్భై వుండనే వుంటుంది!"

"అయితే, మీరు లంచాలు తీసుకుంటారా?"

"అబ్బే....అది లంచాలు తీసుకోవడం కానేకాదు. అక్కడ పనంతా వ్యాపారస్తులతోనే! వాళ్ళ పనులు త్వరగా ముగించి పంపడంగానీ, గంటలతరబడి

కూర్చోపెట్టడంగానీ నా ఇష్టంమీద ఆధారపడివుంటుంది. అందుకని వాళ్ళే డబ్బిస్తారు. కాఫీలు పోయిస్తారు....ఒకటేమిటి, లక్ష వుపచారాలు చేస్తారు!"

జాలప ఒక్కక్షణం ఆగి, "మరి మీ అమ్మగారికి చెప్పారా? చెప్పిరండి. ఇకమీదట ఇక్కడ నాకుకూడా కొంత అధికారం, ఆధిపత్యం లభిస్తయ్" అన్నది.

"అమ్మకు జీతం ఇరవయ్యేనని చెబుదామనుకుంటున్నాను."

"బాగున్నది! వీలుంటే పదిహేనే అని చెప్పండి. పై ఆదాయం విషయం పొరపాటునైనా అనేరుసుమా!.... నేను మొదట చంద్రహారం కొనుక్కుంటాను. సరేనా?"

ఇంతలో బయటినుంచి 'పోస్టు' అన్న కేక వినిపించింది. రమానాధుడు బయటికిపోయాడు. పోస్టుమన్ దీనదయాళుడి దగ్గిరనుంచి వచ్చిన ఒక పార్సెల్‌ను అతనిచేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

రమానాధుడు గబగబా లోపలికివచ్చి ఆదుర్దాగా పార్సెల్ విప్పాడు. లోపల ఒక అందమైన చిన్నపెట్టెలో చంద్రహారం వున్నది. దాన్ని చూసి రమానాధుడు నవ్వుతూ, "అబ్బ....ఎన్నాళ్ళికి దేవుడు నీ మొరవిన్నాడు! ఎంత చక్కగావుందో చూడు?" అన్నాడు.

జాలప కొంచం ఆగి రుద్ధకంఠంతో, "అమ్మ, ఏమిటిలాంటి పనిచేసింది? తన హారం తను వుంచుకోక నాకు పంపించింది. నేనుమాత్రం తీసుకోను. వెంటనే తిప్పి పంపించండి" అన్నది.

రమానాధుడికి చాలా ఆశ్చర్యం వేసింది! "తిప్పి ఎందుకూ పంపడం? అట్లా పంపితే మీ అమ్మగారికి కోపంరాదూ?" అన్నాడు.

"కోపంవస్తే రానియ్యి! నాకేమిటి నష్టం? పెండ్లినాడూ, అప్పగింతల నాడూ లేనిది యివ్వాళ్ళదేనికి చూపడం? ఇచ్చేదైతే, ఆ రోజునే ఇచ్చేదికాదూ? ఈపీడ ఎటూ వదలదనుకొని ముఖాన విసిరిపారేసినట్టుగా, ఇప్పుడు పంపింది. ఆమె నగల్ని ఆమెనే వుంచుకోనీయండి! మీరు చల్లగావుంటే నాకిలాంటివి లక్ష వస్తయ్యి. మన మేమైనా అడుక్కుతినేవాళ్ళమా? పంపించెయ్యండి."

"నాకేమీ సమంజసంగా కనుపించడంలేదు. నీవిలా పంపితే, మీ అమ్మ గారి హృదయం ఎంత బాధపడుతుందో, యోచించు. అదీగాక, నీవన్నట్టు మొదట్లోనే ఇచ్చివుంటుందనుకో; అందువల్ల నష్టమేగానీ లాభం ఏం వుంటుంది చెప్పు? అన్ని నగలతోపాటు ఇదికూడా పోయేదేనా?"

"ఏమైనా కానీయండి, నేను హారాన్నిమాత్రం వుంచుకోను."

"ఎందుకనీ?"

"ఏమో! అట్లా అనిపిస్తున్నది."

"నీ మాటలకు అర్థంలేదు. అట్లా అనిపించడానికి ఏదో ఒక కారణం అంటూ వుండాలిగదా!"

"కారణం? గీరణం! ఇది మా అమ్మ నాకు సంతోషంగా, మనస్ఫూర్తిగా పంపలేదు. నాకు తెలుసు, ఇదంటే మా అమ్మకు చాలా ఇష్టం! కూతురిలా నగలుపోయి కుములుతూవుంటే తను వయస్సు ముదిరినా కూతురి సుఖాన్ని చూడకుండా కులుకుతున్నదని, లోకం అనిపోతుందని, విధిలేక తప్పనిసరై పంపించింది. బిచ్చగాడికి కానీ విసిరిపారేస్తామే? అలా పంపింది. మనస్ఫూర్తిగా ఇచ్చిన నల్లపూసైనా నాకు చాలు. దీన్ని నేను స్వీకరించలేను. నేను అడుక్కునేదాన్ని కాదని మా అమ్మకు తెలియచేయాలి!"

ద్వేషం తర్కాన్నీ, కారణాలనీ వెతకదు. అందువల్లనే రమానాథుడు ద్వేషంతోకూడిన జాలప మాటలకు ఏ సమాధానమూ చెప్పకుండా, "సరే, అయితే లోపలికి తీసుకుపోయి, అమ్మకూ, నాన్నకూ చూపిస్తాను. వాళ్ళ సలహా కూడా కనుక్కుందాం" అన్నాడు పంపించడానికి ఇష్టపడ్డవాడిలా.

జాలప వెంటనే హారాన్ని భర్తచేతుల్లోంచి లాక్కుని, "వాళ్ళనడగడం దేనికి? నా చావూ, బ్రతుకూ పట్టనివాళ్ళదగ్గరకు నేను సలహాకు పోతానా?" అని క్రోధంగా అంటూ తిరిగి అదే పెట్టెలో హారాన్ని పార్సిల్ చేయసాగింది.

రమానాథుడు జంకుతూ, "ఇంత తొందర దేనికి? నాలుగురోజులపాటు వుంచరాదా? పెద్దవాళ్ళ మాటకూడా నిలబెట్టినట్టుగా వుంటుందిగా?" అన్నాడు.

జాలప పంచమస్థాయిని అందుకున్నది. "ఇది ఇంట్లో వున్నంతవరకూ నేను పచ్చిగంగైనా ముట్టను. దీన్ని చూస్తుంటే నా గుండెల్లో మంట పుట్టుకొస్తున్నది. వెంటనే తిరుగుపోస్టులో పంపుతారా, లేదా?" అన్నది కఠోరంగా.

మరుక్షణంలో పార్సిల్ చేయడం పూర్తయింది. రమానాథుడు దాన్ని తీసుకుని బయటికి పోయాడు.

# 11

కొడుక్కు వుద్యోగం దొరికిందని తెలిసి దయానాధుడు మహా సంతోష పడ్డాడు. పెండ్లయిన కొద్ది రోజుల్లోనే ఇలా దొరికి వస్తాదని అత నెన్నడూ అనుకోలేదు. కొడుకును పిల్చి ఇల్లా అన్నాడు: "మంచి నౌకరీ; జాగ్రత్తగా వుంటే, భవిష్యత్తులో అభివృద్ధికి పోగలవు. పోతే, తండ్రిగా నేను చెప్పేది ఒక్కటి విను; ఇతర్ల సొమ్ముని విషంగా చూడు."

తండ్రి వుపదేశం రమానాధుడికి ఏ మాత్రం నచ్చలేదు. మీ వుపదేశం మీ వరకే వుంచుకోండని చెబుదాం అనుకున్నాడు. కాని అంత తెగించలేక పోయాడు.

కొడుకు మారుమాట్లాడక పోవడంతో దయానాధుడే తిరిగి సంభాషణని ప్రారంభించాడు. "ముప్పైకదా ఆ వుద్యోగానికి ఇయ్యడం. నీకు మాత్రం ఇరవై ఇయ్యడానికి కారణం ఏంటి?"

"అవును, కొత్తగా చేరినవారికి, అనుభవంకలవారికి ఇచ్చిన జీతం ఎందుకు ఇస్తారు? నాకూ ఒక సంవత్సరం పోయాక ముప్పై ఇస్తారుగామాలు: పని మాత్రం భారమైందే!" అన్నాడు రమానాధుడు.

"వయస్సులో వున్నావు, నీకు పని భారంఏంటి? సునాయాసంగా చేసేయ వచ్చు!"

రమానాధుడు పెట్టెలో కొద్దిగా డబ్బు, ఎవ్వరికీ తెలియకుండా తన దగ్గిర అట్టే పెట్టుకున్నాడు. దానికి తోడు ఇంకా కొంత మిత్రుల దగ్గిర అప్పు పుచ్చుకుని, ఒక మంచి సూటూకోటూ, ఇతర విలాస వస్తువులూ కొనుక్కున్నాడు. తన జీతం ముప్పై రూపాయలే అయినా వందరూపాయల జీతగాడికంటే మిన్నగా కనుపించాలనీ! అల్లా వుంటేకాని ధనమూ, యశస్సూ లభ్యంకావని అతని అభిప్రాయం. అప్పో సొప్పో చేసి ఎల్లాగయితేఏం, కావాల్సినసామగ్రిని కూర్చుకున్నాడు.

రెండవరోజున రమానాధుడు కోటూ, పాంటూ, హేటూ మొదలైన అట్టహాసంతో బయలుదేరాడు ఆఫీసుకు. ఈ వేషంతో అతని వర్చస్సులో అద్భుతం అయిన మార్పు వచ్చింది. ఆఫీసుకు పోగానే నౌకర్లూ, బంట్రోతులూ వంగి నమస్కారాలు చేశారు. అతనుమాత్రం ఎవ్వరినీ లక్ష్యం చేయనట్టుగా ఠీవిగా బిర్రబిగిసి సరాసరి రమేశ్‌బాబు దగ్గిరకు పోయాడు. అతని దగ్గిర ఛార్జీ పుచ్చుకుని, అక్కడనుంచి తన ఆఫీసు గదిలోకి వెళ్ళిపోయాడు. అక్కడొకముసలి

పంతులు చినిగిన ఒక పాతచాప వేసుకుని కూర్చునివున్నాడు. అతనిచుట్టూ రిజిష్టరు బుక్కులు పరచబడి వున్నై. కొంచం దూరంలో వ్యాపారస్తులు గుమి గూడి వున్నారు. దూరంగా మెల్లాలో రిక్షాలూ, జట్కాలూ వరుసనే పెట్టివున్నై. ప్రతివాళ్ళూ తమనే ముందు పంపించమని తొందర చేస్తున్నారతన్ని. రమానాధు డొకక్షణం అక్కడ నిలబడి పరిశీలనగా చూశాడు. అక్కడ ప్రతి పనీ అవ్య వస్థికంగానే జరుగుతున్నదని చూస్తూనే తెల్సుకున్నాడు. మురికిగా అసహ్యంగా వున్నఆగదిలో, ఆ చిరిగినచాపమీదనే తనుకూడా కూర్చోవడం అతని కేమాత్రం నచ్చలేదు. రివరివా రమేశ్‌బాబు దగ్గిరకుపోయి, "చూడండి ! ఆ చింకిచాప మీద కూర్చోవడం నా వల్లకాదు. ఒక మేజా, రెండు కుర్చీలూ పంపించండి. మరి ఇంకో విషయం; ఆ వ్యాపారస్తులందర్నీ వర్సగా నిల్చోబెట్టే ఏర్పాటు చేయండి; అంతా గుమిగూడి గందరగోళం చేస్తున్నారుగా" అన్నాడు.

రమేశ్‌బాబు చిరునవ్వినవ్వి, తల వూపాడు.

రెండు క్షణాల్లో చింకిచాప స్థానంలో మేజాలూ, కుర్చీలూ వచ్చి చేరి నయ్యి. ఆఫీసు గదంతా శుభ్రం చేయబడింది. రమానాధుడు వచ్చి, లోగడ అదేస్థానంలో వుండి ప్రస్తుతం శెలవు పుచ్చుకుంటున్న ముసలిపంతులునుంచి పనిని పప్పగించుకున్నాడు. ముసలి పంతులు రమానాధునికి తన పనేమిటో, ఎల్లా చెయ్యాలో, ఏ వస్తువుకు ఎంతెంత అమ్మకంపన్ను వసూలు చెయ్యాలో వివరంగా బోధపరిచాడు.

ముప్పై సంవత్సరాలుగా ఆ స్థానంలో వుండి, ఎంతో ధనాన్ని యశస్సునీ సంపాయించుకున్న తరువాత, ఇవ్వాల్టిరోజున ఆ స్థానాన్ని విడిచిపెట్టడమంటే ఆ ముసలి పంతులికి కళ్ళవెంట బొటబొటా నీళ్ళు కారినై. తనలో కలిగిన భావోద్రేకాన్ని ఇతర్లకు తెలియకుండా తల వంచుకుని మెల్లగా, బాధగా మెట్లు దిగాడు వృద్ధుడు.

ఇంతకాలంగా వుంటున్న వృద్ధుడు ఇవ్వాళ వెళ్ళిపోవటం రమానాధుడిలో కూడా కొంత బాధ కలిగించింది. సానుభూతి సూచికంగా అతనితోపాటు తను కూడా రెండడుగులు ముందుకు వేశాడు. రమానాధుడి సానుభూతికి మౌనంగా నవ్వి, వృద్ధుడిలా అన్నాడు. "మీ నించి విడుదలయ్యే ప్రతి వస్తువుకూ మీ కో అణా కమీషను ముట్టచెబుతూ వుంటారు. మీరు ధనికులు. అణాతో ఏమిటి లెఖ్క అని తిరస్కరించబోకండి. ఈ నియమం పూర్వంనించీవస్తున్నదే. దీన్ని చెడగొట్టబోకండి. ఏదైనా ఒక నియమాన్ని చెడగొట్టటం బహు సుళువు ! తిరిగి ఏర్పరచాలంటే మన తరంకాదు. మీరు తీసుకునే ప్రతి అణాలోనూ సగం వాటా బంట్రోతుల కివ్వడం మరచిపోకండి !"

రమానాధుడు అయిష్టాన్ని ప్రకటిస్తూ, "నాకు లంచం అంటే బొత్తిగా యిష్టంవుండదండి. నాకు ఇల్లాంటివి నచ్చవు" అన్నాడు.

వృద్ధుడు నవ్వి "అవును. ప్రారంభంలో అల్లాగే వుంటుంది నాయనా. నాలుగురోజులు పోయిన తరువాత చాలా యిష్టంగా వుంటుంది. అప్పుడు కావాలని అడిగికూడా పుచ్చుకుంటాము" అన్నాడు.

ఆ వృద్ధుడు వెళ్ళింతరువాత రమానాధుడు తన కుర్చీలోకి వచ్చి కూర్చుని బంట్రోతును పిలిచి, "ఇదిగో! వీళ్ళందరినీ వరండా దిగి క్రింద నిల్చోమను. అందరి పేర్లూ వరసన జాబితా ఇవ్వు! ఆ జాబితా ప్రకారం ఒక్కొక్కళ్ళనీ రమ్మను" అన్నాడు.

ఇది విని రెండుగంటలుగా నిలబడివున్న ఒక వ్యాపారి సంతోషంగా, "అవును బాబూ, ఈ పద్ధతి బాగుంటుంది!" అన్నాడు.

మిగిలిన వ్యాపారులంతా అందుకున్నారు. "అవును....బాగుంటుంది....!"

తన మాటను ఇంతమంది ఏకకాలంలో అంగీకరించినందుకు రమానాధుడు వుప్పొంగిపోయాడు. నిజంగా వర్తకసమాజంలో అతను సంపాయించిన ఈ పలుకుబడిని ఏ కాలేజీ ప్రొఫెసరైనా సంపాయించాలంటే ఒక జీవితం చాలదనుకుంటాను!

ఒక్క రెండురోజుల అనుభవంతోనే రమానాధుడు అనేక విషయాలను తెల్సుకున్నాడు. డబ్బు ఎల్లా గుంజాలి? మనుషుల్ని ఎల్లా లొంగదీసుకోవాలి? అనే విషయాన్నిగురించి సుదీర్ఘంగా యోచించి క్రొత్త నిర్ణయాల్నీ, ప్రణాళికల్నీ ఏర్పరచుకున్నాడు. పాపం ముసలిపంతులికి తన జీవితకాలంలో ఏ ఒక్కసారికూడా ఇంత ఉత్తమమైన నిర్ణయాలూ, ఉపాయాలూ తోచివుండవు.

వ్యాపారస్తులు సరుకుల లెక్కింపులో, కొలతలో, నాణ్యంలో అనేకరకాలైన మోసాలు చేస్తారు. రమానాధుడు వాటన్నింటినీ వివరంగా తెలుసుకున్నాడు. కానీ, అర్థణాతో తనను సంతృప్తిపరచి అవతలవాడు వందలూ, వేలూ సంపాయించుకుంటారనికూడా తెలుసుకున్నాడు. వస్తువుల్ని అతని కిచ్చినా పరీక్షించాలనీ, వ్యాధుల్ని శల్యపరీక్షచేసి తను నలుగురిలో పేరు సంపాయించాలనీ అనుకున్నాడు. ఇందువల్ల రెండు లాభాలు వుంటయ్యి. ఒకటి తను నిష్కర్షగా వున్నవాడూ అవుతాడు. రెండోది తన కరకుతనానికి భయపడి వ్యాపారస్తులు మామూళ్ళు పెంచుతారుకూడాను.

రమానాధుడి కార్యపటుత్వాన్నిచూసి రమేశ్‌బాబుకూడా చాలా సంతోషించాడు. ఒకరోజు ఇల్లా అన్నాడు : "నీవు నీ హద్దుల్లోపల ఏమైనా చేసుకోవచ్చును. హద్దులు దాటనంతవరకూ నీమీద ఈగనైనా వాలనీయను."

కొద్దిరోజుల్లోనే ఈవిధంగా రమానాధుడి ఆదాయమూ, దానితోపాటు కాగి తాల్లో పలుకుబడి ప్రభావాలుకూడా పెంపొందినయ్యి. అతను మొదటినుంచీ డబ్బంటే లెక్కలేని మనిషి. ఇక సంపాయించేటప్పుడు చెప్పనే అవసరంలేదు: జీవచ్ఛవాల్లా జమాఖర్చులో మునిగివుండే తోటి గుమాస్తాలకు, రోజూ కాఫీలు పోయించడం, సిగరెట్లు, వక్కచూరలూ కొని ఇస్తూ వుండేవాడు. అతన్ని అడ గనివాళ్ళు పాపాత్ములు. అతనుమాత్రం అడిగిన వెంటనే తనదగ్గిర వున్నవరకూ దానకర్ణుడులా ఇచ్చేస్తాడు. వెనక చిల్లరడబ్బులు వుండీవుండవు. కాఫీలకూ, సిగ రెట్లకూ బాధలు పడుతూవుండే గుమాస్తాలకు కామధేనువు దొరికినట్లయింది.

ఈ ప్రవర్తనవల్ల రమానాధుడు ఒకరకమైన విజయాన్నికూడా సంపా యించాడు. మునిసిపాలిటీలోవున్న బంట్రోతులదగ్గరనుంచీ గుమాస్తాలవరకూ మానసికంగా కొంత అతనికి భృత్యులైనారు. కృతజ్ఞతాభారంతో కృంగిపోయారు. అక్కడవున్న ప్రతివక్కడూ కనీసం రోజుకు ఒక్కసారైనా రమానాధుని కల్పు కోకుండా, శ్లాఘించకుండా వుండలేరంటే ఆశ్చర్యంలేదు.

ఈ కొద్దిరోజులలోనే రమానాధుడిలో ఇంత మార్పు జరిగినా జాలపలో మాత్రం ఏ మార్పూ రాలేదు. ఆమె కోర్కెల్లో ఏ ఒక్కటీ తీరలేదు. రోజు రోజుకూ ఆమె మరీ ఏకాంతప్రియ అయిపోతున్నది. నాగపంచమిరోజు తోటి వారెంతోమంది, ఆటపాటల్లో పాల్గోమని బలవంతం చేశారు. కానీ, ఆమె కద ల్లేదు. భాద్రపదం వచ్చింది. పక్కయింటి శేఠుగారు అతి అట్టహాసంగా గోకు లాష్టమి ఉత్సవం జరుపుకుంటున్నారు. వూళ్ళో అందరినీ ఉత్సవానికి ఆహ్వా నించారు. రాజేశ్వరీ, జాలపలనుకూడా పిలిచారు. రాజేశ్వరి వెళ్ళింది. జాలప మాత్రం పోలేదు.

ఏకాంతంగా కూర్చొని నగలమీద మమకారాన్ని చంపుకోడానికి జాలప తీర్మానించుకుంది. అయితే, వ్యవహారరూపంలోకి వచ్చేసరికి ఈ యేకాంతంవల్ల నగలమీది మమకారం చావడానికి బదులు ద్విగుణీకృతం అవుతున్నది. ఒకసారి రమానాధుడు ఆమెకో నగల కేటలాగును తెచ్చి ఇచ్చాడు. ఎప్పుడూ దాన్ని ముందేసుకు కూర్చుంటుంది. ఆమె ఆలోచనలూ, ఊహలూ సర్వం ఆ కేట్లాగు చుట్టూ తిరుగుతుంటయ్.

అర్ధరాత్రి అయింది. రమానాధుడు అప్పుడే ఉత్సవాన్నుంచి వచ్చాడు. అంతవరకూ మేల్కొనివున్న జాలపను చూసి నవ్వుతూ, "నీవు రాలేదుగానీ, పాటకచ్చేరీ ఎంత అద్భుతంగా వున్నదనుకున్నా" అన్నాడు.

జాలప ఏమీ సమాధానం చెప్పకుండా ముఖం పక్కకు తిప్పుకున్నది.

"ఇక్కడ ఒంటరిగా పడుకోవడంవల్ల నీకు మనస్సు వ్యాకులంగావున్నట్లు వున్నది!"

జాలప మెల్లిగా పెదాలు కదలించి, "నేను రానందుకు పశ్చాత్తాపపడుతున్నట్టున్నారు. ఈ మొండిమెడతో, మొండిచేతుల్తో నేను వచ్చినట్లయితే మీకెంత తలవంపులుగా వుండేదో యోచించారా?"

"నా కెందుకు అవమానం? నీ నగలు దొంగలు ఎత్తుకుపోయారన్న విషయం అందరికీ తెలుసు! అదీగాక నాలుగువేలరూపాయల నగలు పట్టుపట్టుమని ఒక్కరోజులో చేయించడం ఎవరికిమాత్రం సాధ్యం?"

ఈ మాటలు అంటున్నప్పుడు రమానాధుడి హృదయం తీవ్రంగా స్పందించింది. జాలప ఒకమాటు భర్తముఖంలోకి కఠోరంగా చూసి కళ్ళువాల్చుకుంది. మారుమాట్లాడలేదు. మాట తీయగా మాట వస్తుంది. సంఘర్షణ పెరిగిపోతుందని భయంతో ఆమె మౌనంగా కళ్ళు వాల్చేసుకున్నది. కానీ, రమానాధుడికిమాత్రం ఇలా చేయడంలో వేరు అర్థం స్పురించింది. భార్యకు దొంగతనంలోని యథార్థం తెలిసిపోయిందనీ, కేవలం సంకోచంవల్లనే బయట పెట్టలేకపోతున్నదనీ అనుకున్నాడు. దొంగతనం జరిగిన రాత్రి భార్య తనకు చెప్పిన కలకూడా జ్ఞాపకానికి వచ్చింది. ఒక్కసారి అతని రక్తం మంచులా గడ్డకట్టింది....మరుక్షణంలోనే ఆధారాలన్నీ నిరాధారాలుగా కనిపించసాగినయ్యి. ఇది వూరకే అతనుపడే భ్రమే గాని జాలపకు ఈ విషయం ఈషణ్మాత్రమైనా తెలియదని నిర్ధారణ చేసుకున్నాడు. అయితే ఆ మౌనానికీ, కళ్ళు వాల్చుకోవడానికీ అర్థం ఏమిటీ? అతని తల దిమ్మెక్కింది. ఈ విషయంలో జాలప అభిప్రాయం ఏమిటో తెలుసుకోడానికి ఇల్లా అన్నాడు : "పెండ్లి అయిన మరుసటిరోజే నీ హృదయాన్ని కలచివేసే ఈ సంఘటన జరుగుతుందని ఎవరనుకున్నారు?"

జాలప కళ్ళనిండా నీళ్ళునింపుకుని,"అల్లాగని నేను నిన్నేం నగలకోసరం బాధించడంలేదుకదా! నా అదృష్టంలో ఎల్లా రాసివుందో అల్లా జరుగుతుంది. పుటకలో లేంది పూసుకుంటేమాత్రం వస్తుందా? కాకపోయినా, నగలు లేనివాళ్ళు ఎంతమంది లేరు? వాళ్ళందరి రోజులు దొర్లిపోవడంలా?" అన్నది.

ఈ మాటలు అతని సంశయనివృత్తి చేసినయ్యి. ఆమె మాటల్లోనూ, స్వరంలోనూవున్న తీవ్రమైన అసంతృప్తి అతని హృదయాన్ని క్షోభింపచేసింది. ఈ మూడునెల్లనుంచీ తను ఎంత ప్రయత్నించినా, వందరూపాయలకు మించి కూడపెట్టలేకపోయాడు. ఆదాయం రావడమైతే బాగానే వచ్చింది. దానికి తగినట్టుగానే ఖర్చుకూడా బాగా జరిగింది. తను రోజూ తోటి పనివాళ్ళకు కొద్దో గొప్పో ఖర్చుపెడుతూనేవున్నాడు. యదార్థం ఆలోచిస్తే, తనలా ఖర్చుపెట్టకపోతే, ఆ నౌకరీలో ఇన్నాళ్ళు వుండేవాడేకాదు. అందరూ కల్సి తన్ను ఏనాడో

పూడబీకిపారేసేవారు. అందుకనే అంటారు; పాపిష్టిసొమ్ము పాపిష్టిగానే పోతుందని.

రమానాధుడు జాలపలో విశ్వాసాన్నికలిగించే స్వరంతో ఇల్లా అన్నాడు: "భగవంతుడి దయవుంటే, నెలా రెండునెలల్లో ఏదో ఒకటి చేయిస్తాను."

"నగలే సర్వస్వం అనుకునే ఆడదాన్ని కాదులెండి। ఇలా మొండిగా బయటికి రావాలంటే సిగ్గేస్తుందిగాని."

ఈ మాటలు అంటుంటే జాలప కండ్లు చెమ్మగిల్లినయ్యి. స్వరం నిరాశా, విషాదాల్తో బరువెక్కింది. రమానాధుడి హృదయం ఒకమాటు మూగగా ఆక్రందించింది. నిజంగా జాలపను తను చేతులారా కష్టాలపాలు చేస్తున్నాడు. లేకపోతే, నగల విషయం ఈ మూడునెల్లనుంచీ ప్రస్తావించనైనా ప్రస్తావించకుండా వుంటాడా? ఎన్ని వుత్సవాలు, ఎంతమంది ఎల్లా వుత్సాహంగా తిరుగుతున్నారు। జాలప వాళ్ళందరిలా తిరక్కుండా ఇలా అంధకారంలో పడి కృశించడానికి కారణం తను కాడా? తను తన బాధ్యతల్ని ఏమాత్రం నిర్వహించకుండా ఇల్లా వూరుకోవడం ఏమంత సబబు?

తనకు నిజంగా జాలపమీద ప్రేమవుంటే ఇల్లా చూస్తూ వూరుకోగలడా? ఏదో ఒకటి చేయకపోతే ఎలా? ఈ మూడునెలల్లో తనకు ఎంతోమంది నగల వ్యాపారులు పరిచయులైనారు. ఎవరి నడిగితే అప్పియ్యరు? దఫాలవారిగా తీర్చవచ్చునాయె! కానీ తీరా అప్పుతెచ్చి తీర్చలేకపోతే? పోనీ, రెండునెల్లు ఇలా గడపడమే వుత్తమం!

తన అభిప్రాయాన్ని జాలపకు చెప్పి ఆమె యిష్టాయిష్టాలను తెల్సుకుందామనుకున్నాడు. ఒకవేళ భార్య అప్పు తెమ్మనేట్టయితే ఎన్నిబాధలైనాపడి తీసుకువద్దామనుకున్నాడు. విషాదగ్రస్త అయిన భార్యను వూరడించడానికి అతనికి ఇంతకుమించి మార్గం కనుపించలేదు. "నిన్ను ఒక సలహా అడగదల్చుకున్నాను. అడగమంటావా? వద్దంటావా?" అన్నాడు.

జాలపకు నిద్ర వస్తుండటంవల్ల కళ్ళు నులుముకుంటూ, "ఇక నిద్రపోనీయండి; పొద్దున్నే లేవాలి।" అన్నది.

"మరి నీవు తప్పక కావాలనేట్టయితే, ఏ షరాబుదగ్గిరైనా నగలు చేయించుకు వస్తాను.... నెమ్మదిమీద తీర్చుకోవచ్చు! చేయించమంటావా?"

జాలప నిద్రమత్తు ఒక్కసారిగా ఎగిరిపోయింది. కళ్ళు తెరిచింది. భర్త అన్నమాటల్ని ఒకటిరెండుసార్లు మనస్సులోనే నెమరు వేసుకున్నది. ఆ మాటలు అతి కఠోరంగా వినిపించినై. అసలు నగలు చేయించనా, వద్దా అని తన నడగడం ఏమిటి? ఇంటికివచ్చిన చుట్టాన్ని అన్నంతింటావా? కావాలంటే పెడతామన్నట్టు? మా ఇంట్లో అన్నంలేదు. మమ్మల్ని అడగకు అని చెప్పడం

కాదా ? కాకపోతే, తమ కళ్ళారా చూస్తూకూడా, ఇలా సలహా అడగడంలో ఉద్దేశ్యం ఏమిటి ? ఒకవేళ నిజంగా అప్పే తెచ్చినా తను అడిగితే, అప్పుకాదులే అని చెప్పాల్సినపని !

ఇలా ఆలోచించుకుని "నగకోసరం అంత పడిచచ్చేదాన్ని కాదులే !" అన్నది విరసనగా.

"అబ్బే....నీవు తొందరచేస్తున్నావని కాదు. ఏ షరాబుదగ్గిరైనా అప్పు తీసుకుని నిదానంగా తీరిస్తేమాత్రం వచ్చిన నష్టం ఏమిటి ?"

"నాకోసం అప్పులపాలు కావల్సిన పనేమీలేదు. నిన్ను అప్పులపాలు చేసి, నగలతో కులకడానికి నేనేమైనా భోగందాన్నా ? మీతోపాటు సమానంగా కష్టసుఖాలను పంచుకోవల్సినదాన్ని నేను. అల్లాంటప్పుడు అప్పులు చెయ్యమని ఎల్లా చెబుతాను ? మీ రసలు నగలే చేయించకపోయినా, ఏమీ అనుకోను. ఇంటి కయిన మొగవాళ్ళను, కష్టాలపాలుచేయడం నా మతంకాదు....అయినా, ఆదాయం బాగా వుంటుందన్నారుగా ? ఏదీ కనుపించదేం ?"

"ఆదాయం బాగా వుందేమాట నిజమే ! వుంటున్నదికూడానూ ! కానీ, ఇది వెనకవేసుకోడానికి వీలైన ఆదాయం కాదు. దీన్ని కాచుకుని ఎన్నో పిశాచాలు వుంటై. వాటికి కొద్దో గొప్పో తగలేస్తూవుండాలి. లేకపోతే మనం అక్కడ వుండలేము....ఈవిషయం నాకు మొదట్లో తెలియదు...."

"సరే....కానీయండి, ఇప్పుడు మునుకుపోయిందేమిటి ? నిదానంగానే చేయించుకోవచ్చు !"

"సరే....అల్లాగయితే ఇంకోనెల పోయిన తరువాతనే తీసుకుంటాను. ఒక జత గాజులైనా తీసుకుంటే....!"

"నెలరోజుల తరువాతమాత్రం గాజులకు సరిపోయే డబ్బెక్కడినుంచి వస్తుంది ?"

"డబ్బుకు ఏదోవొక మార్గం చూద్దాం. మొదట నీ కే రకంగాజు లిష్టమో చెప్పు ?"

ఈమాటతో ఇంతసేపూ జాలపలోవున్న కృత్రిమ గాంభీర్యం ఛిన్నాభిన్నం అయ్యింది. ఇంతసేపటిగా బలవంతాన అణచుకుంటున్న నగలమీద ఆమెకున్న మమకారం ఒక్కసారిగా వువ్వెత్తున పొంగింది. చప్పున లేచిపోయి అలమరలో నుంచి కేటలాగుతెచ్చి భర్తకు చూపించసాగింది. ఆమె ముఖం వికసించింది. ...కు అపుడే గాజులు వచ్చేసినట్టుగానే వుంది. ఆమె చప్పుచప్పున పుస్తకం

అంతా ఒకటి రెండుసార్లు అటూ ఇటూ తిరగేసి చివరకు రెండు డిజయిన్లు సెలెక్టుచేసింది. ఆ డిజయిన్లు రమానాధుడికికూడా నచ్చినయ్యి. భార్య నిర్ణయానికి సంతోషించాడు కూడాను ! తీరా ధరలు చూసేసరికి అతనిగొంతు ఆరిపోయింది. ఒకదాని ఖరీదు వెయ్యిరూపాయలు. రెండోదాని ఖరీదు ఎనిమిది వందలు !

"ఇల్లాంటివి ఇక్కడ చెయ్యలేరనుకుంటాను. అయినా, రేపు ఒకమాటు బజారుకిపోయి కనుక్కుంటాను !"

"అబ్బ....ఇంతడబ్బు మీదగ్గర పోగుపడటానికి ఎంతకాలము పడుతుందో ఏమో ! అంతవరకూ గోతికాడ నక్కలా, ఎదురుచూడాలి !....పోనిద్దురూ, నగలు లేకపోతే ప్రాణాలు పోతయ్యా ?"

తరువాత ఎవరి పక్కమీదికి వాళ్ళు పోయారు. రమానాధుకుమాత్రం గాజుల ఆలోచనతో చాలా సేపటివరకూ నిద్రపట్టలేదు.

# 12

మరుసటిరోజు వుదయాన్నే రమానాధుడు రమేశ్‌బాబు దగ్గరకు పోయాడు. రమేశ్‌బాబుకూడా గోకులాష్టమి పండుగ జరుపుకున్నాడు. వస్తుతహా పండుగ లంటే అతనికేమీ ఆసక్తిలేదు. కానీ, అతని భార్య ప్రతిసంవత్సరమూ గోకులాష్టమి జరిపేది. భార్య జ్ఞాపకార్థం తనుకూడా జరుపుతున్నాడు. రమానాధుని చూడగానే, "దయచేయండి ! దయచేయండి !! రాత్రి ఎక్కడా దర్శనాలే లేవు ! అందరూ వచ్చారు. తమరే రాలేదు. అవునులే ! ఇంటిపక్కనే శేటుగారు వుత్సవం చేస్తూవుంటే, ఈ బీదవాళ్ళ వుత్సవానికి వస్తారా ? అక్కడెలావున్నది; బాగా జరిగిందా" అన్నాడు.

"అలంకరణం అవీ మీ అంతగొప్పగా లేవు....అయినా వెనకటికంటే నయమే ! భోగంవాళ్ళుకూడా వచ్చారు. పాటలూ, డాన్సులూ జోరుగా జరిగినయ్యట. నేను ఆసాంతం వుండలేదులే !"

"అరే....భోగంవాళ్ళుకూడా వచ్చారా ? శేటుగారు పిలిపించనన్నాడే ? లాభంలేదు. ఈ మూర్ఖులవల్ల హిందూమతం సర్వనాశనం అయిపోతుంది. అసలు మామూలు రోజుల్లోనే భోగంమేళాము ఛండాలం ! ఇక పర్వదినాల్లో ! అదీ భగవత్సాన్నిధ్యంలో !! పెద్దమనుష్యులూ, గౌరవనీయులూ యిల్లాంటి పనులు చేస్తుంటే....ఛీ....ఛీ !"

"ఇంకా నయం—భోగంమేళాలు వుండబట్టే ఈమాత్రమైనా ఉత్సవాలకు ప్రజలు వస్తున్నారు. లేకపోతే ఈ వుత్సవాలపేరు తలిచేవారుకూడా వుండరు. దేశమంతా మీ లా మడికట్టుక్కూర్చున్న దనుకున్నారా ?"

"నిజంగా నాకే అధికారం వుంటేనా ! ఈ దురాచారాన్ని క్షణంలో కట్టిపారేయించేవాడిని—సరేగానీ, ఒక ఆటవేద్దామా ?"

"మరి వచ్చింది ఎందుకనుకున్నారు ? కానీ, ముందు మీరు నాతో షరాబు బజారువరకూ రావాలి. నేను చాలామందిని ఎరుగుదును. అయినా మీరుకూడా వుండడం మంచిది.

"రావడానికేం ? నిరభ్యంతరంగా వస్తాను. కానీ ఈ నగలూ, వాటి మంచి చెడ్డలూ నాకు బొత్తిగా తెలియవు. నే నేనాడైనా కొన్నానా, చేయించానా ? నువ్వేమైనా కొనబోతున్నావా ?"

"ఆఁ కొనడమూలేదూ, పాడూలేదు. ఊరికే ధరలు తెల్సుకుందామని !"

"ఇంట్లో బాగా విదిలింపులు పడుతున్నై గాబోలు ! అంతేనంటావా ?"

"అబ్బే—లేదండి, ఒకవేళ నేను తెస్తానన్నా వద్దంటుంది! అయినా, మన కర్తవ్యం మనం నిర్వహించాల్నా, వద్దా? అవి పోయినప్పటినుంచీ ఒక్క నగేనా చేయించలేదు!"

"ఈ కొద్దిరోజుల్లోనే డబ్బు సంపాయించే విధానం బాగా నేర్చుకున్నట్టు న్నావు! ఏమాత్రం సంపాయించావేంటీ?"

"డబ్బెవరిదగ్గిర వుందండీ? తీసుకుంటే వాయిదాలప్రకారం ఇస్తానని తీసుకోవాలి!"

"ఇల్లాంటి పిచ్చిపనులుమాత్రం ఎప్పుడూ చేయబోక! నగలు అప్పుకు తీసుకోవడం అనేది చాలా చెడ్డ అలవాటు. పైగా ముసలివాడైతే, భార్యను సంతోష పెట్టడానికి ఇతర మార్గాలు లేకపోవడంచేత, డబ్బున్నా లేకపోయినా అప్పో సొప్పో చేసి నగలు పట్టుకుపోతాడు. అల్లాంటివాడు నగలకోసరం అప్పుచేసినా అర్థంవుంటుంది. మంచి యువకుడివి అప్పైనాచేసి భార్యను సంతోషపెట్టవలసిన అవుసరం నీకేమిటి? కావాలంటే వేలకువేలు అప్పిప్పించగలను. అదిమాత్రం మంచి పద్ధతికాదు!"

"ఏంపరకండీ, రెండు మూడు నెలల్లో మొత్తం తీర్చేస్తాను. ఆమాత్రం ధైర్యం లేకపోతే, ఈ ప్రస్తావనే తేను!"

"ఇదిగో నే నొకటి చెబుతాను విను. మూడు నెలల్లో తీర్చేబదులు, మూడు నెల్ల తరువాతే, తీసుకోకూడదా? అప్పుచేయడంకంటే ఘోరమైన బాధగానీ, పాపం గానీ మరోటిలేదు. ఇల్లా అంటున్నానని ఏమీ అనుకోకు. ఒక్కసారి గనక అప్పుకు అలవాటుపడ్డావా, ఇక నీవు శాశ్వతంగా షరాబుకు దాసుడివైపోతావు! నీకు ఆదాయం బాగావున్నది. నిజంగా రెండు మూడు నెలల్లో తీర్చగలవు. అయినా అప్పుచేయవద్దు! భవిష్యత్తుమీద ఆధారపడి ఏపనైనా చేయవచ్చుగానీ, అప్పుమాత్రం చేయకూడదు. అట్లా చేశావా? ఇక అది తెచ్చే చెడు ఇంతంత కాదు! —కాకపోయినా, ఈ దరిద్రదేశంలో నగలమీది వ్యామోహం ఎందుకింత విపరీతంగా వున్నదో, అర్థంకాదు. కమ్మని తిండినీ, మంచి బట్టల్నీ వదులుకోవ డానికి, పశువుల్లా నీచంగా, అసహ్యంగా జీవితాన్ని గడపటానికి సిద్ధంఅవుతారు; కానీ నగలకుమాత్రం దూరంకాలేరు! బంగారమూ, వెండీ మన దేశంలో ఖర్చు అయినట్టుగా, ఏయితరదేశంలోనూ ఖర్చుకాదు. లక్షలరూపాయలను పరిశ్రమల్లోనో, ఇతర అభ్యుదయ కార్యక్రమాల్లోనో వినియోగించకుండా, వెధవ శృంగారం కోసం ఖర్చుపెడతారు. ఇల్లా దేశానికి కావల్సిన అభ్యున్నతిని కావాలాని చేతు లారా అరికడతారు! ఒక్కమాట! ఏ దేశంలో ప్రజలు ఎంత మూర్ఖులో తెలుసు కోవాలంటే, వాళ్ళ నగలమీది మమకారాన్ని చూస్తే చాలు! మనం ఇంకా నయం,

ముక్కూ, చెవులే కుట్టిస్తాం. ఇంకా కొన్ని దేశాలువున్నై. వాళ్ళు పెదిమలకు కూడా నగలు కుట్టించుకుంటారు."

రమానాథుడు ఉత్సాహంగా "ఏదే దేశం?" అన్నాడు.

"ఆఫ్రికా అనుకుంటాను. అక్కడ పెదాలకు నగలు కుట్టించుకుంటారంటే నీకు చాలా ఆశ్చర్యంగా వుందికదూ? కానీ, ముక్కూ చెవులూ కుట్టించుకోవడం కూడా యేమంత తక్కువ ఆశ్చర్యకరం అయిన విషయంకాదు!....ఏదో డబ్బు వున్నవాడు తన భార్యకు నగలు చేయించుకున్నాడంటే అర్థం వుంటుంది. పది పదిహేనురూపాయల గుమాస్తా భార్యకూడా తన భర్తను నగలకోసం వేధించక మానదు. అతను పసిపిల్ల పాలడబ్బీల్లో మిగిల్చో, తన అన్నంలో నెయ్యి వేసుకోవడం మానుకునో డబ్బు కూడబెట్టి ఒకటి రెండు నగలు చేయించక మానడు; అబ్బ—ఏమిటీ పిచ్చి? దీనివల్ల నైతికంగా, ఆర్థికంగా మనం ఎంత పతనమై పోతున్నామో చెప్పలేను!"

"నగలమీది ఆసక్తిలేని స్త్రీ ఎక్కడా వుండదని నా ఉద్దేశ్యం. యూరపులో మాత్రం ఈ వ్యామోహం లేదంటారా?"

"ఆ దేశంతో మనదేశాన్ని పోల్చబోక. ఆ దేశం ధనికదేశం. అక్కడి ప్రజలు ధనికులు. వాళ్ళకువున్నా వుండవచ్చును. కానీ, ఈ దేశప్రజల ఆదాయం బహుకొద్ది. పగలంతా రెక్కలు విరగ్గొట్టుకుంటే బేడ డబ్బులైనా రావు. ఇంత విలువైన సంపాదనలో అనవసరపు ఖర్చు దమ్మిడీ అయినా సహించరాదు."

రమేశ్‌బాబు ఈ సంభాషణల్లో ఆటవిషయం మర్చిపోయాడు. సెలవురోజు కావడంవల్ల యింకా నలుగురైదుగురు మిత్రులుకూడా వచ్చారు. ఈ సందడిలో రమానాథుడు మెల్లిగా జారుకున్నాడు, రమేశ్‌బాబు యిచ్చిన ఉపన్యాసం అతనిలో కొంతవరకూ పనిచేసింది, షరాబుబజారుకు పోయాడు. కానీ, ఏ కొట్టులోకి పోలేదు. ఒకవేళ రెండుమూడునెలల్లో తీర్చలేకపోతే నగుబాటపాలుగావాల్సి వస్తుందనుకుని వెనక్కి తిరిగివచ్చాడు.

రమానాథుడు ఇంటికి తిరిగివచ్చేసరికి తొమ్మిదిగంటలైంది. వాకిట్లో కూర్చున్న దయానాథుడు కొడుకును చూసి ఇల్లా అన్నాడు : "పొద్దున్నే ఎక్కడికి పోయావు?"

"రమేశ్‌బాబుని కల్సుకుందామని."

"ఇలా అక్కడా, అక్కడా అనవసరంగా కాలాన్ని వ్యర్థపుచ్చకపోతే, రోజూ ఓ గంట లైబ్రరీపై పుకుపోయి, ఏదో ఒక పుస్తకం చదవరాదూ? పరీక్షలు ఇవ్వడానికి కాకపోతేమానె, మన జ్ఞానాన్ని అభివృద్ధిపరచుకోవడానికయినా చదవవచ్చుగదా! నన్నడిగితే స్కూలు చదువుకన్నా, స్కూలువదిలిన తదుపరి

చదువే జీవితానికి ఎక్కువగా ఉపయోగపడుతుందంటాను." ఒక్క క్షణం ఆగి "అదీగాక నీ గురించి చాలా విషయాలు వింటున్నాను.... నేను ముప్ఫైసంవత్సరాలనుంచీ ఈ ఉద్యోగం చేస్తున్నాను. ఈనాటివరకూ ఒక్క చిల్లిగవ్వకూడా లంచంటూపంగా ఈ ఇంటికి రాలేదు.... అల్లాంటప్పుడు నేటికి నీవు లంచాలు తీసుకుంటున్నావంటే నా మనస్సెల్లా వుంటుందో యోచించు?"

"మీతో ఎవరన్నారు? అన్నీ అబద్ధాలు. ఆ పెద్దమనిషి ఎవరో నా ఎదటికివచ్చి చెప్పమనండి!" రమానాధుడు కృత్రిమమైన కోపాన్ని అభినయిస్తూ అన్నాడు.

"ఎవరంటే యేం? వాళ్ళ పేర్లు అనవసరం. అసలు విషయం సత్యమా? అసత్యమా? నాకు కావల్సింది అంతే!"

"ఒట్టి అబద్ధం."

"అబద్ధమా?"

"అవును. అబద్ధమే!"

"నీవు మామూళ్ళు తీసుకోవడంలేదా?"

"మామూళ్ళు లంచాలక్రిందికి రావు. అందరూ బాహాటంగా తీసుకుంటున్నారు! నేనూ తీసుకుంటున్నాను. పైగా నేను అడక్కుండానే వాళ్ళు ఇస్తున్నారు."

"అందరూ బాహాటంగా తీసుకుంటున్నమాత్రానా, అడక్కుండానే ఇచ్చినమాత్రానా లంచం లంచంకాకుండా పోదు. దానిలోవున్న చెడుగు మంచిగా మారదు."

"మామూళ్ళు మానుకోవడం నావల్లకాదు. ఒకవేళ నేను మానినా నా క్రిందవుండే చిన్న చిన్న గుమాస్తాలు మానరు. వాళ్ళ జీతాలు బహు తక్కువ. వాళ్ళని మానమనడంకూడా భావ్యంకాదు. అల్లాంటప్పుడు నేను మానడం అసంభవం."

"నేను చెప్పవల్సింది చెప్పాను. తరువాత వినడం వినకపోవడం నీ ఇష్టం మీద ఆధారపడివుంటుంది" అంటూ దయానాధుడు ఆఫీసుకు పోయాడు.

రమానాధుడికి తండ్రిమాటలు బొత్తిగా నచ్చలేదు. "మీరింత నిస్వార్థంగా వుండి వెలగబెట్టిందేమిటి? పిల్లలకు మంచి బట్టలు లేవు. రుచికరమైన తిండికి కూడా ముఖంవాచి వున్నారు. ఇక చదువుల విషయం అడగనే అవసరంలేదు. నియమం అనేది జీవితాలను అధోగతిపాలు చేయడానికిగాదు; జీవితాన్ని పైకి ఎత్తి, ఆనందాన్నీ, సుఖాన్నీ ఈయడానికి ఉపయోగపడాలి! అప్పుడే దాని రాణింపు!" అందామనుకున్నాడు. కానీ, అనలేకపోయాడు.

ఇంట్లోకి పోగానే తల్లి ఎదురై అడిగింది: "ఉదయాన్నే ఎక్కడికి పోయావురా? మీ నాన్నగారు ఎందుకో నిన్ను అపరిమితంగా కోప్పడుతున్నారు" అన్నది.

"నన్ను కోప్పడటంకాదు. మామూళ్ళు తీసుకోవద్దని ఉపదేశం చేస్తు న్నారు. మామూళ్ళు తీసుకుంటే చెడ్డపేరు వస్తుందిట! ఆత్మ దుర్బలమై పోతుందిట!"

"నీవు చెప్పలేకపోయావా? 'మీ రింత నిక్కచ్చిగావుండి పొడిచేసింది ఏమిటి? జీవితమంతా పొట్టకు వెతుక్కోవడంతో సరిపోయింద'ని."

"మీరు చేసిందేమిటి? ఇతర్లమీద ఆధారపడడం తప్ప! మీలాగా నన్ను కూడా తయారుచేస్తున్నారు. మీకు డబ్బు సంపాయించే విధానం చేతకాదు. అందని ద్రాక్ష పులుపు అన్నట్టు తయారైయారు. ఆ విధానం నాకు తెల్సు. వ్యాపా రులదగ్గర నేను డబ్బు గుంజగలను. మీలాగా చేతగాని కబుర్లు చెప్పేవాళ్ళని నేర్పులేనివాళ్ళు అనవల్సివస్తుంది – అందామనుకున్నాను. కానీ కోప్పడతారని వూరుకున్నాను" అన్నాడు రమానాధుడు.

"నీవు చెప్పిందే నిజంరా నాయనా; ఈయనగారు ఇంట్లో కబుర్లు చెప్ప డానికే. బయటికిపోతే...."

తరువాత రమానాధుడు భోజనంచేసి ఆఫీసుకు బయలుదేరాడు. ఆఫీసుకు పోతున్న భర్తకు జాలప పోస్టులో వేయమని మూడుకవర్లు యిచ్చింది. అవి ఆమె తన స్నేహితురాండ్రకు రాసింది. మూడూ జేబులోవేసుకుని బయలు దేరాడు. సగందారిలో వాటిని చింపి చదవడం ప్రారంభించాడు. ఆ వుత్తరాల్లో జాలప తన బాధల్ని వలపోసుకున్నది. మూడింటిలోనూ విషయం ఒక్కటే! ఇల్లా వున్నది: "జీవితం అంతా విషాదమయం అయింది. తిండీ, నిద్రా మొద లైన సాధారణ సుఖాలుకూడా నాకు దూరం అయినయ్యి. వారిని సంతోషపెట్ట డానికి అప్పుడప్పుడూ నవ్వుతూవుంటాను. కానీ, నా జీవితంలో నవ్వు సంపూ ర్ణంగా హరించుకుపోయింది. బహుశా ఈ విషాదం నా ప్రాణాలను బలిగొంటుం దేమో తెలియదు! నగలు చేయించడానికి రోజూ ఆలోచనలు చేస్తుంటారు. డబ్బు కూడబెడుతూ వుంటారు. డిజయినులుకూడా నిర్ణయిస్తూవుంటారు. ఇదంతా నన్ను మభ్యపెట్టడానికేసుమా!' ఇదీ విషయం.

రమానాధుడు చురుగ్గా నడుస్తున్నాడు. పోస్టాఫీసు వెనకబడిపోయింది. కవర్లని పోస్టు చెయ్యలేదు. అతని హృదయంలో తుఫాను చెలరేగింది. 'జాలప నన్ను అపార్థం చేసుకుంటున్నది. తనను మోసంచేస్తున్నాననీ, మభ్యపరుస్తున్నా ననీ అనుకుంటున్నది. కానీ తన కేం తెల్సు; నగలు చేయించాలని నే నెంత బాధపడుతున్నానో? నా దగ్గరేగనక డబ్బుంటే తనను నగల్తో ముంచేసేవాడిని!

కానీ, ఏం చేయను; డబ్బులేదు. అయ్యో! భగవంతుడా! ఈ మొండిపట్టుతో నిజంగా ప్రాణాలమీదికి తెచ్చుకుంటుందేమో! ఈ దారుణాన్ని ఆపే ఉపాయమే లేదా? కాకపోయినా మొదట్లో యెందుకు అబద్ధాలు చెప్పాను? మొదట్లోనే యధార్థం చెప్పినట్లయితే పరిస్థితు లిలా విషమించేవి కాదుకదా!'

రమానాధుడి ఆలోచనల్తోపాటు నడకకూడా తీవ్రతరం అవుతున్నది. క్షణ క్షణానికి అతని ఆలోచనలు క్రొత్త క్రొత్త రూపాన్ని ధరిస్తున్నై. "కాకపోయినా తన బాధల్ని వివరంగా నాతో చెప్పకుండా, ఇలా స్నేహితురాండ్రకు తెలియ చేయడంలో అర్థం ఏమిటి? నన్ను అవమానపర్చడంకాదా?" అని మండిపడ్డాడు.

ఇలా బాధామయ హృదయంతో ఆఫీసుకు చేరుకున్నాడు.

వరండాలో సామాన్లన్నీ గుట్టలు పోశారు. కొంతమంది వాటిని తూచి లెక్కలు కదుతున్నారు. రమానాధుడుమాత్రం వాటివంక కన్నెత్తి అయినా చూడటంలేదు. అతని మనస్సంతా చికాకుగావుంది. పనిలో ఏమాత్రమూ నిమగ్నం కావడంలేదు. ఎంతసేపటికీ తన పెండ్లి, కుటుంబపరిస్థితులూ, వాటిలో తను చేసిన పొరపాట్లే అతని కండ్లముందు తిరుగసాగినయ్యి.

చివరకు విసిగిపోయి మామూలుకంటె ముందే ఇంటికి బయలుదేరాడు.

ఇంటికి రాగానే జాలప ఆదుర్దాగా అడిగింది. "ఉత్తరాలను పోస్టుచేశారా?"

"అరె....రె....ఎంత పొరపాటు! మర్చేపోయాను, అస లా మాటే జ్ఞాపకం లేదు!"

"వెయ్యలేదుకదా? మంచిపనిచేశారు. పోస్టులో వేశారేమోనని భయపడు తున్నాను! ఇటు తెండి."

"ఎందుకూ? రేపు వేస్తాను."

"వద్దు, వాటిని పోష్టు చెయ్యవద్దు. వాటిలో మీ గురించే రాశాను. నిజంగా మీరు పోష్టుచేసివున్నట్లయితే, నా మనస్సు చాలా బాధపడేది" అని చిన్న నవ్వు నవ్వింది జాలప.

"అవును....చెడ్డవాళ్ళను....ధూర్తుల్ని నిందించకపోతే ఎల్లా?"

జాలప ముఖం ఒక్కసారిగా కాంతిహీనమైంది.

"అయితే, మీరు చదివారా వుత్తరాల్ని?"

"అవును....ఏం? తప్పా?"

జాలప జాలిగా అన్నది: "ఐతే, మీరు నామీద కోపంగా వుండివుండాలి!"

జాలప గొంతు దుఃఖావేశంవల్ల పూడిపోయింది. కన్నీటి బిందువులు ఒకటొకటిగా పమిట చెరుగును తడపసాగినయ్యి. తల కృంగిపోయింది. కళ్ళు బరువుగా వాలిపోయినయ్యి. క్షణం తరువాత స్తిమితపడి "అపరాధం జరిగింది. పొరబడ్డాను. మీ యిష్టంవచ్చిన దండనను విధించండి. అనుభవించడానికి సిద్ధంగా వున్నాను. మనసులోమాత్రం కోపం వుంచుకోబోకండి. పొరపాటున అలా రాశాను" అని దీనంగా వేడుకున్నది.

రమానాధుడు జాలపను దగ్గిరకు తీసుకుని కన్నీళ్లుతుడిచి ఇలా అన్నాడు: "నీమీద నా కేమీ కోపంలేదు. నీవు యధార్థాన్ని రాశావు! కానీ ఆ రోజు అడ్డగించకుండావుంటే ఈపాటికి కొన్ని నగలైనా తెచ్చివుండేవాడిని. అదీకాక అప్పు పట్టుకురానా, అని నిన్నడగడం ఏమిటి? ఇంటికి వచ్చిన చుట్టాన్ని అడిగి సత్కరించినట్లుగావుంది! కోర్కెవున్నా అడిగితే, వద్దనడంకద్దు! ఇప్పటికయినా మించిపోయిందేమిటి? భగవంతుడి దయవుంటే, కొద్దిరోజుల్లోనే నగలు కొంటాను."

"డబ్బు లేదుగా? అప్పు తెస్తారా?"

"అవును....వడ్డీ వుండదు....అసలు ఇస్తే చాలు! అప్పంటూ నెత్తినవుంటే కొంచెం జాగ్రత్త అయినా ఏర్పడుతుంది."

"వద్దు....అప్పు తేకండి మిమ్మల్ని చేజేతులా అగాధంలోకి తోయలేను.... ఇకమీదట ఎప్పుడూ నగలమాట తేను!"

"ఒకప్పుడుమాత్రం నీవు అడిగావా? నీవు అడగనంతమాత్రాన నాకర్తవ్యం మర్చిపోతానా? డబ్బంతా కూడిందాకా వుండాలంటే, ఇక ఈ జీవితంలో నగలూ లేవు నాణ్యాలూ లేవు."

"సరే అయితే మొదట ఏదో చిన్ననగ పట్టుకురండి."

"అల్లాగే."

రమానాధుడు బజారుకు పోయేసరికి బాగా పొద్దుగూకింది. జాగ్రత్తగా తెలిసినవారు ఎవ్వరూ చూడకండా షరాబు బజారుకు పోయాడు. ఈ విషయాన్ని సాధ్యమైనంతవరకూ తమ ఇద్దరిమధ్యనే వుంచాలని అతని ఉద్దేశ్యం.

62

# 13

షరాబుబజారులో గంగూ దుకాణం బహు ప్రసిద్ధమైనది. గంగూ కులానికి బ్రాహ్మడే అయినా, వ్యాపారంలో వైశ్యులను మరిపించేస్తాడు. ఎప్పుడూ తియ్యకుండా విభూతిపెండెకట్లు పెడుతుంటాడు. మెడలో ఒక లావుపాటి రుద్రాక్షమాల వుంటుంది. చాలా న్యాయస్తుడనీ, ఎంత అపరిచితుడికైనా ధరల విషయంలో హెచ్చుతగ్గులు చేయడనీ ప్రతీతి. అందుచేతనే అతని దుకాణం ఎప్పుడూ కిటకిటలాడుతుంది.

గంగూ రమానాధుని చూడగానే వినయవిధేయతలు ఉట్టిపడేట్టు, "రండి, బాబుగారూ! రండి. ఇదిగో గుమాస్తాగారూ! బాబుగారు వస్తున్నారు; వీరికి ఆకూ, వక్కా తెప్పించు!" రమానాధువైపుకు తిరిగి, "ఏం బాబూ! ఇటు తొంగైనా చూడటంలేదు? ఈ ముసలి గంగూమీద కోపంవచ్చినట్టుగా వుంది! మీరు దయ చూపకపోతే, బీదవాళ్ళం ఎల్లా బ్రతకడం?" అన్నాడు.

గంగూ అంటగట్టిన ఈ గొప్పతనమూ, గౌరవమూ రమానాధులో చిత్రంగా పనిచేసినయ్యి. కొట్లోకి రావడానికే సంకోచిస్తున్న అతను, ధైర్యంగా నిటారుగా మెట్లుఎక్కి లోపలికి వచ్చాడు. నిజంగా గంగూ ఇలా గౌరవించకపోయినట్టయితే, తను బజార్లోనుంచే వెనక్కు తిరిగేవాడేమో!

"మాలాంటివాళ్ళు వచ్చిమాత్రం ప్రయోజనం ఏమిటిలే! మే మేం కొనగలుగుతాం? ఏదో, డబ్బున్న మహారాజులు వచ్చినా అందం, చందం" పైమాటకు అన్నాడు రమానాధుడు.

"అల్లా అనకండి. నేను డబ్బును చూసేవాడినికాదు! మనిషి ప్రధానం గాని, డబ్బుటండీ? వెధవడబ్బు ఎంత రావడంలేదు, ఎంత పోవడంలేదు! డబ్బుకోసం ఆలోచించకండి. మీకు ఏంకావాల్నో తీసుకోండి! డబ్బు నిదానంగా పంపుదురుగాని. నిన్ననే ఢిల్లీనుంచి వజ్రాలహారాలను తెప్పించాను. చూపమంటారా? వజ్రాలు పొదిగిన చెక్కడపు గాజులుకూడా వున్నై, చూపనా?"

రమానాధుడు గంగూ చూపిన ఆసనంమీద కూర్చుంటూ, "కొద్ది ఖరీదులో ఏదైనా హారం చూపండి" అన్నాడు.

"ఒక వెయ్యిరూపాయల్లో చూపమంటారా?"

"కాదు....నాలుగు వందల్లోపు."

"కొద్దిధరలో, గొప్పధరలో రెండురకాలూ చూపిస్తాను. మీకు నచ్చితే తీసుకోవచ్చు. నా దగ్గిర మోసాలూ, ధరల్లో తేడాలూ పనికిరావండి. పసిపిల్లవాడు వచ్చినా వస్తువులోగానీ, ధరలోగానీ వీసంఎత్తు తేడా వుండదు. నేను చెప్పిన ధరకు కళ్ళుమూసుకుని తీసుకోవచ్చు. ఇక్కడ నాలుగు డబ్బులకోసం అబద్ధాలు ఆడి, మోసాలు చేస్తే సరిటండీ, రేపక్కడ (చేతులు పైకిఎత్తి) సంజాయిషీ చెప్పుకోవద్దూ ?"

గుమాస్తా హారాలపెట్టెలు తెచ్చి ముందుపెట్టాడు. గంగూ ఒక్కొక్కదాన్నీ వివరంగా చూపుతున్నాడు. ఒకదానికంటె ఒకటి మిన్నగావున్నై. దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ హారాల మెరుగునీ, పనితనాన్నీ రమానాధుడు సాశ్చర్యంగా చూస్తున్నాడు. మొదట నాలుగువందల రూపాయల హారాన్ని తీసుకుందామనుకున్నాడు. తనదగ్గిర వున్న మూడువందలూ పోను, ఒక వంద అప్పు చెయ్యవచ్చు అనుకున్నాడు. కానీ, ఆరువందల రూపాయల హారంముందు నాలుగు వందలది సూర్యుడిముందు దీపంలా వెలవెలబోతున్నది. ఇంతకాలం తరువాత ఒక్క వస్తువును కొంటుంటే, అది విలువైనదిగా చూసి కొనడమే ఉత్తమం అనుకున్నాడు. నిజంగా తను ఆరువందల్ది పట్టుకుపోతే, జాలప ఆశ్చర్యంతో నోరు తెరుస్తుంది! కానీ, ఈ గంగూ ఒక్కసారి మూడువందల రూపాయల అప్పు ఒప్పుకుంటాడా ? ఏది తీసుకోవడమా అనే సందిగ్ధంలో పడ్డాడు.

గంగూ రమానాధుడి మనస్థితిని గమనించి, "ఈఆరువందల రూపాయలదే తీసుకువెళ్ళండి. మీ హోదాకు తగివుంటుంది. ఆ మెరుగుచూశారా ? చీకటి ఇంట్లో పెట్టారా ? ఇక దీపంలేని కొరత వుండదు !" అన్నాడు.

"నిజమే ! ఇదే నాకూ నచ్చింది. కానీ, ప్రస్తుతం నాదగ్గిర మూడువందలే వున్నై" రమానాధుడు తలవంచుకుని సిగ్గుపడుతూ అన్నాడు. అతని ముఖం ఎర్రపడ్డది. గంగూ సమాధానంకోసం ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాడు.

గంగూ నిష్కపటంగా అన్నాడు : "బాబూ ! డబ్బులేదని సంకోచించబోకండి. నేను డబ్బును చూసేమనిషిని కాదని మొదట్లోనే చెప్పానుగా ? కావాలంటే, పదివేలరూపాయల సరుకు నిల్చున్నపళంగా మీతో పంపుతాను. మీకు యింకేమైనాకూడా కావాలంటే తీసుకోండి. ఇదిగో, గుమాస్తాగారూ ! ఆ పూలకుచ్చుల్ని చూపండి. బాబుగారూ, ఇది సరికొత్త ఫేషన్ ! అసలైన గులాబీలను మరిపిస్తయ్. ధరకూడా స్వల్పం. ఒక్క రెండువందల యాభై. మీరు డబ్బుకోసం ఏమీ సంకోచించవద్దు !"

రమానాధుడు నవ్వి, "గంగూగారూ, మాటల్లో పడేయబోకండి....నగల విషయంలో నాకు బొత్తిగా అనుభవంలేదు" అన్నాడు.

"అయ్యయ్యో! మీ రలా అనకండి. వీటిని ఇంకో దుకాణానికి పట్టుకు పొండి. నేను చెప్పిన ధరకు దమ్మిడి తేడావచ్చినా, వూరికే ఇచ్చేస్తాను....ఎంత మాట అన్నారు, బాబుగారూ!"

గుమాస్తా చలవరాతి పూలకుచ్చుల్ని ఇచ్చాడు. వాటిని చూసేసరికి రమానాథుడి కండ్లు విప్పారినయ్యి. అవి నిజమైన గులాబీ పుష్పాలకన్నా మిన్నగా వున్నయ్యి. వజ్రాలతో పొదివిన మొగ్గలు సూర్యకాంతికి మెరిసే హిమబిందువుల్లా వివిధ వర్ణాలనూ వెదజల్లుతున్నై. వాటిని చూస్తుంటే అతని కేదో అలౌకికమైన వస్తువును చూస్తున్నట్లుగా వున్నది.

"చూడండి ఎంత అందంగా చెక్కాడో! రెండువందలయాభయ్యో ఈ పనితనానికి ఇచ్చినా ఇయ్యవచ్చండి!"

"అవును....నిజమే! కానీ, రేపటినుంచే డబ్బుకు గొంతుమీద కూర్చుంటారేమోనని భయంగా వుంది....నేనూ, సాధ్యమైనంత త్వరలో తీర్చడానికే ప్రయత్నం చేస్తాను....!"

గంగూ సమాధానం చెప్పకండా హారాన్నీ, చలవరాతి పుష్పాన్నీ ఒక అందమైన మఖమల్ పెట్టెలో పెట్టి రమానాథుడి చేత కందించాడు. తరువాత ఖాతాపుస్తకంలో వ్రాసుకుని పంపించాడు.

రమానాథుడు వుల్లాసంగా ఇంటివైపు నడుస్తున్నాడు. ఎంత సంతోషంగా కనుపించినా, అతని హృదయపు అట్టడుగుపొరల్లో లేశమాత్రంగా భయమూ బెరుకూ కూడా పనిచేస్తున్నై. అతనిస్థితి తల్లిదగ్గిర డబ్బులు దొంగిలించి మిఠాయి కొనుక్కుతినే పిల్లవాడిస్థితిలా వుంది. రుచికరమైన మిఠాయి తినగలుగుతున్నందుకు ఆనందమైతే పడుతున్నాడు కానీ, దానితోపాటు ఇంటికిపోతే తల్లి కొడుతుందేమో అనే భయాన్ని కూడా అనుభవించక తప్పడంలేదు. ఆరువందలు అప్పు చేసినందుకు తనేమాత్రమూ భయపడటంలేదు. నిజంగా తల్చుకుంటే ఆరునెల్లలోపే తీర్చేసెయ్యగలడుకూడానూ! అయినా తండ్రికి తెలిస్తే ఏమంటాడో! వీటిని త్వరగా జాలపకు చూపాలని పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడుస్తున్నాడు. వీటిని చూసి జాలప ఎంత ఆనందపడేదీ, వీటిని ధరించినప్పుడు ఆమె సౌందర్యం ఎలా ఇనుమడించేదీ మొదలైన విషయాలను యోచించుకుని, అన్ని భయాలకూ అతీతుడైపోతున్నాడు.

ఎంత త్వరగా నడిచినా అతనికి నడిచినట్టులేదు. శీఘ్రంగా ఇల్లుచేరాలనే వుత్సాహంతో, పెద్దబజారు విడిచి గొందుల్లోనుంచి నడవసాగాడు. అతను ఇంటిదగ్గిరనుంచి బయలుదేరినప్పుడే ఆకాశం మేఘావృతమౌతున్నట్టుగా వుంది. సరిగా అతనిలా గొందుల్లోకి మళ్ళాడో లేదో దబదబా చినుకులు పడసాగినయ్యి. గొడుగువేసుకునేలోపే తలా బట్టలూ తడిసిపోయినయ్యి. గొంది

విపరీతమైన చీకటిగావుంది. కన్ను పొడుచుకున్నా ఎవటివస్తువు కనుపించడం లేదు. దడదడమనే వర్షపుశబ్దం పరిసరంలోని మిగిలిన శబ్దాలన్నింటినీ మింగేసింది. రమానాధు హృదయంలో ఒక అవ్యక్తమైన భయం సూర్యుడి తొలికిరణంలా పొడమి, కొద్దిసేపట్లోనే హృదయాన్నంతా ఆక్రమించేసింది. "ఎవరైనా రౌడీలు ఈ నగలను లాక్కుంటే....ఆ చీకట్లో నిర్మానుష్యంలో తనేం చేసేట్లు? కాకపోయినా రెండు నిమిషాలు ఆలశ్యం అయితే ఏం కొంప మునుగుతుందని ఇటువచ్చినట్టు....?" అనుకుంటూ తన నడకను తీవ్రతరం చేశాడు. కొద్దిసేపట్లోనే మళ్ళీ బజారుకు చేరుకున్నాడు. మునిసిపాలిటీ దీపాల వెలుగు కనుపించింది. ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. వెలుగులో ఎంత విశ్వాసమూ, శక్తీవున్నై!

రమానాధుడు ఇంటికిపోయేసరికి, తండ్రి మధ్యగదిలో కూర్చుని హుక్కాపీలుస్తున్నాడు. తండ్రికంటపడకండా లోపలికిపోదాం అనుకున్నా డతను. ఇంతలో తండ్రి పిలవనే పిల్చాడు. "ఇంత పొద్దుపోయేవరకూ ఎక్కడికి పోయావురా?"

తండ్రిమాట వినిపించుకోకుండానే అతను లోపలికి పోయాడు. లోపల జాలప తనకోసం ఎదురుచూస్తున్నది. భర్తను చూడగానే చప్పున గొడుగు అందుకుని, "పూర్తిగా తడిసిపోయారు. పోనీ, ఎక్కడైనా కాసేపు ఆగలేకపోయారా?" అన్నది.

"చాలాసేపు ఆగాను. ఇప్పు డప్పుడే తగ్గేట్టుగాలేదు. ఇక విసిగిపోయి బయలుదేరాను" అంటూ రమానాధుడు నిలబడకండా పైకిపోయాడు. జాలప కూడా తనతోపాటు పైకివస్తుందని అతని అభిప్రాయం. కాని ఆమె నేరుగా మరదుల దగ్గిరకుపోయి కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నది. మాటల్లో భర్తధ్యాసే లేకుండా మునిగిపోయింది.

రమానాధుడు పైకిపోయి బట్టలు మార్చుకుని, భార్యకోసం ఎదురుచూస్తూ నిల్చున్నాడు. భార్య ఎంతకీ రాకపోవడంవల్ల విసుక్కుంటూ మంచంమీద కూలపడ్డాడు.

కొంతసేపటి తరువాత దయానాధుడు భోజనానికి లేచాడు. అతనితోపాటు చిన్నపిల్లలుకూడా లేచారు. ఈ అవకాశంకోసమే జాలప ఎదురుచూస్తున్నది. అందరూ వంటగదిలోకి పోయిన తరువాత ఆదుర్దాగా పైకి వెళ్ళింది. రమానాధుడు మంచంమీద పడుకునే భార్యను వుడికించడానికి "బజారుకుపోయాను, అయినా పని జరగలేదు. హారాలు మంచివి చేసి సిద్ధంగాలేవు. అందుకని చేయమని ఆర్డరు ఇచ్చివచ్చాను" అన్నాడు.

ఉత్సాహంతో దీప్తివంతంగా వున్న జాలప ముఖం పైమాట వినగానే

మలినం అయింది. "ఇలా చెబుతారని నాకు మొదటేతెలుసు, అదిగో, ఇదిగో, అని ఇంకో ఆరునెల్లు గడుపుతారు!" అన్నది నిరాశగా.

"అబ్బే....చాలా త్వరగా ఇస్తానన్నాడు."

"పోనిద్దురూ....ఎప్పుడిస్తే ఏం?"

ఆశ మితిమీరితే నిరాశగా పరిణమిస్తుంది. జాలప మూతివిరుచుకుంటూ వెళ్ళిపోవడానికి వెనక్కు తిరిగింది. రమానాధుడు పెద్దగా నవ్వాడు. నగలు తెచ్చే తనను వుడికించటాని కలా చేస్తున్నాడని తెల్సుకున్న దామె.

"మీరు అసాధ్యులే! ఏదీ....ఏం తెచ్చారూ? చూద్దాం?"

"చూశావా కాసేపట్లో ని న్నెలాచేశానో?"

"మొగవాళ్ళకుండే జబ్బే....ఇంత!"

జాలప నగలనుచూసి పరవశ అయింది. కళ్ళు విప్పారినయ్యి అనుకో కుండానే. పెదాలమీద వెన్నెల చిరునవ్వు తాండవించింది. శరీరమంతా తేలిక పడ్డది. తన పరవశత్వాన్ని భర్తకు కనపడకుండా చేయాలనుకున్నది. కానీ, సాధ్యంకాలేదు. నగలను ధరించి అద్దంలో ఒకసూటు చూసుకున్నది. క్రొత్త నగలతో ద్విగుణీకృతమైన తన శోభకు తనే మురిసిపోతూ భర్తతో, "మీరు దేవిని ఉపాసించారు. దేవి ప్రసన్నమైంది. వరమిస్తున్నది తీసుకోండి!— మీ యావత్తుపనులు విఘ్నాలులేకుండా సఫలం అగుగాక!" అన్నది.

ఇన్నాళ్టికి జాలప చిన్ననాటి కోర్కె సఫలం అయింది. ఈ సమయంలో తల్లి దగ్గిరవుంటే "నీ వెంతచేసూ, నీ హారం ఎంతచేసు....నాకుమాత్రం లేదను కున్నావా?" అని ముఖానకొట్టినట్టు చూపవచ్చుకదా! అనుకున్నది.

రమానాధుడికి తన జన్మ సాఫల్యం అయినట్టుగానే వుంది.

"క్రిందికివెళ్ళి అత్తగారికి చూపి వస్తాను."

"చూపవచ్చునులే!"

జాలప వుత్సాహాన్ని ఆపుకోలేక క్రిందకు బయలుదేరింది.

"ఇదిగో అప్పుతెచ్చాననిమాత్రం చెప్పవద్దు" అన్నాడు రమానాధుడు.

జాలప తిరిగి పైకివచ్చేసరికి బాగా పొద్దుపోయింది. రమానాధుడు అలిసి నిద్రపోయాడు. వెన్నెల స్వచ్ఛంగా నిర్మలంగా కాస్తోన్నది. జాలప నేరుగా గదిలోకిపోయి అలమారా తీసింది. దాన్లోనుంచి చిన్ననాటి నకిలీహారాన్ని బయ టికితీసి అసలుహారందగ్గిర వుంచింది. రెండింటినీ పరిశీలనగా చూసింది. చంద్రుడిముందు నక్షత్రంలా అసలుహారంముందు నకిలీహారం కళావిహీనంగా కనుపించింది. ఆమెకు చాలా వెగటూ, అసహ్యం కలిగినయ్యి. వెంటనే తెంచి అవతల పారేసింది, ఈశ్వరోపాసకుడు పూజానంతరం నిర్దాక్షిణ్యంగా మట్టి ప్రతిమను ప్రవాహంలోకి నెట్టినట్టు!

# 14

నగలు తెచ్చిన రోజునుంచీ జాలప ప్రవర్తనలో చాలా మార్పు వచ్చింది. భర్తమీదవున్న వెనకటి ఉదాసీనత మంచులా కరిగిపోయింది. అతి ఆప్యాయతను, ఎన్నడూలేని స్నేహభావాన్నీ తన ప్రతి చర్యలోనూ ప్రదర్శించసాగింది. వెనక రమానాధుడు తనకు అవుసరమైన వస్తువుల్ని అడిగితీసుకొనేవాడు. తనకు అవుసరమైన పనులుకూడా అడిగితేగాని జరిగేవికావు. ఇప్పుడలాకాదు. అతని అవుసరాలన్నీ అడక్కుండానే నెరవేరుతున్నై. స్నానానికిపోతే సబ్బూ, తుండుగుడ్డా సిద్ధం. స్నానంచేసి బయటికివస్తే, ధోవతి మడతలు విప్పి ఎదురుగా కనిపిస్తూవుంటుంది. ఏ రోజైనా తను వంటచేయాల్సివస్తే వెట్టి చాకిరీ చేయవలసి వచ్చినట్టు బాధపడేది జాలప. ఇప్పుడు రోజూ చక్కని రుచికరమైన పదార్థాలను చేసి రమానాధుని మెప్పించచూస్తున్నది. రమానాధుడు జాలపలో వచ్చిన ఈ మార్పునూ, తన నగల విలువనూ తూచుకుని, ఈ భక్తీ, శ్రద్ధ, అనురాగాల ముందు, రెండేకాదు. అల్లాంటివి లక్షతెచ్చి సమర్పించినా చాలవని అనుకునేవాడు.

గంగూ దుకాణంనుంచి రమానాధుడు నగలు పట్టుకుపోయిన విషయం ఎలాగో పక్కదుకాణాలవాళ్ళకు తెల్సింది. ఇక అతను ఆ బజారున కనుపిస్తే రెండువైపులా వున్న దుకాణాలవాళ్ళు తాము కూర్చున్న స్థానాలనుంచి లేచి నిల బడి, "రండి బాబుగారూ! మా దుకాణానికికూడా ఒకమాటు దయచేయండి" అనడం ప్రారంభించారు.

రమానాధుడు ఈ బాధనుంచి తప్పించుకోవడానికి ఖచ్చితంగా చెప్పే వాడు, "నే నేమీ కొనబోవడంలేదు....ఏమీ కొనను!" అని

అయినా వదిలేవారుకాదు "కొనకపోతే మానె, ఒక్కమాటు లోపలికివచ్చి నగలు చూడండి. ఒక్కమాటు ఇంటికిపట్టుకుపోయి అమ్మగారికి చూపండి. నచ్చితే వుంచుకుందురుగాని.........మేము దురదృష్టవంతులం....మీ సొమ్ముతినే భాగ్యం మాకు లేదు. ఇవ్వాళ మీ బంగారపు చేత్తో బోణీచేయాలి. తప్పదు!"

"మీ నగలు చాలా బాగుంటయ్యి. ఆడవాళ్ళకు ఇట్టేనచ్చుతాయి. అంత మాత్రంచేత ప్రయోజనం ఏమిటి? నా చేతిలో కానీకూడా లేదు" అన్నాడు రమా నాధు డొకనాడు.

ఇంతలో ఒక దుకాణదారుడు అందుకున్నాడు: "వెధవడబ్బు....డబ్బెవరి

కావాలిబాబూ ? మేము చూసేవి మనిషి గుణగణాలు ! మీ దయవుంటే అంతే చాలు, డబ్బుతో పనేలేదు ! రండి, లోపలికి దయచేయండి...." అన్నాడు.

వద్దనుకుంటూనే రమానాధుడు లోపలికి పోయాడు. వ్యాపారి ఒక గాజుల జతనూ, ఒక లోలకులజతనూ చూపాడు. రెండూ వజ్రాలు పొదిగినవే ! విద్యుద్దీపాల్లా వెలిగిపోతూ అపూర్వంగా వున్నై.

పదిగంటలకు పైన అయివుంటుంది. తండ్రి భోజనంచేసి తిరిగి వెంటనే కచేరీకి పోయివుంటాడు. తనుకూడా భోజనంచేసి తిరిగి వెంటనే ఆఫీసుకు వచ్చేద్దామని బయలుదేరాడు. మధ్యదారిలో వ్యాపారి పిలవడమూ, తను ఆ నగలను చూడటమూ జరిగింది. వాటిని చూసింతర్వాత ఆఫీసువిషయం మర్చేపోయాడు.

రమానాధుడు తెచ్చిన నగలను జాలపా, రాజేశ్వరీ పరిశీలనగా చూస్తున్నారు. వాటి పనితనమూ, కొత్తవస్తున్నట్టున్న మెరుగూ వాళ్ళను ముగ్ధుల్ని చేసినయ్యి.

రమానాధుడు నవ్వుతూ, "నచ్చినయ్యా ?" అన్నాడు.

"నచ్చకేం ? బాగానే నచ్చినయ్యి" అత్తగారివంకచూసి, "మీరు తీసుకోండి" అన్నది జాలప.

రాజేశ్వరి తన మనోవ్యధను కనబడనీయకుండా తల వంచేసుకున్నది. ఆమె నగలు పెట్టుకోవల్సిన రోజులన్నీ సంసారపు బాధలతోనే గడిచిపోయినై. ఇక ఇప్పుడు ఆమెకు నగలెందుకు !

రాజేశ్వరి జీవితంలోని ఏ ఒక్క కోర్కె ఈనాటివరకూ పూర్తికాలేదు. ఆమె కాపురానికి వచ్చినప్పటినుంచీ భర్త ఆదాయం బొటాబొటీగా వుంటూవచ్చింది. ఏనాడూ సంసారపు ఖర్చులకుపోను రెండు రూపాయలు వెనకవేయడం అంటూ జరగలేదు. మధ్యమధ్యా అతని ఆదాయం ఒకటి రెండు రూపాయలకు పెరిగినా, అదే సంవత్సరం ఇంకో కొత్తజీవి సంసారంలో వుద్భవించడం జరుగుతుండేది. ఆ అదనపు ఆదాయాన్ని కొత్తజీవి చిన్న చిన్న అవుసరాలకు సరిపుచ్చవల్సి వచ్చేది.

ఈ విధంగా ఉవ్వెత్తున లేచిన ఆమె జీవితపు ప్రధమ కోర్కెలన్నీ వాటంతటవే చల్లారిపోయినయ్యి. తల వంచుకునే అన్నది : "ఇంకా నాకెందుకు తల్లీ ........అయినా ఎవరు తెచ్చారు ? ధర ఎంత ?"

రమానాధుడు అందుకుని "ఒక షరాబు చూపడానికి తెచ్చాడు. ధర అడగలేదు........కానీ, పెద్ద ధరే వుండవచ్చు ! అయినా మనకు అవుసరం లేదుకదా ? ధర ఎంత అయితే మనకెందుకు ?" అన్నాడు.

"అవుసరం లేదంటున్నారు. అల్లాంటప్పుడు ఎందుకు తెచ్చారు? తీసుకుపొండి" అన్నది జాలప.

"తీసుకుపోనా?" ప్రశ్నార్థకంగా చూశాడు రమానాధుడు.

"అత్తగారు వద్దంటున్నారు. అదికాక ఊరికే ఏమైనా వస్తాయ్యిగనుకనా మన యిష్టప్రకారం వుంచుకోవడానికి?"

"ఊరికే వచ్చినయ్యి అనుకో. ముంచుకుపోయింది ఏమిటి?"

"వింటున్నారా అత్తయ్యగారూ, మీ కొడుకుగారి మాటలు? డబ్బువుంటే, అనుకున్నా అందం చందం! డబ్బులేని వేడుకబేరాలు ఎందుకు? ఇచ్చిరండి!"

రాజేశ్వరి అంతరాంతరాల్లో మరుగుపడిపోయిన నగలమీద మమకారం కొంచెం పెల్లుబికింది: "అయితే యేం! డబ్బు....ఇప్పుడే అడగడంలేదుగా?" అన్నది.

"ఇప్పు డడక్కపోయినమాత్రాన ఒరిగిందేమిటండి, రేపు వడ్డీతో సహా గోళ్ళూడగొట్టి తీసుకుంటారు" అన్నది జాలప.

"అయితే, ఇచ్చి రమ్మంటారా?.........ఏదో ఒకటి తేల్చి చెప్పండి?" అన్నాడు రమానాధుడు.

ఇలా రమానాధుడు స్పష్టంగా 'ఇచ్చిరమ్మంటారా?' అని అడగడం జాలప కేమీ నచ్చలేదు. అసలు ఈ విషయంలో తనను ప్రశ్నించడం ఏమిటి? ఒకవేళ తను 'వద్ద'న్నా అతను కాదు కూడదని బలవంతాన చేతులకు తొడగవల్సిన పని!

ఆశగా, తృష్ణగా నగలవంక చూస్తూ, "ఇచ్చేయండి అత్తగారూ! రాత్రింబగళ్ళూ ఈ అప్పువాళ్ళ గొడవ ఎవరు పడతారు?" అన్నది. తరువాత నగలను పెట్టెలో పెట్టి భర్తచేతికి అందించింది.

నగలమీది ఆమె చూపులు నోటిదాకావచ్చి యుక్తిగా తప్పించుకుపోయిన ఎలుకను చూసే పిల్లి చూపుల్ని జ్ఞప్తికి తెస్తున్నై.

అంతవరకూ మౌనంగా చూస్తున్న రాజేశ్వరి ఇక తన ఆశల్ని ఆపుకోలేకపోయింది. ఒక్కసారి ఆ గాజులు తన చేతికి తొడుక్కుంటే ఎంత బాగుండునో అనిపించిందామెకు. చప్పున కొడుకుచేతుల్లోని నగలపెట్టెను అందుకుని గాజులుతీసి చేతులకు తొడుక్కున్నది. ఆమె కళ్ళు రెండూ మితిలేని ఆనందంతో మెరిసినయ్యి. రాజేశ్వరి తన జీవితంలోని కోర్కెలన్నీ ఈ ఒక్కక్షణం కాలంలో - వీటిని ధరించడంతో - పూర్తి అయినయ్యనుకున్నది. మరుక్షణంలోనే నగలమీది తన ఈ మమకారానికి సిగ్గుపడి, గాజులు తీసి ఇయ్యబోయింది.

రమానాధుడు తల్లిని వారిస్తూ, "వుండనియ్యమ్మా! తొడుక్కున్నావుగా, వీటిని నీకు నేను కానుకగా ఇచ్చాననుకో!" అన్నాడు.

తల్లి కండ్లు అశ్రుపూరితాలైనయ్యి. తన బహుపురాతనకోర్కె ఈవిధంగా కొడుకుద్వారా తీరింది. అయినా సంతోషంకంటే ఆమెలో బాధే ఎక్కువగా కనుపిస్తుంది. పసివాడు ఏదో మాటవరసకు తీసుకోమన్నాడు. ఆమాత్రానికి తీసుకుంటే అప్పులపాలై పోడా? పైగా ధర ఎంతోకూడా తెలియదు. ఎక్కువ ధర ఐతే ఎక్కడనుండి తెచ్చిస్తాడు? త్వరగా చేతికి డబ్బందును. అందక పోను! వాడిని నేనే కావాలని బాధల్లో పడేయనా? అని ఆలోచించుకుని గాజుల్ని తీసియిస్తూ, "లేదు నాయనా, చూడ్డానికి తొడుక్కున్నాను. తీసుకుపోయి ఇచ్చిరా!" అన్నది.

దిగులుగా, వుదాసీనంగా వున్న తల్లిముఖంచూసి రమానాధుడి హృదయంలో తల్లిప్రేమ పొంగులువారింది. 'వెధవ అప్పు. అప్పుకు భయపడి తను ఈ మాత్రం తల్లిమనస్సు తీర్చలేడా? కనీ, పెంచీ పెద్దచేసిన తల్లికోసం తను ఈ మాత్రం త్యాగం చేయలేడా?' అనుకుని సానునయంగా తల్లితో అన్నాడు: " 'రూపాయల' కోసం భయపడబోకమ్మా! నీ కెందుకు, వుంచుకో!"

రాజేశ్వరి కోడలివైపు చూసింది. జాలప దిగులుగా, ఈ గాజుల్ని తనకు లేకుండా అత్త ఎక్కడ తీసుకుంటుందో, అన్నట్టు అదోవిధమైన భయంగా చూస్తున్నది. రాజేశ్వరి కోడలి భావాన్ని తెల్సుకుని, "ఇదిగోనమ్మా, నీవు తీసుకో, మాకు నగలు ధరించేకాలం పోయింది. ఇక మీరు సుఖంగావుంటే చూడటమే మాకు మిగిలింది" అంటూ గాజులజతను జాలపకు అందించింది.

జాలప వుద్దేశ్యంలో అత్తగారిదగ్గర డబ్బు కుప్పతిప్పలుగా వుందని, పిసినిగొట్టుతనంవల్ల ఇంతసేపు సంశయించారేగానీ, నిజంగా తీసుకోవాలనుకుంటే వారు నిల్చున్నపళంగా డబ్బు ఇచ్చి తీసుకోగలరనుకున్నది. ఇంతసేపటి నుంచీ జాలప, గాజుల్ని వుంచుకోవడమా? పంపడమా? అనే విషయంగురించి సందిగ్ధావస్తలో పడ్డది. గాజుల్నయితే వుంచుకోవాలనేవుంది కానీ, ధర తన భర్తనెత్తిన పడుతుందని వెనక ముందాడుతున్నది. ఇప్పుడత్తగారే తన నోటి మీదగా తీసుకోమంటున్నారు. ధర అత్తగారే చెల్లిస్తారనే దాన్లో సంశయము లేదు. ఇలా అత్తగారే తీసుకోమంటున్నప్పుడు, వద్దనవల్సిన అవసరం జాలపకు కన్పించలేదు. అయినా బాగుండదని పై మాటకు "మీ దగ్గర ప్రస్తుతం డబ్బున్నదో లేదో? నాకు గాజులకేం తొందర్లేదండి!" అన్నది.

రమానాధుడికి తన బండారం బయటపడిపోతుందేమోనన్న భయమూ, ఇలా అప్రస్తుతంగా మాట్లాడుతున్నందుకు జాలపమీద కోపమూ కలిగినయ్యి.

కన్నెఱ్రజేసి "అనవసరం అయిన మాటలెందుకు ? కావాలంటే వుంచుకోరాదూ" అన్నాడు.

"అత్తగారు....ఒప్పుకోవడంలే...."

జాలప నోట్లోనుంచీ మాట పూర్తిగా బయటకు రాకముందే "అరె.... మళ్ళీ అదేమాట అంటావు ? నీకు కావాల్నా ? కావాల్సుంటే వుంచుకో, డబ్బు విషయం ఆలోచించకు....పోనీ ఈ వుంగరాన్ని అట్టేపెట్టుకో !"

"సరే, ధర ఎంతో కనుక్కోరండి."

"అబ్బ....నీకు ధరతో ఏం పని ? కావాల్సింది తీసుకోక !" అంటూ రమానాధుడు బయటికిపోయి, తనతో వచ్చిన గుమాస్తాను ధరలు అడిగి తెల్సు కున్నాడు. ధర వినేసరికి అతనికి గుండె ఆగినంత పనైంది. గాజులు ఏడు వందలూ, ఉంగరం రెండువందలయాభై య్యీ చెబుతున్నాడు. ఏ మూడునాలుగు వందల్లోనో వస్తయ్యనుకున్నాడు. తన అంచనాకు ఇంత వ్యత్యాసం ! ధరల్ని భరించడం అసంభవం ! పోతే క్షణంక్రితం నగలను తీసుకోమని జాలపను వద్దంటున్నా బలవంతంచేసి, ఇప్పుడు ధర భరించలేను ఇచ్చేశెయ్యమంటే ఏం బాగుంటుంది.' అయినా తప్పదు. ఇంత ధర భరించడం కష్టం. వాపసు చేయ వల్సిందే !

"ఏదో కొద్ది ధరల్లో వస్తయ్యనుకున్నాను. మీరు చాలా చెబుతున్నారు" అన్నాడు రమానాధుడు గుమాస్తాతో,

గుమాస్తా పేరు చరణదాసుడు. "ధరలో దమ్మిడీ తేడాలేదు. అవుసరం ఉంటే వుంచుకోండి, లేకపోతే ఇచ్చెయ్యండి" అన్నా డతను.

"పరిస్థితులు బాగా లేవు. ఇప్పు డింత ధర భరించలేను."

"మీ రలా అంటే నేను ఒప్పుకోను. ఇల్లాంటి పనితనంకల వస్తువుల్ని మీరే తీసుకోలేకపోతే మరెవరు తీసుకోగలరు ? ఎందుకండీ సందేహిస్తారు ? రెండునెల్లు జోరుగా పని సాగితే, ఇంత కాదు, ఇంకా ఇంతైనా ఎడంచేత్తో అవ తల పారేస్తారు !"

"ఊఁ, లాభంలేదు. తొమ్మిదివందల యాభై రూపాయలు....అబ్బో !...."

"డబ్బుగురించి ఆలోచించబోకండి. వస్తువు నాణ్యాన్ని గురించి ఆలో చించండి....అమ్మగారు గనక ఒక్కసారి వీటిని ధరించి మీకు కనిపించారా ఇంకా రెండింతలైనా పారేస్తారు."

రమానాధుడు లోపలికి వచ్చాడు. నగలధర విన్నతరవాత, జాలప తనం తట తనే వద్దనకపోతుందా అని అతని ఉద్దేశ్యం !

పెద్దగా నవ్వి, "అయితే, అమ్మా ! ఈ గాజుల ధర ఎంత వుంటుందో చెప్పు చూద్దాం ?" అన్నాడు.

రాజేశ్వరి తక్కువ ఏదో సమాధానం చెప్పి, తన తెలివితక్కువను వెల్లడి చేయదల్చుకోలేదు. తెలివిగా తప్పుకున్నది. "ఈ రాళ్ళపనిముట్ల ధరలు నిర్ణయించడం కష్టం! ఎంతయినా వుండవచ్చు!" అన్నది.

"సరే—నీవు చెప్పు జాలపా. ఎంత ధరకడతావో చూద్దాం!" అతని వుద్దేశ్యం జాలప ఏ వందో, రెండువందలో అంటుంది. అప్పుడు ఈ విపరీతం అయిన ధరను తెలియజేసి, ఆమె నోటిమీదుగానే వద్దనిపిద్దామని.

"ఆరువందలకు తక్కువ వుండదు."

అతని ప్లానంతా భగ్నమైపోయింది. ఆమె మొదట్లోనే ఇంత ధరా ఆలోచించుకుని వున్నదన్నమాట! ఇక తను ఆశ్చర్యపర్చడం, ఆమె నోటిమీదుగానే వద్దనిపించడం జరిగేపనేనా!

సిగ్గుపడుతూ అన్నాడు : "రాళ్ళు చాలా ఖరీదైనవి!"

"ఎంత ఖరీదయినా, ఆరువందలకు మించదు."

"మరి ఈ వుంగరమో?"

"మహా అయితే వందరూపాయలు అవుతుంది."

"ఇక్కడా తప్పే చెప్పావు! నూటయాభై."

"మనమేం ముఖంవాచి కూర్చున్నామా? అంతకు ఎక్కువ అయితే వద్దనే వద్దు!"

ఈ నగల ధర, గుమాస్తా ఎనిమిదివందల యాభై చెబుతున్నాడు. ఏడు వందల్లో తీసుకోవడానికి జాలపకు అంగీకారమే. అంతకయినా తీసుకోవడం భర్త శక్తికి మించిన విషయమేనని ఆమెకు బాగా తెలుసు! అయినా తీసుకోవాలనడానికి కారణం లేకపోలేదు. వీటి ధరను అత్తగారు తన నిలవడబ్బులో నుంచి ఇస్తుందని ఆమె వుద్దేశ్యం! ఇంకా భర్త మాటలు నిజమే అనుకుంటున్నదామె. అత్తగారు తన చేతులనుంచీ తనుగా తీసి 'నీవు తీసుకో' మన్నది. అల్లాంటప్పుడు ధర ఎందుకు అచ్చుకోదూ? జాలప ఈ ధైర్యంతోనే ముందుకు అడుగేసింది.

రమానాథుడు ఈ విపత్తునుంచి తప్పుకోవడానికి ఒకేఒక మార్గం వున్నది. గుమాస్తా జాలప అడిగిన ధరకు ఇవ్వ నిరాకరించడమే!

"అతను ఎనిమిదివందల యాభైకి దమ్మిడీ తగ్గించడు" అన్నాడు రమానాథుడు.

"అయితే, వద్దని ఇచ్చేయండి" అన్నది జాలప.

"నాకు బిడియంగా వుంటుంది అమ్మా. నీవు పోయి ఇచ్చిరా! ఇదిగో, ఏడువందలకు ఇస్తాడా ఈయమను, లేకపోతే తీసుకుపోమను" అన్నాడు రమానాథుడు.

"ఏమిటి నీకు బిడియమా ? అయితే నన్ను మొగవాళ్ళ యెదుటికి పొమ్మంటావుట్రా ?" అన్నది తల్లి ఆశ్చర్యంగా.

జాలప అందుకున్నది : "ఇదేమిటండీ వారిని యిచ్చి రమ్మంటారూ ? ఇందులో బిడియపడటానికి ఏమున్నది ? మొగవారు మీరుపోయి ఇచ్చిరండి."

వాళ్ళదగ్గిర నేను ఖచ్చితంగా మాట్లాడలేను. నాలుగు తియ్యనిమాటలు చెప్పి చివరకు నెత్తిన రుద్దుతారు ! అదీ నా భయం" అన్నాడతను.

"అయితే, పదండి నేను వచ్చి మాట్లాడతాను" అన్నది జాలప.

రమానాథుడు మారుమాట్లాడకుండా వెనక్కు తగ్గాడు. జాలప గడపదగ్గిరకు వచ్చి "ఇదిగో ! గుమాస్తాగారూ,ఏమిటీ ధరలు ? సొమ్ములు అమ్మడానికి వచ్చారా, లేక దోచుకు పోవడానికి వచ్చారా ?" అన్నది.

చరణదాసు వరండాలోంచి గడపదగ్గరకు వచ్చి, "ఏమి శెలవిచ్చారమ్మా ?" అన్నాడు.

"గాజులు ఏడువందలు చెబుతున్నావట, ఇది అమ్మేబేరమా ? లేకపోతే వేడుకబేరమా ?"

"ఆ పనితనానికే ఏడువందలూ ఇయ్యవచ్చమ్మగారూ !"

"సరే, అయితే, పనితనంమీద మోజుపడే వాళ్ళదగ్గిరకు తీసుకుపో ! మేమంత పిచ్చివాళ్ళముకాదు. అదిగాక కొంచెమైనా న్యాయం వుండఖ్లేదుటయ్యా ? వుంగరం నూటయాభై చెబుతున్నావా ? ఇదిగో ఒక్కమాట చెబుతున్నాను. గాజులు ఆరువందలు, వుంగరం వంద, మొత్తం ఏడువందలు ఇష్టముంటే ఇవ్వు, లేదా తీసుకువెళ్ళు."

"అమ్మగారూ ! మీరు చాలా తగ్గించి అడుగుతున్నారు. ఇంకొక్కమాట చెప్పండి."

"మాటాలేదూ, మంచీలేదు. ఏమన్నానో అన్నాను. ఇస్తావా ఇవ్వు. లేదా తీసుకుపో !"

"మీబోటివారి ఇంటిదగ్గరకు నగలు తేవడం, ఇవ్వనని తీసుకుపోవడం కూడానా. అమ్మగారూ ? నిజం చెబుతున్నాను మీరు నమ్ముతారో నమ్మరో ! వీటిల్లో రూపాయికి ఒక్క దమ్మిడీ వుంటుందండి. ఆ దమ్మిడిలోనే కొట్టుఅద్దె, మా జీతాలూ, కమీషన్‌లూ అన్నీ పోవాలండీ. ఇవన్నీపోను యజమానికి రెండు డబ్బులుకూడా మిగలాలి. అందుకని దయచేసి ఇంకోమాట చెప్పండి."

"ఇదిగో నే నెన్నడూ రెండుమాటలు చెప్పను....ఏమన్నానో అన్నాను అదే ఖాయం !"

చరణదాసు ధర్మసంకటంలోపడ్డట్టు ముఖంపెట్టి, "ఈ బేరంవల్ల కొద్దో

గొప్పో నష్టమేగానీ లాభంవుండదు. అయినా మీమాట కాదనలేను .... పోతే రొక్కం ఎప్పటికి ఇప్పిస్తామంటారు" అన్నాడు.

"త్వరలోనే ముడుతుంది" అంటూ లోపలికిపోయి,"చూశారా ! ఏడువంద లకే ఇచ్చాడు. బేరం తెలియనివాళ్ళని వీళ్ళు నిలువునా ముంచేస్తారు. అసలు ఇంకా తక్కువెందుకు అడగలేదా అని ఇప్పుడు బాధపడుతున్నాను" అన్నది జాలప.

తరువాత జాలప నగలను తీసుకుని సంతోషంగా లోపలికి పోయింది. రమానాధుడు మాత్రం చింతాక్రాంతుడై అక్కడే నిలబడివున్నాడు. అత నికి జాలప ప్రవర్తన ఏమీ నచ్చలేదు. "తన పరిస్థితి విపులంగా తెల్పివుందికూడా నగలను ఖచ్చితంగా వద్దనక యిలా తీసుకోవడంలో తన వుద్దేశ్యం ఏమిటి ? వెనుకటి అప్పునే తను మోయలేక చస్తూవుంటే ఇలా కొత్తఅప్పు నెత్తిన పడే యడం ఏమనుకుని ? కాకపోయినా తనదే పొరపాటు. అసలా నగలు ఎందుకు ఇంటికితేవాలి ? వాటిని తేకపోయినట్టయితే, ఏ పేచీ ఉండేదికాదుకదా" అను కున్నాడు. సంపూర్ణమైన అంధకారంలో ప్రయాణంచేసే బాటసారి ఆ అంధకారం లోనే కొంత వెలుగుని కల్పించుకుని చూడగలుగుతాడు. రమానాధుడుకూడా తనకుతాను సమాధానం చెప్పుకున్నాడు. "పోనీలే. భార్యను సంతృప్తిపరచడానికి గాకపోతే మొగవాడి సంపాదనకు సార్థకం ఏమిటి ? తిండీ బట్టా అందరూ ఇస్తారు. తనూ అంతే అయితే ఇక తన ప్రత్యేకత ఏమిటి ?" అనుకుని సమా ధానపర్చుకున్నాడు.

భోజనంచేసి రమానాధుడు పైకిపోయాడు. జాలప నగలనుధరిస్తూ "ఇవ్వాళ ఏ భాగ్యశాలి ముఖంచూశానో ! నగలు వచ్చినయ్యి !"

"ఊరికినే వచ్చినయ్యా ? మరి డబ్బు చెల్లించ నవసరం లేదా ?"

"అత్తగారు ఇస్తారు."

"అట్లాగని అన్నదా అమ్మ ?"

"వేరే అనాల్నా ? వారేగా నన్ను తీసుకోమన్నది. అట్లాంటప్పుడు వారి వ్వక ఇంకెవరిస్తారు ?"

అతను భార్య అమాయకత్వానికి నవ్వాడు. ఒక్క క్షణకాలం, ఇదంతా తను చెప్పిన గొప్పల ప్రభావమేనని తెల్సుకుని బాధపడ్డాడు కూడానూ. అయినా ఇప్పుడిక యధార్థాన్ని చెప్పి జాలప అభిప్రాయాన్ని మార్చదల్చుకోలేదు. "ఇచ్చే దైతే, నగలు పోయినప్పుడే ఇచ్చేది ఆమె దగ్గిర లేకనా ?" అన్నాడు.

జాలప సందిగ్ధంలో పడ్డది. "అయితే, అత్తగారు యివ్వరా ? ఆ విషయం నాకేం తెల్సుమరి ? ఇప్పటికయినా మించిపోయిందిలేదు. ఆడవాళ్ళకు నచ్చలేదని

తిరిగి ఇచ్చిరండి" అంటూ జాలప వెంటనే ఆభరణాలను తీసి భర్తచేతిలో పెట్టింది. ఆమె వాలకం అతి దీనంగా వుంది. "అయ్యో! తనవనుకున్న నగలు తనవికాకుండా పోతున్నయ్యే!" అన్న ఆమె హృదయంలోని మూగబాధ కళ్ళల్లో కనుపిస్తున్నది.

నగలను తిరిగి ఇవ్వడం జాలపకు ఇష్టంలేదన్న విషయం స్పష్టంగా తెలిసిపోయింది. ఇక ఎల్లా వాటిని తీసుకెళ్ళగలడు? తను కావాలంటే ఎంత బాధనైనా సహిస్తాడుగానీ, తన కండ్లఎదుట జాలప మానసికంగాగానీ, శారీరకంగాగానీ ఈషణ్మాత్రం బాధపడటాన్నయినా తను ఓర్వలేడు.

నవ్వుతూ, "వుంచుకో,తీసుకున్నతరువాత మళ్ళీఇయ్యడం ఏం మర్యాద?" అన్నాడు.

"బాగున్నది! మన శక్తికి మించా....?"

"సరే, భగవంతుడే వున్నాడు........" అంటూ నగలను అక్కడపెట్టి క్రిందకు పోయాడు.

క్షణికమైన సంకోచానికీ, మోహానికీ, లొంగిపోయి మితిమీరిన విపత్తుల్ని నెత్తికి తెచ్చుకుంటాము. జాలప నగలమీది తన మోహాన్ని ఏమాత్రం తగ్గించుకున్నా, రమానాధుడు తన సంకోచాన్ని చంపుకుని పరిస్థితుల్ని ఏ మాత్రం వివరించగలిగినా, వాళ్ళ జీవితం వేరువిధంగా వుండేది.

పన్నెండు గంటలైంది. రమానాధుడు ఆఫీసుకు బయలుదేరాడు. ఆత్మీయుల్ని కోల్పోయినవాడిలా వున్నది అతని ముఖలక్షణం.

# 15

ఉధృతంగా ప్రవహించే ప్రవాహానికి చాలా రోజులుగా ఆనకట్టల్ని కట్టి, వా టన్నింటినీ ఒక్కసారిగా తెంపేసినట్టయింది జాలప మానసికస్థితి. నగల రాకతో ఆమె ఏకాంతతకు భగ్నం కలిగింది. ఏదో ఒకమూల మూతిముడుచుకుని ఉదాసీనంగా కూర్చోవడం ఇప్పు డామెకు రుచించడంలేదు. తినుబండారాల రుచిని ఏకాంతంలో కూర్చుని అనుభవించవచ్చు కాని, నగల ఆనందాన్ని అలా పొందటానికి వీలులేదు. వాటిని చూసేవాళ్ళూ, పొగిడేవాళ్ళూ వుంటేకాని వాటి ఆనందం లభ్యంకాదు. అవి ప్రదర్శన యోగ్యాలేగాని, ఏకాంత భోగ్యాలు కావు.

జాలప మొదట అత్తగారితోపాటు పొరుగిండ్లకుపోయి, గంటా రెండు గంటలూ కాలక్షేపం చేస్తున్నది. క్రమేణా అత్తగారి అవుసరం లేకుండా ఒంటరిగానే పోతున్నది. జాలపకు రూపం, రూపానికి తగిన ఔదార్యం, వీటిని మించిన వాక్పటిమా వున్నై. ఇరుగుపొరుగున వున్న తోటి యువతులందరూ, తనలో లేని ఈ గుణాలకు ముగ్ధులైపోయేవారు రోజూ ఏదో ఒక ఇంట్లోనుంచి ఆమెకు పిలుపు వస్తూవుంటుంది. వెంటనే వెళ్ళి, గంటో రెండుగంటలో పాటలతో, కబుర్లతో సత్కాలక్షేపం గావించి వస్తూవుంటుంది కూడాను.

చూస్తూవుండగానే, జాలపకు ఆ బజారు యువతుల్లో పేరు ప్రసిద్ధులు అధికం అయినయ్యి. ఈడువాళ్ళందరికీ ఆమె ఒక రాణిలా కనిపించసాగింది. రోజూ ఒకరింటికి విధిగా వెళ్ళవల్సివస్తున్నది. ఆమెకు ఈ విధమైన పలుకుబడితోపాటు కొంత ఖర్చుకూడా తగలసాగింది. తన ఉదార స్వభావాన్ని ఎక్కడికి వెళ్ళినా ప్రదర్శిస్తూ వుండాలని ఆమె ఉద్దేశం. వెళ్ళిన ప్రతిచోటా ఆకులూ, ఫలహారాలూ మొదలైన ఖర్చులు తను భరిస్తూవుంటుంది. అలా భరించడం ఆమెకో విధమైన గర్వకారణం, ఫాల్గుణమాసంలో వరుసన పదిహేను రోజులు ఉత్సవాలు జరిగినయ్యి. ఆ పదిహేనురోజులూ అతిధుల్ని సత్కరించడం, సంగీత విద్వాంసురాండ్రకు విందులుచేయడం మొదలైన ఖర్చులు తనే భరించింది. అప్పుడప్పుడూ గంగాస్నానానికి పది పదిహేనుమంది స్త్రీలు జట్టుగా కల్సివెళ్తుంటారు. ప్రతిసారీ బండ్ల ఖర్చులూ. దారిలో ఫలహారాల ఖర్చులూ తనే భరిస్తూవుంటుంది.

ఈవిధంగా పెరిగిపోతున్న జాలప ఖర్చుల్ని రమానాధుడు నోరు మెదప కుండా ఇస్తున్నాడు. ఎందుకీయడు? తను ఆదర్శ భర్త! భార్య అడిగితే ప్రాణా న్నయినా తీసి ఇస్తాడు. అల్లాంటప్పుడు వెధవ రెండు మూడు రూపాయలు లెఖ్ఖా? రోజూ జాలప తనకు లభిస్తున్న గౌరవాలనూ, మర్యాదలనూ మూట కట్టుకువచ్చి ఏకరువుపెడుతూవుంటుంది. రమానాధుడు విని పొంగిపోతూంటాడు.

ఒకసారి ఆ బజారు ఆడవాళ్ళంతా సినిమాకు పోవాలనుకున్నారు. వెళ్ళారు కూడాను. ఆ రోజు సినిమాహాలుదగ్గిర చూసిన ఆ అలంకరణ వాళ్ళ నెంతగానో ఆకర్షించింది. అప్పటినించీ తప్పనిసరిగా వారానికీ, పదిరోజులకూ సినిమాకు పోవడం అలవాటైపోయింది.

రమానాధుకు సినిమాలంటే ఏమంత ఇష్టంలేదు. అయినా భార్య మనస్సు త్రోసిపుచ్చలేక ప్రతిసారీ తనుకూడా వెళ్తూండేవాడు.

సినిమాహాల్లో అత్యధునాతనంగా అలంకరించుకుని ఎంతో స్వతంత్రంగా నవ్వుతూ, మొగవాళ్ళతో బెదురులేకుండా మాట్లాడుతుండే ఆడవాళ్ళు చాలామంది కనుపిస్తుంటారు. జాలపమీద వాళ్ళ ప్రభావం ప్రత్యక్షంగా కాకపోయినా, పరో క్షంగానైనా పడుతున్నదనే చెప్పాలి. మొదట్లో జాలప స్త్రీలకు ప్రత్యేకించబడిన పరదాల వెనక కూర్చుంటూవుండేది. అనేకమంది స్త్రీలు తమ భర్తల్తో చేతులు చేతులు కలుపుకుని, అందరిలో కూర్చోవడం చూచిన తరువాత, తనుమాత్రం రమానాధు సరసను ఎందుకు కూర్చోకూడదు? అనుకున్నది. తనూ అందగత్తే, చక్కగా సభ్యతగా ప్రవర్తించగలదు. వాక్చాతుర్యంకూడా వున్నది. మరి ఏమిటి అభ్యంతరం?

రమానాధుడికికూడా సినిమాహాల్లో, భార్యను సరసన కూర్చోపెట్టుకోడానికి అట్టే అభ్యంతరం ఏమీ కనుపించలేదు. జాలపేగనుక ఏ అందవికారో, లేక కురూపో ఐవుంటే, అతను స్త్రీల ప్రత్యేకతను కాపాడడానికి తప్పనిసరిగా ముందడుగు వేసేవాడు! అట్లా కాకుండా అపురూప సౌందర్యవతి అయిన భార్యను పక్కన కూర్చోపెట్టుకోవడంవల్ల నామర్దా, అవమానాలు ఏమీ రావు; పైగా ఒక గర్వం, గౌరవం చిరుగాలిలాంటి వుల్లాసం తనకు లభిస్తాయి.

ఈ విషయంలో రమానాధుడు అప్పుడప్పుడూ ఆలోచిస్తూ వుండేవాడు కూడాను. వస్తుతః జాలప పల్లెటూరిపిల్లే అయినా, ఈ కొద్దిరోజుల్లోనే పూర్తిగా పట్నవాసపు యువతిలా మారిపోయింది. రాగా పోగా ఆమెలోవున్న లోటల్లా ఇంగ్లీషు రాకపోవడం. రమానాధుడు ఆ లోటునుకూడా తీర్చేస్తున్నాడు. రోజూ ఇంగ్లీషు చెబుతున్నాడు.

కానీ ఈమాత్రంచేత రమానాథుడు వెయ్యిమంది మొగవాళ్ళల్లో భార్య నెలా సరసన కూర్చోపెట్టుకోగలడు ? ఒంటరిగావున్న వ్యక్తి మతాన్నీ, వంశ పారంపర్యంగా వస్తున్న ఆచారాలను తోసిరాజని ముందుకు నడవడానికి నిర్ణయించుకోగలడు ? నలుగురిలోకిపోయి తన నిర్ణయాన్ని ఆచరణలో పెట్టాలనుకునేసరికి, అనాదిగా సమాజంలో గూడుకట్టుకున్న ఆచారాల బలం ఎక్కువౌతుంది. వ్యక్తి వాటిముందు బలహీనుడౌతాడు. ఓడిపోతాడు. రమానాథుని పనికూడా అలాగే అయింది. సినిమాహాల్లో తన స్నేహితులు ఎంతోమంది వుండవచ్చు. వాళ్ళందరి ఎదుటా భార్య నెలా సరసను కూర్చోపెట్టుకోవడం ? వాళ్ళంతా నవ్వరూ ? తను వాళ్ళ ముఖం చూడటం ఎల్లా ? అని చాలాసేపు తర్కించుకున్నాడు. చివరకు భార్యను పిల్చి ఇలా అన్నాడు : "ఇవ్వాళ సినిమాకు పోదాం. మన ఇద్దరం ఒకేచోట కూర్చోవాలి !"

ఈ మాటవిని జాలప హృదయం సంతోషంతో పొంగిపోయింది. అయినా చిన్న అభ్యంతరాన్ని తెలియచేసింది. "మనిద్దరం ఒకేచోట కూర్చుందామా ? వద్దు బాబూ ! రేపటినుంచీ స్నేహితులు వెక్కిరించి ప్రాణాలు కొరుక్కుతింటారు !" అన్నది.

"ఈ విధంగా భయపడితే, ఎన్నడూ ఏమీ చేయలేము. కాకపోయినా ఏమిటీ పందాలు ?"

ఎల్లాగయితే యేం ! చివరకు జాలప వప్పుకున్నది. మొదట ఇద్దరూ సిగ్గుపడ్డారు, క్రమేణా అభ్యస్తులైపోయారు. రోజులు గడిచినకొద్దీ చేతులూ చేతులూ కలుపుకుని పార్కులకు షికారుగా పోతున్నారుకూడా.

ఒకరోజు జాలప నవ్వుతూ అన్నది : "మనం ఇలా తిరగడం మీ నాన్నగారు చూస్తే !"

"చూస్తే ! ఏం చూస్తే ?"

"నాకుమాత్రం చచ్చే సిగ్గుగా వుంటుంది."

"నాకూ సిగ్గుగానే వుంటుంది.... అస లాయన ఇటు రారు."

"మరి, అత్తగారు చూస్తేనో ? .... అయినా వారిదేముందిలే ! రెండు మాయమాటలు చెబితే మెదలకండా వూరుకుంటారు."

జాలప ఒక్క పదిరోజుల్లోనే ఈ కొత్త సమాజంలో తన అస్తిత్వాన్ని నిలబెట్టుకున్నది. ఆమె సౌందర్యం, సంభాషణల్లోని మృదుత్వం త్వరలోనే ఆమెకీ నవనాగరిక సమాజంలో పలుకుబడిని సంపాయించిపెట్టినయ్యి. పార్టీలకూ, సభలకూ ఆహ్వానాలు రాసాగినయ్యి. మొదటిరోజునే ఒక మహిళ తన ఇంటికి తేనీటి విందుకు ఆహ్వానించింది జాలపని. జాలపకు వెళ్ళాలని అంత ఉత్సాహం లేకపోయినా, మాట తీసేయలేక ఒప్పుకున్నది.

పార్కునుంచి ఇంటికిరాగానే, "అయితే, ఈ విందుకు పోక తప్ప దంటావు ?" అన్నాడు రమానాధుడు దిగులుగా. "ఏం చేయను ? కూడదంటే బాగుంటుందా ?" అన్నది.

"అయితే, పొద్దునే నీ కో మంచి చీరె పట్టుకురానా ?"

"ఏం నా దగ్గర లేకనా ? మంచవేవున్నై ! ఒక్క పదినిమిషాల భాగ్యా నికి యాభయ్యో, అరవయ్యో ఖర్చెందుకు ?"

"ఆఁ. నీ కంత మంచి చీరెలు ఎక్కడున్నై ? ఆమె కట్టుకున్న చీరె చూచా, ఎంత బావుందో ? నీకూ అలాంటిదే తెద్దామనుకుంటున్నాను."

"పొరపాటైంది, తీరిక లేదనేసినట్లయితే, ఈ బాధంతా లేకుండాపోయేది !"

"జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మనం పోయి ఖుషుగా విందార గించి మెదలకండావస్తే ఏం బాగుంటుంది ? ఆమెనుమాత్రం మనం ఒకసారి పిలవద్దా ?"

"అనవసరంగా వూబిలో చిక్కుకున్నట్లయింది, మనపని...."

"ఊఁ, ఊబీలేదు, దిగనూలేదు ! కాకపోతే పదిరూపాయలు ఖర్చవు తయ్యి. అంతేనా ? అయితే అవుతయ్యి ! నాకు డబ్బుసమస్య పట్టలేదు. ఇంటిని గురించే బెంగగా వుంది. మన ఇల్లు అలాంటివారికి విందుచేయడానికి ఏ విధం గానూ పనికిరాదు. టేబుళ్ళూ, కుర్చీలూ, కప్పులూ, సాసర్లూ అంటే రమేశ్‌బాబు గారిదగ్గిర పట్టుకురాగలను. మరి ఇంటివిషయం ఏం చేసేట్టు ?"

"అదికాదండీ, మనంకూడా తప్పనిసరిగా విందు చెయ్యాలా ఏఁవిటి ?" వీలైతే మానేయడం మంచిది అనే స్వరంలో అన్నది జాలప.

ఇదేం తెలివితక్కువ ప్రశ్న ! భార్యకు, ఒక మంచి సిలుకుచీరె, ఒక రిష్టువాచి, చెప్పులజత-వీటిని కొనడం ఎల్లాగా అని తపేకంగా ఆలోచిస్తున్నాడు. ఇవి లేకుండా విందుకు పంపడం ఏమంత బాగుండదు. పోనీ పంపకుండా వుందా మంటే, అదీ బాగుండదు ! ఇంతవరకూ షరాబులబాకీల్లో కానీకూడా చెల్లు వేయ లేదు. అప్పుడే ఒకమాటు గంగూ హెచ్చరించాడుకూడాను. అ దిలాగేవుంచి మళ్ళీ అప్పుచేయడం ఎల్లా ? అసలు ఎవరిస్తారు ? రేపటి విందుకు అక్కడికి చాలామంది స్థితిపరులూ, భాగ్యవంతులూ వస్తారాయె ! వాళ్ళతో జాలప సౌంద ర్యంలో ఏమాత్రం తీసిపోదు. ఆ మాటకొస్తే జాలప సౌందర్యంముందు వాళ్ళంతా మట్టిబొమ్మల్లా కనుపిస్తారు. కానీ....కానీ, వాళ్ళదగ్గిర జాలపకులేని ఇతర ఆధునిక సాధనాలు వున్నై. వాటి సాయంతో వాళ్ళు తమ కొద్దిపాటి సౌందర్యాన్ని వెయ్యిరెట్లుగా ఇనుమడింపచేసుకోగలుగుతారు. మరా సాధనాలు జాలపకు లేకపోతే, యీ పోటీలో జాలప - తన సౌందర్యదేవత - ఓడిపోదా ?

నగలూ, వస్త్రాలూ ఇతర సౌందర్యాన్ని పెంపొందించే ఆధునిక సామగ్రి లేక జాలప సౌందర్యపోటీలో వోడిపోతూవుంటే తను చూస్తూ వూరుకోగలడా? అలా జరగదు. వూరుకోడు, ఉఁహుఁ చూస్తూ వూరుకోలేడు! అసలు ధనానికీ, యవ్వనానికీ చరమలక్ష్యం ఏమిటి. సౌందర్యోపాసనకాదా? అలాంటప్పుడు, ఎన్ని బాధలైనాపడి ఈ సౌందర్యరాశిని ఆరాధిస్తాడు! ఆ రాత్రంతా రమానాధుడు అన్యమనస్కంగానే గడిపాడు. మరునాడు ఉదయాన్నే చీరె, చెప్పులూ, రిష్టువాచీ తెచ్చి ఇచ్చాడు.

వాటిని చూసి జాలప విసుగ్గా, "నే నివేవీ వద్దన్నానుకదా? ఎందు కనవసరంగా వందో రెండువందలో ఖర్చుపెట్టారు?" అన్నది.

"వందా కాలేదు. రెండువందలూ కాలేదు. అంత ఖర్చుపెట్టడానికి నా దగ్గిరేం కుప్పలు పోసుకున్నా ననుకున్నావా?"

జాలప గడియారాన్ని చేతికి కట్టుకుని మంత్రముగ్ధంగా చూసుకుంటున్నది.

"ఓ....హో....నీ చేతికి ఎంత అందం వచ్చింది!"

"నిజం చెప్పండి, ఎంతకి కొన్నారు?"

"నిజం చెప్పనా? నూట అరవై అయినయ్యి. పది చెప్పులు, నూరు గడియారం, యాభై చీరె!"

"నేను చెప్పినంతా అయింది! ఇదంతా ఎల్లాగ తీరుస్తారు? అసలామె విందుకు పిలవకండావుంటే బాగుండేది. ఇట్లాగయితే. ఇక నేను బయటికి పోను బాబూ!"

రమానాధుడికికూడా ఇంత బాకీ ఎల్లాగ తీరుతుందా, అనే బాధ లేక పోలేదు. అయినా తనబాధ బయటపెట్టి భార్య ఆనందాన్ని భగ్నం చేయతల్చుకో లేదు. పైకిలా అన్నాడు: "తీరక కూర్చుంటుందా?"

"ఆఁ ఎలాగో! ఆదాయం ఖర్చులకే చాలడంలేదు. ఇక అప్పులు తీర్చడానికి ఆకాశాన్నుంచి వూడిపడుతుందా? మామగారు ఇంటిఖర్చులన్నీ సర్దుకుంటున్నారుగనక సరిపోతున్నది. లేకపోతే తెలిసేది మనపని. ఎందుకుగానీ, నా మాటవిని, వీటిని తిరిగి ఇచ్చిరండి!"

"సరే, తెచ్చానుగా, ఈ సారికి వుండనియ్యి. ఇకమీదట నిన్ను అడక్కుండా ఏవీ పట్టుకురాను!"

సాయంత్రంకాగానే జాలప కొత్తవస్తువుల్ని ధరించి ఒక మాటు తన అందాన్ని అద్దంలో చూచుకున్నది. తనకు తనే మురిసిపోయింది. ఇప్పుడు రమానాధుడు వాపసుచేస్తాను ఇమ్మని అడిగినా ఇయ్యదు!

కొద్దిసేపటికి రమానాధుడు, జాలప ఆతిధ్యం ఇచ్చినవారి యింటికి బయిలు దేరారు. ఆమె తన ఇంటినెంబరు చెప్పింది. అందువల్ల త్వరలోనే అక్కడికి చేరారు. అదొక పెద్ద బంగళా, గేటుకు తగిలించివున్న సైన్‌బోర్డుమీది విలా సాన్ని చదివిన రమానాధుడి ఆశ్చర్యానికి మేరలేకపోయింది.

"ఇందుభూషణ్, అడ్వకేట్, హైకోర్టు" అని వున్నది. అయితే, తమ్ము విందుకు పిలిచినామె 'పండిత ఇందుభూషణ్‌గారి భార్య అన్నమాట' అని అను కున్నాడు రమానాధుడు.

ఇందుభూషణ్‌గారు కాశిలో ఒక ప్రసిద్ధమైన వకీలు. రమానాధుడు చాలా సార్లు వారిని చూశాడుకూడాను. కానీ, అంత గొప్ప వకీలు పరిచయం తనకు లభిస్తుందని అత నేనాడూ వూహించనుకూడా లేదు. ఇలా జాలప ద్వారా వూహించరాని పరిచయం లభిస్తున్నది.

మొదట్లో రమానాధుడు ఆ విందుకు చాలామంది స్త్రీ పురుషులు వస్తారను కున్నాడు. తీరాచూస్తే, వకీలుగారూ, వారి భార్య రత్తన్, తనూ, తన భార్య, వాళ్ళు తప్ప ఇంకెవ్వరూ లేరు. వీళ్ళని చూడగానే రత్తన్ ఎదురువచ్చి, సాద రంగా లోపలికి తోడుకుపోయింది. వకీలుగారు ఈజీచైర్‌లో పడుకున్నారు. వారిని పరిచయం చేసింది. వకీలుగారు పడుకునే కరస్పర్శచేసి, "క్షమించండి, నా ఆరోగ్యం బాగా లేదు. అందువల్ల కదలలేకుండా వున్నాను....అయితే, మీకు ఇక్కడే ఆఫీసులోనైనా ఉద్యోగమా ?" అన్నాడు.

రమానాధుడు సిగ్గుపడుతూ "అవునండి, మునిసిపల్ ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాను. మొదట లా చదువుదాం అనుకున్నాను. కానీ, కొత్త వకీళ్ళు పడే బాధల్ని చూసి, ఆ ప్రయత్నం విరమించుకున్నాను" అన్నాడు. చిన్న అబద్ధంతో, ఇతర్లకు నష్టంలేకుండా గౌరవమర్యాదలు లభించేటట్లయితే, వాటిని వదులుకోవడం తెలివితక్కువ. అందుకనే చిన్న అబద్ధం ఆడేశాడు.

వకీలుగారు నవ్వుతూ "మీ రన్నది నిజం. అక్కడైతే రెండుమూడేం డ్లలో ఒక మంచి పదవిని చిక్కించుకోవచ్చును. ఈ వకాలత్తులో పది సంవత్స రాలకుకూడా ఒక కేసు వస్తుందో, రాదో" అన్నారు.

జాలప ఇంతవరకూ రత్తన్, వకీలుగారికి ఏమౌతుంది ? కూతురా లేక భార్యా, అనే సందిగ్ధంలోపడి తన్నుకుంటున్నది. వకీలుగారికి దాదాపుగా డెబ్భై ఏళ్ళు వుంటయ్యి. తలంతా ముగ్గుబుట్టలా నెరసిపోయింది. మీసాలు, గడ్డం గొరి గించేశాడు. ముఖంమీదవున్న ముడతలు అతను ఇహలోకపు యాత్రలో బాగా అలసిపోయినట్టు తెలియచేస్తున్నై. విశాలమైన నుదురు. ఎత్తయిన బంగారు రంగు శరీరచ్ఛాయ కలిగి ఈ డెబ్భైఏళ్ళ వయసులోకూడా అందగాడనిపించుకోవ

డానికి తగివున్నాడు. చూస్తూనే అతడు దీర్ఘరోగనీ, ఏకాంతప్రియుడనీ, ఎవ్వరితోటీ మాట్లాడుట ఇష్టంలేదనీ తెల్సుకోవచ్చును.

రత్తన్ స్వభావం వీటికి పూర్తి వ్యతిరేకం. చామనచాయరంగు; కుదిమట్టమైన అవయవ నిర్మాణం. మనుషుల్ని ఇట్టే పరిచయం చేసుకోగల కలుపుగోలుతనం ఆమెలో వున్నై. ఏమంత చెప్పుకోతగ్గ సౌందర్యం ఆమెలో లేదు. ముక్కు కొంచెం చట్టిముక్కు. కళ్ళు బాగా లోపలికివుండి అంత ఆకర్షణీయంగా కూడా వుండవు. మొత్తంగా మనిషిని చూస్తే ఏదో విలక్షణం ఆమెలో దృగ్గోచరం అవుతుంది. అంత సౌందర్యంతో విలసిల్లే జాలపకూడా రత్తన్‌లోని ఈ విలక్షణత ముందు తలవంచింది.

నౌకరు మిఠాయిలు, పండ్లు, టీ, అన్నీ తెచ్చి బెంచీలమీద పెట్టాడు. రెండు మేజాలు ఎదురు మళ్ళగావేశారు. జాలప, రత్తన్‌లు తమ స్థానాల నలంకరించారు. రమానాధుడుకూడా తన స్థానంలోకివచ్చి కూర్చున్నాడు. వకీలుగారు మాత్రం రాలేదు. ఇంకా కుర్చీలోనే వున్నారు.

రమానాధుడు నవ్వుతూ, "మీరుకూడా రండి" అన్నాడు.

"మీరు మొదలు పెట్టండి. నేను వస్తాను" వకీలుగారు పడుకునే సమాధానం చెప్పారు.

అందరూ ఫలహారాలు చేయడం ప్రారంభించారు. వకీలుగారుమాత్రం దూరంగావుండి, తమాషా చూస్తున్నట్టుగా పడుకున్నారు. వారేమీ ముట్టుకోవడం లేదు. వకీలుగారి గంభీరమైన స్వభావంవల్ల జాలప, రమానాధులు స్వేచ్ఛగా, వుల్లాసంగా మాటాడుకోవటానికి చాలా సిగ్గుపడుతున్నారు. టోనులో పెట్టినట్లు వుక్కిరిబిక్కిరౌతున్నారు. కాలక్షేపానికి కూర్చున్న నలుగురిలోను, ఒకరు వుత్సాహరహితులూ, మౌనప్రియులూ అయితే. మిగిలిన ముగ్గురూ ఇరుకున పడతారు.

చాల బలవంతంమీద వకీలుగారు రెండుచుక్కల టీని నోట్లో పోసుకున్నారు.

విందు ముగిసింతరువాత రత్తన్, జాలపలు తోటలోకి షికారుకు పోయారు. రమానాధుడు తను ఒంటరిగా వకీలుగారిముందు మౌనంగా కూర్చోవల్సి వస్తుందని తెల్సివుంటే ఇక్కడికి వచ్చేవాడేకాదు.

బాధగా ముఖం చిట్లించి కొంచం పత్తిగిలి వకీలుగారిలా అన్నారు:"కడుపులో ఏం మార్పు వచ్చిందో తెలియదు. ఏం తిన్నా అరగడంలేదు. చివరకు పాలుకూడా అరగటంలేదు. మీరంతా బాగడాని కిలా వుత్సాహపడతారు కదా? నాకు అదంటేనే పైప్రాణాలు పైన పోతయ్యి. ఎప్పుడైనా తప్పనిసరికి ఒక్క

గుక్క నోట్లో పోసుకున్నానా; ఇక కళ్ళు చింతనిప్పుల్లా అయిపోతయ్యి. కడుపులో పేగులు మెలేసుకున్నట్టయి శరీరం కొంగర్లు పోతుంది."

"హరాయింపుకు మందు పుచ్చుకుంటున్నారా?"

వకీలుగారు నిర్లక్ష్యంగా, "నాకు మందులమీద ఏమాత్రం నమ్మకంలేదు. ఈ డాక్టర్లూ, వైద్యులూ వీళ్ళున్నారే?........వీళ్ళకంటే మూర్ఖులు ప్రపంచంలో గాలించినా దొరకరు. ఒకే లక్షణాలుకల రోగిని ఇద్దరు డాక్టర్లదగ్గరకు తీసుకు పోతే, ఇద్దరూ ఏమాత్రం సంబంధంలేని రెండు రోగాలని నిర్ణయిస్తారు. అసలు వీళ్ళకు రోగవిధానమే తెలియదు. ఒకడు రక్తపు చెడుగు అంటే, ఇంకోడు వాతం అంటాడు. ఖర్మంచాలక ఏ అమాయకుడైనా వీళ్ళ చేతుల్లో పడ్డాడా, వాడు ప్రాణాలను గోల్పోవడమో లేకపోతే శాశ్వతంగా రోగిజీవితం గడపవల్సి రావడమో జరుగుతుంది."

ఇక్కడీ విధంగా ఆరోగ్యశాస్త్రాన్ని గురించి చర్చలు జరుగుతూవుంటే, అవతల తోటలో జాలప, రతన్‌లు తమ స్నేహాన్ని ప్రగాఢంచేసుకుంటున్నారు.

రతన్ నవ్వుతూ, "నా భర్తనుచూసి నీకు ఆశ్చర్యం వేసివుంటుంది కదూ?" అన్నది.

"నిజంగా ఆశ్చర్యమే వేసింది. పైగా రెండోపెళ్ళేమో అనుకున్నాను" అన్నది జాలప.

"అవును రెండోపెళ్ళే! ఐదేళ్ళయింది మా పెండ్లయి. వారి మొదటి భార్య ముప్ఫైఏళ్ళయింది చనిపోయి. ఆమె కో కొడుకు. అప్పుడు వీరికి ముప్ఫై ఐదేళ్ళుంటయ్యి. అందరూ మళ్ళీ పెళ్ళిచేసుకోమని బలవంతం చేశారట. కానీ, పసివాడికి అన్యాయం జరుగుతుందనే వుద్దేశంతో చేసుకోలేదు. ఐదు సంవత్సరాల క్రితం ఆ కొడుకు చనిపోయాడు. జీవితంలో మరీ ఒంటరివారైపోయారు. ఇక పెండ్లిచేసుకోడం తప్పనిసరైంది. నాకు తండ్రిలేడు. తల్లి వున్నది. మరి మా అమ్మ వీరిదగ్గర డబ్బుకు ఆశించే నన్ను ఇచ్చిందో, వీరి మంచితనాన్ని చూసే ఇచ్చిందో, ఎలాగైనాకానీ, మా ఇద్దరికీ పెండ్లి జరిగింది. పెండ్లి అయినరోజునుంచీ నేను విపరీతంగా బలుస్తున్నాను. వారు రోజు రోజూ శుష్కించి పోతున్నారు. నాకు పిల్లలు పుట్టరని డాక్టర్లు చెబుతున్నారు. పిల్లలు లేకపోతే, ఈ ఆస్తిఅంతా ఏమైపోతుందేమోనని వారికి దిగులు. నాకు ఒక్క సంతానం కలిగిందా వారి రోగాలన్నీ ఎగిరిపోతయ్యి. ఈ లావుతగ్గి సన్నబడటానికి అనేక విధాలుగా బాధలుపడుతున్నాను. రోజూ నియమంగా నడక సాగించాను. పాలూ, నెయ్యీ ఇలాంటివి పూర్తిగా మానేశాను. అయినా లావు తగ్గడం లేదు."

"అయితే, వకీలుగారు నీమీద కోపంగా వుంటారనుకుంటాను ?"

"ఊఁ హూఁ. పొరపాటునైనా కోప్పడరు. నన్ను ఒక్కమాటైనా అనరు. తన బాధను నోటిమీదగా నాకు చెప్పరు. చెబితే నా మనసు బాధపడుతుందేమోనని వారి ఉద్దేశ్యం! అయినా వారి మనోవ్యాధి నాకు బాగా తెల్సు! తెలిసిమాత్రం ఏం చేయగలనూ ? తగ్గించడం నా వశమా ? నా మనస్సు ఎక్కడ నొచ్చుకుంటుందోనని అతి జాగ్రత్తగా వుంటారు. ఏది కావాలంటే అది తెచ్చి యిస్తారు. ఎట్లా కావాలంటే అట్లా వుండమంటారు. ఈ జబ్బులో, వృద్ధాప్యంలో కూడా నాకోసం నిరంతరం శ్రమించి ధనోపార్జన చేస్తుంటారు. అక్కడికీ, ఎందుకీ శ్రమ ? ఇప్పటికి సంపాయించింది చాలకనా అంటుంటాను. అయినా వినరు. వారు సరిగా అరగిద్దెడు బియ్యపు అన్నం తినలేరు. మరీ పట్టుపడితే ఒక అణా ద్రాక్షపళ్ళు తింటారు. మరి ఇంత శ్రమపడటం నాకోసం కాక యింకెవరికోసం చెప్పు ? ఒక్కొక్కసారి వారిని చూస్తూవుంటే, అలివిమాలిన జాలి వేస్తుంది."

"ఇల్లాంటివారిని దేవతా స్వరూపులే అనవచ్చు! ఇంకొకళ్ళైతే, భార్య చనిపోయిన పదోరోజైనా గడవకముందే, రెండో పెళ్ళికి సిద్ధపడతారు!" అన్నది జాలప.

"అవునమ్మా జాలపా! నిజంగా దేవతా స్వరూపులే. ఇప్పటికీ ఆ మొదటి భార్య మాట ఎత్తితే, కన్నీళ్ళు పెట్టుకుంటారు. నీకు మరోప్పుడు ఆమె ఫొటో చూపుతాను....వకీలుగారు అలా పైకి గంభీరంగా కనుపిస్తుంటారా ? ఎంతో మెత్తని హృదయం వారిది. ఎంతోమంది అనాథలకూ, విధవలకూ, విద్యార్థులకూ నెలసరి చందాలు ఇస్తూవుంటారు....సరేగానీ జాలపా! ఈ గాజులు ఎక్కడ చేయించావ్ ? చాలా బాగున్నై !"

"బాగున్నైకదూ ? చాలా మంచిపనివాడిచేత చేయించాము !"

"నాకు ఇక్కడ ఎవ్వరూ తెలియదు. నగలకోసంకూడా వారిని కష్టపెట్టడం నాకేమీ బాగుండదు. పోతే, బజారు కంసాలిబత్తులకు బంగారం ఇచ్చి చేయమందామా అంటే, కల్తీకలుపుతారేమోనని భయం. నీవు కొంచం సాయం చేసిపెడుదూ ? మీ ఆయనగారితో చెప్పి ఇల్లాంటివే ఒక జత చేయించిపెడుదూ!"

"అట్లాగే అదేమంత భాగ్యం! మీ ముందే చెబుతాను !"

"మీరిలా వచ్చినందుకు నా కెంతో ఆనందంగా వుంది. ఇక్కడ నాకు తెలిసినవాళ్ళు ఎవ్వరూ లేరు. పగలంతా ఒంటరిగా కూర్చోవడంవల్ల మనస్సు మహా వ్యాకులంగా వుంటుంది. ఇద్దరు ముగ్గురు యువతుల్ని ఇంతక్రితం పరి

చయం చేసుకున్నాను. కానీ, వాళ్ళ నడవడి వ్యవహారాలు నాకేమీ నచ్చలేదు. నీవు రోజూ ఒక గంటసేపు వచ్చిపోతూవుండు జాలప!"

"తప్పకుండా! అంతకన్ననా?"

"నేను రోజూ కారు పంపుతుంటానులే!"

"ఎందుకూ బళ్ళు దొరక్కనా?"

"నీతో ఎంతమాట్లాడినా ఇంకా మాట్లాడాలనే వున్నది. నిజంగా నీలాంటి భార్య దొరకడం రమానాధుడిగారి అదృష్టమే అనాలి!"

"మొగవాళ్ళు అట్లా ఎన్నటికీ అనుకోరులెండి! చీవాట్లూ విదిలింపులూ వడ్డించకండావుంటే అనుకున్నంత ఫలం."

"నిజం? చీవాట్లు వేస్తారా? ఆఁ నేను నమ్మను. అదుగో వారూ వస్తున్నారు. గాజుల విషయం మర్చిపోవుగా?"

రమానాధుడు వచ్చాడు. జాలప భర్తతో, "చూడండి, ఇలాంటి గాజుల జత చేయించడానికి ఎన్నాళ్ళుపడుతుంది? రత్తన్ ఇల్లాంటిదే చేయించుకోవాలనుకుంటున్నది. మన చరణదాసుతో చెబితే త్వరలోచేసి ఇయ్యడా?" అన్నది.

"ఎందుకు చేసి ఇయ్యడూ? చేసి ఇస్తాడు!"

"వీటికి ఎంత తీసుకున్నాడు?"

"ఎనిమిది వందలు...."

"అయినా ఫరవాలేదు" అన్నది రత్తన్.

"తప్పకుండా చేయిస్తానులెండి" రమానాధుడు అన్నాడు.

"మరి డబ్బిప్పుడే కావాలంటే, నా దగ్గిరదొరకదే!" అన్నది రత్తన్.

డబ్బు విషయంలో పురుషుడెన్నడూ స్త్రీదగ్గిర వెత్తిపడడు. రమానాధుడు కావాలంటే ప్రాణాన్నయినా ఇస్తాడుగానీ ఇలాంటి సందర్భంలో తన దగ్గిర డబ్బు లేదనిమాత్రం చెప్పలేడు. ఇతర్ల దగ్గిర ప్రాధేయపడతాడు. అప్పుచేసి నానాయాతనలూ పడతాడు, ఇంకా ఇలాంటివే లక్షచేస్తాడు. కానీ ఈ సమయంలో తన బలహీనతను మాత్రం బయటపడనీయడు. జాలపకుకూడా భర్త ఆర్థికస్థితి బాగా తెల్సు. అయినా ఇప్పుడీ బాధ్యతను మోయడమే ఆమె మనోభిలాష! అతను మోయలేకపోయినా, నా దగ్గిర డబ్బు లేదనిచెప్పినా, ఆమెమనస్సు చాలా బాధపడుతుంది. కొంపతీసి భర్త తనదగ్గిర డబ్బు లేదంటాడేమోనని భయపడింది. కానీ. రమానాధుడు "ఫరవాలేదు. డబ్బు ఎప్పుడుంటే అప్పుడు ఇద్దురుగాని" అన్న తరువాత ఆమె ప్రాణాలు కుదుటపడ్డయ్యి.

"అయితే, ఎన్నాళ్టికి చేసి ఇస్తాడు?" అడిగింది రత్తన్.

"ఎట్లాలేదన్నా పది పదిహేను రోజులు పట్టవచ్చు!" అన్నాడు రమానాధుడు.

"వచ్చే ఆదివారం మా యింటికి తప్పకరావాలి సుమా!" జాలప రత్తన్‌తో అనునయంగా అన్నది.

రత్తన్ జాలప ఇచ్చిన ఆహ్వానాన్ని అంగీకరించింది. జాలప, రమానాధులు సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. ఇంటికి పోయేసరికి రమేశ్‌బాబు వాకిట్లో ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

జాలప బండి దిగి నేరుగా లోపలికిపోయింది. రమానాధుడు రమేశ్‌బాబు దగ్గిరకుపోయి ఇలా అన్నాడు: "మీరువచ్చి చాలా సేపయినట్టుంది?"

"లేదు ఇప్పుడేవచ్చాను. నీవు వకీలుగారింటికి పోయావా?"

"ఆఁ వెళ్ళాను! అనవసరంగా మూడురూపాయలు ఖర్చయినయ్."

"ఇలాంటి విషయాల్లో అయినా ఫరవాలేదు. పెద్దవాళ్ళ పరిచయం వుండటం మంచిదే. మరి ఓమాటు మీ ఇంటికికూడా ఆహ్వానించకపోయావా?"

"వచ్చే ఆదివారం వస్తారు. అప్పుడిక్కడో చిన్న టీ పార్టీ."

"ఇదిగో. నీవు రమ్మంటే నేనూవచ్చి మీ పార్టీలో పాల్గొంటాను. నీకు తెలుసో తెలియదో వకీలుగారి తమ్ముడొకడు ఇంజనీరు? అతనిదగ్గిర కో చిన్న సిఫారసు వకీలుగారినుండి తీసుకుపోదామని. మా బావమరది ఒకడు ఎక్కడా ఉద్యోగంలేక ఖాళీగా వుంటున్నాడు. వీరి దగ్గిరనుంచి గనక సిఫారసు పట్టుకు వెళ్తే పని జరుగుతుంది. ఇందులో నీవు పడవలసిన శ్రమేమీ లేదు. నన్ను వారికి పరిచయం చేస్తేచాలు; మిగిలిన పనంతా నేనే చూసుకుంటాను. ఇందుకుగాను, నీకు పార్టీకి కావలసిన ఏర్పాట్లన్నీ నేను చేసిపెడతాను. ఫర్నిచరూ, గాజు సామగ్రీ ఇలాంటివన్నీ నా దగ్గిరనుంచి తెప్పించుకోవచ్చును. పైగా వాటి నిక్కడికి తెప్పించుకోవడానికి కానీకూడా కూలి పెట్టనవసరంలేదు. ఎటూ నౌకరీకి వచ్చిన డింభకుడు వున్నాడుకదా? అబ్బాయీ! నీ కోసరమే ఇదంతా, వచ్చి పనిచేయమంటే సరి; వాడే చేస్తాడు. నీ కెందుకు? వకీలుగారూ, వకీలమ్మగారూ ముగ్ధులయ్యేట్టుగా చేస్తాను చూడు!"

"అట్లా అయితే, ఇంకేం! నా నెత్తిన పాలుపోసినట్టే! ఎట్లాగురా భగవంతుడా? అని దిగులుపడుతున్నాను."

"దిగులూవద్దు, ఏమీవద్దు! ఆ కుర్రవాడిని నీకు వప్పచెబుతాను. కావల్సిన పనులన్నీ చేయించు."

"అదికాదండి, రెండుమూడు నెల్లక్రితమేగా మీ బావమరిది నెక్కడో నౌకరీలో వుంచారు? అప్పుడే మళ్ళీ నౌకరీ అవుసరం ఏం వచ్చింది?"

"సరేలే! అతనొక్కడే అనుకుంటున్నావా? వాళ్ళు మొత్తం ఏడుగురు అన్నదమ్ములు. ఇంకా ఆరుగురికి వుద్యోగాలు చూడాలి....సరేగాని, ఇటురా! ఇటు కూర్చుని, అసలు ఏమేమి సామాను కావాలో లిస్టు రాసుకుందాము. ఐతే, అసలు మొత్తం ఎంతమంది వస్తారు?"

"వకీలమ్మగారు తప్పనిసరిగా వస్తారు. ఇకపోతే....వకీలుగారు కూడా బాహుశా రావచ్చును....ఇంతే."

"చాలా బాగుంది! అవుసరంలేని వాళ్ళందరినీ పిలవడంవల్ల, ఖర్చు, రసాభాసా తప్పితే మరేమీ లాభం వుండదు. మన కసలు ముఖ్యం వకీలమ్మ గారు. వారిని గనక మంచిచేసుకున్నామా? మనపని చిటికెలమీద గడిచిపోతుంది."

ఇద్దరూ లిస్టు తయారుచేశారు. రమేశ్‌బాబుకు పెద్దవాళ్ళ పరిచయం ఎక్కువ! అందరిఇండ్లకూ స్వతంత్రంగా వెళ్తూంటాడు. రెండు రోజులనుంచీ అవుసరమైన సామాగ్రిని పోగుచేయడంలో నిమగ్నుడైవున్నాడు. రోజూ ఆఫీసు పని ముగియగానే వచ్చి గదిని అలంకరించడంలో మునిగిపోతాడు. దయానాథుడు కూడా ఒకచెయ్యి వేస్తున్నాడు. ఇక రమానాథుడివిషయం చెప్పనే అవుసరంలేదు!

రోజూ ముగ్గురూ, ఆఫీసుకు వెళ్ళేముందూ, వెళ్ళి వచ్చిం తరవాతా ఈ పనిలో గంటలతరబడి గడుపుతారు. ఏ అద్దం ఎక్కడ కట్టవల్సిందీ, ఏ తివాచీ ఎక్కడ పరచవల్సిందీ, ఏ డ్రాయరు ఎక్కడవేయవల్సిందీ మొదలైన బాధ్యత లన్నీ దయానాథుడివే! ఒక్కొసారి ఈ విషయం గురించి ముగ్గురిలో తర్కం కూడా జరుగుతూవుంటుంది. ఒకళ్ళకు ఒకచోటవుంటే నచ్చిన వస్తువు, ఇంకొ ళ్ళకు నచ్చదు. దయానాథుడు "నిలువుటద్దం ముందుగదిలో కట్టడం అనవసరం. వెనకగదిలో కడదాం"అన్నాడు. రమేశ్‌బాబు ఈ ప్రస్తావనని పూర్తిగా వ్యతిరే కించాడు. నిలువుటద్దం వెనుకగదిలో అసలు పనికిరాదు, ముందుగదిలోనే కట్టా లన్నాడు. రమానాథుడు ఎటూ మాట్లాడకుండా వూరుకున్నాడు. చివరకు దయా నాథు డిలా అన్నాడు: "నేను అనేకమంది ఇంగ్లీషువాళ్ళ డ్రాయింగ్ రూములు చూశాను. డ్రాయింగ్ రూములో అద్దం ఎక్కడా వుండదు. అద్దం పడకగదిలో వుంటుంది. ఇక్కడ అద్దంకట్టడం పూర్తి అసందర్భంగా వుంటుంది."

రమేశ్‌బాబు ఇలా అన్నాడు: "మీలాగా అనేకమంది ఇంగ్లీషువాళ్ళ ఇళ్ళు చూడకపోయినా, ఇద్దరి ముగ్గురి ఇళ్ళుమాత్రం చూశాను. నేను చూసినచోట్ల పడక గదుల్లోనే కాకుండా, ఇతర గదుల్లోకూడా అద్దాలు వున్నై. అదీకాక, మనమేమీ ఇంగ్లీవాళ్ళం కాదు. మనం భారతీయులం. కావాలంటే, మీకు ఎంతోమంది ఇక్కడి జమీందార్ల ఇండ్లలో ప్రతి గదిలోనూ నిలువుటద్దాలు చూపుతాను. అదీకాక, ప్రతి

చిన్నవిషయంలోనూ ఇంగ్లీషువాళ్ళని అనుకరించా లనేమైనా ధర్మశాస్త్రం వుందా? మనలో చాలామందిని చూశాను. కట్టూ, బొట్టూ, వేషంలో మాత్రం మూడు మూర్తులా అనుకరిస్తారు. కానీ, వాళ్ళల్లోవున్న-వాళ్ళను ప్రపంచ విజేతలుగా చేసిన-ఉన్నతం అయిన భావాల జోలికి ఎవ్వరూ పోరు. ఎవరినైనా వెకిలిగా అనుకరించడం మంచిదికాదు. అదిసరే, ఈ ముసలితనంలో మీకు పూర్తిగా ఇంగ్లీవాళ్ళమైపోదామని వుందా?" పెద్దగా నవ్వాడు రమేశ్‌బాబు.

వస్తుతః దయానాథుడు ఇంగ్లీషువాళ్ళను అనుకరించడానికి పూర్తి వ్యతిరేకి. అతని కీ టీపార్టీలన్నా నచ్చవు. ఏదో నలుగురు పెద్ద మనుష్యులు వస్తారు. వాళ్ళ పరిచయ భాగ్యం లభిస్తుందని ఈ పార్టీకి అనుమతించాడు. అత నీనాటివరకూ కోటువేసిన పాపానపోలేదు. టీ తాగుతాడుగానీ, అది మామూలు ఇత్తడిగ్లాసుల్లోనే. కేవలం తన వాదాన్ని సమర్థించుకోవడానికి ఇల్లా అన్నాడు ; "మీరు చెప్పినది చాలా బాగున్నది. మనం వాళ్ళను అనుకరించకూడదనే విషయంలో నేనూ మీతో ఏకీభవిస్తాను. కానీ ఈ టేబుళ్ళూ, కుర్చీలు, అలంకరణ పద్ధతీ, ఇదంతా వాళ్ళను అనుకరించడం కాక మరేమిటి? మీరు నిజాయితీని నిలబెట్టుకోవాలంటే, చక్కని చిరుచాపల్ని పరచండి. శుభ్రమైన దేశవాళీ చల్లని పానీయాన్నియ్యండి." ఒక్క క్షణం ఆగి, "మీరు మొదటినుంచీ చివరివరకూ వాళ్ళను అనుసరించి ఒక్క ఆ అద్దందగ్గిర మాత్రం మన పద్ధతి నిలబెడతానంటే ఏం బాగుంటుంది? పూర్తిగా జాతీయంగానైనా వుంచండి. లేదా పూర్తిగా విజాతీయంగానైనా వుంచండి" దయానాథుడు తన సంభాషణను ఆపేశాడు.

రమేశ్‌బాబు పని ఇరుకున పడ్డట్టయింది. తన వాదనకు బదులు చెప్పలేడను కున్న దయానాథు డిలా ప్రతివాదన చేయడంతో అతని తల తిరిగినట్టయింది. ఇక దయానాథుని వాదనలో ఓడించాలంటే, సమస్యలోని విశాలత్వానికి స్వస్తి చెప్పి సంకుచిత తత్వాన్ని స్వీకరించాలి. "అయితే, మీరు ఏ ఇంగ్లీషువాళ్ళ గదుల్లోనూ అద్దాలు చూడలేదా? పోనీ, అలాంటివాళ్ళ పేర్లు నాలుగు చెప్పండి; మీరు చూసిన ఇళ్ళల్లో మా క్రిస్టియన్‌క్లర్కు ఇల్లు ఒకటైవుండవచ్చు; బహుశా మీరతని ఇల్లుకాక ఇంకే ఇతర ఆంగ్లేయుల ఇండ్లూ చూడకపోవచ్చును. ఇక వాళ్ళ అభిరుచులకు ప్రతినిధిగా ఇతన్ని తీసుకుంటున్నారా?" అన్నాడు రమేశ్‌బాబు.

"ఏం ఇతన్నింత తక్కువగా తీసేస్తున్నారు? ఒక్క రంగు మినహాయిస్తే వాళ్ళకూ, ఇతనికీ ఇంకేవిధమైన తేడా లేదు."

దాని కేం సమాధానం చెప్పడమా అని రమేశ్‌బాబు యోచిస్తుండగానే బయట కారుమోత వినిపించింది. రమానాధుడి గుండెలు దడదడమన్నై. కారులో వచ్చింది రత్తనేనని ఖచ్చితంగా తెల్సు. ఎక్కడ లోపలికి వచ్చి ఈ ఏర్పాటంతా చూస్తుందోనని మిత్రుడినీ, తండ్రినీ తీసుకుని గడపలోకి ఎదురు పోయాడు. వస్తూనే రత్తన్ కరస్పర్శ చేసింది. తరువాత రమానాధుడు తండ్రినీ, మిత్రునీ పరిచయం చేశాడు. రత్తన్ వాళ్ళ నంతగా లక్ష్యం చేయలేదు.

"కొంచం మీ రిటు వస్తారా? నాకు కూర్చోవడానికి అవకాశం దు.లే మీతో అవుసరంగా ఒక్కమాట చెప్పిపోవాలి" అన్నది రత్తన్.

ఇద్దరూ కారుదగ్గరకు వచ్చారు.

"మీరు నగలకు ఆర్డరు ఇచ్చివుంటా రనుకుంటాను?"

"అవును.... చేస్తుండాలి."

"ఆ రోజున మీతో డబ్బు ఇప్పుడప్పుడే దొరకదని చెప్పానుకదండీ? తరువాత మిమ్మల్ని ఇబ్బందిపెట్టడం మంచిదిగాదనుకుని డబ్బు తెప్పించాను. ఎనిమిది వందలుకదూ అన్నారు?"

జాలప చెప్పిన ధర ప్రకారం రత్తన్ ఎనిమిదివందలూ ఈయడానికి సిద్ధంగా వున్నది. తీసుకోదల్చుకుంటే రమానాధుడు ఈ క్షణాన పైె రెండు వందలూ ఏబాధాలేకుండా తీసుకోగలడు కానీ, అత నలా చేయలేకపోయాడు. నిత్యం వ్యాపారులదగ్గర అణా బేడా పుచ్చుకోవడానికి అత నేమాత్రం సంశయించడు. మోసం, అన్యాయం, కుట్ర వీటిని సాధనాలుగా చేసుకుని లక్షలు సంపాయించే వాళ్ళదగ్గిర ఒక్క అణా తీసుకోవడంలో తప్పేమీ లేదని అతని అభిప్రాయం. రత్తన్ అపారమైెన విశ్వాసాన్నీ, ఆత్మీయతనూ ప్రదర్శిస్తున్నది. ఆ రెండువందలూ రెండువేలుగా మారినా ఆతను తీసుకోలేడు.

"అయితే, మీతో జాలప ఎనిమిదివందలని చెప్పిందా? బహుశా మర్చిపోయి వుండవచ్చు। దాని గాజులు ఆరువందలే, మీకు కావాలంటే ఎనిమిది వందలుజత చేయిస్తాను.

"నాకు అవే బాగున్నాయండి అలాంటివే చేయించండి" అంటూ కారులో వున్న బాగ్ తీసి ఆరు వందరూపాయలనోట్లు లెఖ్ఖపెట్టింది రత్తన్.

"డబ్బుకేం తొందరండీ, వస్తువు తయారై వచ్చినతరువాత చూచుకోవచ్చును."

"అల్లాకాదు; నాదగ్గరవుంటే ఖర్చయిపోతుంది. అదీకాక నే నేదైనా అనుకుంటే అది వెంటనే జరిగిపోవాలి....ఆలశ్యం ఆయితే బాధగా వుంటుంది" అంటూ రమానాధుడి చేతికి డబ్బుయిచ్చి వెళ్ళిపోయింది రత్తన్.

రమానాధుడు డబ్బు పెట్టెలో పెట్టిరావడానికి గదిలోకి పోయాడు.

లోపల దయానాధుడూ, రమేశ్‌బాబూ ఇలా మాటాడుకున్నారు.

"చూశారా ?" అన్నాడు రమేశ్‌బాబు.

"చూశాను ! కండ్లువున్నప్పుడు చూడక ఏం చేస్తాను ?" అన్నాడు దయానాధుడు.

"మీ మనస్సుకు కష్టంగా వున్నట్టుంది. ఈ రోజుల్లో ఇల్లాగే వుండాలండి. భయమూ, బెదురూ లేకుండా ఎక్కడికిపడితే అక్కడికి రా౦ పోగలిగి వుండాలి ! కాకపోయినా మనవాళ్ళలా మొగుడు చస్తుంటే మందునీళ్ళకయినా పోలేని శత పీనుగుల్లావుంటే ఎలా ?"

"ఏమో బాబూ, మరీ బరితెగించిన నాగరికత నాకు బొత్తిగా నచ్చదు. ఇంత విచ్చలవిడా ? ఈ జబ్బు మా వాడికికూడా అంటుకున్నట్టున్నది. భార్యను నెత్తినెక్కించుకునేవాళ్ళను చూస్తే నాకు వళ్ళు మండుతుంది. కొడుకుగదా అని పస్తాయిస్తున్నాను. లేకపోతే, ఏనాడో కాపురం విడిగా పెట్టుకోమనేవాడిని. ఇంత భయభక్తులులేని ఈమె, వకీలుగారి కళ్ళల్లో తప్పకుండా కారం కొడుతుంది !"

"ఈ విషయంలోమాత్రం నేను మీతో ఏకీభవించలేను. స్వతంత్రంగా, స్వేచ్ఛగా వున్నందువల్ల ఆడవాళ్ళు చెడిపోతారనిగానీ, లేక చెడిపోయేవుంటారని నే ననను కాని – మనవాడంటే ఆమెకు ఎక్కువ ప్రీతే. ఈమాత్రానికి అనుమానించనవుసరంలేదు. ఈ డబ్బు ఏదో కారణంగా ఇచ్చివుంటుంది."

"మీరు లక్ష చెప్పండి, దీన్లో ఏదో మోసం వుంది. మా వాడామెను మభ్య.... అంటూ వుండగానే రమానాధుడు వచ్చాడు. ఈ చివరి మాటలు అతనికి స్పష్టంగా వినపడ్డయి. "అవును, నా కిదే వుద్యోగం. ఆమెను మభ్యపెట్టి డబ్బు గుంజుతున్నాను...." అన్నాడు కసిగా.

దయానాధుడు సిగ్గుపడిపోయాడు. మాటను సవరించుకోడానికి "ఎందుకలా కోపం తెచ్చుకుంటావు ? నే నా వుద్దేశ్యంతో అనలేదు."

"అనలేదేమిటి ? నా చెవుల్తో నేను విం టేను. నే నంత మోసగాడిననే అనుమానం ఎందుకు కలిగింది ? ఈ కాలానికి తగినట్టు కొంచెం తెల్లని బట్టలు వేసుకుని తిరుగుతున్నాను. కాకపోతే నేను సంపాయించిన డబ్బుల్నే అందరిలా పిసినారిగా లేకుండా సరదాగా ఖర్చుపెట్టుకుంటున్నాను. ఇదేగా కారణం మీ రనుమానించడానికి ?........మీ రనుకున్నంత నీచుడిని కాదులెండి. ఇంతవరకూ నేను అక్రమ మార్గాలకు పోలేదు. ఒకవేళ ఏనాడైనా అక్రమంగా ప్రవర్తించవలసివస్తే, ఆనాటినుంచీ మీరు చెప్పకుండానే నా దారి నేను చూసుకుంటాను. ఇంత అనుమానంగావుంటే రమేశ్‌బాబుగారు ఎదురుగా వున్నారుగా అడగండి."

సత్యం, అసత్యం తేడాలు స్వరంలోనే వున్నై. విశ్వాసం కలిగించే స్వరంలో అసత్యాన్ని చెప్పినా చెల్లుబడి అవుతుంది. దయానాధుడు కొడుకు మాటలు యథార్థాలనుకున్నాడు. అలాంటి కొడుకుని అనుమానించినందుకు పశ్చాత్తాపపడ్డాడు. "నీ వెందుకురా; వేరేదారి చూసుకోవడం? ఒకవేళ నీ వలాంటి మార్గానికి తిరిగితే నేనే నా దారి చూసుకుంటాను. ఇంతకూ నే ననేదేమిటయ్యా అంటే, నా కొడుకు దరిద్రుడనిపించుకున్నా ఫరవాలేదుగాని చెడ్డవాడనిపించుకుంటేమాత్రం సహించలేను" అన్నాడు దయానాధుడు.

రమేశ్‌బాబు నవ్వుతూ "ఇది ఇంతటితో పోనీయండి. సరేగాని, రమా! అసలా డబ్బు ఎందుకు ఇచ్చినట్టు?" అడిగాడు.

"ఆమె నాకు ఇయ్యలేదు. మోసగించి తీసుకున్నాను" రమానాధుడి కసి ఇంకా తీరలేదు.

"ఇదిగో! ఇంకా అవే మాటలు పట్టుకు కూర్చున్నావా? మిత్రుడిని నాతో చెప్పకపోతే, ఎల్లా? చెప్పు ఎందుకు ఇచ్చింది?"

"గాజులు చేయించమని ఇచ్చింది."

ఒక్కక్షణం ఆగి "అబ్బ! అనవసరమైన జంజాటాన్ని నెత్తిన వేసుకున్నావయ్యా! ఆడవాళ్ళ విషయం నీకు తెలియదు. నీవు ఎంత మంచిగానయినా చేయించు. నీ డబ్బులే నాలుగు వేసుకో అయినా వాళ్ళకు నచ్చవు. డబ్బు మిగుల్చుకున్నావేమో అన్న అనుమానం పోదు. సరే, నే నొక మంచి షరాబు దగ్గరకు తీసుకుపోతాను" అన్నాడు రమేశ్‌బాబు.

"ఈమె అలాంటి మూర్ఖురాలు కాదులెండి."

కొద్దిసేపటి తరువాత రమానాధుడు లోపలికిపోయి "మీ స్నేహితురాలు రత్తన్ వచ్చిపోయింది" అని జాలపతో చెప్పాడు.

"నిజంగా? ఐతే, మన ఏర్పాటంతా చూసి నవ్వుకుని వుండాలి!" అన్నది జాలప.

"ఆమె లోపలికి వచ్చి చూస్తే నిజంగా అంతా అయ్యేది. బయటనుంచే వెళ్ళిపోయింది. గాజులకు డబ్బు ఇచ్చింది. నువ్వు ఎనిమిదివందలని చెప్పావుటగా?"

"ఊరికే అన్నాను" సాధారణంగా అని వూరుకున్నది జాలప.

ఆమె మనస్సులో నిదానంగా ఒక పెద్ద అశాంతి రగుల్కొనసాగింది. రమానాధుడు ఎనిమిదివందలు మెదలకుండా తీసుకున్నట్లయితే, ఆమె కే బాధా వుండేదికాదు. భర్త చూపిన ఈ కొద్దిపాటి సత్ప్రవర్తనవల్ల ఆమెలోవున్న న్యాయబుద్ధి మేల్కొన్నది. ఈ విషయంలో తనను గురించి భర్త, రత్తన్‌లు ఏమనుకున్నారోనని చాలాసేపు చింతించింది.

# 16

రమానాధుని ఇంట్లో జరిగిన విందులో చెప్పుకోదగిన విశేషాలేమీ జరగలేదు. వకీలుగారు విందుకురాలేదు. రత్తన్ వస్తూ తనవెంట బంధువుల పిల్లనొక అమ్మాయిని తీసుకువచ్చింది. దయానాధుడు అక్కడవుంటే తనుకూడా పాల్గొనవల్సివస్తుందేమోనని ఆ సమయానికి ముఖం తప్పించాడు. రమేశ్‌బాబు విందులో కలవకుండాపోయి బయటనిలబడ్డాడు. ఎన్నిసార్లు పిల్చినా రాలేదు.

విందు ముగిసిన తదుపరి ఇద్దరు అతిథుల్ని తీసుకుపోయి అత్తగారికి పరిచయం చేసింది జాలప. రాజేశ్వరికి వాళ్ళ కట్టూ, బొట్టూ, వ్యవహారాలు ఏమాత్రం రుచించలేదు. అంటీఅంటనట్లు ప్రవర్తించింది. పెద్దగా సిగ్గూ, బిడియమూ లేకుండా మాట్లాడటమూ, నేల అదిరేట్టు గబగబా నడవడమూ, మేడ మీదికిపోయి గంతులు వేయడమూ ఆమెకు బొత్తిగా నచ్చలేదు. జాలపకూడా వీళ్ళతో కల్సిపోయినందుకు ఆమె వళ్ళు కారంరాచినట్టు మండింది.

రత్తన్ గాజులవిషయం అడుగుతుందేమోనని రమానాధుడు భయపడ్డాడు కానీ, ఆమె ఆ విషయమే ఎత్తలేదు. ఈ విందు ఏర్పాట్లల్లో పడివుండడంవల్ల అతని కింతవరకూ గంగూ దుకాణందగ్గిరకు పోవడానికి తీరిక దొరకలేదు. ఈ గొడవ అయిపోతే, గంగూకు వెనకటి బాకీలో రత్తన్ ఇచ్చిన ఆరువందలూ జమ కట్టి మళ్ళీ సరుకు తెచ్చుకుందామనుకున్నాడు. దాన్తో, ఇటు రత్తన్‌దగ్గిరా అటు గంగూదగ్గిరాకూడా తన పలుకుబడిని పెంచుకోవచ్చునని అతని అభిప్రాయం.

ఆ మరునాడే రమానాధుడు బాగా ముస్తాబై గంగూ దుకాణానికి పోయాడు. ఆకాశంలో కూర్చుని మాట్లాడేవాడిలా అడిగాడు: "ఏమండీ షరాబుగారూ, ఏమిటి విశేషాలు? మంచివి, కొత్తవస్తువులు ఏమైనా వచ్చినయ్యా?" అన్నాడు.

ఇన్నాళ్ళనుంచీ గంగూ అడిగినప్పుడల్లా రమానాధుడు ఇవ్వాళ, రేపూ అని గడుపుకొస్తూ వుండటంవల్ల అతను పూర్తిగా నిరాశపడిపోయాడు. ఇక డబ్బు రావడం గగనమే అనుకున్నాడు. ఒక విధమైన సంశయమూ, నిరాశ కల్సిన స్వరంతో గంగూ అలా అన్నాడు: "ఎన్ని వస్తువులు తయారు కాలేదు ఎన్ని అమ్ముడుపోలేదు? మీరీ ఎనిమిదినెల్లనుంచీ ఇటు ముఖమైనా చూపించారా? ఎనిమిది నెల్లయింది, ఒక్క కానీకూడా మీ ఖాతాలో చెల్లు

పడలేదు. ఇక మీరుఇచ్చినట్టే, నేను తీసుకున్నట్టే! ఇలాగయితే మేము నాదే వ్యాపారం చేశాం!"

"ఇదిగో! గంగూగారూ, ఇటురానందుకు మీరు అపార్థంచేసుకున్నట్టు న్నారు? మరేంలేదు వత్తిచేతుల్తో రాసడం ఇష్టంలేకనే ఇన్నాళ్ళుగా రాలేదు. మా పద్ధతి నీకు తెలియదు. పదిసార్లు అడిగించుకోవడం నాకు సుతరామూ గిట్టదు. ఇవిగో, ఈ ఆరువందలూ ఖాతాలో జమకట్టించు, త్వరలో ఒక గాజులజత చేయించు" అంటూ ఆరువందల రూపాయల నోట్లను గంగూచేతిలో పెట్టాడు రమానాధుడు.

గంగూ ఆరునోట్లను ఒకమాటు లెక్కపెట్టుకుని ఇనుపపెట్టెలో వేసు కుంటూ "మిగిలిన బాకీమాట ఏమీ శెలవిచ్చారుకాదు" అన్నాడు.

"త్వరలోనే."

"ఇదిగో చూడండి, బాబుగారూ! వ్యాపారాలు బొత్తిగా పడిపోయినయి; కొట్ల అద్దెలు తేలడంకూడా అంతంతమాత్రంగా వుంది. మిగిలినదికూడా త్వరగా దయచేయించాలి."

గంగూ త్వరలోనే గాజులుచేసి ఇస్తాననిచెప్పి రమానాధుని పంపివేశాడు. కానీ, అతనికి అప్పుపెడితే త్వరలో వసూలుకాదని నిర్ధారణ చేసుకున్నాడు గంగూ. అందుకనే గాజులు చేయడం ప్రారంభించలేదు. రమానాధుడు మాత్రం రోజూ ఒకమాటు గంగూని దర్శిస్తున్నాడు. ఇతనుకూడా తియ్యని కబుర్లుచెప్పి పంపుతున్నాడు. నౌకరు వూర్లో లేడనేవాడు. ఇంకోరోజు భార్యకు జబ్బుగా వుండటంవల్ల నాకు తీరుబడి లేకపోయిందనేవాడు. ఈ విధంగా దాదాపు నెలకు పైన గడిచింది.

ఇల్లా ఆలశ్యం కావడంవల్ల రమానాధుడు పూర్తిగా ఇరుకునపడ్డాడు. ఇటు గంగూనీ దబాయించి అడగలేడు, అటు రత్తన్ అడిగితే సమాధానమూ చెప్ప లేడు. రత్తన్ ఎక్కడ కనపడి అడుగుతుందోననేభయంతో పార్కుకు పోవడం కూడా మానుకున్నాడు. అతని పిచ్చేగానీ, పార్కుల్లో కనుపించకపోతే ఇంటికి వచ్చి అడగలేదా?

చూస్తూండగానే శ్రావణమాసం కూడా వచ్చింది. ఒకరోజు రత్తన్ చాలా నిష్కర్షగా అడిగింది, "ఆ వెధవ చేయకపోతే, ఇంకోడులేడా? చేసేవాళ్ళకేం తక్కువ" అన్నది.

"వాడిలాంటి దొంగముండాకొడుకని తెలియక ముందు అడ్వాన్సు ఇచ్చాను. పోనీ, ఇప్పు డింకోచోటికి పోదాం అనుకుంటే, వీడి కిచ్చిన ఈ అడ్వాన్సు డబ్బు కాస్తా చేయిజారినట్టే, ఇందుకనే నేను వెనకా ముందాడుతున్నాను" అన్నాడు రమానాధుడు.

"పోనీ, వాడిదుకాణంను చూపించండి. వాడిదగ్గరేకాదు, వాడిబాబుదగ్గిర కూడా వసూలుచేస్తాను....ఇలాంటి దొంగవెధవల్ని పోలీసులకు పప్పచెప్పాలి" అని రత్తన్ చాలా కోపంగా అన్నది.

అంతవరకూ నిశ్శబ్దంగావున్న జాలపకూడా అందుకున్నది "నిజమే! ఆలశ్యం అనేది ఎవరికయినా జరుగుతుంది. కానీ ఇదే మన్యాయం? డబ్బు మింగి కూర్చుని నెలల తరబడి తిప్పడం నే నెక్కడా చూడలేదు. ఇలాంటి వాళ్ళకు తప్ప కుండా శాస్తి జరగాలిసిందే!"

"పోనీ, వాడిదుకాణం చూపించడానికి మీకేమిటి అభ్యంతరం?" రత్తన్ ప్రశ్నించింది.

"దేనికిలెండి, ఒక్క పదిరోజులలో నేను గాజుల్ని తెచ్చియిస్తే సరి గదా?" రమానాధుడు హామీ యిస్తున్నట్టు చెప్పాడు.

"మీరుకూడా చాలా అశ్రద్ధ మనుషులండి, పైగా కరుగ్గానైనా మాట్లాడరు. ఈ మెత్తదనాన్ని చూసే వాడు నెత్తిన ఎక్కాడు. ఒక్కసారి బుద్ధి చెబితేనా........!"

చివరకు చాలా కష్టంమీద రత్తన్ ఇంటికి పోయింది. ఆరోజు సాయంత్రమే, సగండబ్బు అడ్వాన్సుగా ఇవ్వాలనీ, వెనకటి బాకీకూడా పూర్తిగా చెల్లు చేయాలనీ, అప్పుడుగానీ గాజులుచేయటం ప్రారంభించడం పడదనీ గంగూ నిక్కచ్చిగా చెప్పాడు.

ఈ విషయం వినేసరికి రమానాధుడికి గుండె ఆగినంత పనైంది. "చూడండి గంగూగారూ! మీరిప్పుడిలా అంటే ఎల్లగా? ఈ గాజులు మాయింటిలోకికాదు. ఒక పరిచయస్తురాలు చేయించి పెట్టమన్నది. ఈ డబ్బు ఆమెది. దీన్ని మీరలా బిగబడితే, నే నిక ఆమెకెలా ముఖం చూపించడం? మీ డబ్బు ఎక్కడికీపోదు. అంత భయంగావుంటే నోటురాసి ఇస్తాను. గాజులుమాత్రం త్వరగా చేయించి ఇయ్యండి" అని ప్రాధేయపడ్డాడు.

"నోట్లూ, పత్రాలూ ఏం చేసుకోను? నాలుక గీసుకోమంటారా? పంవత్సరాలతరబడి అప్పులు పెట్టుకు కూర్చుంటే, మా పనులెల్లా జరుగుతయ్యి. అయినా నేనేం వడ్డీకోసం ఏడుస్తున్నానా? కాకపోయినా మీకేమండి మహరాజులు ఆరు వందలు మీకో లెఖ్ఖా, జనూ? గాజులుచేసి సిద్ధంగావున్నై. డబ్బిచ్చి పట్టుకుపొండి!"

"ఏమిటీ?........ చేసి సిద్ధంగా వున్నయ్యా? అయితే నాకు ఈ మాట నెల రోజులక్రితమే ఎందుకు చెప్పలేదూ? ఈలోపు డబ్బయినా సిద్ధంచేసుకునే వాడినిగా!"

"మీ రీమాత్రం అర్థంచేసుకోలేరని నాకేం తెల్సూ?"

ఇక రమానాధుడి నోటివెంట మాటరాలేదు. నిరాశగా కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరుకున్నాడు ఇప్పటికయినా తన యథార్థ పరిస్థితిని జాలపకు తెలియచేస్తే మనస్సులో బాధపడుతూనైనా తన గాజుల్ని ఇచ్చేది. కానీ. అతనలా చేయ దల్చుకోలేదు! చేయడు! తన ఆర్థికస్థితిని జాలపకు చెప్పి ఆమె మనస్సును కించ పర్చడం అతని కేమాత్రం ఇష్టంలేదు.

అతని పైఆదాయం, నిరభ్యంతరంగా నెలకు వంద రూపాయలవరకూ వుంటుంది. అయితే. దానికి తగిన పై ఖర్చులుకూడా వున్నై. సినిమాలూ,షికార్లూ, విందులూ వీటిపైనే ఖర్చు అవుతుంది. వాటిని జాగ్రత్తగా దాచినట్లయితే. ఈసరికి ఇద్దరు షరాబులకూ చెరిసగం బాకీ అయినా, తీర్చేవాడే! కానీ, ఇలా కానీ, కానీ పీక్కి అప్పుతీర్చడం అతనికి ఇష్టంలేదు. తనకు ఎక్కడినుంచో ఒక్కసారి పెద్ద మొత్తంగా డబ్బు వస్తుందనీ, దాన్తో తీర్చవచ్చుననీ అతవి హృదయంలో ఒక సన్నని సూర్యకిరణంలాంటి భావన మెదుల్తూ వుంటుంది. దాన్నతను నిజంగా కిరణమే, వెలుగునే ఇస్తుందనుకుంటాడు. అది అంధకారం! దానినుంచి వెలుగు లభించకపోగా మనిషి రోజురోజూ కష్టాలపాలౌతూ వుంటాడు.

కాకపోయినా మన దేశంలో దమ్మిడీలను రూపాయలు చేయగల నేర్పు ఒక్క వైశ్యులకే దక్కింది. ఇతర్లంతా రూపాయలను దమ్మిడీలు చేయడంలో మొనగాళ్ళు!

కొంచెం పొద్దుగూకింతరువాత పోనీ ఇంకెక్కడైనా అప్పు దొరుకుతుం దేమో అనే వుద్దేశ్యంతో రమానాధుడు షరాబు బజారుకు పోయాడు. కాని అక్కడ పనేమీ జరగలేదు. వ్యాపారుల దగ్గర కర్ణపిశాచంలాంటి దేదో వుండుం డాలి. ఒక్కళ్ళకు గనక యియ్యడం ఆలశ్యం అయిందా ఇక ఆ బజారులో అప్పు పుట్టదు.

ఆ రాత్రంతా అతనికి నిద్రపట్టలేదు. ఇలాంటి క్లిష్టసమయంలో ఎవరైనా ఒక్క ఐదువందలు సహాయంచేస్తే. జీవితమంతా వాళ్ళకు కృతజ్ఞుడైవుంటాడు. పోనీ ఒక వెయ్యిరూపాయలకు నోటు రాయించుకుని ఐదువందలు ఇచ్చేవాళ్ళైనా వుంటే ఆతనినెత్తిన పాలుపోసినట్టే! అతనలా నోటు రాయడానికికూడా సిద్ధమే. అయినా, ఇచ్చే ఉదారపురుషులు ఎవరూ కనిపించలేదు. ఏ మిత్రుడి దగ్గరకయినా పోయి తన పరిస్థితిని చెప్పుకొని అప్పుఅడగడానికికూడా వీలులేకుండా వచ్చింది. తను క్రితం గంటవరకూ ప్రతివాళ్ళదగ్గరా గొప్పలు చెబుతూనేవున్నాడు.బ్యాంకులో డబ్బుందనీ, అదనీ, ఇదనీ కోశేస్తూనే వున్నాడు. తను యథార్థాలే చెబుతున్నా డనిపించుకోడానికి,ప్రతివాడికీ,ముక్తహస్తంతో,దానకర్ణుడిలా కాఫీలూ,టీలూ పోయి స్తూనేవున్నాడు. మరి ఇప్పుడు వెళ్ళి ఈ బాధలన్నీ ఏకరువుపెట్టడం ఎల్లా? అప్పు

అడగడం ఎల్లా ? పోనీ తన కేదైనా జబ్బువచ్చి ఒక నెల మంచంలోవున్నా బాగుండు. రత్తన్ జబ్బులోవున్నాడని అడగడమైనా తాత్కాలికంగా మానుకుంటుంది. ఈ భయాలూ, బాధలూ, అవమానాలు వీటినుంచి, ఒక్క పదిరోజులు విశ్రాంతయినా దొరుకుతుంది.

రమానాధుడు నిద్రపోకుండా ఇలా ఆలోచిస్తూవున్నాడు. ఇంతలో పక్కనే పడుకునివున్న జాలపకు మెళుకువ వచ్చి మంచంలో ఇటూ అటూ కదిలింది. వెంటనే అతను ముసుకుతన్నిపట్టి గాఢనిద్రలోవున్నట్లు నటించాడు. ఒక్కక్షణం జాలప నిండా ముసుకుకప్పుకున్న భర్తవంక చూసింది. నటనకు తనను తాను కాపాడుకునే శక్తిలేదు. బహుకొద్ది అవధిలో బయటపడిపోతుంది.

జాలప భర్తముసుగు వత్తిగిలించి "ఇంకా మేల్కొనేవున్నారా ?" అడిగింది.

"ఎందుకనో నిద్రరావడంలేదు." రెండు క్షణాలు ఆగి "కొన్నాళ్ళపాటు ఏదైనా పొరుగూరుపోయి, డబ్బు సంపాయించుకువస్తే బాగుండనిపిస్తున్నది" అన్నాడు రమానాధుడు.

"అయితే, నన్నూ తీసుకుపోతారుగా ?"

"ఏ ఆధారమూ లేకుండా పరాయిస్థలానికి పోయేప్పుడు, వెంట నిన్ను కూడా ఎలా తీసుకుపోవటం ? సత్రం భోజనం, మఠం నిద్రగా వుంటుంది జీవితం!"

"అట్లా వీలుకాదు. మీరు లేకుండా నే నిక్కడ ఒక్క క్షణంకూడా వుండను.... అయితే, ఎక్కడికి వెళ్దామని ?"

"ఎక్కడికైందీ యింకా తేలలేదు."

"అయితే, నిజంగా నన్నువిడిచి వెళ్తారా ? ఇన్నాళ్ళనుంచీ ఇంత ప్రేమ చూపుతున్నారు ఇదంతా కపటమేనా ? లేకపోతే, నన్నువిడిచి ఎట్లా వెళ్ళగలుగుతారు ?" జాలప కళ్ళల్లో నీళ్ళుతిరిగినయ్.

"ఆఁ, కపటప్రేమా ? అట్లాగయితే నేను ఏనాడో వెళ్ళిపోయి వుండేవాడిని. ఇన్నాళ్ళయినా నే నిక్కడ వుండటానికి కారణం. నిజంగా నిన్ను విడిచి పెట్టలేకనే !"

"పోమహా. మీవన్నీ ఒట్టికబుర్లు. నేను మొదటినుంచీ మీ వాలకం చూస్తూనే వున్నాను. ఎప్పుడూ ఏదో ఏకాంతంగా బాధపడుతూ వుంటారు. అదేమిటో నాతో మాటమాత్రం చెప్పరు. ఒకవేళ నేను వూరుకోలేక నోరు తెరచి అడిగినా, ఏమీ లేదని తప్పుకుంటారు. ఏవో వున్నగని స్పష్టంగా తెలు

స్తుండగా! ఏమిటి మీరుపడే బాధ? నా కెందుకు చెప్పరు? నామీద విశ్వాసం లేదా? అయితే, విశ్వాసం లేనిచోట ప్రేమెలా వుంటుందిలెండి."

"నే నేదో బాధపడుతున్నాననీ, నీకు చెప్పడంలేదనీ వూరికే నీవు అనుకోవడం మాత్రమే; వట్టి భ్రమ!"

"అయితే, మీ హృదయంలో నిజంగా నామీద ప్రేమ వుందా? నిజం చెప్పండి, అబద్ధం చెబితే స్వరం వెంటనే పట్టిస్తుంది!"

"అయితే. ఇక నోటితో చెబితేనన్నమాట, ప్రేమ వున్నట్లు!"

"సరే, అది పోనీయండి. నే నొకప్రశ్న వేస్తాను; దానికి సమాధానం చెప్పాలి! చెప్పకపోతే నామీద ఒట్టే! "మీరు నన్ను ఎందుకు ప్రేమిస్తున్నారు?" చెప్పండి. దాయకుండా చెప్పండి."

"ఏమిటీ అర్థంలేని ప్రశ్న? ఇలాగే నేనూ నిన్నడిగితే?"

"అడగండి, సమాధానం సిద్ధంగా వున్నది."

"అయితే చెప్పు?"

"ఊఁ హూఁ. మొదలు మీరు చెప్పండి."

"నేను ఎందుకు ప్రేమిస్తున్నానో వివరంగా చెప్పలేను. కానీ, నిన్ను ప్రేమించకుండా మాత్రం వుండలేను! ఇది నిజం!"

"నా పోరు చల్లార్చడంకోసం ఏదో ఒక సమాధానం చెప్పబోకండి. బాగా ఆలోచించుకుని నిజంచెప్పండి. నే నేమీ మీకూ, మీ తల్లిదండ్రులకూ అణకువగా సేవచేసే ఆదర్శపత్నినికాదు. పోతే చదువుసంధ్యలూ, సౌందర్యం – ఇవికూడా ఏమంత గొప్పగా లేవు! మరి నాలో ఏం చూసి నన్ను ప్రేమిస్తున్నట్టు?....బాగా ఆలోచించండి. ఇలా ఎందుకు అడుగుతున్నానో తెల్సా?"

"తెలియదు."

"మీ ప్రేమ నా నుంచి చెదరకుండా, శాశ్వతంగా వుండటానికి!"

"నిజం జాలపా! నేను నిన్ను ప్రేమిస్తున్నానేగానీ, ఎందుకు ప్రేమిస్తున్నానో మాత్రం నాకు తెలియదు. నీలో లోపమే వున్నదో, మంచే వున్నదో నే నెన్నడూ దాన్నిగురించి ఆలోచించలేదు. మరి నాకు రూపం, విద్య, ధనం ఏమీ లేవుకదా, నన్నెందుకు ప్రేమిస్తున్నావు?"

"నిజం చెప్పనా? మీ మంచితనాన్ని చూసే! పెండ్లి అయిన మొదట్లో మీరు నాకు భర్త అని మాత్రమే తెల్సు. ఆ పెండ్లి మీతో కాకుండా, ఇంకొకరితోనైనా నాకే అభ్యంతరమూ వుండేదికాదు. కానీ, రోజులు గడిచినకొద్దీ మీ మంచితనం నన్ను పూర్తిగా వశపరుచుకున్నది. ఇప్పుడు దేవేంద్రుడే భర్తగా వస్తానన్నా నేను స్వీకరించలేను. ఇంత అయినా, మీరు నాతో మర్మంగానే వ్యవహరిస్తున్నారు!"

"నే నేదో మర్మం వుంచుతున్నానని నీవు వూరికే భ్రమపడుతున్నావు.... జాలపా?"

రమానాధుకి ఒక్కసారి జాలపదగ్గిర తన బాధ లన్నింటినీ ఏకరువు పెడ దామా అన్నంత ఉద్రేకం వచ్చింది. కానీ, తను ఇన్నాళ్ళుగా కాపాడుకుంటున్న మిధ్యాగౌరవం అతన్నాపని చేయనియ్యలేదు.

జాలప అప్పుడప్పుడు షరాబులకు డబ్బు చెల్లిస్తున్నదీ లేనిదీ అడుగుతూ వుంటుంది. రమానాధుడు మాత్రం ప్రతి నెలా కొద్దోగొప్పో తీరుస్తున్నట్టుగానే చెబుతూ వుంటాడు. ఇవ్వాళ ఎంతసేపటికీ నిద్రపోకపోవడమూ, ఉదాసీనంగా వుండటమూ చూసి, ఆమెకు అనుమానంవేసి అడిగింది. "షరాబులకు ఇంకా పూర్తిగా చెల్లుపడలేదా?"

"లేదు. ఇంకా కొద్దిగావుంది."

"అంటే ఎంత?"

"ఆరువందలదాకా వుంటుంది."

"అమ్మయ్యో!....చాలావున్నది!....కొంపముంచి మీరేమీ రత్తన్ డబ్బు బాకీక్రింద చెల్లువేయలేదు కదా?" అనుకోకుండానే అడిగేసింది. తరవాత అలా ఎందుకు అడిగానా అని నాలిక కొరుక్కున్నది.

రమానాధుడు, ఒకవేళ ఈ ప్రశ్న వేస్తుందేమో ఏం చెప్పడమా? అనుకుం టూనే వున్నాడు. అనుకున్నంతా అయింది. ఇప్పటికయినా రమానాధుడు కొంచం ధైర్యంచేసి యధార్థాన్ని బయటపెట్టినట్టయితే, బహుశా ఈ బాధలు యింతటితో నన్నా తీరేవేమో! వినగానే కొంత జాలప బాధపడ్డా, బలవంతాన అయినా తన గాజుల్ని రత్తన్‌కి యిచ్చి ఆమెను సమాధానంపరచేది లేకపోతే జరిగిన యధార్థా న్నంతా చెప్పి తొందరపడవద్దనైనా చెప్పేది కానీ, రమానాధుడికి జాలప అడిగిన ఈ ప్రశ్న చాలా కటువుగానూ, తనను అవమానపరుస్తున్నట్టూ తోచింది. అతని ఆత్మాభిమానానికి ఘోరమైన దెబ్బతగిలింది. ఇలా అన్నాడు "ఏమిటలా అడుగు తావు? ఆమె డబ్బును జమకట్టేంత పనికిమాలినవాడి ననుకున్నావా? కావాలంటే, ఇవాళైనా వేలకువేలు రూపాయలకు నగలుతేగలను, సాధారణంగా పనివాళ్ళు ఆలస్యంచేయడం కద్దు! ఇంకో పదిరోజులు చూస్తాను. ఇస్తాడా సరేసరి, లేదా డబ్బు తిరిగి యిస్తాను. అసలు నీ కీ అనుమానం ఎందుకు కలిగింది?"

"ఆఁ. అనుమానంలేదు, ఏమీలేదు."

తరువాత జాలప నిద్రపోయింది. రమానాధుకు మాత్రం నిద్రపట్టలేదు. తెల్ల వారింతరువాత ఒకసారి రమేశ్‌బాబుని కలుసుకుని విషయాన్నంతా చెబితే బాగుండు ననుకున్నాడు. రమేశ్‌బాబు తల్చుకుంటే ఎక్కడైనా అప్పు ఇప్పించగలడు

కూడాను ! కానీ....కాని....తరువాత ఏమంత ఫలితంవుండదని ఆ నిర్ణయాన్ని మార్చుకున్నాడు.

రమానాధుడు ఉదయాన్నే కాఫీతాగి ఇంట్లోనుంచి బయలుదేరాడు. ఆఫీసుకుపోతే ఏదో శాంతి లభిస్తుందని అతని ఆశ. ప్రాణాపాయంలో వున్న రోగి, డాక్టర్ని చూడగానే కొంత సంతృప్తి చెందుతాడు. తను బ్రతికేదీ బ్రతకందీ తరువాత విషయం ! సరిగా అలానేవున్నది రమానాధుడి స్థితికూడాను.

ఆఫీసులో బంట్రోతు తప్ప ఇంకా ఇతరు లెవ్వరూ రాలదు. తలుపులు తీసుకు లోపలికిపోయాడు. రిజిష్టరు బుక్కులన్నీ తీసి ముందువేసుకు కూర్చున్నాడు. జమాఖర్చు లెక్కలన్నీ కూడాడు. పెద్దబాబుగారిదగ్గిర జమకట్టవల్సింది తన ఆఫీసుగదిలో రెండువేల ఐదువందలు వున్నట్టు లెక్కలు తేలినయ్యి. "ఆ రెండువేల ఐదువందల్లో తను ఐదువందలు తీసి లెక్కలు రెండువేలకు సరిపుచ్చితే ఏం ? ఇప్పుడు లెక్కలు ఎవరు చూడవచ్చారు ?" అనుకున్నాడు. "పోనీ. ఎవరైనా తనిఖీచేసినా లెక్క పొరపాటైందని చెప్పి అప్పుడు తెచ్చి చెల్లించవచ్చునుగదా ?" కానీ ఈ భావాలు అతనిలో ఎక్కువసేపు నిలవలేదు. నదీతరంగాలవలే యే ఒక్క అభిప్రాయమూ నిలవకుండా వేగంగా పరుగెత్తుతున్నై. రిజిష్టరు బుక్కుల్ని తీసి యథాస్థానంలో పెట్టి బయటి వరండాలో పచార్లు చేయసాగాడు.

సరుకుల బళ్ళు ఒక్కొక్కటిగా రా సాగినయ్యి. బండ్లవాళ్ళు ఉదయాన్నే ఆఫీసులో రమానాధుని చూసి అమ్మకంపన్ను చెల్లించిపోదాం అనుకున్నారు. వాళ్ల త్వరగా ఇక్కడనుంచి విడుదలైతే తమ సరుకుల్ని వెంటనే అమ్ముకోడానికి వీలువుంటుంది. ఈ అవకాశాన్ని కల్పించినందుకు రమానాధుడు మామూలు అణా కాక, అదనంగా ఇంకో అణా వసూలుచేశాడు. అయినా బళ్ళవాళ్ళు వెనకాడలేదు. వాళ్ళకు డబ్బులు పోయినా, త్వరగా సరుకులు మార్కెట్టులోకి విడుదలకావడం కావాలి ! పది పదకొండు గంటలకి మార్కెట్టు బందుఅవుతుంది. ఈలోపే వున్న సరుకుని వదిలించుకోవాలి. లేకపోతే మర్నాటికోసం ఎదురుచూడవలసి వస్తుంది. మర్నాటికి సరుకులో యే రూపాయో, అర్థరూపాయో తగ్గిందా, కనీసంగానైనా బండికి పది పదిహేను రూపాయల నష్టం రాకతప్పదు. ఆ నష్టంకన్నా ఈ అణా ఇచ్చుకోవడం వాళ్ళకు ఎక్కువ సంతోషకరం.

ఇల్లా వ్యాపారులు మామూలు అణాకాక, ఇంకో అణా సంతోషంగా ఇవ్వడానికి సిద్ధపడతారనే విషయం, రమానాధుడు ఇవ్వాళే మొదటగా తెల్సుకున్నాడు. అతను ఉదయాన ఇంటిదగ్గిర చేసేపనికూడా ఏమీలేదు. నిద్రలేస్తూనే ఆఫీసుకు వచ్చి కూర్చుని సరుకులవాళ్ళని త్వరగా పంపిస్తే అదనంగా ఐదారు రూపాయలు

లభిస్తయ్యి. పోతే మామూలుగా వచ్చే ఐదురూపాయలు, అదనంగా వచ్చేయీ ఐదారురూపాయలూ, ఒకటి అటూ ఇటూగా రోజూ పదిరూపాయలు దొరుకుతుంటయ్యి. ఈవిధంగా ఒక్క ఐదారునెల్లు కష్టపడితే సునాయాసంగా బాకీలు ఎత్తేయవచ్చు.

రమానాధుడు మళ్ళీ రిజిష్టరు బుక్కులను బయటికి తీశాడు. లెక్కలను రెండువేలకు కుదించసాగాడు. మొదట్లోవేసిన భయం యిప్పుడు లేదు. మొదటగా సైన్యంలో జేరినవాడు తుపాకీ పట్టుకోడానికే భయపడతాడు. రోజులు గడిచిన కొద్దీ వర్షంగా తుపాకీగుండ్లు వస్తున్నా ఎదురునడుస్తానంటాడు.

పదిగంటలకు రమానాధుడు ఆఫీసుకు తాళంవేసి భోజనానికి బయలుదేరాడు. ఇంతలో ఒక వ్యాపారి డబ్బు జమకట్టడానికి వచ్చాడు. రమానాధుడు భోజనంచేసి వచ్చిందాకా కూర్చోమన్నాడు. వ్యాపారి ఏదో అవసరమైన పనివుంది, పోవాలని బ్రతిమలాడుతున్నాడు. చివరకు పదిహేను రూపాయలు అదనంగా ఇచ్చే కండిషన్‌మీద రమానాధుడు భోజనానికి పోయేవాడల్లా ఆగి జమ కట్టుకున్నాడు.

వ్యాపారి పనై, అతను వెళ్ళింతరువాత బజారునుంచి కాఫీ తెప్పించుకు తాగి భోజనానికి పోవడం మానుకున్నాడు రమానాధుడు.

ఉదయంనుంచీ చీకటిపడేవరకూ కూర్చొని మొత్తం పాతిక రూపాయలు సంపాయించాడు. రోజూ ఇలావుంటే ఒక్క పదిరోజుల్లో రతన్‌కు డబ్బు ఇచ్చేయవచ్చుననుకున్నాడు. పొద్దుటి నిరాశనూ, బాధనూ,అన్నింటినీ మర్చిపోయి, వుల్లాసంగా చీకటిపడేసరికి ఇల్లు చేరుకున్నాడు రమానాధుడు.

# 17

తొమ్మిది రోజులు గడిచిపోయినయ్యి. రమానాధుడు రోజూ ఉదయాన్నే ఆఫీసుకుపోయి దీపాలు పెట్టిందాకా వుండి ఇంటికి వస్తాడు. ప్రతిరోజు ఇంటి దగ్గిర బయలుదేరేప్పుడు 'ఇవ్వాళ ఏదైనా ఒక పెద్దమొత్తం దొరికితే బాగుండు!' అనుకుని బయలుదేరేవాడు. తిరిగి వచ్చేప్పుడు తను అనుకున్నట్లు ఏ పెద్ద మొత్తమూ లభింపక నిరాశగా ముఖం వేళ్ళాడేసుకుని వచ్చేవాడు. మొదటి రోజులా అతని అదృష్టం మళ్ళీ ఏనాడూ పండలేదు. అయినా విపరీతం అయిన పొదుపుతో ఈ కొద్దిరోజుల్లోనే వందరూపాయలు కూడపెట్టాడు. కాఫీలూ, సిగరెట్లు, సినిమాలూ, షికార్లూ అన్నీ మానేశాడు. ఆతని పొదుపరితనం నిజంగా చరమస్థాయికి చేరిందనే చెప్పాలి. ఎంత అయినా వందరూపాయలకు మించ లేదు. రేపు పదోరోజు. రత్తన్ గాజులకోసం గొంతుమీద కూర్చుంటుంది. ఏం సమాధానం చెప్పేట్లు? ఇంకొక నెలపడుతుందంటే? ఒప్పుకుంటుందా? ఒప్పుకుంటే ఎలాగోలా నెల అయ్యేసరికి సర్దుకోవచ్చును. అసలు నాకు గాజులేవద్దు, డబ్బు తెచ్చి ఇయ్యమంటుందేమో? ఆవిడ అంతమాత్రపదికూడాను! అంతగా ఆమె డబ్బే కావాలని ఖచ్చితంగా అడిగితే, షరాబు డబ్బు తిరిగి వాపసు చేయడని తనూ ఖచ్చితంగా చెపితేసరి.

శ్రావణమాసం కావడంచేత ఆకాశం అంతా మేఘాలతో నిండివున్నది. పెండ్లి బండ్లలా మేఘాలు అటునించి ఇటూ, ఇటునించి అటూ నిదానంగా పరుగెత్తుతున్నై. రమానాధుడు, రమేశ్‌బాబు దగ్గిరకుపోయి రెండుమూడు ఆటలువేసి వద్దామనుకుంటున్నాడు. ఆకాశంవైపు చూసి ఆగిపోయాడు. ఇంతలో రత్తన్ వచ్చింది. అటో ఇటో తేల్చుకుపోదాం అన్నంత వుద్రేకంతో వచ్చింది.

రత్తన్‌ని చూసి జాలప ఇలా అన్నది: "సరైన సమయానికి వచ్చావు. వారంరోజులనుంచీ వారికి తీరికలేక బయటికి ఎక్కడికీ పోవడంలేదు. ఇవాళ నీతోపాటు నేనుకూడా షికారుకు వస్తాను పద."

"ఇవ్వాళ నేను కొంచం త్వరగా ఇంటికి పోవాలి. రేపే గడువురోజని వారికి జ్ఞాపకంచేసి పోవడానికి వచ్చాను" రత్తన్ కొంచం కఠినంగానే అంది.

రమానాధుడు అందుకున్నాడు: "నాకు జ్ఞాపకం వున్నదండోయ్! నేను మరీ అంత మతిమరుపువాణ్ణి గాదులెండి. రోజూ ఉదయం, సాయంత్రం వెళ్ళి ఒక్కగంటచొప్పున వాడిదగ్గిర కూర్చుని వస్తున్నాను. కానీ గాజుల పని వుంది

చూచారూ ? మహావిసుగైన పనండి. ఎట్లాలేదన్నా ఇంకొక నెలపట్టేట్టుగా వుంది। మీరు ఇంకొక్క నెల ఓపికపట్టారా, అప్పుడు గాజుల పనితనాన్ని చూసి మీరే అంటారు।"

"అయితే, ఇంకొకనెల పడుతుందన్నమాట ? అంతబాగా చేస్తున్నారా ? అంత గొప్ప పనితనంగావుండేవి నాకు అవుసరంలేదు. నా డబ్బు నాకు ఇప్పించండి."

"అబ్బే....నెల ఖచ్చితంగా అవుతుందనికాదు నే ననడం, వూరికే వూహించి చెప్పాను. నెలలోపే కావచ్చు। అసలు వజ్రాలను వెదకి సంపాయించడానికే ఇంతటైము పట్టింది" రమానాధుడు బ్రతిమలాడుతున్నట్టుగా అన్నాడు.

"స్వామీ ! నా కసలు మీ గాజులే వద్దు. నేనూ చాలా నగలు చేయించాను గానీ ఈ మోసం ఎక్కడా చూడలేదు."

రత్తన్ నోటినుంచి 'మోసం' అన్నమాట విని, రమానాధుడు నిలువునా నీరైపోయాడు. అతని శరీరంలోని రక్తమంతా ఇగిరిపోతున్నట్టనిపించింది. "మోసం అనడంకన్నా, నా తెలివితక్కువ అనండి చాలా బాగుంటుంది. కాకపోయినా, లేనిపోనిది నెత్తినపెట్టుకోవడం ఏమటి ? ఇలా జరుగుతుందని నాకు మాత్రం ఏం తెల్సును ? అడ్వాన్సు ఇస్తే త్వరగాచేసి ఇస్తాడనుకున్నానుగానీ ఇలా చేస్తాడనుకున్నానా ? ఇప్పుడేమో మీ రసలు గాజులే వద్దంటున్నారు. అతను గాజులే ఇస్తాను డబ్బు ఇయ్యనంటున్నాడు" అన్నాడు.

"డబ్బు ఎందుకీయడు ?" కోపంగా అడిగింది రత్తన్.

"మీకోసం చేసిన వస్తువును మీరు తీసుకోనంటే, దాన్ని అమ్మడాని కతను ఎక్కడికి పోతాడు ? అందరి అభిరుచులూ ఒక్కలా వుండవాయె ! మీ కోసం చేసిన వస్తువులు మీరే తీసుకోవాలి. మరెవ్వరూ తీసుకోరు. ఈ బాధలు పడలేకనే అడ్వాన్సు డబ్బు తిరిగి ఈయరు."

రత్తన్ ముఖం మాడ్చుకొని "నాకు ఇవన్నీ అనవసరం. అతనికి నష్టం వచ్చేదీ, లాభం వచ్చేదీ నే నాలోచించను. అతను ఆలస్యం చేశాడు. దానికి తగిన ఫలితం (నష్టం) అతను అనుభవించక తప్పదు. రేపీవరకు డబ్బుగానీ, గాజులుగానీ ఏవో ఒకటి నాకు ముట్టాలి....అంతే ! ఒకవేళ మీకూ, అతనికీ మొఖమాటాలు, స్నేహాలు వుండి, మీరు ఖచ్చితంగా అడగలేకపోతే నాకు చూపండి, నే నడుగుతాను. కొట్టుకూడా చూపలేరా ? పేరు చెప్పండి చాలు ! వాడినీ, వాడి దుకాణాన్నీకూడా వేలం వేయిస్తాను. శ్రీకృష్ణజన్మస్థానానికి పంపిస్తాను" అతి నిష్కర్షగా అన్నది రత్తన్.

రమానాధుడు స్తంభితుడై, కళ్ళు క్రిందకు వాల్చుకుని ఒంట్లు లెఖ్ఖపెట్ట సాగాడు ఏమీ తోచక.

జాలప అందుకున్నది : "నిజమే! రత్తన్ చెప్పినట్టు ఒకమాటు కొట్టు చూపించరాదా ? ఎంతవరకూ తయారైనయ్యో కళ్ళతోచూస్తే, కొంత తృప్తిగా నైనా వుంటుంది !"

"చూడటం గీడటం అనవసరం జాలప! ఇక నే నా గాజులు తీసుకోనే తీసుకోను !"

"సరే అయితే! రేపు మీకు డబ్బు ఇస్తాను" రమానాధుడు రుద్ధకంఠంతో అన్నాడు.

"ఏవేళ్టప్పుడూ ?" రత్తన్ ప్రశ్నించింది.

"ఆఫీసునుంచి వచ్చేప్పుడు పట్టుకు వస్తాను."

"ఇప్పుడే చెబుతున్నాను. పూర్తి డబ్బు ఇచ్చేసెయ్యాలి. ఒకటి రెండు వందలు ఇచ్చి తరవాత చూద్దామంటే లాభంలేదు."

"అట్లాగేలెండి" అంటూ రమానాధుడు మధ్యగదిలోకిపోయి గబగబా ఒక వుత్తరం రాసి, దాన్ని పెద్దతమ్ముడు గోపీచేతికి ఇచ్చి రమేశ్‌బాబుకు పంపించాడు. దగ్గర ఉండి సమాధానం రాయించుకురమ్మని చెప్పాడు.

రెండు క్షణాలు ఆగి ఇంకొక వుత్తరం వ్రాసి, చిన్నతమ్ముడు విశ్వంభరుడి చేతికి ఇచ్చి మణిక్‌లాల్‌కు పంపించాడు. ఇతనితోకూడా దగ్గరవుండి సమాధానం రాయించుకు రమ్మని చెప్పాడు.

వెళ్ళబోతూ విశ్వంభరుడు ప్రశ్నించాడు : "వర్షం కురుస్తున్నది. ఎల్లా పోనూ ?"

"ఏం మొక్కమొలిచిపోవులే !" విదిలించేశాడు రమానాధుడు.

"ఒకవేళ వారు ఇంటిదగ్గిర లేకపోతేనో ?"

"ఉంటాడు. ఈ సమయంలో ఎక్కడికీ పోడు."

రమానాధుడు ఇవ్వాళ ప్రథమంగా స్నేహితులముందు డబ్బు కావాలని చేయి చాపాడు. అత నెన్నడూ స్నేహితులను ఇంత ప్రాధేయపడి డబ్బు అడగలేదు. దయనూ, కరుణనూ ప్రేరేపించే పదాల నన్నింటినీ ఏరి కూర్చాడా ఉత్తరాలలో. ఇంతక్రితం ఎంతోమంది స్నేహితులు తనకూ ఇలాంటి ఉత్తరాలనే వ్రాశారు. వాటిని చదివి, తను ద్రవించిపోయేవాడు. తనదగ్గిర డబ్బువుంటే, నిస్సంకోచంగా ఇచ్చేవాడే. కానీ, ధనహీనుడవడంవల్ల ఏవేవో సాకులుచెప్పి, వాళ్ళను వదిలించుకునేవాడు. మరి ఇప్పుడు రమేశ్‌బాబు తనకు అల్లాంటి సాకులేవ్న చెబుతాడేమో ? అప్పుడు తనేం చెయ్యాలి ? రమేశ్‌బాబు అలా ఎన్నటికీ చెప్పడని రమానాధుడికి ధృఢమైన నమ్మకం. తనంటే డబ్బులేక సాకులు

చెప్పేవాడు. రమేశ్‌బాబుదగ్గిర డబ్బు మూలుగుతున్నది. అబద్ధాలు చెప్పే అవుసరం ఆయన కేమిటి?"

వెళ్ళిన తమ్ముళ్ళు ఇంకా రాలేదు. రమానాథుడు బయటికి వచ్చి వరండాలోపల పచారుచేస్తున్నాడు. ఎదురుగా రత్తన్ కారు యమదూతలా కన్పిస్తున్నది. రత్తన్ లోపలినుంచి బయటికి వచ్చి, రమానాథుని చూడనట్టుగానే కారులో కూర్చుని వెళ్ళిపోయింది.

రమానాథుడు ఇంకా బయట పచారు చేస్తూనేవున్నాడు. అతని మనస్థితి తామరాకుమీది నీటిబొట్టులా ఏమాత్రం నిలకడలేకండా వున్నది. ఎటునించీ ఏమాత్రం అలికిడిగానీ, శబ్దంగానీ వస్తే తన ఆలోచనల్లోంచి దిగ్గున మేల్కొని తమ్ముళ్ళు వస్తున్నారేమోనని చూస్తున్నాడు. తిరిగి, నిరాశచెంది తనలో తనే గొణుక్కుంటూ, పచారుచేయడం మొదలుపెడుతున్నాడు. 'భగవంతుడి దయవల్ల రమేశ్‌బాబు రెండువందలూ ఇచ్చాడా? ఇంకెందుకూ ముఖాన కొట్టినట్టు ఇప్పుడే పట్టుకుపోయి పారేస్తాను. అయినా, ఆ అడిగేది మణిక్‌లాలునే ఇంకో వంద ఎక్కువ అడిగి, రమేశ్‌బాబుగార్ని ఒక్కవందే అడిగితే బాగుండేదేమో? రమేశ్‌బాబుగారికి సొంతంగా కానీ ఖర్చులేకపోయినా, బావమరుదులు పీక్కుతింటూ వుంటారు. ఒక్క కానీకూడా మిగలనీయరు. మణిక్‌లాల్ దగ్గిర డబ్బుకేమిటి? వూరికే మూలుగుతూ వుంటుంది. ఇవ్వదల్చుకుంటే వెయ్యిఅయినా ఇయ్యగల స్థితిమంతుడు....ఒకవేళ లేదంటే? అంతగా లేదంటే, తరవాత వీళ్ళ పని చెబుతాను. ఈసారి ఆదుకోకపోయాడా ఇక రమేశ్‌బాబుగారితో చస్తే చదరంగం ఆడను. ఇక మణిక్‌లాల్ పనా? నగలు విడిపించుకోవడానికి నా దగ్గిరకు రాకా తప్పదు. గొంతు నులుముకుండానూ వూరుకోను' అనుకుంటుండగానే ఇద్దరు తమ్ముళ్ళూ వచ్చేశారు.

మణిక్‌లాల్, "ప్రస్తుతం నా పరిస్థితి చాలా ఇబ్బందిగా వున్నది. నిన్నే వచ్చి అడుగుదామనుకుంటుండగా మీ తమ్ముడు వచ్చాడు. ఆపదలో సాయపడలేనందుకు విచారిస్తున్నాను" అని వ్రాశాడు.

రమానాథుడు చిన్నతమ్ముడు తెచ్చిన చీటీని చింపి అవతల పారేశాడు.

రమేశ్‌బాబు ఇలా సమాధానమిచ్చాడు: "నేను జీవితంలో కొన్ని నియమాలను నియమించుకున్నాను. వాటి ఆచరణకు ఎలాంటి పరిస్థితిలోనూ భంగం కలగనీయను. వాటిల్లో స్నేహితులమధ్య ఇచ్చి పుచ్చుకోవడంలాంటి వ్యవహారాలు చేయకూడదనేది ఒకటి. ఇంకా నీవు చిన్నవాడివి. జీవితానుభవం లేనివాడివి. కాబట్టి ఈ సమాధానం నీకు నచ్చకపోవచ్చు: నీవు నా ఆత్మీయమైన మిత్రుల్లో ఒకడివి. సాధ్యమైనంత దీర్ఘకాలం నీ మిత్రత్వాన్ని నిలుపుకో గోరుతున్నాను. అందువల్ల అప్పు ఈయను."

రమానాధుడు దీన్నికూడా చింపి అవతల పారేశాడు. చరచరా లోపలికి పోయి, గదిని నాలుగువైపులా ఒకసారి పరికించి ఏమీ చెయ్యడానికి వీలులేక కుర్చీలో కూలబడ్డాడు. ఎదురుగావున్న దీపాన్ని కళ్ళు పెద్దవిచేసి చూడసాగాడు. కానీ, అతనికి దీపం కనుపిస్తున్నదా? లేదా? ఏమో!

చెవులువుండి వినలేని స్థితి, కన్నులువుండీ చూడలేని స్థితి జీవితంలో సంభవమే!

# 18

సాయంత్రం అయింది. మునిసిపాలిటీ ఆవరణ అంతా నిశ్శబ్దంగా వున్నది. గుమాస్తాలందరూ ఒక్కొక్కరుగా వెళ్ళిపోయారు. పాకీవాళ్ళు గదు లన్నీ చిమ్మి శుభ్రంచేస్తున్నారు. కూలీలు, ఇతర చిన్న నౌకర్లూ చెప్పుల్లో కాళ్ళు పెట్టుకుని వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు. కానీ రమానాధుడుమాత్రం ఇంత వరకూ తన ఆఫీసుగదిలోనుంచి బయటికి రాలేదు. ఇంకా లెక్కలు రాస్తూనే వున్నాడు. ఇవ్వాళ అతను రత్తన్‌కి డబ్బు చెల్లించాలి. ఉదయం ఇంటిదగ్గర నుంచి వచ్చేప్పుడు కడసారిగా పెద్దమొత్తం ఏమైనా దొరికితే బాగుండు అను కుంటూ వచ్చాడు. మొదలు గెల్చి, ఇక జీవితమంతా ఓడిపోతూవుండే జూద గాడిలా అయింది అతని పని. ఇవ్వాళ రత్తన్‌కు ఎల్లాగా సమాధానంచెప్పడం అని అతను ఉదయంనుంచీ యోచిస్తున్నాడు. "రత్తన్ తనను ఇంతగా ఖచ్చితంగా అడగడానికికూడా ఒక చిన్న కారణం వుంది. డబ్బు షరాబుకు ఈయకండా నేను ఖర్చుపెట్టుకున్నట్టు ఆమెకు అనుమానం కలిగింది. లేకపోతే ఇంత గట్టిపట్టు పడుతుందా? తను ఏవిధంగానైనా ఈ అనుమానాన్ని తొలిగించగలిగితే, మళ్ళీ కొన్నాళ్ళు ఆగుతుంది. ఒక్కసారి ఆమె డబ్బు ఆమెకు చూపిస్తే, 'తన డబ్బు ఇతరంగా ఖర్చుకాలేదనీ, నిజంగా నగలు చేయడంలో ఆలస్యం జరిగిందనీ' నమ్మకం కలుగుతుంది. ఆ నమ్మకంతో ఆమెను మరికొన్నాళ్ళు ఆపవచ్చును. ఈ లోపు ఏదో ఒక ఏర్పాటుచేసుకుని డబ్బు సర్దుబాటు చేయవచ్చు. ఐతే వూరికే ఒక్కమాటు ఆమెకు చూపించడానికి ఆరువందలరూపాయలు కావాలి, ఎల్లా? తనా విధంగా ముఖాన కొట్టినట్టు చూపించగానే వెంటనే ఆమె ముఖ మాటానికయినా "వద్దు. మీ దగ్గరేవుంచి త్వరగా చేయించండి" అనకమానదు అని దీర్ఘంగా యోచించాడు.

రమానాధుడు ఇంకే ఇతర మార్గము లేకపోవడంచేత పై నిర్ణయాన్నే స్థిర పరుచుకున్నాడు.

ఉదయంనుంచీ వసూలైన డబ్బు ఎనిమిదివందలరూపాయలు అతని దగ్గిర వున్నై. అవి సాయంత్రానికి క్యాషియరుదగ్గిర జమ కట్టాలి. కానీ ఇతను ఎంతకీ రాకపోవడంవల్ల తన టైము ప్రకారము క్యాషియరు వెళ్ళిపోయాడు. రమానాధుడు కావాలనే అలా ఆలశ్యం చేశాడు. అతను వెళ్ళిపోయాడని గట్టిగా తేలేవరకూ జమా ఖర్చులు రాస్తూనే వున్నాడు. అతను వెళ్ళిపోయాడని నిక

రంగా తెల్పిన తరువాత, బంట్రోతును పిల్చి ఇలా అన్నాడు దర్పంగా : "ఈ సంచీని పట్టుకుపద....జమకడదాం."

"వారు వెళ్ళి చాలాసేపయింది" బంట్రోతు అన్నాడు.

"వెళ్ళాడా ఆయన ? అరె....రె....చెప్పలేదేం ? ఎంతసేపైవుంటుంది ?"

"ఈపాటికి ఇంటికి పోయివుంటారు."

"మరి డబ్బు నెలా జమకట్టడం ?"

"పిల్చుకురమ్మంటే పిల్చుకు వస్తాను."

"ఏడ్చినట్టుగా వుంది. ఇంటికి పోయినవారిని పిల్చుకువస్తావా ? సరే ఈ డబ్బును, ఇక్కడే ఈ సొరుగులో వుంచుతున్నాను....బాధ్యత నీదే !"

"వద్దు బాబూ, ఇక్కడ పెట్టవద్దు ! తాళాలుకూడా మంచివి కావు. గ్రాచారం చాలకుంటే నా నెత్తికొచ్చిపడుతుంది !"

"అయితే, ఎక్కడ పెట్టమంటావు ?"

"మీ వెంట తీసుకుపొండి."

రమానాధుడు ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నాడు. వెంటనే ఒక జట్కాను పిలిపించి, రూపాయల సంచీతోసహా ఇంటికి బయలుదేరాడు. దారి పొడుగునా రత్తన్ నెలా డబ్బుచూపి, మభ్యపరచవల్సిందీ ఆలోచించుకున్నాడు.

ఇల్లు చేరగానే డబ్బు చూసి జాలప అడిగింది : "ఏం గాజులు తయారు కాలేదా ?"

"ఇంకా కాలేదు. డబ్బయినా పట్టుకువస్తే ఆమెకు ధైర్యంగా వుంటుందని పట్టుకువచ్చాను."

"అసలు ఏమన్నాడు ?"

"ఇవ్వాళా, రేపూ అంటున్నాడు. ఆమె వచ్చిందా ?"

"వస్తూ వుండాలి. ఆమెకు ఎక్కడా కాలు నిలవడంలేదు."

దీపాలు వెలిగించారు. ఇవ్వాల్టికి ఇక రాదనుకుంటూ, డబ్బు సంచీని లోపలపెట్టి, రమానాధుడు కొంచెం బయటికి పోయాడు. అత నటుపోగానే రత్తన్ వచ్చింది. వస్తూనే, "గాజులు తెచ్చివుండాలి !" అన్నది.

"చిట్టితల్లివి తొడుక్కోలేవని ? తయారుగా చేసివుంచాడు ! పాపం వీరు ఇవ్వాళ నాలుగుసార్లు వాడి చుట్టూ తిరిగారు. ఇంకా నాలుగు రోజులు వాయిదా పెట్టాడుట దౌర్భాగ్యుడు."

"వీ డెక్కడ దొరికాడు ? ఇలా పేచీ వస్తుందని తెలిస్తే, నే నసలు డబ్బు యిచ్చేదాన్నేకాదు. నేను చెబుతున్నాగా, వాడు గాజులూ ఇయ్యడూ, డబ్బూ ఈయడు !"

రత్తన్ స్వరంలో కొంతవరకు రమానాధుడిమీద అవిశ్వాసంకూడా ధ్వనిస్తున్నది. జాలపకు కోపం వచ్చింది. "డబ్బు రెడీగా వున్నది. ఇష్టం వచ్చినపుడు పట్టుకుపో. గాజులంటావా, అతను ఈయంగి మే మెక్కడినుంచి తెచ్చి ఈయగలం?"

"మరి ఫలానప్పటికి ఇస్తానని చెప్పలేదా?"

"ఏమో! ఒకవేళ త్వరలో ఇస్తాననే చెప్పినా నమ్మడానికి వీలులేదు. ఒఠి దొంగముండాకొడుకు."

"అంటే.... ఇక వాడు గాజులుచేసి ఇయ్యడంటావు. అంతేనా?"

"నీ యిష్టం! అలాగే అనుకో!"

"సరే, డబ్బే ఇవ్వు.... నీ గాజులు బంగారంగాను!"

వెంటనే జాలప లోపలినుంచి డబ్బుసంచి తెచ్చి రత్తన్‌ముందు పడేసి గర్వంగా "తీసుకో" అన్నది.

మొదట్లో రమానాధుడిమీద రత్తన్‌కు నిజంగానే అనుమానం కలిగింది. కానీ డబ్బు చూడంగానే ఆ అనుమానం నిరాధారమని తేలిపోయింది. సిగ్గుపడుతూ ఇలా అన్నది: "రెండుమూడు రోజులలో అవి వచ్చేటట్టుగా వుంటే, ఈలోపు నేను పట్టుకుపోవడం దేనికి? నీ దగ్గరే వుంచు!"

"అంత త్వరగా ఇస్తాడని నమ్మకం ఏమిటి? ఇప్పటికి నీ డబ్బు నీవు పట్టుకుపో. అంతగా తయారై తెస్తే అప్పుడే తెచ్చిఇద్దువుగాని."

"అదికాదు జాలప! నా దగ్గిరవుంటే, ఇంకా దేనికయినా ఖర్చయిపోవచ్చు. తీరా గాజులు వచ్చేసరికి డబ్బు లేకపోవచ్చు! అందుకని మీ దగ్గరే వుంచండి."

"మా దగ్గిరా అంతే, ఏ ఖర్చులోనయినా పడవచ్చు! అసలు ఇతర్ల సొమ్ము ఇంట్లోవుంచుకోవడం ఆపదల్ని కొనితెచ్చుకోవడమే. నాకు పెండ్లి అయిన నాలుగవరోజునే పదివేల రూపాయిల నగలు దొంగలు ఎతుకుపోయారు. అది సొంతంగనక సరిపోయింది. ఇప్పుడు నీ డబ్బేగనక అలాపోయిందా? అనవసరంగా నెత్తికి తెచ్చుకోవడం అవుతుంది. కనక మా యింట్లో వద్దు తల్లీ!"

"సరే నేను పట్టుకుపోతున్నాను. అట్లాగని రమానాధుడుగారు మెదలకండా వూరుకుంటారేమో, కొంచం త్వరగా తయారయ్యే ఉపాయం చూడమను."

రత్తన్ వెళ్ళిపోయింది. జాలప నెత్తిమీది బరువు దించుకున్నంతగా సంతోషపడింది. అప్పుడప్పుడూ మన శ్రేయస్సుకోరేవారినుంచే బాధలు సంభవిస్తుంటయ్యి.

రమానాధుడు తొమ్మిది గంటలచాయల ఇంటికి వచ్చాడు. జాలప తను డబ్బంతా ఇచ్చేసినట్టు భర్తకు చెప్పింది.

రమానాధుడు ఒక్కసారిగా స్తంభితుడైపోయాడు. భూమంతా తనను వలయంగా చుట్టుకొని నులిమేస్తున్నట్టనిపించింది. కోపమూ, బాధా కల్సిన స్వరంతో ఇలా అన్నాడు: "ఏమిటీ? రత్తన్‌బాయికి డబ్బు ఇచ్చావా? ఎవరు ఇయ్యమన్నారు?"

"ఆమె డబ్బేగా అది? ఆమెకోసం చాలాసేపు ఎదురుకూడా చూశారుగా? మీరు పోగానే ఆమె వచ్చి గాజులు అడిగింది. నాకు కోపంవచ్చి డబ్బు అవతల పారేశాను."

"అయితే, ఆమె ఇయ్యమని అడగలేదా?"

"ఎందుకు అడగలే? అడిగింది! తీరా డబ్బుతెచ్చి ముందు పడేసేసరికి వుంచమనడం ప్రారంభించింది. అలాంటి అనుమానపడేవాళ్ళ సొమ్ము ఇంట్లో వుంచకూడదు. అందుకనే అవతల పడేశాను."

రమానాధుడి వళ్ళు మండిపోయింది. తమాయించుకుని "ఇక ఎన్నడూ, నన్నడగకుండా ఇలాంటి పనులు చేయక."

"అయితే, ఇప్పుడుమాత్రం మునిగిపోయిం దేమున్నది? పోయి అడిగి పట్టుకురండి. కాకపోయినా ఇతర్ల సొమ్ము మనింట్లో ఎందుకండి.... వెధవపీడ!"

రమానాధుడు మారుమాట్లాడకుండా క్రిందికి వచ్చేశాడు. భార్యను కోప్పడే శక్తికూడా అతనిలో లేదు. డబ్బు రత్తన్‌దేనని తన నోటిమీదుగా చెప్పాడు. పైగా తను లేకుండా ఈయవద్దని మాటమాత్రంగానైనా అనలేదు. అలాంటపుడు జాలపను కోప్పడటం ఏం న్యాయం?

రమానాధుడికి ఏమి చేయడానికి పాలుపోవడంలేదు. ఏదో విధంగా ఈరాత్రే ఆ డబ్బును తెచ్చి ఇంట్లో పెట్టాలి! గడచినదాన్ని గురించి యోచించడంవల్ల ప్రయోజనం శూన్యం! ఆ డబ్బెలా తేవడమో, అదే ముఖ్యం. తను రత్తన్ దగ్గరకు పోయి. "ఈ డబ్బు మీకు ఇయ్యడానికి తేలేదు. షరాబుని బెదిరించడానికి పట్టుకువచ్చాను. అక్కడికీ రెండు మూడు రోజుల్లో తయారుచేసి ఇస్తానని బ్రతిమలాడాడు. అయినా నేను వినలేదు. భయం వుండుగానని పట్టుకు వచ్చాను. రెండు మూడు రోజుల తరువాత తీరా అతను చేసుకురావడం, మీ రీ డబ్బును ఇంకో అందుకు ఖర్చుపెట్టడం జరిగితే, చాలా నామర్దాగా వుంటుంది. కనుక ఆ డబ్బును నాకు ఇచ్చేసెయ్యండి" అని అడిగి, ఆమె దగ్గరనుంచి డబ్బు తిరిగి తేవచ్చును.

రమానాధుడు రత్తన్ దగ్గరకుపోయి డబ్బు తేవడానికి నిశ్చయించుకు న్నాడు. గడియారంవంక చూశాడు. తొమ్మిది గంటలైంది. 'ఈ సమయంలో రత్తన్ ఎక్కడికీ పోదు' అనుకుంటూ సైకిలుమీద బయలుదేరాడు.

రమానాధుడు రత్తన్ బంగళా దగ్గరకు చేరేసరికి, అక్కడ చాలా సంద డిగా వున్నది ఎదురుగావున్న మామిడిచెట్టుకు వుయ్యాల వేసివుంది. చాలామంది పిల్లలు రత్తన్ చుట్టూ గుమిగూడివున్నారు. ఆమె ఒక్కొక్కరుగా అందరినీ వుయ్యాల వూపుతున్నది. రత్తన్‌బాయి తన జీవితంలోని ఒంటరితనాన్ని, దాంప త్యంలో అవ్యవస్థతనూ మర్చిపోవడానికి రోజూ ఏ విందో, ఏ వుత్సవమో చేస్తూ వుంటుంది. వకీలుగారు వీళ్ళకు కొంచెందూరంలో నిలబడి చుట్ట కాలుస్తున్నారు. రమానాధుడు నేరుగా రత్తన్‌దగ్గరకే వెళ్దామనుకుంటుండగానే,వకీలుగారు రెండడు గులు ముందుకువేసి కరస్పర్శచేస్తూ "రండి, ఇటు కూర్చోండి" ఒక కుర్చీలో తను స్వయంగా కూర్చొని, రెండవదానిని రమానాధునికోసం కొంచెం ముందుకు లాగి "మీ మునిసిపల్ బోర్డువిషయాలు ఏమిటీ?" అన్నాడు.

రమానాధుడు వకీలుగారు చూపించిన కుర్చీలో కూర్చుంటూ "కొత్త విశే షాలు ఏమున్నాయండీ" అన్నాడు.

"చుట్టుపట్లవున్న బోర్డులన్నీ ఆడపిల్లలకు విధిగా చదువు చెప్పించాలన్న తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించినయ్యి. మరి మీ బోర్డు ఎప్పు డలాంటి తీర్మానం చేస్తుందండి? ఆడవాళ్ళకు చదువు లేకపోతే, సమాజం ఎన్నటికీ బాగు పడదండి. మీరు యూరోపు పోలేదనుకుంటాను. అక్కడి ఆడవాళ్ళ స్వేచ్ఛా, అణకువ, సౌందర్యం, సభ్యత....ఓ....హో....వేనోళ్ళ పొగడవచ్చు! అంతా ఎలా వచ్చిందనుకుంటున్నారు? చదువువల్లనే!"

తను, సామాన్యంగా ఇక్కడి పత్రికల్లో చదువుతుండే విషయాల ఆధా రంతో ఇలా అన్నాడు రమానాధుడు: "అక్కడి ఆడవాళ్ళ ప్రవర్తన ఏమంత బాగుండదని నా అభిప్రాయం."

"నాన్సెన్సు! మీ అభిప్రాయం పూర్తిగా పొరబాటు. వాళ్ళ దేశాచారాల ననుసరించి వాళ్ళు ప్రవర్తిస్తుంటారు. మన దేశంలో చూడండి, ఒక స్త్రీ పరపురుషు డితో కొంచెం చనువుగా మాట్లాడ్డం మూడోవ్యక్తి కంట బడిందా, ఇక వాళ్ళ కూడు గుడ్డలకుకట్టకమానడు. అక్క డలాకాదు. స్త్రీలూ, పురుషులూ నిరభ్యంత రంగా షికార్లకు పోతారు. సినిమాలకు పోతారు, ఒకేచోట చదువుకుంటారు.అసలు ఎవ్వరూ ఆ విషయాన్ని గురించి పట్టించుకోరు. మనం చాలా సంకుచితమైన స్వభావాలు కలవాళ్ళం, కనకనే అలావుండటం మనకు తప్పుగా తోచింది. వాళ్ళు విశాలమైన హృదయాలు కలవాళ్ళు, అందుకనే వాళ్ళకు తప్పుగా తోచలేదు.

ఆదేశాల్లో పురుషులకూ, స్త్రీలకూ మధ్య స్నేహాన్ని, పరిచయాన్ని అభివృద్ధిచేయ డానికి అనేక విషయాలు వుంటయ్యి. ఉదాహరణకు, సాహిత్యం, సంగీతం, చిత్ర కళ, శిల్పం ఇలాంటివెన్నో విషయాలు వాళ్ళ పరిచయానికి ఆధారభూతాలుగా వుంటాయి. మన దేశంలోనో ? స్త్రీ పురుషుల మిత్రత్వానికి ఆధారం, ఆశయం కూడా కామకళ ఒక్కటే. అందువల్లనే మన బుద్ధులు వక్రించి, అందరినీ మన లాగే అర్థంచేసుకుంటున్నాము. నేను ఒక సంవత్సరం ఇంగ్లండులోనూ, అమె రికాలోనూ వున్నాను. ఎంతోమందితో స్నేహంచేశాను. వాళ్ళతో డాన్సులుకూడా చేసేవాడిని. కానీ, ఆ స్నేహంలో ఇతర భావాలకు ఏ మాత్రం చోటులేదు !"

రమానాధుడికి ఈ మాట లేమీ రుచించడంలేదు. అతను ఇతర ఆలోచనల్లో మునిగిపోయాడు.

వకీలుగారు మళ్ళీ ప్రారంభించారు : "స్త్రీ పురుషులకు తమ తమ మాన సిక భౌతికాభివృద్ధులకు స్వేచ్ఛగా మార్గాలు లభించనంతవరకూ, మన సమాజం ఇలాగే నిత్యం అధోగతిపాలవుతూవుంటుంది....ఇక్కడ నడికారువ్యక్తి రెండో పెళ్ళిచేసుకుంటేనే ఎగతాళిచేస్తారు. వేలెట్టి చూపుతారు. ఇక నాలాంటి వృద్ధుడు చేసుకుంటే వాడిపాట్లు చెప్పనే అవుసరంలేదు ! అక్కడలాకాదు. ముసలి ఆడ వాళ్ళు నవయువకుల్ని పెళ్ళి చేసుకుంటారు. అలాగే వృద్ధులైన పురుషులుకూడా చక్కని యువతుల్ని పెళ్ళి చేసుకుంటారు. ఎవ్వరూ ఆక్షేపించరు. కాకపోయినా ఇతర సహకారాలూ, సానుభూతులూ కావల్సిన సమయం వృద్ధాప్యమే !"

వకీలుగారు చెప్పుకుపోతున్నారు. రమానాధుడి దృష్టంతా వుయ్యాలమీద వున్నది. ఎల్లాగయినా రత్తన్‌తో రెండుమాటలు మాట్లాడాలి. అక్కడికి వెళ్ళి మాట్లాడటం ఏమంత సభ్యతగా వుండదు. చివరకు తెప్పరిల్లుకుని ఇలా అన్నాడు "ఇంతమంది పిల్లలు ఎక్కడనుంచి వచ్చారు ?"

రత్తన్‌కు పిల్లలంటే విపరీతం అయిన ప్రేమ. ఎక్కనుంచి వస్తారో ఆమెను చూడగానే గుంపులు గుంపులుగా ప్రోగుపడతారు. "మీకూ పిల్లలంటే సరదే అనుకుంటాను ? వెళ్తారా ? వెళ్ళండి !"

వకీలుగారి నోటినుంచి మాట బయటికి వచ్చిందో రాలేదో బ్రతుకుజీవుడా అనుకుంటూ రమానాధుడు వుయ్యాలదగ్గరకు పోయాడు.

రమానాధుని చూడగానే రత్తన్ నవ్వుతూ "ఈ పిల్లలు నాదుంప తెంపు తున్నారు. ఎంత వూపినా తృప్తిగాలేదు. కొంచెం మీరు వూపండి, నేను విశ్రాంతి తీసుకుంటాను" అంటూ వుయ్యాల వూపేదల్లా వదలి, పక్కనే వున్న అరుగు మీద కూర్చున్నది.

రమానాథుడు ఇష్టం లేకపోయినా మనస్సులో బాధపడుతూనే ఉయ్యాల వూపడానికి వచ్చాడు. అంతవరకూ వూగి, అలిసికూర్చున్న పిల్లలుకూడా కొత్త వ్యక్తి రావడంతో మళ్ళీ ఊగడానికి తయారయ్యారు.

అరగంట గడిచింది. రమానాథు బాగా అలిసిపోయాడు. గడియారంలో టైము చూస్తే తొమ్మిదిన్నర అయింది. తను వచ్చినపని ఎల్లాగా ఆమెతో చెప్పడం? అనుకుంటుండగానే రత్తన్ వచ్చి వుయ్యాలలో కూర్చుని "కాసేపు నన్ను వూపండి. క్రిందవుండికాదు, వుయ్యాల ఎక్కి!" అన్నది.

రమానాథుడు ఎన్నడూ వుయ్యాల ఎక్కలేదు. ఉయ్యాల ఎక్కితే అతనికి కళ్ళు తిరుగుతయ్యి. అయినా తప్పదు. తను వుయ్యాలమీద ఎక్కి ఉంగు టుయ్యాల వూపడం ప్రారంభించాడు. రత్తన్ వూగుతూ పాటపాడుతున్నది.

మన్మధుని సతి
రతి
ఊగనే వచ్చింది
ఉయ్యాల!
అది చూసి
మాట విననంటుంది
మారాముచేసింది
ఉయ్యాలా!

ఉయ్యాల వూపుతూవుంటే అతని కాళ్ళు వణకసాగినయ్యి. ఎంత ప్రయత్నించినా వణుకు ఆగటంలేదు.

రెండు క్షణాలు పోయింతరువాత "అచ్చే.... ఇలాగా? కొంచెం పెద్ద వూపులు వూపండి" అన్నది రత్తన్.

సిగ్గూ అభిమానం కల్సిన ఒకరకమైన పట్టుదలతో రమానాథుడు శక్తినంతా కూడగట్టుకొని పెద్దగా వూపసాగాడు. అతనికి తలతిరగడం ఎక్కువయింది.

"మీకు బొత్తిగా కుదరడంలేదు. ఎప్పుడూ వుయ్యాల ఎక్కలేదా?"

"లేదండి. ఎప్పుడో చిన్నతనంలో వూగిన జ్ఞాపకం!"

"అయితే మీరు కూర్చోండి. నేను వూపుతాను. చివారు కొమ్మలకు తగలాలి! రేపు జాలపనుకూడా పట్టుకురండి. ఇద్దరం వూగుతాము!" నవ్వుతూ అన్నది రత్తన్.

రమానాథుడు వుయ్యాలదిగి సైకిల్ ఎక్కి ఇల్లు చేరుకున్నాడు. పది నిమిషాలవరకూ సైకిలు తొక్కుతున్నా, వుయ్యాలమీద వున్నట్టుగానే వున్నది.

ఎక్కడికి పోతున్నదీ, ఎక్కడనుంచి వస్తున్నదీ బొత్తిగా మర్చిపోయాడు. కాళ్ళు మాత్రం అలవాటుప్రకారం పెడల్‌ని తిప్పుతున్నై.

కొద్దిసేపటి తరువాత మామూలుస్థితికి వచ్చి ఆలోచించసాగాడు. "ఎంత పొరపాటు చేశాను! ఎంత చక్కని అవకాశాన్ని చేతులారా పాడుచేసుకున్నాను! ఆమెతో మాటమాత్రం డబ్బు విషయం ఎందుకనలేకపోయాను? మీకు ఇచ్చిన డబ్బు ఇయ్యండి, రేపు గాజులు రాబోతున్నై అంటే తెచ్చి ఇచ్చేదిగా. పైగా దాన్లో అధికంగావున్న రెండువందలవిషయమైనా చెప్పలేదు. ఇంతవరకూ ఆమెకూడా లెక్కచూడనట్టుగా వుంది. కొంపముంచి ఆపట్న ఆరు వందలే అనే అభిప్రాయంతో ఇంకెవరికైనా ఇచ్చేస్తుందేమో? లేక తనడబ్బులో కలుపుకుంటుందేమో! పోనీ, ఇప్పుడే వెనక్కుపోయి అదనపు డబ్బు అడిగితే? బాగుండదు. ఉదయాన్నే కబురు పంపుతాను. అయినా యింకో ఐదువందలు వుంటేకదా ఆఫీసుకు పోవడం! ఎక్కడనుంచి వచ్చేట్టు?' ఇట్లా ఆలోచిస్తూ రమానాధుడు ఒక్కసారి కంపించిపోయాడు.

నిరాశలోకూడా ఆశ అనేది సూర్యకిరణంలా స్వల్పంగానైనా జీవితాన్ని అంటుకుని వస్తూవుంటుంది. ఇంటికి వెళ్తున్న రమానాధుడు 'అయినా ఒకమాటు గంగూ దుకాణందగ్గిరకు పోయివద్దామని' షరాబు బజారుకు పోయాడు. అప్పటికే గంగూ దుకాణం కట్టేసి ఇంటికి పోయాడు. తిరిగివస్తుండగా చరణదాసుడు యెదురయ్యాడు.

"ఏం బాబూ! ఆ తరువాత ఈ బజార్న రావడమే మానేశారు? డబ్బు ఎప్పుడిస్తారు?" అనడిగాడు చరణదాసుడు.

రమానాధుడు వినమ్రుడై "కొద్ది రోజుల్లో ఇచ్చేస్తాను. మొన్న గంగూ బాకీ చుప్తా చేశాను. ఈసారి నీ బాకీ...." అన్నాడు.

"ఆ కథంతా మాకు తెల్సులెండి! తెలివికలవాడు కనుక యుక్తిగా రాబట్టుకున్నాడు. లేకపోతే, మాలాగే పడివుండివల్సివచ్చేది. సంవత్సరం కావల్సివస్తున్నది. ఒక్క కానీకూడా చెల్లుపడలేదు. వందకు రూపాయి చొప్పున వడ్డీ కట్టుకున్నా, ఈసరికి ఎనభై రూపాయలు అయ్యేది.... ఇక ఇలా బాగుండదండి. రేపువచ్చి కొద్దో గొప్పో చెల్లువేసిపొండి! కాకపోయినా ఇచ్చి పుచ్చుకుంటూ వుంటే వ్యాపారాలకి లాయకీగా వుంటుంది. ఈవిధంగా అసలు ముఖమే చూపకపోతే, అనుమానం పుట్టుకువస్తుంది.... అయితే రేపు వస్తారా?"

"చూడు తమ్ముడూ! రేపు డబ్బురాదు. ఊరికేవచ్చి లెక్కలు చూసుకోమంటే నా అభ్యంతరం ఏమీలేదు.... చూడూ! ఓ చిన్నపని చేసిపెడతా? చాలా అవుసరంగా కావాలి, మీ యజమానిచేత ఒక్క ఐదువందలు ఇప్పించు. మళ్ళీ

వారంరోజుల్లో తిరిగి ఇచ్చేస్తాను....అప్పుడు నీక్కూడా ఓ మంచి పారి తోషికం....!"

"ఆ....హా....ఏమడుగుతున్నారండి? మా యజమాని మీకు ఇంక ఒక్క చిల్లిదమ్మిడీకూడ అప్పు ఈయడు. నేను ఆపుతున్నాను. లేకపోతే ఈ సరికి మీ మీద దావాకూడా వేసివుండును! మీ గురించి నేను రోజూ చీవాట్లు తింటు న్నాను. ఇదంతా దేనికి, మీరు మర్యాదగా ఇస్తారా? లేక మీ నాన్నగారికి చెప్ప మంటారా?"

"నీకు ఇయ్యవల్సింది నేనుకదా? మా నాన్నగారితో పనేమిటి? కాక పోయినా, నే నేం వూరువిడిచి పోతున్నానా?"

"మీరు వూళ్ళో వుండండి, లేకపొండి, మా కదంతా అనవసరం! రేపు కనీసం రెండువందలైనా జమ కట్టండి. రోజూ సంపాయించే డబ్బంతా ఏం చేస్తున్నారండి, లేదంటారు? రేపు మా మనిషిని పంపుతాను. తప్పక ఇవ్వాలి!"

రమానాధుడు ఇక సమాధానం ఈయకండానే ముందుకు నడిచాడు. ఏమైనా వుపయోగం వుంటుందేమోనని బజారుకు వచ్చాడు. వుపయోగం లేకపోతే పోయింది. కొత్తఆపదవచ్చి నెత్తిన పడ్డది. ఇతను నిజంగా తన తండ్రితో చెప్పేట్టుగనకైతే, ఇంటిదగ్గర పెద్ద రభస జరుగుతుంది. దాంతో జాలపకుకూడా తన అసమర్ధత తెలిసిపోతుంది.

పైకి రమానాధుడు కళ్ళనీళ్ళు పెట్టుకోవడం లేదన్నమాటేగాని, అతని హృదయంమాత్రం ఘోరంగా క్షోభిస్తున్నది. యధార్ధమైన పరిస్థితిని జాలపకు చెప్పకండా, దాచినందుకు విపరీతంగా చింతిస్తున్నాడు. జాలప తెలివికలది. సమయస్ఫూర్తితో వ్యవహరించగలదు. సంసారపు ఆర్ధికస్థితి నిజంగా ఆమెకు తెల్సివుంటే అప్పు చేయనిచ్చేదేకాదు. కాకపోయినా ఇంత పెద్ద ఋణభారాన్ని నెత్తిన వుంచుకునికూడా, అతను పొదుపు నేర్చుకోలేకపోయాడంటేనే ఆశ్చర్యం. ఈ సంవత్సరంలో అతని ఆదాయం దాదాపుగా వెయ్యికిపైనవున్నది. ఏమాత్రం పొదుపరిగావున్నా కనీసం ఐదువందలు వెనకవేసేవాడు. కాఫీలకూ, సిగరెట్లకూ, కల్పితమైన మర్యాదలను నిలుపుకోవడానికి వందలు వందలు తగలేశాడు. ముందు గొయ్యిపెట్టుకుని కళ్ళుమూసుకు నడిచేవాళ్ళ మూర్ఖత్వాన్ని ఏమనాలి!

ఈ సంవత్సరంలో తను పెట్టిన అనవసరపు ఖర్చుల్ని గురించి బాగా పరి తాపపడ్డాడు. అతని శక్తిసామర్ధ్యాలు అందరికీ తెల్సు. జాలపదగ్గిరమాత్రం గొప్ప అనిపించుకోవడానికి చేసిన ఆడంబరాలకు బాగా కించపడ్డాడు. నిజం

గానే, మనం మన బలహీనతలు లోకమంతా వెల్లడైనా సహిస్తాముగానీ, చేసుకున్నవాళ్ళదగ్గిర వెల్లడవడాన్నిమాత్రం సహించలేము.

ఇంటికి రాగానే "ఎక్కడికి పోయారు.... ఇంత ఆలస్యం అయింది" అనడిగింది జాలప.

"నీవు చేసినపనికి ఇప్పుడు రత్తన్‌వాళ్ళ ఇంటిదాకా పోవల్సివచ్చింది. కళ్ళుమూసుకుని అన్నీ ఇచ్చేస్తివి. వాటలో నావికూడా రెండువందలు వున్నై!"

"ఆ విషయం నాకేం తెల్సు? పోనీ, చెప్పన్నా పోయారా? మాటామంచీ ఏమీ లేకుండా అక్కడ పెట్టిపోతిరి. నే నేమో మొత్తం ఆమెదే అనుకుని ఇచ్చేశాను! అయినా ఎక్కడకీ పోదులెండి, తిప్పి పంపుతుంది."

"తిప్పి పంపుతుందనీ, డబ్బెక్కడికీ పోదనీ నాకూ తెల్సు! అది ఆఫీసు డబ్బు. రేపే జమకట్టాలి. ఎప్పుడో ఆమె పంపేవరకూ ఎల్లా?"

"అయితే, రేపు మీరు ఆఫీసుకు పోయేప్పుడు నాకు గుర్తు చేయండి. నేను ఇస్తాను. నా దగ్గిర రెండువందలు వున్నై."

రమానాధుడికి నమ్మకం కలగలేదు. "నిజం? రెండువందలు? ఎక్కడిదీ ఇంత డబ్బు?"

ఎక్కడిదో ఒక్కడిది. అదంతా మీ కెందుకు? నేను ఇస్తానన్నానుకద?"

రమానాధుడికి పోయిన ప్రాణాలు వచ్చినయి. ఆఫీసులో ఎనిమిదివందలు కట్టాలి. జాలప రెండువందలు ఇస్తుంది. రత్తన్‌దగ్గిరివి రెండువందలు. కలిపి నాలుగువందలు. పోతే తన దగ్గిరవున్న వందతోకూడా ఐదువందలు. మిగిలిన మూడువందలు ఏంజేసేట్లు? రత్తనే గనక మొత్తం డబ్బు పంపించిందా, ప్రస్తుతాని కీ గండకత్తెరను తప్పించుకోవచ్చును!

భోజనాలుచేసి పడుకున్న తరువాత "ఏమిటీ ఆలోచిస్తున్నారు?" అనడిగింది జాలప.

"ఏమీ లేదు."

"లేకపోవడం యేం? మీ ముఖం చూస్తే తెలియడంలా?"

"ఏమైనావుంటే నీకు చెప్పనా?"

"నాతో ఎందుకు చెబుతారులే!"

కొంతసేపటి తరువాత ఇద్దరూ నిద్రపోయారు. సగం రాత్రివేళ జాలప నిద్రలో అరవడం, కేకలువేయడం ప్రారంభించింది.

"జాలపా! ఏమి టలా అరుస్తున్నావు? ఏదైనా కల వచ్చిందా?"

జాలప నిద్రలేచి వణికిపోతూ, "అవును. చాలా చెడ్డ కల.... మనం చాలా కష్టాల్లో పడిపోయాం."

"ఏమి టా కలా !"

"ఏం చెప్పను....మాట పెగలడంలేదు. మిమ్మల్ని పోలీసులు పట్టుకు పోయారుట...."

రమానాధుడి గుండెల్లో రైళ్ళు పరుగెత్తినయ్యి. కొన్ని కలలు నిజం అవుతుంటయ్యి. ఇది నిజమౌతుందేమో! ఇదే కల నాలుగురోజులక్రితం వచ్చినట్టయితే లెఖ్ఖచేసేవాడు కాదు. పైకి నవ్వుతూ యిలా అన్నాడు :

"మరి వీరి నెందుకు పట్టుకుపోతున్నారని అడక్కపోయా?" అని నవ్వాడు.

"మీకు నవ్వులాటగా వున్నట్టుంది. నా గుండె దడ ఇంకా తీరలేదు."

కొంతసేపటి తరువాత రమానాధుడు స్వయంగా కలవరించసాగాడు. "అమ్మా, ఇప్పుడే చెబుతున్నాను, నే నెందులోనైనా పడిచస్తాను! ఇక ఎన్నటికీ కంటికి కనిపించను" అంటున్నాడు.

జాలప యింకా నిద్రపోలేదు - భర్తను తట్టి లేపి "నేను అరిచానని హేళనచేస్తుంటిరే? మీరు కలవరిస్తున్నారేం? కలకన్నారా?" అన్నది.

"అవును....ఏం కలో జ్ఞాపకం రావడంలేదు."

"ఏమిటో, మీ అమ్మగారిని బెదిరిస్తున్నారు."

జ్ఞాపకం చేసుకోడానికి కొంత తలగోక్కుని, "వూహుం, ఏమీ జ్ఞాపకం రావడంలేదు....మొత్తానికి ఏదో అరిచివుంటాను!" అన్నాడు.

"సరే, పోనీయండి. పక్కకు ఒత్తిగిలి పడుకోండి. ఎల్లికిలా పడుకుంటే పీడకల లొస్తయ్యి."

రమానాధుడు పక్కకు తిరిగి పడుకున్నాడు. ఇక నిద్రపట్టలేదు. భయమూ, అనుమానమూ పట్టుకుని నిద్ర రానీయందే? పక్కనేవున్న గడియారం రెండు కొట్టింది. జాలప లేచి, మరచెంబులో నీళ్ళు కాసిని గొంతులో పోసుకుని భర్తవంక చూసింది. అత నింకా మేల్కొని వున్నట్టు తెల్సుకొని "ఏమిటి, ఇంకా మేల్కొనే వున్నారా?" అన్నది.

"నిద్రపట్టడంలా! నీ దగ్గర రెండువందలు ఎక్కడివా అని ఆలోచిస్తున్నాను."

"నేను మా ఇంటిదగ్గరనుంచి తెచ్చుకున్నాను. దీన్లో కొంత వప్పగింతలప్పుడు యిచ్చింది. కొంత అంతక్రితమే నా దగ్గర వున్నదీనూ!"

"అయితే, నువ్వు రూపాయలు కూడబెట్టటంలో మంచి నేర్పరివన్నమాట. మరైతే, ఇక్కడకూడా కూడపెట్టవేం?"

"మిమ్మల్ని చూసిం తరువాత అదికూడా మర్చేపోయాను!" నవ్వింది జాలప.

"అవునులే, మనస్సులో ఈ దౌర్భాగ్యుడు నా కెందుకు దాపరించాడా అని తిట్టుకుంటూ వుంటావు!"

"ఎందుకు తిట్టుకుంటాను. మీ రేమైనా కుంటివారా? గుడ్డివారా? లేకపోతే, సోమరిపోతుగా బజార్ల వెంట తిరుగుతున్నారు గనకనా? మనసుకు నచ్చిన మనువు గనక అయితే, ఆడవాళ్ళు నిత్యదరిద్రాన్ని అనుభవించడానికయినా సిద్ధ పడతారు!"

"అయితే, నేను నీ మనస్సుకు నచ్చునంటావు. అంతేనా?" అన్నాడు వినోదంగా.

"నచ్చటమే కాదు....దోచుకున్నారు! నా స్నేహితురాండ్రందరిలోకీ నేనే ఇంత అదృష్టవంతురాల్ని!"

ఈ మాటలు విని రమానాథుడు ద్రవించిపోయాడు. ఇంత ప్రేమ చూపే భార్యదగ్గిర యిలా ప్రవర్తిస్తున్నందుకు తనను తనే నిందించుకున్నాడు. తన ప్రవర్తన నిష్కపటంగా వుంటే, జీవితం ఎంత మధురంగా వుండేదో వూహించుకుని, మొదట్లోనే ఈ జ్ఞానం వుంటే ఎంత బాగుండును? అని చింతించాడు.

# 19

ఉదయాన్నే రమానాధుడు రత్తన్ దగ్గరకు, ఒక చీటీ రాసి నౌకరుచేతికి ఇచ్చి పంపించాడు. "జాలప నాకు తెలియకుండా మీకు డబ్బు ఇచ్చేసింది. ఇన్నాళ్లు ఎదురుచూసిన తరువాత మీకు తిరిగి డబ్బే ఈయడం — గాజులు ఈయకుండా — నాకు మహాకష్ట మనిపించింది. అసలు నే నా డబ్బు మీకు యిద్దామనే ఉద్దేశ్యంతో తేలేదు. షరాబుని మందలించినట్లుగా వుంటుందని పట్టుకువచ్చాను. రెండు మూడు రోజులలో గాజులు వచ్చేస్తున్నై. మీరు వెంటనే డబ్బు పంపించండి. మరో విషయం; దాన్లో నావి రెండువందలున్నై. అవికూడా పంపించండి. ఇదీ చీటిలో విషయం.

తను పంపిన నౌకరు తొమ్మిది గంటలకు తిరిగివచ్చాడు. రత్తన్ తన రెండువందలైతే పంపించిందిగాని, చీటీ కేవిధమైన సమాధానమూ ఈయలేదు.

రమానాధుడు దిగులుగా, నిరాశగా ఒకమాటు ఆకాశంవైపు చూశాడు. రత్తన్ ఇలా ఉత్తరానికి సమాధానం అయినా ఈయకపోవడం అతనికి కొంత ఆశ్చర్యాన్నికూడా కలిగించింది. చదువుకున్నదీ, వ్యవహారజ్ఞానం కలదీ అనుకున్నాను. ఇలా ఉత్తరానికి సమాధానం యివ్వవల్సివుంటుందనే సామాన్యనాగరిక నియమాన్నయినా పాటించని మూర్ఖురా లనుకోలేదు. అదీకాక, రాత్రి అంత చక్కగా, నమ్రతగా వ్యవహరించిన వ్యక్తి ఉదయానికల్లా ఎందుకిలా ఉత్తరానికి సమాధానంకూడా ఇయ్యనంత కఠినంగా మారిపోయిందో అర్థంకాదు!" అని అనుకుని, మిగిలిన డబ్బుసంతనను గురించి ఆలోచించడంలో మునిగి పోయాడు.

ఉత్తరాన్ని తీసుకుపోయి డబ్బుతెచ్చిన నౌకరు ఇంకా అక్కడే నిలబడి వున్నాడు. జాలప లోపలినుంచి వస్తూ "ఉదయంనుంచీ ఎక్కడికి పోయావురా? పది కావస్తోంది. ఇంతవరకు కూరలైనా పట్టుకురాలేదు" అన్నది.

"నాకేం నాలుగు కాళ్ళు, నాలుగు చేతులూ వుండయ్యంటుండీ? బాబుగారు డబ్బుకోసం పంపితే పోయి ఇప్పుడేగందా, ఆ పని ముగించుకుని వస్తుంటిని!" కోపంగా సమాధానం ఇచ్చాడు పనివాడు.

"ఎవరి దగ్గిరకు?"

"మోటా రెక్కి వస్తుండలేదంటండి? ఆ అమ్మగోరి దగ్గిరికి"

"అయితే, తెచ్చావా డబ్బు?"

"ఎందుకు తేనుండి? పరుగునపోయి తెచ్చినోను!"

"సరే, చప్పున వెళ్ళి కూరలు పట్టుకురా."

నౌకరు కూరలకువోయిన తరువాత, జాలప రమానాధుడితో ఇలా అన్నది: "అయితే, మీరు రతన్ దగ్గిరనుంచి డబ్బు తెప్పించుకున్నారుగా? ఇక నా డబ్బుతో పనిలేదనుకుంటా!"

రమానాధుడు అతినిరాశగా, ప్రవాహంలోకి కొట్టుకుపోతున్నవాడిలా "సరే ఇవ్వకు" అన్నాడు.

"అది కాదండి, నేను ఇస్తానన్నానుగా! పొద్దున్నే మనిషిని ఎందుకు పంపారు? ఏమనుకుంటుందో!"

"నేను డబ్బు పంపమనలేదు. ఊరికే, సంచీలో డబ్బు ఎక్కువవున్నదని మాత్రమే తెలియజేశాను। ఇక ఆమె తనంతట తనే పంపింది."

"అయితే, నా రూపాయలు చాలాగట్టివి. ఎంతో కష్టపడి అన్నీ కొత్తవి పోగుచేసుకున్నాను. ఎంత చక్కగా వున్నై అనుకున్నారూ! చూపించేదా?"

ఇంతలో బయటినుంచి ఎవరిదో గొంతు వినిపించింది."బాబుగారూ! సేటు గారు డబ్బు తెమ్మని పంపించారు."

అప్పుడే స్నానంచేసి బయటికివస్తున్న దయానాధుడు ఇది విని "ఏ సేటూ? ఏం డబ్బు? మేమెవ్వరికీ బాకీలేదే!" అన్నాడు.

"చిన్నబాబుగారు సంవత్సరంపైనయింది నగలుపట్టుకువచ్చి. ఇంతవరకూ దమ్మిడీ అయినా ఇయ్యలేదు. మాట పోగొట్టుకున్న తరువాత ఇచ్చిమాత్రం ప్రయోజన మేమిటి? ఇవ్వాళ కొద్దిగానైనా జమవేయించండి!"

దయానాధుడు కొడుకుని పిల్చి "ఇత నెవరో చూడు, ఏదో డబ్బు బాకీటగా, ఎందుకనీయలా ఇంతవరకు? అసలు బాకీ ఎంత?" అడిగాడు.

రమానాధుడి సమాధానం రాకముందే "ఏడువందలు....పూర్తిగా దమ్మిడీ తక్కువలేకుండా ఏడువందలు!" అన్నాడు గుమాస్తా.

దయానాధుడి కండ్లు పెద్దవయినయ్యి. "ఏమిటీ, ఇత ననేది నిజమేనా?" అన్నాడు.

రమానాధుడు తప్పుకుందామనే ఉద్దేశ్యంతో "ఏమో, నాకు సరీగా జ్ఞాపకం లేదు!" అన్నాడు.

"అయినా, పొరపాటు రాదు. ఇదిగో, లెఖ్ఖల పుస్తకం నాదగ్గిరే వుంది. కావాలంటే చూసుకోండి!" అన్నాడు గుమాస్తా.

రమానాధుడు గుమాస్తామీద మండిపడ్డాడు. "సరే, నీవు పో. నేను కొట్టు దగ్గరకు వస్తాను!"

"అట్లా కుదరదండి బాబుగారు. డబ్బు వసూలు కాకుండాపోతే సేటుగారు కోప్పడతారు. మీరు డబ్బు ఇవ్వాలి, నేను పోవాలి!"

దయానాథుడు జీవితంలో ఎన్నడూ ఇతర్ల చేత మాట పడలేదు. ఇతర్ల సొమ్ము విషంలా చూస్తూ వచ్చాడు. అప్పుచేసి తినడంకంటే, చావడం అతని దృష్టిలో చాలా తేలికైన విషయం. అలాంటి తండ్రికి తన చర్యలవల్ల ఆత్మక్షోభ కలిగించడం అతని కేమీ ఇష్టంలేదు. కర్కశంగా అన్నాడు: "ఇంకా కదలవేం? మర్యాదగా పోతావా, పో. లేదా మెడపట్టుకు నెడతాను!"

"డబ్బివ్వండి....మీరు శ్రమపడకుండానే వెళ్ళిపోతాను."

"అయితే, నీవు వెళ్ళవన్నమాట? పో! నే నియ్యను, దావావేసుకోమను, చెప్పు పో! మీ సేటుకు చెప్పు!"

దయానాథుడు అందుకున్నాడు: "ఏమిట్రా ఆ పెడసరం మాటలు? అసలు డబ్బులేకండా నగలు ఎందుకు తీసుకోవాల్సివచ్చింది? పోనీ,తీసుకున్నావే అనుకో, త్వరగా తీర్చకుండా ఇన్నాళ్ళు ఎందుకు వుంచావు? నీ సంపాదన తిప్పించి మళ్ళించి లెక్కలేసినా పదిరూపాయలు లేదుకదా, ఇంత అప్పు ఏ ధైర్యంతో చేశావు? మీ ఆవిడమాత్రం నీ విలా అప్పుచేస్తుంటే వద్దనక ఎలా తీసుకున్నదిరా తెచ్చిందే చాలని? పైగా కోర్టులకు పొమ్మంటా? కోర్టులకుపోతే, ఎవరి పరువు బజార్ల పాలవుందో తెల్సా?" అన్నాడు కోపంగా.

తండ్రి అలా మాట్లాడటం రమానాథుడికి చాలా కష్టాన్ని కలిగించింది, "మీరు అనవసరంగా మధ్యలో ఎందుకు అందుకుంటారు? మిమ్మల్ని డబ్బు అడిగినప్పుడు మీరు మాట్లాడండి;నా జీతంలో నే నెలాగో మిగిల్చి తీరుస్తాను?" అన్నాడు రమానాథుడు. తండ్రీ కొడుకుల ఈ వాగ్వాదం ముదిరేట్టుగా కనిపించే సరికి, గుమాస్తా తన దారిన తాను పోయాడు. దయానాథుడుకూడా గొణుక్కుంటూ సంధ్య వార్చుకోవడానికి పోయాడు. రమానాథుడు మాత్రం తలవంచుకుని పైకి పోయాడు. అతని ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు. దాయడానికి పడిన పాట్లన్నీ వ్యర్థమైనయ్. ఒక్కక్షణంలో బయటపడిపోయింది. ఈ గొడవలో అతను మునిసిపాలిటీ డబ్బు విషయం మర్చేపోయాడు.

పైకి పోగానే జాలప అడిగింది: "అంతా తీర్చేశాను. కొద్దిగామాత్రమే వున్నదంటిరిగా?"

రమానాథుడు తలవంచుకుని "వీడు ఒట్టి దొంగముండాకొడుకు. అబద్ధం చెబుతున్నాడు. నేను చాలాభాగం తీర్చేశాను" అన్నాడు.

"ఇస్తే ఎందుకు వస్తారు? ఆదాయం తక్కువైనప్పుడు ఎందుకీ నగలు తీసుకున్నారు? నగలు కావాలని నేను ఎన్నడైనా అడిగానా? ఒకవేళ అడిగినా పరిస్థితుల్నిబట్టి వ్యవహరించుకోవాలి గానీ ఇలా అప్పులు చేసుకుంటారా? ఎవరైనా, తన పరిస్థితుల్ని బయటదాచుకుని, భార్యకు చెప్పుకుంటారు. మీ రలా కాదు, నా దగ్గరే దాస్తున్నారు! ఆదాయం తక్కువని తెలిస్తే నేను నా

ఖర్చులన్నీ మానుకునేదాన్ని. ఈ సినిమాలు ఇవన్నీ మానేసేదాన్ని. నిజంగా దావా వేస్తే మన పని ఏం కావాలి చెప్పండి? నేను మీకు భార్యను. మీ మంచి చెడ్డల్లో నాకు భాగం వున్నది. ఒకవేళ మంచి విషయంలో మీరు నా భాగాన్ని హరించినా, చెడ్డ విషయంలోమాత్రం నా పాలు నన్ను పంచుకోనీయండి."

జాలప మాటలకు రమానాధుడు ఏమీ సమాధానం ఈయలేదు. తలవంచుకుని వింటూ నిల్చున్నాడు.

ఆఫీసుకు పోయే టైము అయింది. భోజనం చేయడానికికూడా అవకాశం లేదు. అందువల్ల భోజనం చేయకుండానే బయలుదేరాడు రమానాధుడు. అది చూసి తల్లి కేకవేసింది. "ఏమిట్రా, భోజనం చేయకుండానే వెళ్తున్నావు?"

రమానాధుడు తల్లి కేకకు సమాధానమైనా ఈయకుండా బయలుదేరాడు. జాలపని డబ్బు అడగలేదు! అడిగితే ఇస్తుందని తెల్సు! కానీ, ఇన్ని మాటలూ పడ్డ తరువాత ఇక డబ్బు అడగడానికి సాహసించలేకపోయాడు. ఒకవేళ అడిగితే మళ్ళీ ఎక్కడ ఉపదేశం ప్రారంభిస్తుందోననే భయంకూడా లేకపోలేదు అతనిలో.

నాలుగడుగులు వేయగానే జాలప పిలుపు వినిపించింది. వెంటనే ఆగి "సరే, ఇవ్వు!" అన్నాడు రమానాధుడు.

రమానాధుడు బయటి వరండాలో నిలబడ్డాడు. జాలప పైనుంచి డబ్బు తెచ్చి ఒక్కొక్కరూపాయీ లెక్కపెట్టి రెండువందలు అతనిసంచిలో పోసింది. ఈ డబ్బు చూడటంతో భర్త విచారం మాయమైపోతుందనీ, అతని పెదాలమీద చిరునవ్వు నాట్యం చేస్తుందనీ మధురమైన కల్పనలలో ఒక్క క్షణం మునిగి తేలిందామె. కానీ, డబ్బు సంచిలో పోసిం తరువాతకూడా రమానాధుడి ముఖం యధాస్థితిగా, విచారంగానే వున్నది. మిగిలిన మూడువందలనిగురించి విచారం, దుఃఖం అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నై. బాగా ఆకలిగొనివున్న వ్యక్తి వో రెండు మెతుకులు కొరికి సంతుష్టిపడగలడా!

రోడ్డుమీదికి వచ్చిం తరువాత రమానాధుడికి ఒక ఆలోచన తట్టింది. ఒకసారి రత్తన్ దగ్గిరకుపోయి, అభిమానమూ, సిగ్గూ ఒక్క క్షణకాలం దూరంగా వుంచి 'ఒక మూడువందలు కావాలి ఇవ్వండి" అని అడుగుదాం అనుకున్నాడు. ఇక అభిమానపడితే జరగదని గట్టిగా తీర్మానించుకుని ఒక గుర్రంబండిని పిల్చి "జార్జిటౌనుకు పోనియ్యి" అన్నాడు.

పదినిమిషాల్లో జార్జిటౌన్ వచ్చింది. రత్తన్‌బాయి బంగళాకూడా వచ్చింది. రత్తన్ వరండాలో కూర్చున్నది. రమానాధుడు బండిలో వుండే, చేయి పైకి యెత్తాడు అభివందనం చేస్తున్నట్టు. ప్రత్యభివందనానికి రత్తన్‌బాయీకూడా

చేయి యెత్తింది. బండి వేగంమాత్రం ఏమీ తగ్గలేదు. చూస్తూవుండగానే బంగళా వెనకపడిపోయింది. అతను ఇంటిదగ్గర్నుంచీ కూడగట్టుకువచ్చిన ధైర్యమంతా ఉదయపు పొగమంచులా వీడిపోయింది. ఆమె లోపలికి రమ్మన్నట్లయితే తమ బండి ఆపిపోయేవాడే. లేక ఆమె అసలు వరండాలో లేకపోయినా నేరుగా ఇంట్లోకి పోయేవాడే. ఎదురుగావుండి పిలవకపోయిన తరువాత ఇంకెలా పోవడం?

బండి గవర్నమెంట్ హౌస్‌దగ్గరకు పోయిన తరువాత "పొరపడ్డాం. బండిని మున్సిపల్ ఆఫీసుకు పోనియ్యి" అన్నాడు రమానాథుడు.

బండి వెనక్కు తిరిగింది.

పన్నెండుగంటలా ప్రాంతాన ఆఫీసు చేరుకున్నాడు రమానాథుడు. ముఖం వెలాతెలా పోతున్నది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నై. ఈ ఆలస్యానికి రమేశ్‌బాబు ఏమంటాడో అన్న భయం ఎక్కువైంది. రమేశ్‌బాబు ఆఫీసులో ఎల్లాంటి ముఖమాటాన్నీ వుంచడు. చాలా ఖచ్చితంగా వుంటాడు. రమానాథుడు భయపడుతూ ఒక్కమాటు తన ఆఫీసు గదివంక చూశాడు. గదినిండా మనుషులు నిండారు. వాళ్ళంతా తనకోసమే ఎదురుచూస్తున్నారు. కాని, ఆగిపోకుండా నేరుగా రమేశ్‌బాబు గదిలోకి పోయాడతను.

చూస్తూనే, రమేశ్‌బాబు "ఇప్పటివరకూ ఎక్కడికి పోయావు? క్యాషియరుగారు నీకోసం వెతుకుతున్నారు. మీ ఇంటికి మనిషినికూడా పంపించారు కనబడలా?" అన్నాడు.

"నేను ఇంటిదగ్గర లేనండి. వకీలుగారింటికి పోయాను. ఒక పెద్దచిక్కు వచ్చి పడింది నెత్తిన!"

"ఏమిటది? ఇంటిదగ్గర అంద...."

"ఆ.........ఇంటిదగ్గర అందరూ కులాసాగానే వున్నారులెండి. నిన్న మధ్యాహ్నంపూట పని కొంచెం జాస్తిగా వున్నది. పని చేసుకుంటూవుంటే టైము ఎంత అయిందో తెలియలేదు. తీరా పని ముగిసేసరికి టైము అయిపోవడంవల్ల క్యాషియరుగారు ఇంటికిపోయారు. నా ఆఫీసుగదిలో పెట్టె బేడా ఏమీ లేవు. అక్కడ డబ్బు వుంచడం ఏమంత మంచిదిగాదని వెంటపట్టుకుపోయాను. మొత్తం ఎనిమిదివందలు. చిల్లరగావున్న ఐదువందలూ సంచీలో పోసుకుని చేత్తో పట్టుకున్నాను. మిగిలిన వందకాగితాలు మూడూ కోటు పై జేబులో పెట్టుకున్నాను. కొంచెం చేతిలో పనుంటే చూసుకుని ఇంటికివెళ్ళి చూద్దునుకదా, పై జేబులోని మూడు కాగితాలూ లేవు....ఎవరో కొట్టేశారు."

"ఏమిటీ? పోయినయ్యా?"

"అవునండి, కోటు పై జేబులో పెట్టాను. కొట్టేశారు."

"మరి, నిన్ను దారిలో కొట్టి సంచీ లాక్కోవాలా ?" కోపంగా, హేళనగా అన్నాడు రమేశ్‌బాబు.

"పొద్దుటినించీ, ఆ డబ్బు భర్తీచేయడానికి నానాపాట్లూ పడుతున్నాను. ప్రయోజనం లేకపోయింది."

"మరి మీ నాన్నగారితో చెప్పలా ?"

"వారి స్వభావం మీకు తెలియందేముంది ? డబ్బు ఇవ్వకపోగా తిట్లు ప్రారంభిస్తాడు."

"ఏం చేస్తాం మరి ?"

"సాయంకాలంలోపు ఏదోవిధంగా భర్తీచేస్తాను."

రమేశ్‌బాబు కొంచం గట్టిగా అన్నాడు : "సరే కానీ ! అయినా ఇంత పొరపాటు ఎల్లాపడ్డావు ? ఏమోనయ్యా, నీ మాటలమీద నాకు అట్టే నమ్మకం కలగడంలేదు. ఏమైనా అల్లరిచిల్లరిగా ఖర్చుపెట్టుకున్నావా ? మర్చేపోయాను, మొన్న మీ వాడిని నా దగ్గిరకు డబ్బుకు పంపావు, ఏమిటా అవసరం ?"

ఈ ప్రశ్నతో రమానాధుడి ముఖం పాలిపోయింది. రహస్యం బయట పడిందే అనుకున్నాడు. కానీ, అతి చాకచక్యంగా తప్పుకున్నాడు, "ఏమిటండీ మరీ అలా అంటారు ? నేనేమంత చిన్నపిల్లవాడినా ? సర్కారు డబ్బు ఖర్చు పెట్టుకోడానికి ? మొన్న మా నాన్నగారికి ఏదో అవుసరం వచ్చింది. ఇంట్లో డబ్బు లేదు. సరే, మీ దగ్గరకు పంపుతానని చెప్పి పంపాను. మీరిచ్చిన సమాధానం చూసి పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వారు. అంతేగాని, నాకే అవసరమూ వచ్చి పంపించలేదండి ! అసలీ నోట్లు ఎలాగ పోయినయ్యో నాకే ఆశ్చర్యంగా వున్నది" అన్నాడు రమానాధుడు.

"పోనీ, మీ నాన్నగారిని అడగడానికి నీకు కష్టంగావుంటే, నేను చీటీ రాసి తెప్పించనా ?"

రమానాధుడు రెండుచెవులమీద చేతులుపెట్టుకుని "బాబూ, నా మాటవిని ఆ పనిమాత్రం చేయకండి. ప్రాణంపోయినా ఒప్పుకుంటాను గానీ, మా నాన్నగారికీ విషయాన్ని తెలియనీయను...." అన్నాడు.

రమేశ్‌బాబు ఒక్కక్షణం ఆలోచించి, "మరి సాయంత్రానికి డబ్బు దొరుకుతుందనే నమ్మకం వుందా !" అన్నాడు.

"దొరకవచ్చును."

"సరే, ఇప్పటికీ ఐదువందలూ జమకట్టిరా ! రేపు ఆఫీసు టైములోపు మిగిలిన డబ్బు చెల్లించకపోతే మాటదక్కదు. అసలు ఆఫీసు వ్యవహారాలలో స్నేహాన్నీ, మొగమోటాన్నీ చూడనని నీకు బాగా తెల్సుకదా ? నీవింకా కుర్రవాడివని క్షమించి, ఈ అవకాశాన్నయినా యిస్తున్నాను. లేకపోతే, ఇప్పుడే

నీ చేతికి సంకెళ్ళు పడేవి. నేనిలా అంటున్నానని మనస్సులో ఏమీ అను కోకు....నీవు కాకుండా నీ స్థానంలో నా తమ్ముడో, కొడుకో వుండి ఇలాగే చేస్తే, నీకిచ్చిన ఈ అవకాశాన్నయినా వాళ్ళకు ఇచ్చేవాడిని కాదు! నా దగ్గిర డబ్బు వుంటే, నేనే చెల్లించేవాడిని; అప్పుగా కాదు, మన స్నేహాన్నిగురించి! ఏం చేయను? నా పరిస్థితులేమీ బాగా లేవు. సరే, రేపటికి సాధ్యమైనంతవరకూ పని సానుకూలం చేసుకో. లేకపోతే, సంకెళ్ళు తప్పవు!"

"సంకెళ్ళు!" ఈ మాట రమానాధుడి హృదయంలో బల్లెంలా గుచ్చు కున్నది. శిక్ష చెప్పిన ఖైదీలా తన గదిలోకిపోయి కుర్చీలో కూలపడ్డాడు. ఎంతకీ అతని మనస్సు పనిలో లగ్నం కావడంలేదు.

# 20

సాయంత్రం పని అయి ఇంటికి పోయేప్పుడు రమేశ్‌బాబు పనికట్టుకు వచ్చి, రమానాధుడితో "రేపు ఆఫీసుకు వచ్చేప్పుడు తప్పనిసరిగా డబ్బు పట్టుకురా" అని చెప్పాడు.

రమానాధుడు పైకి 'సరే' అన్నాడు. కానీ, లోపల మండిపడ్డాడు. 'ఒట్టి మోసగాడు! తన అవుసరం అయితే కాళ్ళుపట్టుకోవడానికి కూడా సిద్ధం అవుతాడు....ఇతర్లకు అవుసరం వస్తే, తియ్యని ఆదర్శాలను వల్లిస్తుంటాడు! ఛీ ఛీ....వెధవ బ్రతుకు! ఇలాంటి ముండాకొడుకులకు చప్పున చావైనా రాదు" అనుకున్నాడు మనస్సులోనే.

రమానాధుడు ఇంటికిపోతూ, మళ్ళీ ఒకమాటు రత్తన్‌ని కల్సుకుందామనుకున్నాడు. అంతకన్నా అడగతగ్గవాళ్ళు ఇంకెవ్వరూ లేకపోబట్టి, ఇష్టంలేకపోయినా అక్కడికే వెళ్ళాడు. ఏమో తన రోజులు బాగావుండి ఇస్తే ఈయవచ్చు!

ఇతను పోయేసరికి రత్తన్ వరండాలో కూర్చుని ఒక గుజరాతీ నగల వ్యాపారిదగ్గిర నగలు చూస్తున్నది. రమానాధుడిని చూడగానే సంతోషంగా "రండి రమానాధుగారు! ఈ హారం చూడండి ఎంతబాగున్నదో! పన్నెండువందలు చెబుతున్నాడు" అన్నది.

రమానాధుడు హారాన్ని చేతిలోకి తీసుకు అటూ ఇటూ తిప్పిచూసి "బాగుంది" అన్నాడు.

"కానీ, ధరే ఎక్కువచెబుతున్నాడు!" అన్నది, రత్తన్ తల వూపుతూ.

"ఇదిగో! అమ్మగారూ! మీ రిలాంటి హారాన్ని ఎక్కడైనా ఈ ధరకు తెచ్చేట్టయితే, నేను వూరికెనే ఇచ్చేస్తానండి" గుజరాతీ యాసతో హిందీలో అన్నాడు వ్యాపారి.

రమానాధుడు నవ్వుతూ "అలాంటి పందాలు వేయకండి. అనవసరంగా వస్తువును పోగొట్టుకోవడం అవుతుంది" అన్నాడు.

"అలా అనకండీ బాబుగారు! వందరూపాయలకుకూడా వచ్చే హారాలు వున్నై. పైగా అవి వీటికన్నా ఎక్కువ నిగారింపుగాకూడా వుంటై! అయినా వస్తువుల్లో నాణ్యం బేనాణ్యం లేదుటండీ?" అన్నాడు వ్యాపారి.

రత్తన్ హారాన్ని ఆశగా చూస్తూ "సరే, ఇంకోమాట చెప్పు? ఒకే ధర మీదవుంటే ఎల్లా?" అన్నది.

"ఇంకోమాట చెప్పడానికి వీలులేదండి. పన్నెండు వందలకుగనక ఇస్తే పన్నెండు దమ్మిడీలుకూడా రావంటే నమ్మండి? అంత దేనికి, కావాలంటే ఈ పూళ్ళోనే దీన్ని పద్నాలుగు వందలకు అమ్ముతాను!" అంటూ హారాన్ని పెట్టెలో సర్దుతున్నాడు వ్యాపారి. రత్తన్‌బాయి అంతకు ఇక తగ్గించదని నిశ్చయించుకుని "ఏమి టలా సరుకుంటావు? దిష్టేమైనా తగులుతుందనా?" అన్నది.

"సర్దుకోక ఏం చెయ్యమంటారు? మీలాంటివారే వస్తువు విలువను గమనించకుండా ధర అడుగుతూంటే?"

రత్తన్ లోపలికిపోయి రమానాధునికూడా లోపలికి పిల్చి "ఇంకా తగ్గిస్తా డంటారా?" అన్నది.

"నా వుద్దేశ్యంలో అది వెయ్యికన్నా ఎక్కువ చేయదు" అన్నాడు.

"సరే, అయితే, వెయ్యిరూపాయలకు ఇచ్చేట్టుగావుంటే తీసుకుంటాను. మీరు ఒక్కపనిచేయండి.........నాదగ్గర ఆరువందలున్నై. వకీలుగారు వచ్చే సరికి ఆలస్యం కావచ్చు! మీ రొక నాలుగువందలుంటే ఇయ్యండి. రేపు ఉదయాన్నే పంపిస్తాను."

రమానాధుడు సిగ్గూ, అభిమానమూ కల్సిన స్వరంతో "చెబితే, మీరు నమ్ముతారో నమ్మరో! నా దగ్గర ఒక్క దమ్మిడీకూడా లేదు. నేను మిమ్మల్నే అడుగుదామని వచ్చాను, నా మాట విని ఒక పనిచేయండి, ఆ డబ్బు నాకు ఇయ్యండి, ఇంతకన్నా మంచిహారం ఆరు, ఏడు వందల్లో రెండుమూడురోజుల్లో నేను తెచ్చి పెడతాను. డబ్బు చాలా అవుసరం కావాలి, మీకు పుణ్యం వుంటుంది!" అన్నాడు.

"పోండి, నాకు చెబుతారు? ఒక్క గాజులజత చేయించడానికి ఇన్నాళ్ళు చేశారు, ఇక హారంపట్టుకు వస్తారంటే నే నెలా నమ్మను? అదీకాక నిన్న నేను బజార్లో కొట్లన్నీ గాలించాను. ఇలాంటి హారం ఎక్కడాలేదు. ఒకవేళ ఎక్కడైనా వున్నా, ఇంతకు రెట్టింపుధర చెబుతారు."

"అయితే ఇతన్ని రేపు రమ్మనండి."

"సరే, రేపు రమ్మని చెబుతాను, ఏమంటాడో చూద్దాం."

ఇదరూ బయటికివచ్చారు. రమానాధుడు వ్యాపారితో ఇలా అన్నాడు: "ఇదిగో! నీవు రేపు ఉదయం ఎనిమిది గంటలకు రాకూడదూ?"

"లేదండీ, రేపు నేను కాశీపోవాలి. అక్కడ ఇద్దరుముగ్గురు పెద్దమనుషులకు నగలు తెస్తానని మాటఇచ్చి వచ్చాను. నాకోసం ఎదురుచూస్తుంటారు."

"అయితే, నాదగ్గిర ఇప్పుడు ఆరువందలు వున్నై. ఇంతవరకూ తీసుకుని ఆ హారాన్ని ఇచ్చి వెళ్ళండి. మిగిలింది కాశీనుంచి తిరిగి వచ్చేప్పుడు తీసుకొనవచ్చును!" అన్నది రత్తన్.

"రూపాయిల విషయానికేం ? ఎప్పుడైనా పట్టుకుపోతాను. నెలా, రెండు నెల్ల తరువాత అయినా ఫరవాలేదు. నా కదేమీ లేదు. కానీ.... నేను పరాయిదేశం వాడిని.... ఇవ్వాళ ఇక్కడ వుంటే రేపు మరోచోట వుంటాను. మళ్ళీ నే నీవూరు ఎన్నాళ్ళికివస్తానో చెప్పలేను. ఇప్పుడో వెయ్యి ఇప్పించండి. మిగిలిన రెండు వందలూ, ఈసారి వచ్చినప్పుడు అలాగే పట్టుకుపోతాను."

"నిన్ను చూస్తే బేరం అమ్ముకునే లక్షణం ఏమీ కనుపించడంలేదు.... ఏదీ కుదరనివ్వవు !" అన్నాడు రమానాధుడు.

వ్యాపారికి అరికాలిమంట నెత్తికి ఎక్కింది. గబగబా పెట్టె సర్దుకుంటు న్నాడు. వెళ్ళడానికి వుద్యుక్తుడై "డబ్బులున్నా మంచిసరుకు కావల్సివచ్చినప్పుడు ఎక్కడ దొరుకుతై అండి !" అన్నాడు.

వ్యాపారి ఇలా వెళ్ళిపోవడానికి సిద్ధంకావడం చూసేసరికి, రత్తన్ గుండెలు వేగంగా కొట్టుకున్నై. అలాంటి హారం ఇక తనకు జన్మలో దొరుకు తుందా ? తన అధికారాన్ని కోర్కెలని ఎవరో బలవంతాన విరిచేస్తున్నారని పించిం దామెకు. డబ్బేమైనా దొరుకుతుందేమోనని గబగబా ఇంట్లోకి పోయి పెట్టె లన్నీ వెతికింది ఎక్కడా ఏమీ దొరకలేదు. ఇంతలో కారుహారన్ వినిపించనే వినిపించింది. రత్తన్ ముఖం విప్పారింది. కారులోనుంచే వకీలుగారు దిగారు. రత్తన్ రెండు అడుగులు ముందుకువేసి 'మీరు తొమ్మిది గంటలకుగా వస్తా నన్నారు ?' అన్నది.

"అవును వేళ్ళేటప్పుడు అలాగే అనుకున్నాను.... కానీ, ఇత నెవరు ? నగల వ్యాపారా ?"

నగల వ్యాపారి వకీలుగారికి నమస్కరించాడు.

వకీలుగారు రత్తన్‌వైపు చూచి "నీవేమైనా నగలు తీసుకున్నావా ?" అన్నారు.

"ఒక హారంతీసుకుందామనుకున్నాను. పన్నెండువందలు చెబుతున్నాడు."

"ఇంతేనా ? అయితే, ఇంకేమైనా ఒకటికూడా తీసుకో, తలలో పెట్టుకోవ డానికి మంచిదేమీ లేదన్నావు కదూ ?"

"ఇప్పటికి హారం చాలులెండి.... ఇప్పు డెవ్వరూ తలలో నగలు పెట్టు కోవడంలేదు...."

"పోనీ, తీసుకుని వుంచుకోరాదూ ? రేపెవరైనా తలలో నగలు పెట్టుకు కనిపిస్తే అప్పుడు బాధపడలావు !"

వకీలుగారు రత్తన్‌మీద పతిచూపే ప్రేమకు బదులు, తండ్రిచూపే దయను చూపుతుంటాడు. తండ్రి ఎలాగయితే తిరునాళ్ళకయినా పోయినప్పుడు పిల్లలకు

ఏ ఏ ఆటబొమ్మలు కావాలో అడిగి మరీ కొనిపెడుతూవుంటాడో, అలాగే వకీలు గారుకూడా రత్తన్‌ను అడిగి మరీ నగలు కొంటుంటారు.

వకీలుగారికి శుష్కించి, రోగగ్రస్తమైన ఈ వృద్ధదశలో కూడా నాదీ అనే ఆత్మీయతని కల్పించుకోవడానికి సశరీరంగా కదలి, నడిచి, మాట్లాడగల ఒక స్త్రీ అవసరం. భగవద్భక్తి ప్రేరితమైన ఉపాసకుడికి పూజలూ, నైవేద్య నీరాజనాలూ సమర్పించడానికి ఒక విగ్రహం ఎంత అవుసరమో, వకీలుగారికి స్త్రీ కూడా అంతే అవుసరం। ఆ విగ్రహం లేకపోతే ఆ వుపాసకుడి పూజలూ, నైవేద్యాలూ ఎలా నిరాధారం, అసక్యరహితం అయిపోతయ్యో, అలాగే వకీలు గారికి 'స్త్రీ' అనేది లేకపోతే, వారి సంపాదనా,జీవితంకూడా అర్థంలేని వవుతయ్యి. అందుకనే ఆ 'స్త్రీ' రూపంలో రత్తన్‌ని స్వీకరించారు. ఇక రత్తన్‌ని సంతోష పెట్టాలంటే వారిదగ్గిర డబ్బు మినహా మరేమీ లేదు. అందుకని ఆమె ఆనందం కోసం డబ్బును ఎంతైనా ఖర్చుపెడతారు.

రత్తన్ పెట్టెలోనుంచి హారాన్ని తీసిచూపుతూ "దీని ధర పన్నెండు వందలు చెబుతున్నాడు" అన్నది.

వకీలుగారి దృష్టిలో డబ్బుకు ఆదర్శం సుఖాన్ని, ఆనందాన్ని చేయడమే ! ఆ హారం నిజంగా రత్తన్‌ని ఆనందపర్చేటట్టయితే, ఎంత డబ్బుఅయితే మాత్రం ఏమిటి ? చెక్కుబుక్కుతెచి "ఖచ్చితంగా చెప్పు ! ఎంతరాయను ? ధరలో ఏమైనా వ్యత్యాసమున్నదా ?" అన్నారు వ్యాపారివంక చూస్తూ.

వ్యాపారి ఒకమాటు హారాన్ని అటూ ఇటూ త్రిప్పిచూసి "సరే....,....పద కొండువందల యాభై రూపాయలు రాయండి" అన్నాడు.

వకీలుగారు చెక్కురాసి ఇచ్చారు. వ్యాపారి వెళ్ళిపోయాడు. రత్తన్‌ముఖం వికసించింది ఆమె ఆనందానికి మేరలేకుండా వున్నది.

వకీలుగారిలో అర్వాచీన ప్రాచీన ఆచారాలు బహుచిత్రంగా మిశ్రితం అయి నయ్యి. ఏ హైముకయినాసరే భార్య చేతిమీదుగా వంచి పెట్టవల్సిందేగానీ, మరె వ్వరు వండినా తినరు. చివరకు వంట బ్రాహ్మణుడి చేతిమీదుగా కూడా తినరు.

ఆ పూటకు రత్తన్ కమ్మనివంటచేసి తన కృతజ్ఞతను తెలియచేసుకున్నది.

కాసేపు వకీలుగారి యూరోపుస్తుతిని విని రమానాథుడు నిరాశగా ఇంటికి పోయాడు.

# 21

రమానాధుడు ఆల్‌ఫ్రెడ్‌పార్కు మీదుగా సైకిలు వేసుకుని ఇంటికి వెళ్తున్నాడు. అతని స్థితి విచిత్రంగావుంది. తెల్లవారేసరికి మూడువందల రూపాయలు తప్పక కావాలి. మూడువందల రూపాయలు కాదుకదా మూడువందల కానులుకూడా దొరకవన్న విషయం నిర్ధారణ అయిపోయింది! డబ్బు కట్టకపోతే, సంకెళ్ళు వేస్తారు. జైలుకు పోవాలి! తండ్రికి చెడ్డపేరు వస్తుంది! కన్నతండ్రికి చెడ్డపేరు తెప్పించేకన్నా చావు చాలానయం। చచ్చినా చెడ్డపేరు రాకుండా ఎక్కడికి పోతుంది? ఫలానా ఆయన కొడుకు మునిసిపాలిటీ డబ్బుతిని చచ్చాడంటారు నలుగురూ. పేరు ఎటూ తప్పనప్పుడు మరి చచ్చి ప్రయోజనం? పోనీ, బ్రతకటం మాత్రం ఎల్లా?

ఇల్లాంటి దారుణమైన పరిస్థితిలో అతనికి ఈ చిక్కులనుంచి బయటపడటానికి ఒక్కటే ఒక్క వుపాయం వున్నది.అతనుగనక పరిస్థితినంతా అభిమానం, దాపరికంలేకుండా జాలపకు చెప్పాడా, ఆమె తప్పకుండా సానుభూతి చూపుతుంది. ప్రాణప్రదమైన తన నగలను తాకట్టుపెట్టయినా డబ్బు తెచ్చి ఇస్తుంది. అంతకు మించి వేరుమార్గం లేదు....చెప్పక తప్పదు! గత్యంతరంలేదు!

రమానాధుడు తన పరిస్థితినంతా జాలపకు చెప్పడానికి గట్టిగా తీర్మానించుకున్నాడు. అయినా అతని ముఖంలో విచారమూ, దిగులూ, బాధా గోచరిస్తూనే వున్నై.

భార్యకు చెప్పేద్దామని ఎంతో ఆలోచించుకుని, ధైర్యాన్ని కూడగట్టుకుని ఇంటికి వచ్చాడు రమానాధుడు.ఇంటికి జేరేసరికి అతని ఆలోచనలు తిరగబడ్డాయి. భార్యదగ్గిరనగలు తీసుకోవడమే గత్యంతరంఅయితే, ఎప్పుడైనా తీసుకోవచ్చును. ఇప్పుడీ అర్ధరాత్రి తీసుకునిమనుకు చేసేదేమున్నది? రేపే తీసుకుందా మనుకున్నాడు.కొంతనిశ్చింతగా ఆ మాటాయీమాటా మాట్లాడుతూభోంచేసి పడుకున్నాడు. ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. భార్యకు చెప్పి అనవసరంగా తను బయటపడటం కన్నా, వెనకటిలాగానే ఏదో ఒక నగ పట్టుకుపోతే పోనుగదా! అనుకున్నాడు. ఏం! వెనక ఒకసారి కుల మర్యాదనూ, తండ్రిగారి ప్రతిష్ఠనూ కాపాడటానికి చేయలా? అదేపని ఇప్పుడు తన ప్రాణం రక్షించుకోవడానికి చేస్తే తప్పేమిటి? చేయనిపక్షంలో ఇలాగే ఏం చేయడమా అనే సందిగ్ధంలోపడి ఉన్న అవధిని కాస్తా పాడుచేసుకోవడమూ, తరువాత చేతులకు సంకెళ్ళు తగులో్కనూమానవు.

చివరకు రమానాధుడు వెనుకటిలాగానే ఏదో ఒక నగను దొంగిలించ డానికే నిశ్చయించుకున్నాడు. సమయానికి జాలప నిద్రలేస్తే! తన దొంగతనాన్ని పట్టుకుంటుందేమోనని భయంమాత్రం అతని మనస్సులో కలకవేస్తూనే వున్నది. ఒకవేళ నిజంగా జాలప కంటపడటమే సంభవిస్తే నిలువునా ప్రాణాలు తీసుకోవడం కంటే వేరుమార్గం లేదు....అయినా తప్పదు! దొంగతనం చేయవల్సిందే ఈ సారికి....!

రమానాధుడు తన గుండెలమీదవున్న జాలప చేతిని తీసి, అవతలపెట్టి మెల్లిగా మంచందిగి క్రింద నిలబడ్డాడు. జాలపదగ్గరనే తాళంచెవులు వున్నై. అవి తీసుకుంటేనేగానీ నగలపెట్టె తీయడానికి వీలులేదు. ఇంతలో జాలప కదలి నట్టయింది. ఒక్క క్షణం పరకాయించి చూశాడు....అది అతని భ్రమ!

అతను మెల్లగా భార్యరవికె జేబులోనుంచి తాళంచెవిని తీయబోయి చప్పున వెనక్కి తగ్గాడు. అతని ముఖము ఏ పామునో, లేక దుష్టజంతువునో చూసినట్టు వివర్ణమైంది. జాలప నవ్వుతున్నట్టు కనిపించిం దతనికి. మందమైన దీపపుకాంతిలో రెండు క్షణాలు అల్లాగే భార్యవంక చూశాడు. స్వప్నావస్థలోనే నవ్వుతుంటోంది జాలప. రమానాధుడి గుండెలను చీల్చుకొని ఒక దారుణమైన మౌనఆక్రందన బయలుదేరింది. అది అతని ఒక్కడికే వినిపించింది. ఇంత అమాయకంగా, సరళంగా వున్న భార్యని ఎలా మోసగించడం? తెల్లవారి రెండోసారి నగలుపోయి నయ్యని తెలిస్తే, ఆమె దుఃఖానికి అంతువుంటుందా! తను అలాంటి పరిస్థితిలో జాలపను చూడగలడా? సహించగలడా? జాలపకోసం కావాలంటే ప్రాణాలినైనా ఈయడానికి సిద్ధపడివచ్చిన తనే ఇలా చేయడం....ఆమెను శాశ్వత దుఃఖితగా చేయడం భావ్యమా? తనకు భార్య అయినందుకు ఇదేనా ఫలితం? జాలప ఏ ధని కుడినో చేసుకునివుంటె! ఎన్ని నగలు చేయించేవాడో! ఎంత ఆనందంగా జీవితం గడిపేదో!....తను అవేవీ చేయలేకపోగా, ఉన్నవికూడా కాజేయడానికి సిద్ధపడు తున్నాడు.

రమానాధుడు వెనక్కు తగ్గాడు. ఒకమాటు గట్టిగా శ్వాస వదిలి, తిరిగి మంచంమీద పడుకున్నాడు. అప్పటికిజాలపకు మెళుకువవచ్చింది. ఒకమాటు భర్త వంక చూసి "ఇంకా నిద్రపోలేదా? నా కో కమ్మని కల వచ్చింది. మనమిద్దరం ఎక్కడో ఒక అందమైన తోటలో వున్నాము. అక్కడికి ఒక సాధువు వచ్చాడు. అతను సాక్షాత్తూ దేవుడిలా వున్నాడు. నన్ను వరం కోరుకోమన్నాడు. మరి ఏం వరం కోరుకోమంటారో కనుక్కుందామని మీ కోసం వెనక్కితిరిగి చూశాను. మీరు లేదు. తోటంతా వెతికాను. కనుపించలేదు....చివరకు వరం అడక్కుండానే కల మాయం అయింది....!" అన్నది.

"మరి కల మాయం కాకుండావుంటే, ఏం వరం అడిగేదానివి ?"

"నా ఇష్టంవచ్చినది అడిగేదాన్ని. ఇప్పుడు మీకెందుకు చెప్పాలేం ?"

"కాదులే చెప్పు! బహుశా చాలా....చాలా ఎక్కువ....కుబేరుడికి వున్నంత ధనం ఈయమని అడిగేదానివి....ఔనా ?

"మీ రడుగుతారేమో. అట్లా నేనేం అడగను. డబ్బంటే మీకు అంత ప్రీతి!"

"అవును. అదెటూ యధార్థమే! డబ్బులేకుండా బ్రతకడంకంటే, చావడం చాలా వుత్తమం! నాకే దేవుడైనా కనిపిస్తే చాలినంత డబ్బు ఈయందే అడుగేనా కదలనీయను. అట్లాగని నన్ను దురాశాపరుడనుకోకు! నే నేమీ కుబేరుడిని కావాలనిగానీ, రాక్ ఫెల్లర్ ని ఐపోదామనిగానీ అనుకోవడంలేదు! సాధారణమైన జీవితావుసరాలకు కొదువలేకుండా డబ్బుంటేచాలు! మన దేశం చాలా దరిద్రదేశం అని. ఇక్కడి ప్రజల్లో ముప్పాతికమందికి తిండి, గుడ్డా, ఇల్లూలాంటి ముఖ్యమైనవే అతి కష్టంమీద-ఒక్కొక్కరి జీవితాలు వీటిసాధనలోనే గతిస్తూ వుంటయ్యి-లభిస్తుంటయ్యని నీకు తెల్సుకదా ? ఈ దరిద్ర దేశంలోనే కొంతమంది నెలకు లక్షలలెఖ్ఖన ఖర్చు పెడుతుంటారు. వాళ్ళుపెట్టే ఒక్క నెలఖర్చు ఏ దేవుడైనా నా కీయకూడదా ? ఏడు జీవితాలను పోషించుకుంటానే ఆ డబ్బుతో! ఇదీ నా విషయం! మరి నీకేమి కోరుకుంటావో చెప్పవా ? మంచిమంచి నగలు కోరుకుంటావు! కదూ ?"

"నన్నెందుకు అనవసరంగా వుడికిస్తారు ? నే నేం నగలకు ముఖంవాచి కూర్చున్నానా ? కావాలంటే ఈ క్షణాన నగలన్నీ ఇచ్చేస్తాను తీసుకోండి !?"

"మరి నీవు ఏం కోరుకుంటావో ఎంతకూ చెప్పకపోతివి ?"

"నేను....నేను....ఎప్పుడూ మీ అనురాగం, ప్రేమా ఇలాగే తగ్గకుండా వుండాలని కోరుకుంటాను."

"అయితే, ఎప్పుడైనా తగ్గవచ్చుననే భయంకూడా వున్నదా ?"

"ఏమో....బాగున్నదే....! మీరేం దేవతలా ! కాకపోతే, మునులా ! ఎప్పుడూ మనస్సు మార్చుకోకండా ఒకేలా వుంచుకోవడానికి ! పైగా ఏ స్త్రీ జీవితాన్ని చూసినా, భర్త మొదట్లో ప్రేమగా చూడటం,తరవాత ఇతరత్రా మోజుపడి, తన్ను చూడకపోవడం జరుగుతున్నదేనాయె ! అలాంటిగతి నాకుపట్టకుండా వుండాలని, నేను ఇప్పటినుంచే భగవంతుని వేడుకుంటున్నాను. కాకపోయినా, నాకు తెలియక అడుగుతాను, మొగవాళ్ళు ఎందుకనలా మనస్సు మార్చుకుంటారు ?" మెడచుట్టూ తన చేతులను పెనవేసి, నిమీలితంగా అతని కండ్లల్లోకి చూస్తూ "నిజం చెప్పండి, మొదట్లో ప్రేమించినట్టే ఇప్పుడూ ప్రేమిస్తున్నారా ?" అన్నది జాలప.

రమానాధుడు జాలపని దగ్గిరకు తీసుకుంటూ "అంతకంటే వెయ్యిరెట్లు అధికంగా!" అన్నాడు.

జాలప నవ్వి "అబద్ధం! పరహారణాలా అబద్ధం!" అన్నది.

"అబద్ధమని నీ వనుకుంటున్నావు!"

"ఊరకే నేను అనుకోవడమేకాదు. నా కళ్ళతో చూస్తున్నానుకూడాను! ఒక్కక్షణం దగ్గిరకూర్చోరు, మనసులోవున్న బాధ ఏమిటోచెప్పరు, ఎంతసేపటికీ పెడపెడగా వుంటారు. ఏదో విధిలేక నవ్వుతారు, మాట్లాడతారు. అదీ ఎంతో కష్టం మీద. 'ఎందుకువచ్చిన పీడరా ఇదీ' అనుకుంటూ. అన్నందగ్గిరా అంతే! ఏదో పూటకూళ్ళ ఇంట్లో తిన్నట్టు నాలుగు మెతుకులు నోట్లో వేసుకుపోతారు. అన్నం వుడికినా ఫరవాలేదు. వుడక్కపోయినా ఫరవాలేదు. పప్పులో వుప్పువున్నా ఫరవాలేదు. లేకపోయినా ఫరవాలేదు. బయటనుంచి ఎంతో బాధగా ఇంటికి వస్తారు.అది నేనెక్కడ చూసి, అడిగి తెల్సుకొనిపోతానో అని కృత్రిమమైన నవ్వు ముఖంలోకి తెచ్చుకుంటారు. నాకు చెప్పడానికి ఏమిటి మీ కీ అభిమానం? మరి నన్ను ప్రేమిస్తున్నానంటిరిగా? ప్రేమించేచోట అభిమానానికి తావెక్కడిది? మీ కష్టసుఖాలు నాకు చెప్పకపోతే, నన్ను ప్రేమిస్తున్నారని ఎలా అనుకోగలను? మీ కష్టాలతో సంబంధంలేకుండా సుఖాలకు మాత్రం ఆశించేది, వేశ్య! నేను వేశ్యని కాదు, భార్యని! మీ కష్టాలూ, సుఖాలూ అన్నీ నా కష్టాలూ సుఖాలే! బహుశా భార్యపట్ల మీ కీ దృష్టి లేదేమో. అందుకనే హృదయానికి దూరంగావుంచి, శారీరక అవుసరాలకు మాత్రం వినియోగించుకుంటూ వేశ్యలా చూస్తున్నారు. సరే,ఇక నేను మాత్రం చేయగలిగింది ఏమున్నది? నేనూ అలాగే వుంటాను!"

జాలప ఎన్నడూ ఇలా మనస్సువిప్పి రమానాధుడితో మాట్లాడలేదు.అతనికి ఇంతవరకూ జాలప ఇంతచక్కగా మాట్లాడగలదని, తనను ఇంత బాగా అర్థం చేసుకోగలదనీ తెలియదు. అతను ఆమెను ప్రేమించడానికీ, ఆసక్తి చూపడానికీ ఆమె సౌందర్యమే కారణం. ఈకొలబద్దతో అతనామెను ఒక అందమైన బొమ్మను చూసినట్టు చూస్తున్నాడేగానీ, ఆమెకూ ఓ హృదయం వుంటుందనీ, సున్నితమైన భావాలు వుంటయ్యనీ యెన్నడూ వూహించలేదు. ఆమెలో ఆ సౌందర్యమే లేకపోతే, రమానాధుడు ఏనాడో విముఖుడయ్యేవాడు.

మొదటినుంచీ జరిగిన విషయాలను చక్కగా వివరించడానికి తగిన సమయం వచ్చింది. రమానాధుడు తన స్థితినంతా జాలపముందు పెట్టి మనోభావాన్ని తేలికపర్చుకోవడానికి కూడా సిద్ధం అయ్యాడు. మళ్ళీ సంకోచం! ఇన్నాళ్ళనుంచీ కాదంటున్న విషయాలను ఒక్క క్షణంలో అవునని యెలా ఒప్పుకోవడం? పైగా ఇప్పుడంతా చెప్పితే, క్షణం క్రితం జాలప తనమీద

వేసిన నేరాలకు తను పూర్తిగా బాధ్యుడైనట్టేకదా? మొదట్లో అతను జాలపతో తన ప్రేమను సుస్థిరం చేసుకోవడానికి, లేనిగొప్పలు చెప్పుకోవడం అవుసరం అనుకున్నాడు. ఇప్పుడు అలా చెప్పుకోకపోయినా తన కీ ప్రేమ లభించేదని తెల్సుకున్నాడు.

ఈ విధమైన రకరకాల తర్క-వితర్కాలతో, ఆలోచనలతో నిద్రపోయాడు రమానాధుడు. ఉదయాన్నే చాలా పెందలకడనే లేద్దామనుకున్నాడు. కానీ నిద్ర లేచేసరికి బాగా పొద్దెక్కింది. తీక్షణమైన సూర్యకిరణాలు అతని పక్క-మీదా, శరీరంమీదా పడుతున్నై. ఆదరాబాదరా నిద్రలేచి ముఖమైనా కడుక్కోకుండానే రమేశ్‌బాబు దగ్గిరకు బయలుదేరాడు. అతనితో ఇక ఏవిధమైన దాపరికమూ లేకుండా స్థితినంతా చెబుదామనుకున్నాడు. ఏమో, అతనికి జాలికలిగి సాయ పడితే పడవచ్చు!

జాలప వంటపనిలో నిమగ్నమైవున్నది. భర్త ఇలా ఆదుర్దాగా వెళ్ళడం చూసి ఏమిటని ప్రశ్నించింది కళ్ళతోనే! కానీ రమానాధుడు సమాధానం ఇయ్య లేదు. అతని ముఖంలో దిగులూ, భయమూ, నిరాశా ద్యోతకమవుతున్నై. పిచ్చిగా వెళ్ళిపోతున్న భర్తను గడప దాటే వరకూ అలాగే చూస్తూ కూర్చున్నది జాలప.

జాలప పైకి ఎంత నిశ్చలంగా చూస్తున్నట్టు కనిపిస్తున్నా, లోప లామె మనస్సు తహతహలాడుతూనేవున్నది. వెనక్కి పిలిచి విషయం ఏమిటో కను క్కుందామని గడపదాకా పోయింది. అప్పటికే రమానాధుడు బజారులోకి వెళ్ళి పోయాడు. ఇక వెనక్కి పిలవడం బాగుండదని చూస్తూ నిల్చున్నది. రమా నాధుడు బళ్ళనీ, మనుషుల్నీ ఎవ్వరినీ లెక్క-చేయకుండా త్వరత్వరగా వెళ్ళి పోతున్నాడు. ఒక బండిని తప్పుకున్నాడు. ఇద్దరు ముగ్గురు మనుష్యులకు ఎదురు తగిలాడు. 'ఎందుకు త్వరగా వెళ్తున్నాడు? అడిగినా చెప్పలేదేం?' అను కుంటూ ఆమె భర్త కనిపించేవరకూ చూస్తూ నిలబడింది.

రమానాధుడు రమేశ్‌బాబు దగ్గరకు పోయేసరికి ఎనిమిదిగంటలైంది. అతను సంధ్య వార్చుకుంటున్నాడు. రమానాధుని చూసి కండ్లతోనే కూర్చో మన్నాడు. గబగబా ఒక అరగంటలో ముగించుకుని, "ఏమిటి? ఇంకా ముఖ మైనా కడుక్కోనట్టు వున్నది? ఇదిగో! ఈ పనులే నాకు నచ్చవు! నీవు ఏ గొప్ప ఘనకార్యం చేయకపోతేమానె, కనీస కర్తవ్యం, నీ శరీరాన్నయినా నీవు శుభ్రంగా వుంచుకోకపోతే ఎలా? ఊ! అదలావుంచు, డబ్బు కేమైనా ఏర్పాటు చేశావా?" అడిగాడు రమేశ్‌బాబు.

"ఆ విషయంగురించే మీ దగ్గిరకు వచ్చాను!"

"నిన్ను చూస్తే చాలా ఆశ్చర్యం వేస్తున్నది. మీ నాన్నగారితో చెప్ప

డానికి ఏమిటి నీ అభ్యంతరం? నాలుగు చీవాట్లు వేస్తారంటావా? వెయ్యనియ్యి! ఈ బాధ తప్పిపోతుందిగా? అదీకాక....నీవు చేసిన పెద్ద తప్పుమాత్రం ఏమున్నది? ఇలాంటి పొరపాట్లు సాధారణంగా జరుగుతూనే వుంటయ్యి! పోనీ, నీ బదులు మీ నాన్నగారితో నేను చెప్పిచూస్తాను....ఏమంటావు?"

"వారితో చెప్పడానికే వీలుంటే యింతసేపా? ఎప్పుడో చెప్పేవాడిని!.... అది సరే, మీరేమీ సర్దలేరా?"

"ఎందుకు సర్దలేను? కానీ, సర్దాలనిలేదు. ఇలాంటివాళ్ళకు సానుభూతి చూపడం నా కేమాత్రం ఇష్టంవుండదు. పరాయివాడిని నాతోటే చెప్పినప్పుడు ఇవే మాటలు మీ నాన్నగారితో ఎందుకని చెప్పవు? నీవు పోయి చెప్పు, అంతగా వా రివ్వనంటే, అప్పుడు నేను ఇస్తాను?"

రమానాధుడు ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. ఇంత ఆత్మీయంగా కనుపించే మనుష్యులుకూడా, ఇంత కఠోరంగా ప్రవర్తిస్తారని అత నెన్నడూ అనుకోలేదు. క్షణాని కొక ఆలోచనా, క్షణానికొక దారిగావున్న దతని మనస్థితి. ఒక్కొక్కసారి ఏమీ ఆలోచించలేకుండా నిర్వికారుడై పోతున్నాడు.

దారిలో అతనికొక చక్కని ఆలోచనతట్టింది. అతనెటూ పరిస్థితిని నోటితో జాలపకు చెప్పలేడు. పోతే, ఉత్తరం రాసి ఇయ్యగలడు. ఇలా ఐతే అంత బాధ పడనవసరం వుండదు. ఆమె ఉత్తరం చదివినంతసేపూ, తను బయటిగదిలో నిరీక్షిస్తూ వుండవచ్చును! ఇట్లా అనుకుని చరచరా ఇంటికి వచ్చి, క్రింద వుత్తరాన్ని బరకసాగాడు.

"ప్రియమైన....!

చాలా బాధలోవుండి ఈ వుత్తరం రాస్తున్నాను. ఒక్కగంటలోపు మూడు వందల రూపాయలు కావాలి. లేకపోతే, జైలుకు పోవల్సివస్తుంది. ఎక్కడైనా అప్పుతీసుకుందామని విశ్వప్రయత్నం చేశాను. కానీ ఎక్కడా దొరకలేదు. నీ నగల్లో ఏ ఒక్క నగనైనా ఇచ్చావా ప్రస్తుతానికి ఈ బాధల్లోనుంచి బయటపడతాను. చాలా త్వరగా మళ్ళీ నీ నగను నీకు, కొని ఇవ్వడమో, చేయించడమో చేస్తాను....చాలా అవసరము కనుక ఈ ఉత్తరం వ్రాస్తున్నాను."

ఉత్తరం రాయడం పూర్తిచేసుకుని తను లేవబోయే సమయానికి రమేశ్ బాబు వచ్చారు. నవ్వుతూ, "మీ నాన్నగారితో చెప్పావా?" అన్నాడు.

"అవకాశం దొరకలేదు."

"అవకాశం దొరకలేదా? అలా అంటే ఎల్లా చెప్పు? ప్రాణంమీదికి వచ్చినప్పుడు అవకాశాలకోసం ఎదురుచూస్తే ఎలా? అదీగాక తండ్రీ కొడుకుల

మధ్య అవకాశాలేమిటి? నీ వెక్కడ డబ్బులేకండా ఆఫీసుకు వస్తావోనని నా భయం!"

రమానాధుడు ఏమీ మాట్లాడలేదు. రమేశ్‌బాబు మళ్ళీ అందుకున్నాడు. "పోనీ, రత్తన్‌బాయితో ఈ విషయం అని చూడకపోయా? వుంటే ఇచ్చేదేమో!"

"రత్తన్‌బాయితోనా? ఊఁహూ! నా నోటిమీదగా నేను చెప్పలేను. బిడియంగా వుంటుంది."

"అరే, మీ నాన్నగారితో చెప్పడానికి సిగ్గే, రత్తన్‌బాయితో చెప్పడానికీ సిగ్గేనా? సరే! నేను వెళ్తున్నాను!"

రమేశ్‌బాబు వచ్చిన తరువాత, రమానాధుడు వుత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకుని జాలపకు యిద్దామనే వుద్దేశ్యంతో లోపలికి పోయాడు.

ఇవ్వాళ జాలపను ఒక స్నేహితురాలు తన ఇంటికి రమ్మనమని ఆహ్వానించింది. అక్కడికి వెళ్ళడానికి తయారౌతున్నది. ఉన్న చీరెల్లో అన్నిటికంటె మంచి సిల్కుచీరె కట్టుకున్నది. చేతులకు బంగారు గాజులు విచిత్రమైన శోభను కల్గిస్తున్నై. మెళ్ళో చంద్రహారం మెరుస్తున్నది. అద్దంముందు నిలబడి లోలకులు పెట్టుకుంటుండగా రమానాధుడు పైకిపోయాడు. అతన్ని చూసి, "ప్రొద్దున్నే ముఖమైనా కడుక్కోకుండా ఎక్కడికి పోయారు? పగలంతా ఎటూ ఇంట్లో వుండనేవుండరుకదా, పొద్దునా, సాయంత్రం పూటయినా ఇంట్లో వుండకూడదా? మీరు లేకపోతే, ఇల్లంతా బావురుమంటూవుంటుంది. ఒక్క నిమిషంకూడా తోచదు. మా అమ్మగారి ఇంటికి పోయివద్దామనుకుంటే, మిమ్మల్ని వదిలి ఎలా వుండటమా? అని యోచిస్తున్నాను" అన్నది జాలప.

"నీవు ఎక్కడికో ప్రయాణము అయినట్టున్నది?"

"ఒక స్నేహితురాలు పిలిచింది. మూడుగంటలకల్లా వస్తాను."

రమానాధుడి స్థితి మళ్ళీ సందిగ్ధంలో పడ్డది. వేటగాడు లేడిని కొట్టడానికి బాణాన్ని ఎక్కుపెట్టాడు. కాని లేడి తన పిల్లతో చర్లాట ఆడుకోవడం చూసి ముగ్ధుడై బాణాన్ని విడవడం మర్చేపోయాడు.

భర్త తనవంక కన్నార్పకుండా చూస్తూవుండటం జూచి నవ్వి, "నాకు దిష్టి తగుల్తుంది. మీ చూపులంటే నాకు మహా భయం" అన్నది జాలప.

ఈ ఒక్కమాటతో రమానాధుడు వాస్తవిక జీవితాన్నుంచి పైకి లేచి, వూహల్లోకి, కల్పనల్లోకి చొచ్చుకుపోయాడు. ఇంత ఆనందంగా, ఉత్సాహంతో కళకళ్ళాడుతున్న భార్యకు తన వుత్తరాన్నిచ్చి దుఃఖపరచగలడా? సంతోషంగా ఎగిరే పావురపు గొంతుమీద తను కత్తివేయగలడా? తను అంత హృదయహీనుడా? లేకపోతే, ఉదయాన్నే ఉషఃకిరణ స్పర్శతో వికసించిన గులాబీని

చేతులారా తుంచి కాళ్ళతో నేలరాయగలడా? కాదు .... ఈ పని తనవల్లకాదు. తను ఎన్ని బాధలైనా పడగలడు. కానీ, హృదయహీనుడుమాత్రం కాలేడు! దీని కోసం జీవితం నాశనం అయినా ఒప్పుకుంటాడు. కానీ, జాలపను నగలు అడ గడు....అడగలేడు!

స్థిమితపడి అన్నాడు: "దీష్టిపెట్టను. హృదయంలో దాచుకుంటాను."

ఈ ఒక్కమాటతో అతని బాధలన్నీ క్షణకాలం శమించినయ్యి. ప్రేమకూ, అభిమానానికీ మధ్య జరుగుతున్న సంఘర్షణను శాశ్వతంగా అంతంచేశాడు. ఏదైనా వ్రణంతో బాధపడేరోగి క్షణకాలం ఓపికపట్టి శస్త్రచికిత్సను చేయించ డానికి బదులు శాశ్వతంగా పైపూతలు పూస్తూ, బాధపడుతూ చివరకు ప్రాణా పాయస్థితికి తెచ్చుకుంటాడు. అలాగే వున్నది రమానాధుడి స్థితికూడాను!

క్రిందకు దిగబోతున్న జాలపను ఒక మాటు తన కౌగిలిలోకి తీసుకు న్నాడు. ఎంతో ఆమర్దాగా ఆమెను తనలో యిముడ్చుకోవడానికి విఫల చేష్టలు చేశాడు. ఇక దొరకదు........! ఇదే కడసారి! అన్నట్లు ఆమెను ఎంతకూ విడిచిపెట్టలేదు. చచ్చిపోతున్న లోభిచేతిలోని రూపాయి బిళ్ళలా ఆమె అంత కంతకూ మరీ అతనిలోకి అదుముకుపోతున్నది.

కొద్దిసేపటితరువాత అతని చేతుల్లోంచి బయటపడి, "మీ దగ్గర ఏమైనా దబ్బులువుంటే ఇయ్యండి, అక్కడేమైనా అవుసరం అవుతుందేమో!" అన్నది జాలప.

"డబ్బా? .... లేదు."

"లేకేం? వున్నది! ఒక్క రెండురూపాయలు యియ్యండి; చాలు" అంటూ భర్త జేబులో చెయ్యిపెట్టి డబ్బు తీసుకున్నది జాలప. డబ్బుతోపాటు తనకు రాసిన ఉత్తరంకూడా బయటపడ్డది.

ఆ కాగితాన్ని జాలప చేతుల్లోంచి లాక్కోవడానికి ప్రయత్నిస్తూ "అది యిటు యివ్వు. సర్కారువారిది" అన్నాడు రమానాధుడు.

జాలప మడతలు విప్పి "ఇది సర్కారు కాగితమా?....అన్నీ అబద్ధాలు! మీ దస్తూరి స్పష్టంగా కనిపిస్తూవుంటే....!" అన్నది.

"అవన్నీ నీ కెందుకు....ఊరికే బాధపెట్టక ఇచ్చేసెయ్యి!"

రమానాధుడు మళ్ళీ కాగితాన్ని లాక్కోవడానికి ముందుకు పోయాడు. జాలప రెండుచేతుల్నీ వెనకకుపెట్టుకుని "చదవకుండా యీయను....ఎక్కువ మొండికేశారా? చింపేస్తాను!" అన్నది.

"సరే, చింపేసెయ్యి!"

"అట్లాగయితే, నేను తప్పకుండా చదువుతాను" అంటూ రెండడుగులు వెనక్కువేసి చదవసాగింది. మిన్నువిరిగి మీదపడ్డంతయిుం దతనికి. గబగబా

మెట్లుదిగి క్రిందికి వచ్చేశాడు. ఇక జాలపకు తను ముఖం చూపడం యెల్లా? ఇన్నాళ్ళనుంచీ బహుజాగ్రత్తగా ఆడుతూవస్తున్న నాటకం ఒక్క క్షణంలో బయటపడిపోతుంది. నే నిలా కుటిలంగా, మర్మంగా ప్రవర్తించినందుకు ఏమను కుంటుందో? అసలు చివరి కిలా వున్నదున్నట్టు చెప్పేయడమే తనకు గత్యం తరం అయితే ఇన్ని బాధలు, కష్టాలు, అబద్ధాలు ఇవన్నీ ఎందుకు చేసినట్లు? అనుభవించినట్టు? ఈ సంవత్సరంనుంచీ, నే నిలా కావాలని ప్రవర్తించినట్లు జాలపకు తెలిస్తే ఎంత దుఃఖిస్తుంది? ఆమె దుఃఖాన్ని తను చూడగలడా? అంత కటికహృదయుడా తను? అదీకాక మొదటి దొంగతనం తనే చేసినట్టు తెలిస్తే ఇక తనను ప్రేమిస్తుందా? విశ్వసిస్తుందా? ఇలాంటి ప్రేమమూర్తి దగ్గర తిరస్కరింపబడి, విశ్వాసాన్ని గోల్పోయిన తరువాత బ్రతికేం? చచ్చేం? జాలప దృష్టిలో విలువ తగ్గింతరువాత నిజంగా చావడమే ఉత్తమం! పైగా కొన్ని గంటల్లో డబ్బు చెల్లించాలి. లేకపోతే పోలీసులు వస్తారు. బేడీలువేసి నడిబజార్న లాక్కుపోతారు. తల్లీ, తండ్రీ, జాలపా, అందరూ తనను దోషి అంటారు!

రమానాధుడు చావుతప్ప తనకు వేరే శరణ్యంలేదని గట్టిగా నిర్ణయించు కున్నాడు.

కానీ, మళ్ళీ అతని కొక ఆలోచన తట్టింది. తనకు చావంటే భయం లేదు. నిర్భయంగా చచ్చిపోగలడు. అంతవరకూ నిశ్చయం! కాని, జాలప గతి ఏమయ్యేట్టు? తల్లీ, తండ్రీ అంటే నెలో, రెండునెల్లో ఏడ్చి ఊరుకుంటారు. జాలప ఎల్లా ఊరుకోగలుగుతుంది? జీవితాంతం తనమూలానపడి దుఃఖించదా? ఇలా కాకుండా కొన్నాళ్ళపాటు తనేదైనా పల్లెటూళ్లో అజ్ఞాతవాసం గడిపితే? బహుశా కొన్నాళ్ళ తరువాత ఈ పరిస్థితులు మారవచ్చును; జాలపకూడా తనని అర్థం చేసుకోనవచ్చును. అప్పటికి తన దగ్గిర డబ్బుకూడా చేరవచ్చు! ఈ మాత్రానికి ప్రాణం తీసుకోవడం ఏమిటి?

రమానాధుడు అతి వేగంగా నడిచిపోతున్నాడు, ఎక్కడికో! ఎందుకో! పోలీసులు రావడంలేదుగదా? జాలప తన ఉత్తరాన్ని చదివిందేమో? ఇంటి దగ్గర్నుంచి తనను వెదకడానికి మనుషులు బయలుదేరారేమో?....మొదలైన ఆలోచనలు అతని బుర్రలో విషసర్పాల్లా మెలికలు తిరుగుతున్నై. సాధ్య మైనంత త్వరలో ఒక సురక్షితమైన స్థానాన్ని చేరడం మంచిదనుకుంటున్నాడు. పరిచయమైన ప్రతి వ్యక్తీ అతని కంటిలో భూతంలా కనిపించసాగాడు.

ఇంతలో చెవులు గింగురుమనేట్టు రైలు కూసింది. రమానాధుడు వులిక్కి పడి పరిసరాన్ని కలియజూశాడు. తను రైల్వేప్లాటుఫారంమీద వున్నాడు. తన యెదురుగావున్న రైలు కూతవేసి బయలుదేరబోతున్నది. అతని కా రైలు

మృత్యువులోని అమరత్వంలా కనిపించింది. తన నీ బాధలనుంచి వేరుచేయగల ఉత్తమ సాధనం అనిపించింది. తను ఆ రైలుయెక్కి కూర్చున్నాడా? ఇక ఈ బాధలకు శాశ్వతంగా స్వస్తే! కానీ, జేబులో డబ్బులు లేవు. వేలుకి ఒక ఉంగరంమాత్రం వున్నది. పక్కనేవున్న ఒక కూలీలమేస్త్రీని పిల్చి "ఈ ఉంగరాన్ని ఎక్కడైనా అమ్మి డబ్బు పట్టుకు రాగలవా? నేను వచ్చేప్పుడు జేబులో డబ్బు వేసుకువచ్చాను. కాని, దారిలో పోయింది. ఈ బండికే అవుసరంగా వెళ్ళాలి....ఇంటికిపోయి డబ్బు తెచ్చుకునే సమయంలేదు!" అన్నాడు.

కూలీలమేస్త్రీ రమానాధుడిని క్రిందినుంచీ పైవరకూ ఒకమాటు చూసి, ఉంగరాన్ని తీసుకుని స్టేషనులోకి పోయాడు.

రమానాధుడు బుక్కింగ్ ఆఫీసుకు ఎదురుగా పచారుచేస్తున్నాడు. పది నిమిషాలు గడిచినై. మాటిమాటికీ స్టేషన్ గేటువైపుకు చూస్తున్నాడు. కాని, కూలీలమేస్త్రీ రాలేదు. రమానాధుడు ఇంకో కూలీదగ్గరకుపోయి విషయం అంతా చెప్పి, ఆ కూలీల మేస్త్రీ ఎక్కడవున్నాడో చూడమన్నాడు. రెండవకూలీ విషయాన్నంతా విని అతని పేరు తెలియంది కనుక్కోవడం కష్టం అన్నాడు. బండి కూతవేసింది. మేస్త్రీ మోసం చేసినట్టే! సందేహంలేదు! రమానాధుడు ధైర్యం చేసి టిక్కెట్టులేకుండానే బండి ఎక్కాడు. 'అంతగా ఎక్కడైనా దింపితే దిగుదాం' అనుకున్నాడు.

బండి కదిలింది. రమానాధుడికి దుఃఖం పొర్లుకువచ్చింది. 'అయ్యో! భగవంతుడా, ఎంతపని చేశావు? మళ్ళీ ఏనాటికయినా తిరిగి, యింటికి రావడం అనే అదృష్టం వుందా? లేకపోతే, ఈ జీవితానికి ఇదే ఆఖరా? ఇలాగే, ఎక్కడో, నా అనే వాళ్ళు లేనిచోట కుళ్ళి కుళ్ళి చావడమే నా జాతకంలో రాసివున్నదా? సాధారణమైన అబద్ధాలవల్లా, కొద్దిపాటి అభిమాన సంకోచాలవల్లా నా జీవితం ఎలాంటి పరిస్థితికి వచ్చింది! మొదటినించీ జాలపతో యదార్థాన్నే చెప్పినట్లయితే, ఈ దుర్దినం చూడబోనుకదా? ఒక్కసారిగా కటువైన, చేదుగా విషతుల్యంగావుండే యదార్థాన్ని చెప్పి జాలప ఆశల్ని మొదట్లోనే తుంచేయడం నా వల్ల కాకపోయింది! కొద్దిరోజులపాటైనా, జాలపకు నేనూ ధనికుడి భార్యనే అనే గర్వాన్నీ, సంతృప్తినీ కలిగించగలిగాను. తన జీవితానికి అదే పదివేలు!" అనుకున్నాడు.

బండి బయలుదేరి 'పదినిమిషాలైనా కాలేదు. బయటనుంచి ఎవరో తలుపు తీశారు. టిక్కెట్టు చక్కర్ లోపలికి వచ్చాడు. రమానాధుని గుండెలు వేగంగా కొట్టుకోసాగినై. ఇంతమందిలో తను అవమానపడవల్సి వచ్చినందుకు

సిగ్గుతో కృంగిపోయాడు. చక్కర్ దగ్గరకు వస్తున్నకొద్దీ అతని ముఖం వివర్ణం అయిపోతున్నది.

"మీ టికెట్" అన్నాడు చక్కర్.

రమానాధుడు కొంచెం స్తిమితపడి "నా టిక్కెట్టు కూలీల మేస్త్రీ దగ్గరే వుండిపోయింది. టిక్కెట్టు తెమ్మని డబ్బు యిచ్చాను. అత నెంతకూ రాలేదు. రైలు కదలబోతూవుంటే ఆదుర్దాగా ఎక్కేశాను" అన్నాడు.

చక్కరుకు నమ్మకం కలగలేదు. "నా కదంతా తెలియదు. మీరు వచ్చే స్టేషన్‌లో దిగాలి. ఏ వూరు పోతున్నారు?" అన్నాడు.

"చాలా దూరం పోవాలి. కలకత్తావరకు!"

"ఐతే, వచ్చే స్టేషన్‌లో టిక్కెట్టు తీసుకోండి."

"అదే కష్టం! నా దగ్గిర పదిరూపాయల కాగితమే వున్నది. బుక్కింగ్ దగ్గిర వత్తిడిగావుంటే టిక్కెట్టు తెచ్చిపెట్టమని కూలీల మేస్త్రీకి ఇచ్చాను. ఆ తరువాత అతను నా కంటికి కనుపించలేదు. నా దగ్గిర వేరు డబ్బులు లేవు. బహుశా అతన్ని మీరు చూసేవుండవచ్చునేమో! ఎర్రగా వుంటాడు. ముఖం మీద స్ఫోటకం మచ్చలు వుంటయ్యి!"

"ఈ విషయాన్నిగురించి మీరు కోర్టుద్వారా చర్య జరుపుకోవచ్చును. టిక్కెట్టు లేకుండామాత్రం వెళ్ళడానికి వీలులేదు."

రమానాధుడు అతి వినయంగా "అది కాదండి, నా దగ్గిర వేరే డబ్బు లేదు. మీ ఇష్టం మీరేంచేసినా సరే!" అన్నాడు.

"నిజమే! ఇలా జరిగినందుకూ, మీ దగ్గిర వేరే డబ్బులేనందుకూ, నాకూ బాధగానేవుంది. కానీ, నియమాన్నెలా అతిక్రమించడం?"

పెట్టెలోవున్న ప్రయాణీకుల్లో గుసగుసలు బయలుదేరినయ్యి. మూడవ తరగతి పెట్టెకావడంచేత ఎక్కువమంది కూలీలు వున్నారు. తెల్లని గుడ్డల్లోవున్న ఒక సభ్యమానవుడు అవమానపడుతున్నందుకు వాళ్ళ ఆనందానికి మితిలేకుండా వున్నది. టిక్కెట్టు చక్కర్ నిజంగా రమానాధుని రెండు తన్ని క్రిందికి దింపినట్లయితే, వాళ్ళు ఇంకా ఆనందపడేవాళ్ళు!

రమానాధుడు తలవంచుకుని నిలబడివున్నాడు. వెనక ఎన్నడూ ఇలాంటి అవమానాల్ని ఎరుగడు....ఇదొక కొత్త జీవితం! ఇలాంటివి ఇంకా ఎన్ని అనుభవించాలో?

రమానాధుడి కిలా నిస్సహాయంగా, ఏమీ చేయలేకుండా, చేతులు ముడుచుకుని అవమానాన్ని భరిస్తూ కూర్చోవడం బాధగావుంది. రైలునుంచి దూకి చస్తే బాగుండు ననిపించింది.

"కలకత్తాలో ఎక్కడికి పోతారు బాబూ?"

ఎవరా? అని రమానాధుడు తలతిప్పి చూచాడు. పక్కనేవున్న ఒక వృద్ధ ప్రయాణీకుడు ప్రశ్నించినట్లు తెల్సుకుని, తనను అవమానించడానికి ప్రశ్నిస్తున్నాడనే ఉద్దేశంతో "నీ కెందుకూ, ఎక్కడికో ఒక్కడికి పోతాను!" అన్నాడు విదిలింపుగా.

వృద్ధుడు రమానాధుడి విదిలింపును ఏమాత్రం లెక్కచేయకుండా "నేనూ కలకత్తా వెళ్తున్నాను. తోడుగావుంటావని అడిగాను" గొంతు కొంచం తగ్గించి "కావాలంటే ఛార్జీ డబ్బులు నేను ఇస్తాను. అక్కడ ఇద్దువుగానిలే!" అన్నాడు.

రమానాధుడు వృద్ధుడిని పరిశీలనగా చూశాడు. డెబ్బయి ఏళ్ళుంటయ్యి. పండి వడిలిపోతున్న దబ్బపండులా శరీరం ముడతలు పడిపోతున్నది. తలా, మీసాలూ, గడ్డమూ నున్నగా గొరిగించుకున్నాడు. పక్కనొక చిన్న మూట మినహా వేరే సామగ్రి లేదు.

రమానాధు డిలా సమాధానం లేకుండా తనవంక చూస్తూండటంవల్ల ముసలివాడు మళ్ళీ అన్నాడు: "మీరు హౌడాలోనే దిగుతారా?"

రమానాధుడు వృద్ధుడిని అర్థం చేసుకున్నాడు. అతను చూపుతున్న దయకు కృతజ్ఞతను తెలియజేస్తూ "మీ కెందు కంత శ్రమ? నేను వచ్చే స్టేషన్‌లో దిగి, డబ్బు చూసుకుంటాను" అన్నాడు.

"మీ కేం వందలు కావాల్నా? వేలు కావాల్నా? నేను బాధపడతానను కోవడానికి? ఒక్క పదిరూపాయలేగా! అక్కడికి పోయింతరువాత ఇచ్చేద్దురు గాని!.... అసలు మన నివాసస్థానం ఎక్కడా?"

"ప్రయాగే!"

"ప్రయాగేనా? ఎంత అదృష్టవంతులు. అలాంటి పుణ్యక్షేత్రంలో వుండటానికి నోచుకున్నారు! నేను ఇప్పుడే త్రివేణీలో స్నానంచేసి వస్తున్నాను. ఏం ప్రయాగ! ఏం ప్రయాగ! నిజంగా అమరపురి అంటే దానికే చెల్లుబడి అవుతుంది!.... అయితే, మీకు ఎంత డబ్బు అవసరమవుతుంది?"

"అక్కడదిగంగానే మీరు డబ్బుఅడిగితే నేను ఇయ్యలేకపోవచ్చును...."

"పరవాలేదు....మీరేమీ ఎగ్గొట్టరు! ప్రయాగలో పండాలు నోటూ పత్రమూ ఏమీ లేకుండా వచ్చే పోయే యాత్రీకులకు డబ్బు అప్పు ఇస్తూంటారు... అయితే, పదిరూపాయలు ఇయ్యమంటారా?"

"ఇవ్వండి" తలవంచుకుని అన్నాడు రమానాధుడు.

రమానాధుడు చక్కరుకు డబ్బు ఇచ్చి వృద్ధుడిని గురించి ఆలోచించడం ప్రారంభించాడు. 'ఇత నెంత మంచివాడు! ఎంత సరళంగా ప్రవర్తిస్తున్నాడు! ఏమాత్రం పరిచయంలేని నాకు డబ్బు ఇయ్యటానికి, సాయపడటానికి తయారవుతున్న యితని హృదయం గొప్పదని చెప్పాలి. నాగరీకులమనీ, చదువుకున్న

వాళ్ళమనీ విశ్రవీగేవాళ్ళల్లో ఇలాంటి సహృదయులు ఎంతమంది వుంటారు ?" అనుకున్నాడు. పెట్టెలోవున్న ఇతర ప్రయాణీకుల్లోకూడా ముసలివాడిమీద గౌరవం ఎక్కువైంది.

తరువాత మాటల సందర్భంలో వృద్ధుడి పూర్వాపరాల నన్నింటినీ తెల్సుకున్నాడు రమానాధుడు. అతని దసలు బీహారు. కలకత్తాలో నలభై సంవత్సరాల నుంచి వుంటున్నాడు. కలకత్తాలోనే ఒక చిన్న కూరగాయల దుకాణంవున్నది. అదే వాళ్ళ జీవితానికి ఆధారం. కులానికి శూద్రుడు. పేరు దేవీదీన్. ఎన్నో రోజులనుంచీ తీర్థయాత్రలు చేయాలనే కోర్కెయున్నది. ఇప్పుడు బదరీనాథ్ తీర్థాన్ని సేవించి వస్తున్నాడు.

రమానాధుడు ఆశ్చర్యంగా అడిగాడు : "అయితే, మీరు బదరీనాథ్‌యాత్ర చేసి వస్తున్నారా ? ఆ యాత్ర పడుచువాళ్ళవల్లనే కాదంటారే ? పెద్ద పెద్ద కొండ లెక్కాలని విన్నానే ?"

"ఇంతకూ కావల్సింది భగవంతుడి దయ ! ఆ దయవుంటే కొండలూ ఎక్కవచ్చు....! ఏమైనా చెయ్యొచ్చు....!"

"అయితే, పిల్లలూ వాళ్ళూ అంతా కలకత్తాలోనే వుంటున్నారా ?"

దేవీదీన్ కొంచెం వెర్రిగా తెచ్చిపెట్టుకున్నట్టుగా నవ్వి "పిల్లలంతా నా కంటే ముందే ఆ రాముడిదగ్గరకు చేరుకున్నారు.... నేనే ఈ లోకాన్ని పట్టుకు పాకులాడుతున్నాను ! నలుగురు కొడుకులు.... ఇద్దరికి పెళ్ళిళ్ళుకూడా అయినయ్యి ! నల్గురూ చచ్చిపోయారు" అంటూ. తన విషాదాన్ని కప్పిపుచ్చుకోడానికి మరో మాటు వెర్రిగా నవ్వాడు.

ఒక్కక్షణం ఆగి మళ్ళీ అన్నాడు. "మా ముసలిది ఇంకా బ్రతికేవున్నది. మా ఇద్దరిలో ఇప్పుడు పోటీపడ్డది. ముందు నేను చస్తానంటుంది అది. కాదు నేనే అంటాను నేను. మరి ఎవరం పోతామో ముందు ? ఒకవేళ వీలైతే, మా ముసలి దాన్ని చూపిస్తానులెండి ! ఇంత ముసలిదయినా ఆసక్తి చావలేదు ఇంకాను ! ఒళ్ళంతా నగలతో నింపుకుంటుంది. వ్యాపారంలో ఒక్క కానీకూడ బేరుపోనీ యదు కదా ! నాకు ఇదంతా చూసి నవ్వువస్తుంది. ఇంతకష్టపడి సంపాయించీ ఎవరికిపెట్టను చెప్పండి ? ఇప్పటికి సంపాయించినది చాలు. ఇక దుకాణం మూసి యాత్రలు చేసివద్దాము పదమంటాను. ఊహూఁ, అదా దుకాణాన్ని వదిల్తేనా ? ఇంకా వ్యాపారం చేయాలనీ, డబ్బు సంపాయించాలనీ దాని ఉద్దేశం! తను యాత్ర లకు వస్తే బేరం పాడయిపోతుందంటుంది. కానీ కానీ పోగుచేసి ప్రతి సంవత్సరం ఒక్కో కొత్తనగ కొంటూవుంటుంది. ఎవరు చూసి సంతోషించను చెప్పండి ? మనమా కాటికి కాళ్ళుచాచాం. మన తరువాత తినేవాళ్ళూ లేరు. అలాంటప్పుడు

ఈ నగలు ఎందుకు? ఈ డబ్బు ఎందుకు? అది సరేగానీ, కలకత్తాలో మీకు ఉద్యోగం ఎక్కడ బాబూ?"

"ఎక్కడా లేదు. వెళ్ళి వెతుక్కోవాలి!"

"ఐతే, వుద్యోగం దొరికేవరకూ మా ఇంట్లోనే వుండు. పైన రెండుగదులు వున్నై. వరండా వున్నది. క్రింద దుకాణం పెడుతుంది. పై గదుల్లో ఒక గది నీవు తీసుకో. నిదానంగా వుద్యోగం దొరికిం తరువాత ఇల్లు చూచుకుందువుగాని. మేడ ఎట్లాలేదన్నా యాభై వేలఖరీదు చేస్తుంది. నలభై సంవత్సరాలక్రితం హాబడా వచ్చాను. అప్పటినుంచీ ఎన్నో సుఖాలు, కష్టాలు అనుభవించాను. ఈ కండ్లతోనే చూశాను. ఇక ఎదురుచూడవల్సింది ఒక్కటే ఒక్కటి బాబూ! చావే! ఆ శుభఘడియకోసరం ఎదురుచూస్తున్నాను. మా ముసలిదాన్ని మాత్రం ఇప్పట్లో తీసుకుపోవద్దని రోజూ దేవుడికి మొక్కుతూ వుంటాను. మరి....అదికూడా లేక పోతే, ఈ మేడా, దుకాణం, డబ్బూ, నగలూ ఇవన్నీ ఎవరనుభవించేట్టు?" అని మళ్ళీ నవ్వాడు దేవీదీన్-నిర్విచారంగా తన కీ లోకమే పట్టనట్టు. ఈ లోకంలో తను ఒక ప్రేక్షకుడుమాత్రంగా సుఖ దుఃఖాలకు అతీతంగా వుండి నవ్వుతున్న దేవీదీన్‌ని చూస్తే రమానాధుడికి విపరీతమైన ఆశ్చర్యంవేసింది. సామాన్యవృద్ధులు ముఖం ముడ్చుకుని కొంప మునిగిపోయినట్టుగా వుంటారు ఎప్పుడూ! దేవీదీన్‌ని చూస్తే పూర్తిగా విరుద్ధం! ఈ క్షణకాల పరిచయంలో ఎంతో ఆత్మీయుడిలా ఏ అరమరికా లేకుండా తన జీవితాన్నంతా చెప్పాడు. రమానాధుడి జీవితాన్నికూడా, పూర్వపరిచయుడిలా తనే చెప్పసాగాడు.

"అయితే నీవు ఇంట్లో చెప్పకుండా వస్తున్నట్టుంది? .... .... పోతే, అమ్మాయిగారు ఎప్పుడూ నగలకోసం వేధిస్తూ వుండివుండాలె! అదీకాక అమ్మ గారికి (రాజేశ్వరి), అమ్మాయి (జాలప) మధ్య తరచుగా పోట్లాటలు జరుగుతుం టయ్యి అనుకుంటాను? ఈ పోట్లాటలూ, ఈ నగల వేధింపులూ వీటితో నీవు చాలా విసిగిపోయినట్టుంది?" అన్నాడు దేవీదీన్.

"అవును! నిజమే! నీ వెలా తెల్సుకున్నావు?"

దేవీదీన్ పెద్దగా నవ్వి "ఇదొక పెద్ద మంత్రం. చాలా కష్టపడితేగాని రాదు. ఊఁ....తరవాత....ఇంకా సంతానం లేదుకదూ?" అడిగాడు.

"ఇంతవరకూ లేదు."

"నీకంటే చిన్న తమ్ముళ్ళు వుండివుండాలె?"

"అరె....అంతే, ఇద్దరు తమ్ముళ్ళు వున్నారు! నీ కెలా తెల్సింది?"

దేవీదీన్ మళ్ళీ పెద్దగా నవ్వి "ఇదంతా మంత్రమహిమ! అత్తవారు కొంచెం వున్నవారనుకుంటాను? ఔనా?" అడిగాడు.

''ఆఁ వున్నవాళ్ళే!''

''కాని, డబ్బుకు తగిన తెగింపులేదు.''

''అవును బొత్తిగాలేదు.......... పెళ్ళయింతరువాత ఒక్కసారికూడా కూతుర్ని పంపమని అడగలేదు.''

''నాకు తెల్సు! మొగపిల్లవాడికోసం నానాపాట్లు పడతారు. చివరకు దొంగతనం అయినా చేస్తారు. పాపం, ఆడపిల్లకంటే....ఏమీ చేయరు!''

రమానాధుడికి మూడురోజులనుంచీ నిద్ర లేకపోవడంవల్ల కునికిపాట్లు పడుతున్నాడు. దేవీదీన్ తన మూటలోనుంచి ఒక దుప్పటితీసి తను కూర్చున్న చోట పరచి ''నీ విక్కడ పడుకో నాయనా! నేను అక్కడ కూర్చుంటాలే'' అన్నాడు.

రమానాధుడు నిద్రపోయాడు. దేవీదీన్ తడవతడవకూ అతనివంక పుత్ర వాత్సల్యంతో చూస్తున్నాడు.

# 22

రమానాధుడు చరచరా మెట్లుదిగి పోతూంటే, జాలపకు ఇక శాశ్వతంగా తన్ను విడిచిపోతున్నాడన్న అనుమానం కలగలేదు. అతను పోయిం తరువాత వుత్తరంతీసి చదివింది. భర్తమీద విసుక్కున్నదికూడాను! 'ఏమిటి నాదగ్గిర దాపరికం' అని విదిలించుకున్నది. "అసలు వీరికి డబ్బుతో ఇప్పుడింత అవసరం ఏమిటి? ఆఫీసు డబ్బు ఏమైనా ఖర్చుపెట్టలేదుగదా? ఖర్చుపెట్టకపోవడమేమిటి? పెట్టేవుంటారు! రత్తన్ డబ్బు షరాబుకు చెల్లువేసి వుంటారు. తిరిగి రత్తన్‌కు ఇవ్వడానికి ఆఫీసుడబ్బు పట్టుకువచ్చివుంటారు. అయ్యో భగవంతుడా! ఏమి టీ పాపఖర్మం? నే నేమైనా నగలుతేవాలని అడిగానా? నా దగ్గర ఎందు కీ అబద్ధాలు చెప్పడం? గొప్పలకుపోయి ఆపదల్లో పడటం దేనికి? జీవితంలో నగలే ముఖ్యం కాదని నాకు తెలియదా? ప్రపంచంలో నగలు లేనివాళ్ళు ఎంతమంది బ్రతకడం లేదు! నగలకోసం భర్తను కావాలని నిప్పుల్లోకి తోస్తానా? అంత నీచురాల్నా?'' అనుకున్నది.

జాలపకు పరిస్థితి అంతా అవగాహన అయింది. ఇలా చేసినందుకు భర్త మీద కోపంకంటే, అతనికి ఎక్కడ ఆపద సంభవిస్తుందోననే భయం ఎక్కువైంది. క్రింద తనకోసం ఎదురు చూస్తుంటారని గబగబా వెళ్ళింది, ఏ నగలు కావాలో ఇచ్చేద్దా మనుకుంటూ. కానీ, క్రింది గదిలో ఎవ్వరూ లేరు. వాకిట్లోకి పోయి బజారువంక చూసింది. ఎక్కడా కనుపించలేదు. పోనీ ఎవరినైనా పంపి ఎక్కడ వున్నారో పిలిపిద్దామనుకుంటే ఇంట్లో ఎవ్వరూ లేరు. ఇద్దరు మరుదులూ బడికి పోయారు. మామగారు ఆఫీసుకు పోయారు. గబగబా పైకిపోయి చేతి గాజులూ, మెళ్ళో హారం తీసి ఒక జేబుగుడ్డలో మూటకట్టుకున్నది. క్రిందికి వచ్చి గుర్రబ్బండి చేసుకొని మునిసిపల్ ఆఫీసుకు బయలుదేరింది.

దారికి రెండువైపులా చూస్తూ పోతున్నది. కానీ, రమానాధుడు ఎక్కడా కనుపించలేదు. ''అరే....ఈ కొద్దిసేపట్లోనే ఇంతదూరం పోయారా? ఒకవేళ ఆఫీసుటైము మించిపోతున్నదని తనూ బండిలోవెళ్ళారేమో?'' అనుకుంటూ, ''ఇంత క్రితం ఎవరైనా ఇటు బండిలో వెళ్ళగా చూశావా?'' అన్నది బండివాడితో.

''అవునమ్మా, ఒకరు ఇప్పుడిటుగానే పోయారు.''

జాలపకు కొంచెం ధైర్యం వచ్చింది. బండి ఆఫీసు దగ్గరకు వచ్చేసరికి

పన్నెండయింది. అక్కడ ఎవరి పనుల్లో వాళ్ళు తిరుగుతున్నారు. భర్త ఎక్కడ వుండేది ఎవరి నడగాలో ఆమెకు తోచలేదు. ఇంతలో అటునుంచి వస్తున్న నౌకర్ని పిల్చి "ఇదిగో, రమానాథుగార్ని కొంచెం పిలుస్తా?" అన్నది.

"నేను వారిని పిలుచుకురావడానికే పోతున్నానమ్మా మీరు వారింటి దగ్గర నుంచే వస్తున్నారా?"

"అవును, నేను ఇంటిదగ్గరనుంచే వస్తున్నాను. పదినిమిషాలక్రితమే వారు ఇంటిదగ్గరనుంచి బయలుదేరారు."

"ఇక్కడికి రాలేదే."

జాలప సంశయంలో పడ్డది. ఇక్కడికీ రాక, దారిలోనూ కనుపించక ఇంకెక్కడికి పోయివుంటారు? ఆలోచించినకొద్దీ ఆమెలో అవ్యక్తమైన భయాలూ, అశుభమైన అనుమానాలు కలగసాగినయ్యి. ఆఫీసులో ఆమెను ఎరిగినవాళ్ళు ఎవ్వరూ లేరు. రమేశ్‌బాబు వున్నా ఇంతవరకూ ఆయన ఎదుటపడి మాట్లాడి ఎరుగదు. చివరకు ధైర్యంచేసి "ఇదిగో! రమేశ్‌బాబుగార్ని ఇటు పిలుస్తా" అన్నది.

నౌకరు జాలపను రమేశ్‌బాబు దగ్గిరకు తీసుకుపోయాడు. ఎవరో స్త్రీ తన్ను కల్సుకోడానికి వచ్చారని విని రమేశ్‌బాబు వెంటనే ఆఫీసుగదిలోనుంచి బయటికి వచ్చాడు.

"మిమ్మల్ని కష్టపెట్టినందుకు క్షమించండి. వారు పదిహేనునిమిషాల క్రితం ఇంటిదగ్గిరనుంచి బయలుదేరివచ్చారు. ఇంకా ఇక్కడికి రాలేదా!" అన్నది జాలప.

"అయితే, మీరు శ్రీమతి రమానాథుగారా?....ఇంతవరకూ అతను రాలేదు. ఆఫీసు టైములో ఎక్కడికీ పోయే అలవాటుకూడా లేదే!" అన్నాడు రమేశ్‌బాబు.

జాలప ఒకమాటు నౌకరునంక చూసి "నేను....మీతో కొంచం మాట్లాడటానికి వచ్చానన్నది" రమేశ్‌బాబుతో.

"అయితే, లోపలికివచ్చి కూర్చోండి. ఎంతసేపలా నిలబడతారు. అతనెక్కడికి పోయాడా అనేదే ఆశ్చర్యంగా వున్నది! ఒకవేళ ఎక్కడైనా చదరంగం ఆడుతూ కూర్చోలేదుగదా?"

"లేదండి, వారసలు ఎక్కడికయినా వెళ్ళారేమోనని అనుమానంగా వున్నది. పదిహేను నిమిషాలక్రితం నాకు చీటీ రాసి యిచ్చారు. చూడండి.... వారేమైనా ఆఫీసుకు డబ్బు కట్టాల్సుందా?"

"అట్లా అడుగుతున్నారేం....? మీ కేమీ చెప్పలేదా అతను?"

"లేదండి....ఈ విషయంలో ఎన్నడూ ఒక్కమాటైనా నాకు చెప్పలేదు."

"అరె....అతని నడవడి ఏమీ అర్థంకాకుండావున్నదే? మొన్న వసూలైన డబ్బులో మూడువందలు కట్టాలి! నోట్లు జేబులోపెట్టుకు పోతూవుంటే ఎవరో కొట్టేశారని చెప్పాడు. ఆ మూడువందలూ ఇవ్వాళ జమకట్టవల్సిన రోజు. అయితే ఇత నెక్కడైనా (నవ్వి) దేవీపూజ చేస్తున్నాడా అమ్మాయి?" అన్నాడు రమేశ్‌బాబు.

సిగ్గుతో జాలప ముఖం ఎఱ్ఱపడ్డది. "వారిలో అలాంటి లోపాలు లేవండి. నిజంగానే పారేసుకుని వుంటారు, సిగ్గుపడి నాతో చెప్పలేదనుకుంటాను. నాతో మాటమాత్రం అనివుంటే ఎలాగో ఒకలా డబ్బు ఇచ్చివుందును" అన్నది.

"అయితే, ఇంట్లో డబ్బు వున్నదా?"

"మూడువందలే కదండి! ఇప్పుడే పట్టుకు వస్తాను!"

జాలప వచ్చి బండిలో కూర్చున్నది. చౌకుకు పోనీయమన్నది. ఆమె పరిచయుల్లో ధనికులూ, సహృదయులూ చాలామంది వున్నారు. జాలప అడగంగానే నిరభ్యంతరంగా మూడువందలూ ఇస్తారుకూడాను: కానీ సమయం లేదు. అందుచేత హారాన్ని అమ్మివేయడానికి నిశ్చయించుకున్నది.

చౌకునుంచి నేరుగా షరాబు బజారుకు పోయింది. ఒకమాటు ఈ చివరనుంచి ఆ చివరవరకూ కొట్లనన్నింటినీ కలయచూసింది. ఏ కొట్లోకి పోదామన్నా మోసంచేస్తారేమోనని భయంగా వున్నది. చివరకు ఒక కొట్టుముందు ఆగింది. అక్కడొక వృద్ధుడు కూర్చుని వున్నాడు, అతను చాలా అనుభవజ్ఞుడు. జాలపలోని భయాన్నీ, ఆదుర్దానీ చూసి వల్లోపడిందనుకున్నాడు.

జాలప నేరుగా అతని దగ్గరకుపోయి "ఈ హారాన్ని మీరు తీసుకుంటారా?" అడిగింది.

ముసలివాడు హారాన్ని పరికించి చూసి "మాకు నాలుగు డబ్బులు వచ్చేట్టుగావుంటే ఎందుకు తీసుకోమమ్మా? సరుకు అంత మంచిదికానట్టుగా వున్నది!" అన్నాడు.

"మేము అమ్మడానికి వచ్చాముగనక సరుకు బాగా లేదంటున్నారా?" ఇదే మీరు అమ్మడం అయితే, సరుకు బాగుండేది....అవునా? సరే, అదంతా పోనియ్యి, ఎంతకు తీసుకుంటావో రెండుమాటల్లో చెప్పేసెయ్యి."

"మీరే చెప్పండమ్మా."

షరాబు మూడువందల యాభైనుంచి నాలుగువందలవరకూ ధరపెట్టాడు. జాలప మారు మాట్లాడకుండా నాలుగువందలు తీసుకు మళ్ళీ ఆఫీసుకు పోయింది. తన చిన్నతనపు మమకారాలన్నీ ఆ హారంలో ఇమిడివున్నై. అయినా, దా

న్నమ్ముతూ ఆమె దుఃఖపడలేదు. పైగా గర్వపడ్డది! తను చేసిన ఈ మహా త్యాగాన్ని అతిత్వరగా భర్తకు తెలియచేయాలని, వారి పొగడని పొంధాలని అనుకుంటున్న దామె! 'ఒకవేళ ఆఫీసుకు వచ్చారేమో! వచ్చివుంటే యెంత బాగుండును' అనుకున్నది.

జాలపను చూడగానే రమేశ్‌బాబు "ఏమైంది? ఇంటికి వచ్చాడా?" అన్నాడు.

"అయితే ఇంకా ఇక్కడికి రాలేదా?" అంటూ నోట్లకట్టను విప్పి రమేశ్‌బాబుకు అందించి "ఇంకా ఇంటికి రాలేదు" అన్నది.

రమేశ్‌బాబు డబ్బు లెఖ్ఖపెట్టుకుని "సరిగా వున్నై. ఇంతకూ అత నెక్కడికి పోయినట్టూ? ఇక రాకుండా పోయేవాడైతే, కనీసం ఒక ఉత్తరమైనా రాసి పడేసిపోడా?.... నీవు మంచి సమయంలో వచ్చావమ్మా! ఈ డబ్బు విషయం ఎల్లాగా అని ధర్మసంకటంలో పడివున్నాను!" అన్నాడు.

జాలప బండి ఎక్కి ఇంటికి బయలుదేరింది. బండిలో వున్నంతసేపూ ఆమెకు తనేదో గొప్ప ఘనకార్యం చేసినట్టు గర్వంగా, ఆనందంగా వున్నది. 'ఇంటికి వచ్చి విచారంగా కూర్చునివుంటారు. మొదలు బాగా ఏడిపించిగానీ యదార్థం చెప్పకూడ' దనుకున్నది. తీరా ఇంటికి వచ్చేసరికి రమానాధుడు రాలేదని తెలిసింది.

"ఎండలో ఎక్కడికి పోయావు?" రాజేశ్వరి అడిగింది.

"పనుండి వెళ్ళాను. ఇవ్వాళ భోజనంకూడా చేయలేదు. ఎక్కడికి వెళ్ళారో?" అన్నది జాలప.

"ఆఫీసుకు పోయి వుంటాడు!"

"లేదు, అక్కడనుంచి ఇప్పుడే మనిషి వచ్చాడు" అంటూ జాలప పైకి పోయి మిగిలిన డబ్బు పెట్టెలోపెట్టి, కూర్చుని చమట తుడుచుకోసాగింది.

నాలుగుగంటలవరకు జాలప నిశ్చింతగానే ఎదురుచూసింది. కానీ పొద్దుగూకవస్తున్నకొద్దీ, ఆమెలో ఆందోళన బయలుదేరసాగింది. నిశ్చింతగా కూర్చోలేకపోయింది. ఒకమారు మేడ పై భాగానికి పోయి, అక్కడినుంచి నాలుగు వైపులా కలయచూసింది వస్తున్నారేమోనని. ఊఁహూఁ వస్తున్న జాడలు ఎక్కడా లేవు.

దీపాలు పెట్టిన తరువాత జాలపలో ఆందోళన, దానితోపాటు ఆరాటం కూడా ఎక్కువైంది. 'ఎక్కడికి పోయారు? ఆఫీసునుంచి ఇంటికి రాకుండా ఎక్కడికీ పోయే అలవాటులేదే! పోనీ స్నేహితుల దగ్గిరకు ఎక్కడికయినా పోయేరేమో అనుకున్నా. ఇంతసేపా? లేకపోతే, నేను డబ్బు చెల్లించిన విషయం తెలియక, ఇంకా డబ్బుకోసమే తిరగడంలేదుగదా? పాపం జేబులో

ఏమైనా డబ్బువున్నదో, లేదో ! ఉదయంనుంచి కాఫీ అయినా తాగారో, లేదో ? నాకు తెల్సినందుకు సిగ్గుపడి ఎక్కడైనా వుండిపోయారా, ఇంటికి రాకుండా ? ఎట్లా తెలియడం ? ఎవరి నడగడం ?'

జాలప అనేకవిధాల ఆలోచించింది. ఆలోచించినకొద్దీ ఆమె హృదయం బరువెక్కుతున్నది. చివరకు ఇంటిదగ్గర కూర్చోలేక రత్తన్‌బాయి ఇంటికి పోయింది. అక్కడికి రాలేదని చెప్పారు. పార్కులూ, మైదానాలూ, సినిమా హాళ్ళదగ్గిరా వెతికీ వెతికీ రాత్రి తొమ్మిది గంటలకు నిరాశగా ఇల్లు చేరింది.

అప్పటివరకూ జాలప కన్నీళ్ళను బలవంతాన ఆపుకున్నది. అంతా వెతికి ఇంటికి వచ్చేప్పుడు 'ఒకవేళ ఈలోపు ఇంటికి వచ్చారేమో' అనే సన్నని ఆశ ఆమెలో వుదయించింది. గడపలో కాలుపెట్టి ఇంటి లక్షణం చూస్తే వచ్చినట్టు లేదు. ఇల్లంతా బావురుమంటూవున్నది. అక్కడికీ ఆశను చంపుకోలేక వస్తూనే అత్తగారిని అడిగింది "ఆయన వచ్చారండీ ?"

"ఏ స్నేహితులదగ్గిరో కూర్చుని కబుర్లు చెప్పుతుంటాడు. వాడికి ఇల్లూ వాకిలీ పట్టిందీ ? ఉదయం పదిగంటలకు పోయిన పోవడం ఇంతవరకూ రాలే దంటే ఏమనుకోవాలి ?" అన్న దత్తగారు.

"ఏం పనివున్నా ఆఫీసునుంచి ఇంటికి వచ్చిగాని వెళ్ళరు ! అలాంటిది ఇవ్వాళ ఇంతవరకూ రాలేదు. గోపీని పంపమంటారా? కొంచెం వెతికివస్తాడు."

"పసివాడు వాడెక్కడ వెతుకుతాడు. ఇంకాసేపు చూసి అన్నం మూత పెట్టి పడుకో. ఇష్టంవచ్చినప్పుడు వస్తాడు !"

జాలప మాట్లాడకుండా పోయి పడుకున్నది. ఇంతవరకూ బలవంతాన ఆపుకున్న కన్నీళ్ళు కట్టలు తెంచుకున్నై. వెనక ముందు పరిస్థితుల్ని చక్కగా ఆలోచిస్తే ఇలా జరగడానికి ఎక్కువభాగం తనే కారణంగా కనుపిస్తున్నది జాలపకు. తను నోటిమీదుగా నగలు అడక్కపోయినా, అంతకన్నా వెయ్యిరెట్లు అధికంగా తన ప్రతిచేష్టా తనకు నగలు కావాలనే విషయాన్ని రమానాధుడికి తెలియచేసింది. మాటలూ, చేతలూ, చూపులూ అన్నీ నగలమీద మమకారాన్నే వ్యక్త పరుస్తుండేవి. అత వెన్నోసార్లు తనకు చాలా దగ్గిరకు వచ్చాడు. అయినా తను అతని ఆర్థికపరిస్థితుల్నిగాని, మానసిక కల్లోలాలనుగానీ ఏమాత్రం అర్థం చేసుకో లేదు. కనీసం ప్రయత్నమైనా చేయలేదు. కొత్తగా వచ్చిన భార్యను సంతోష పెట్టడానికి ప్రతి యువకుడూ వుత్సాహపడతాడు. అట్లాగని భార్య ముందాలోచన లేకుండా ఖర్చుపెట్టనిస్తే ఇలాంటి పరిస్థితులే ఏర్పడతయ్యి ! తను చేసుకున్న దానికి ఫలితం తానే అనుభవిస్తున్నది.

మంచంమీద పడుకుని యిల్లా ఆలోచిస్తున్న జాలపకు బయటి కాపలా

వాళ్ళ ఈలలు వినిపించినయ్యి. వెంటనే లేచి అత్తగారిదగ్గిరకుపోయి "వారింత వరకూ రాలేదు. మీరు లేచి భోంచేసి పడుకోండి" అన్నది.

"ఇంకా రాలేదా? ఎక్కడికి పోయాడు? పోయేటప్పుడు చెప్పాడా ఎక్కడికి పోయేదీని?" అన్నది రాజేశ్వరి.

"చెప్పలేదు."

"పోనీ, నీవైనా అడగలేదా?"

"ప్రయాణమైనవారిని ఎక్కడికని ఎలా అడగడం?"

"అయితే, వారిని లేపి చెప్పమంటావా?"

"ఇప్పుడు మామగారిని అనవసరంగా లేపడం దేనికి. వెళ్ళి భోజనంచేసి పడుకోండి."

"నేను, ఇప్పుడేమీ తినలేనమ్మా! ఏం పిల్లలో ఏం సంసారమో, పోనీ, ఈ పూట రానని ఎవరిచేతనైనా చెప్పి పంపకూడదూ?"

అత్తగారు వెళ్ళి పడుకున్నది. జాలపమాత్రం అలాగే కూర్చుని నిమిషాలను లెక్కిస్తూ రాత్రి గడిపింది.

# 23

రమానాధుడు వెళ్ళి వారంరోజులైంది. ఇంతవరకూ జాడాలేదు, జాబూ లేదు. ఎవరికి తోచినట్టు వాళ్ళు అనుకుంటున్నారు. రమేశ్‌బాబు రోజూ వచ్చి కనుక్కుపోతున్నాడు. ఆరోజున రమానాధుడు పన్నెండు గంటలాచాయల రైల్వే స్టేషన్‌వైపుకు పోవడం మేము చూశామని ఎవరో దయానాధుడితో చెప్పారు. దయానాధుడు బయట అయితే పెట్టలేదుగాని కొడుకు ఆత్మహత్య చేసుకున్నాడని తన వరకూ నిర్ధారణ చేసుకున్నాడు. ఇక కొడుక్కి ఆ గతి పట్టటానికి సర్వవిధాలా నీవే కారకురాలవని అత్తమామలు జాలపను దూషించడం ప్రారంభించారు. వీళ్ళు బాహాటంగా జాలపను ముఖానపట్టుకు అడిగేస్తున్నారు. "ఉన్న నాలుగు రోజులూ షికార్లనీ, సినిమాలనీ వాడి ప్రాణాలు కొరికావు। చివరకు వాడిని పొట్టన పెట్టుకున్నావు।" అనడం ప్రారంభించారు. ఒక్క రమేశ్‌బాబు మాత్రమే జాలప దుఃఖాన్నీ, బాధనీ అర్థం చేసుకున్నాడు. అప్పుడప్పుడు దయానాధునితో "అలాంటి మాటలు అనకండి. జాలప అసలే దుఃఖంతో కృశించిపోతున్నది" అనేవాడు.

"ఇప్పుడు దుఃఖించి మాత్రం ప్రయోజనం ఏమిటి? ఇల్లు తగలబెట్టి, నీళ్ళకు పరుగెత్తినంతమాత్రాన జాలిపడతామా?" అనేవాడు దయానాధుడు.

దయానాధుడు మామూలుగా లైబ్రరీనుంచి ఇంటికి వస్తున్నాడు. అసలు సాధారణంగానే మనిషి వ్యాకులంగావుంటూ వున్నాడు. ఇవ్వాళ మరీ ఇదిగా వున్నాడు.

ఇంటికి రాగానే రాజేశ్వరి అడిగింది. "ఏం అలా వున్నారు? ఎవరితోనైనా పోట్లాడారా?"

"లేదు ఎవరితోనూ పోట్లాడలేదు. ఈ అప్పులవాళ్ళతో ప్రాణం పోయేట్టుగా వున్నది. ఎంతమందిదగ్గిర అప్పులు చేశాడో ఏమో। బయట కాలుపెట్టడం భయం, పీక్కుతింటున్నారు. ఇవాళ విసిగిపోయి నాకు తెలియదు. ఇంటిదగ్గర అతని భార్య వున్నది వచ్చి అడగండని ఖచ్చితంగా చెప్పాను" అన్నాడు దయానాధుడు.

ఇంతలో జాలప వచ్చింది. మామగారన్నమాటలు ఆమె చెవులపడ్డయ్యి. అసలే కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నది. మనిషి సగమైపోయింది. ఈమాటలువిని కాసేపు విస్తుపోయింది. ఒక్క క్షణం తరువాత తెప్పరిల్లుకుని "అవును। వాళ్ళను నేరుగా

ఇంటికి పంపండి, సాధ్యమైతే తీరుస్తాను. లేకపోతే నాలుగురోజులు ఆగమని బ్రతిమలాడుకుంటాను" అన్నది.

దయానాధుడు మండిపడి "మహా ఇచ్చేదానివి బయలుదేరావు! ఎక్కడి నుంచి తెచ్చి ఇస్తావేం? వేలకువేలు అప్పు చేశాడు. ఒక్క దుకాణంలోనే ఏడు వందలు ఇవ్వాలట! అలాంటివి ఇంకెన్ని వున్నయో!" అన్నాడు.

"వాళ్ళ నగలన్నీ అలాగే వున్నై. నేను ఒకటి రెండుసార్లు మాత్రమే వాడాను! వాళ్ళను పంపించండి. వాళ్ళ నగలు వాళ్ళకు ఇచ్చేస్తాను. పోతే వాడి నందుకు ఐదూ పది పైన ఇయ్యమంటే ఇచ్చుకుందాం!" అంటూ పైకి పోబో తూండగా రత్తన్ వచ్చింది.

ఎంతో ఆదరంగా సానుభూతిని ప్రకటిస్తూ జాలపను తన రెండుచేతులతోటీ దగ్గరకు తీసుకుని "ఏమైనా జాడతెల్సిందా?" అన్నది రత్తన్.

రత్తన్ గొంతులో ధ్వనిస్తున్న సానుభూతికి జాలప కళ్ళు అనుకోకుం డానే చెమ్మగిల్లినయ్యి. వెంటనే అత్తమామలు చూపుతున్న కాఠిన్యంకూడా జ్ఞాప కానికి వచ్చింది. రుద్ధకంఠంతో "లేదు, ఇంకా ఏజాడా తెలియలేదు!" అన్నది.

"అసలు ఎందుకు వెళ్ళినట్టు? ఇద్దరూ పోట్లాడుకున్నారా?"

"లేదు,నీతోడు! ఒక్కమాటకూడా అనుకోలేదు. పైగా డబ్బు పారేసుకున్న విషయం నాకు చెప్పనేలేదు. నాతోమాటమాత్రం అనివుంటే డబ్బు ఇచ్చేదాన్ని. ఆరోజు రెండుఝాములవరకూ రాకపోయేసరికి ఎందుకు రాలేదో కనుక్కుందా మని ఆఫీసు దగ్గిరకు పోయా. డబ్బు పారేసుకున్న విషయం అప్పుడు తెలిసింది. వెంటనే ఇచ్చేశాను!"

"లేకపోతే, ఎవరినైనా అమ్మగారిని పట్టాడా? నీకెందుకు సందేహం, ముమ్మాటికీ అంతే జరిగివుంటుంది. ఒక్క పదిరోజుల్లో ఎక్కడవున్నదీ తెలిసి పోతుంది. చూస్తూవుండు."

"అట్లాగని విన్నావా?"

"వినలేదు నా అనుమానం."

"లేదు రత్తన్. వారినలా అనుమానించడానికి వీలులేదు. వారికా చెడు బుద్ధి లేదు...."

రత్తన్ నవ్వి "పిచ్చిదానా, నీకేం తెల్సు? వాళ్ళలా లేనట్టుగా కను పిస్తారు. అవే వాళ్ళ తెలివితేటలు....నైపుణ్యం!" అన్నది.

"దొంగ ఎవ్వరికంటా పడకూడదని బహు చాకచక్యంగా, జాగ్రత్తగా దొంగతనం చేస్తే, వాడిని పట్టుకునేవాళ్ళు అంతకన్నా చాకచక్యంగా వాడికి

తెలియకుండా పట్టుకుంటూరు....ఆ చాకచక్యం మనలో (ఆడవాళ్ళల్లో) వున్నది. ఆ మన స్తత్వంవుంటే ఏనాడో పట్టుబడేవారు."

"సరే, అదలా వుంచు, కొంచం ఏమైనా షికారుపోదాంపద."

"ఇప్పుడు తీరికలేదు .... అదికాక అసలే నామీద కారాలూ మిరియాలూ నూరుతున్నారు. ఇక షికారుకు వెళితే బ్రతకనిస్తారా? అయినా ఎక్కడికి వెళ్దామని నీ వుద్దేశ్యం?

ఎక్కడికీలేదు. కొంచం బజారుదాకా పోయివద్దామని."

"ఏం తీసుకోవడానికి?"

"షరాబు దుకాణాలకుపోయి నీ గాజుల్లాంటి గాజులు వున్నయ్యేమో చూద్దామని. మరి రమానాధుడుగారు ఎన్నాల్టికీ తేలేదాయె! ఇక నేనే తెచ్చుకుందామని బయలుదేరాను."

"ఏం నా గాజులమీద పట్టించావు? అయినా ఇవేం బాగున్నై? బజార్లో వీటికన్నా వెయ్యిరెట్లు మంచివి దొరుకుతయ్యి!"

"ఏమోనబ్బా! నా మనసంతా ఈ గాజులమీదనే వున్నది."

"ఇలాంటివే కావాలంటే చేసి రెడీగా వుండవు. ఆర్డర్ ఇచ్చి చేయిద్దామంటే, నెలో రెండు నెల్లో పడుతుంది. అంత నీకు త్వరగా కావల్సివుంటే ఈ గాజులు తీసుకో. నేను వేరే చేయించుకుంటాను."

"ఏమిటీ? నిజంగా ఇస్తా? ఎంతా ఆరువందలా?"

"అవును ఆరువందలు. నెలలతరబడి కంసాలి చుట్టూ తిరిగితే, చేసి ఇచ్చాడు నీకని ఇస్తున్నాను. ఇంకోరయితే ఇయ్యను" అంటూ జాలప తనచేతి గాజుల్ని తీసి రత్తన్‌కు తొడిగింది. రత్తన్ ముఖం సంతోషంతో వికసించింది. కృతజ్ఞతగా "ఆరువందలేకాదు, నీవెంతచెబితే అంత ఇస్తాను. నాకోసం ఎంత త్యాగంచేశావు? పోతే, ఒక్కవిషయం. ఇవిగో! యిప్పుడీ నాలుగువందలూ వుంచు. మిగిలిన రెండువందలూ తరువాత ఇస్తాను" అన్నది రత్తన్.

"ఏం ఫరవాలేదు. ఇవికూడా నీ దగ్గరేవుంచు. ఎప్పుడు వీలుగావుంటే అప్పుడే ఇద్దువుగాని."

"అట్లావద్దు. ఇవి నాదగ్గిరేవుంటే ఖర్చయిపోతయ్యి" అంటూ రత్తన్ నాలుగువందలూ జాలపచేతికి ఇచ్చింది. జాలప తన కన్నీళ్ళను బలవంతాన ఆపుకుంటూ డబ్బు తీసుకున్నది.

ఈ గాజుల్ని భార్యచేతికి తొడిగి రమానాధుడు ఎంతో ఆనందపడ్డాడు. ఇప్పుడతను వుంటే ఎంత దుఃఖపడేవాడో!

రత్తన్ జాలప కన్నీళ్ళను చూసింది. ఆమె మనస్సు ద్రవించిపోయింది "వద్దు జాలపా. నీవే వుంచుకో!" అన్నది సంకోచంగా.

"ఏం? సంకోచిస్తున్నావా? నేను కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నందుకా....? ఫరవాలేదు తీసుకో. ఇవి నాకు ప్రాణాలకంటే ఎక్కువ, అందుకే కన్నీళ్ళు పెట్టుకోవల్సివచ్చింది. పైగా నీ దగ్గరవుంటే నాదగ్గరవున్నట్టేనాయె! ఇంకెవ్వరికీ యీయకు."

"ఇతర్లకు ఎందుకిస్తాను నీజ్ఞాపకంగా నాదగ్గరే వుంచుతాను .... .... రమానాధుగారు లేకపోవడమే చాలా బాధగావుంది. నీవు బాధపడకు జాలప, పదిరోజుల్లో తప్పనిసరిగా తిరిగివస్తారు. నేను చెబుతున్నాగా తప్పనిసరిగా వస్తారు. ఈ విషయం వకీలుగారికికూడా తెలిసింది. వారెంతో బాధపడ్డారు. సామాన్యంగా అందరూ వకీళ్ళ మనస్సు కఠోరంగా వుంటుందనీ, వాళ్ళకు దయాదాక్షిణ్యాలు వుండవనీ అనుకుంటారు. మా వకీలుగా రలాకాదు. వీరి మనస్సు ఎంత మెత్తనను కున్నావు!"

జాలప నవ్వుతూ "ఇదిగో! రత్తన్, ఒకమాట అడుగుతాను ఏమీ అనుకోవుకదా? మరి నీకూ, వకీలుగారికీ మనస్సు కలుస్తుందా?" అన్నది.

నవ్వుతూ వికసించివున్న రత్తన్ ముఖం ఈ మాట వినగానే నల్లగా మాడిపోయింది. ఎన్నడో, పోగొట్టుకుని ఇక దొరకదని ఆశ వదలుకున్న నిధినిగురించి తిరిగి జ్ఞాపకం చేసినట్టయింది ఆమెపని.

"నేను యువతిననీ, వారు వృద్ధులనీ, వారికీ, నాకూ మధ్య పూడ్చుడానికి వీలులేని వృద్ధాప్యమనే అగాధం వున్నదనీ నే నెన్నడూ అనుకోను. బహుశా నీవు ప్రేమకూ, అనురాగానికీ, కారణం ధనం, అందం, వయస్సూ అనుకుంటు న్నావులావుంది. కానీ, అది ఒట్టిభ్రమ! ప్రేమకూ, అనురాగానికి కారణాలు ప్రేమా అనురాగాలే! మిగిలిన ఇంకేవీ వీటికి కారణాలుకావు. ఆ రెండూ వారిలో నాకు బహుళంగా లభిస్తూవున్నై. వారు నాకోసరం ఏమైనా చేయగలరు! ఈ వృద్ధాప్యంలో ఇంకా ఇల్లా శ్రమపడుతున్నారంటే, నాకోసరం కాదా? ఇంతకంటే నాకు కావల్సిందేముంది?" అంటూ రత్తన్ నవ్వి వెళ్ళిపోయింది.

"రేపుకూడా ఒకమాటు వచ్చిపో, నాకు ఒక్కదానికీ ఏమిటోగా వుంటుంది" అన్నది జాలప.

రత్తన్ వెళ్ళిపోయిన తరువాత జాలప మామగారి దగ్గరకు పోయి "ఇదిగో! ఈ డబ్బు, జమకట్టుకోమని చరణదాసుకు ఇయ్యండి" అన్నది.

"ఎక్కడిది?"

"రత్తన్‌కు నా గాజులు అమ్మాను."

దయానాధుడు విస్మయంగా జాలప ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

తనకూ, తన భర్తకూ కలిగిన ఈ ఎడబాటుకు కారణం ఈ విలాసవస్తువులే అనుకుంటూవుంటుంది. వాటిని ధరించకపోవడమే కాకుండా వాటిని ఇంట్లో వుంచడం, రోజూ చూస్తూవుండడంకూడా ఆమెకు కష్టంగానే వున్నది.

ఒక రోజు ఆమె మనస్సు మరీ అపరిమితంలో పడ్డది. ఆవేదనలూ, ఆవేశాలూ విపరీతం అయినయ్యి. అర్ధరాత్రివరకూ పిచ్చిదానిలా తన దగ్గిరవున్న విలాసవస్తువు లన్నింటినీ పోగుచేస్తూ కూర్చున్నది. సబ్బులు, దువ్వెనలు, స్నో, హెయిరాయిల్ బాటిల్స్, క్రీమ్‌బాటిల్స్, రిబ్బన్లూ, హెయిర్‌పిన్నులు, అన్నీ ఒక పెద్ద గుట్టవేసింది. అర్ధరాత్రివరకూ వాటిని పోగుపెడుతూనే వున్నది. ప్రొద్దునే వాటిని గంగలో కలపడానికి నిశ్చయించుకున్నది. ఇకమీదట ఆడంబరానికీ, విలాసానికీ ఏమాత్రం స్థానంలేని ఒక నవ్యజీవితాన్ని గడపాలనుకున్నది. అప్పటికి గాని ఆమె మనస్సు తేలికపడలేదు?

తెల్లవారుఝామున నాలుగుగంటలైంది. బజార్లలో మనుష్యులు తిరుగుతున్న సవ్వడి వినిపిస్తున్నది. జాలప నిద్ర లేచి, రాత్రి కట్టిన మూటను చేత పట్టుకుని గంగాస్నానానికి బయలుదేరింది. మూట చాలా బరువుగా వుండటంవల్ల ఒక్క చేత్తో మోయడం కష్టంగావున్నది. తడవతడవకూ చేతులు మార్చుకుంటున్నది. ఒకచంప బరువు, మరోచంప ఎవరైనా చూస్తారేమోననే బిడియం! మనిషి కుంచుకుపోయి నడుస్తున్నది. అప్పుడే ఎద్దుల్ని బళ్ళకు కడుతున్న బళ్ళ వాళ్ళు బాడుగకోసం బ్రతిమలాడుతున్నారు. అయినా వినిపించుకోకుండా నిండా ముసుగు కప్పుకుని గంగవైపుకు నడిచిపోతున్నది.

నది దగ్గరకు పోయేసరికి బాగా తెల్లవారింది. నడుస్తూన్న జాలప ఠక్కున ఆగిపోయింది. తనకు కొద్దిదూరంలో రత్తన్ కారు కనిపించింది. తలవంచుకుని తప్పుకుపోదాం అనుకున్నది. కానీ అంత దూరాన్నించే రత్తన్ జాలపను చూసింది. దగ్గిరకువచ్చి కారు ఆపి "జాలప! ఎక్కడికీ ఉదయాన్నే బయలు దేరావు? వీపుమీద ఆ మూట ఏమిటి?" అన్నది.

జాలప తలమీది ముసుగును ఒత్తిగిలించి "గంగా స్నానానికి" అన్నది.

"నేను స్నానంచేసి వస్తున్నాను. అయినా పద నీతోపాటు మళ్ళీ వస్తాను, నిన్ను మీ ఇంటిదగ్గిరకూడా దింపుతాను. తరువాత నేను ఇంటికి పోతాను. కారు ఎక్కు."

"వద్దు....వద్దు....నీవు పద. నీకు ఆలస్యం అవుతుంది."

కానీ, రత్తన్ వినిపించుకోకుండా కారులోనుంచి దిగివచ్చి జాలప చేతిలో మూటను బలవంతాన తీసుకుని కారులో పెట్టింది. "అబ్బ....ఏమున్నది మూటలో? ఇంత బరువుగా వున్నదేం? విప్పిచూడనా?" చేతులు నొప్పులు తీర్చుకుంటూ అన్నది రత్తన్.

జాలప సమాధానానికి యెదురుచూడకండానే రత్తన్ మూటవిప్పి చూసింది. విస్మయంగా "వీటిని యెక్కడికి పట్టుకుపోతున్నావు?" అన్నది.

"గంగలో పారేయడానికి" కార్లో కూర్చుంటూ ముక్తసరిగా సమాధానం చెప్పింది జాలప.

రత్తన్ విస్మయం మరీ ఎక్కువైంది. "పిచ్చేమైనా ఎక్కిందా? పద, వీటిని ఇంట్లో పడేసి మళ్ళీ వద్దాము" అన్నది రత్తన్.

"వద్దు..........వీటిని తప్పనిసరిగా గంగలో వదిలేసెయ్యాలి!"

"ఎందువల్లా?"

"కారును పోనీ చెబుతాను."

"అట్లాకాదు. మొదలు చెప్పాలి!"

"ఊహుం, కారు నడిపితేగానీ చెప్పను."

రత్తన్ కారును స్టార్టు చేసింది.

"ఇక చెప్పు."

"ఏమిటి రత్తన్, వీటిని నే నెందుకు పారేస్తున్నానో, నీవు వూహించుకోలేవా? నేను వేరే చెప్పాలా? ఇక ఇవి నా కెందుకు? ఎవరికోసరం? చూసి సంతోషించేవాళ్ళు లేనప్పుడు వీటి అవుసరం ఏమిటి? పైగా ఎప్పుడూ కళ్ళ ముందుండటంవల్ల నా మనసు, బాగా బాధపడుతున్నది. వీటిని చూస్తూవుండటం వల్ల మాన్పుకువచ్చిన వ్రణం తిరిగి చీముపడుతూ వున్నది."

రత్తన్ ఒక్క క్షణంసేపు ఏమీ మాట్లాడలేకపోయింది. అనాయాసంగా కళ్ళు చెమ్మగిల్లినయ్యి. రెండుక్షణాల తరువాత కొంచెం స్థిమితపడి "వద్దు.... ఇది చాలా అన్యాయం! ఆ అన్యాయమైనా నీకు జరిగితే నే నేమీ అభ్యంతర పెట్టేదాన్నికాదు. ఈ అన్యాయం నీకంటే ఎక్కువ రమానాధుడిగారిపట్ల జరుగుతుంది. వీటిని వారు ఎంత ప్రేమగా, ఎంత ఉత్సాహంతో తెచ్చారో ఆలోచించు! వీటి నిలా పారేస్తే వారి ప్రేమకు అపచారం చేసినట్టుకాదా? వద్దు, పారేయ వద్దు. వీటిని వారి జ్ఞాపకార్థాలుగా ఎంచి దాచిపెట్టు!" అన్నది.

"కాదు....రత్తన్, ఇవి వారి జ్ఞాపకార్థాలు కాదు. నా జీవితాన్ని ఇలా అధోగతి పాలుచేసిన దయ్యాలు. వీటిని చూస్తూవుంటే నా కింక మనశ్శాంతి అంటూ లభించదు. ఈ విలాస వస్తువులమీది మమకారమే నన్నింతచేసింది!"

రత్తన్ ఓటమిని స్వీకరించింది. జాలపని వదని వారించడానికి ఆమె సాహసించలేకపోయింది. పైమాట కిలా అన్నది: "నీ మనస్సు చాలా కఠోరమైనది జాలప! నేనైతే, ఈ పని చేయలేను."

# 24

రమానాధుడు వెళ్ళి దాదాపుగా నెలకావస్తున్నది. ఇంతవరకూ ఏవిధమైన ఆచూకీ దొరకలేదు. అక్కడికీ ప్రయాగనుంచి వెలువడే ఒక ప్రసిద్ధ దినపత్రికలో రమానాధుని ఆచూకీ తెలియచేసినవారికి ఐదువందలు బహుమతి ఇవ్వబడుననికూడా ప్రకటన చేశారు. అయినా ప్రయోజనం లేకపోయింది. జాలప రోజు రోజుకూ క్షీణించిపోతున్నది. జాలప దశను చూస్తే దయానాధుడికి కూడా జాలి కలగసాగింది. ఒకమాటు వచ్చి కూతుర్ని తీసుకుపోవల్సిందని వియ్యంకుడికి వుత్తరం కూడా రాశాడు. పరిసరమైనా మారిస్తే జాలప దిగులు కొంతవరకైనా తగ్గవచ్చునని అతని వుద్దేశ్యం! దీనదయాళుడు వుత్తరం చూడగానే పడుతూ లేస్తూ వచ్చాడు. జాలపని కొన్నాళ్ళపాటు తీసుకుపోదామని అనుకున్నాడు. కాని జాలప వెళ్ళ నిరాకరించింది.

"అయితే, ఇక్కడిలా కుళ్ళి కుళ్ళి చచ్చిపోదామనా?" అన్నాడు దీనదయాళుడు.

"అంతగా చస్తే పీడవదులుతుంది! ఈ దౌర్భాగ్యురాలికి ఆ అదృష్టం కూడానా?" అన్నది జాలప.

"అది కాదమ్మా, నీ విప్పుడు నాతో వచ్చినందువల్ల నష్టమేమిటి? శాహజాదీ, వాసంతి వాళ్ళుకూడా మొన్ననే వచ్చారు. కులాసాగా కాలం వెళ్ళబుచ్చవచ్చుకదా?"

"రాను, నాన్నా నేను రాను! నాకలా కులాసాగా గడిపే అదృష్టం లేదు. ఇక్కడి పరిస్థితులు ఇలా వుంటే, నేను వచ్చి పుట్టింట్లో కూర్చోనా? అత్తమామలు వంటరివాళ్ళయి పోతారు. నేను రాను."

"సరే గానీ, అమ్మా! అసలు విషయం ఏమిటీ? కొంతమంది అప్పులు చేశాడని అంటున్నారు. కొంతమంది ఆఫీసులో డబ్బుగాజేశాడని అంటున్నారు. ఏది నిజం?"

"ఏదీ నిజంకాదు! అన్నీ అబద్ధాలే"

"అయితే, మరెందుకని వెళ్ళినట్టూ?"

"నాకూ తెలియదు. నాకూ అదే ప్రశ్నగా వున్నది!"

"పోనీ, తండ్రితో ఏమైనా పోట్లాడాడా?"

"అబ్బే....అసలు తండ్రిదగ్గర తలకూడా ఎత్తరు. ఎన్నడూ యెదురు సమాధానం చెప్పయినా ఎరుగరు! కాకపోతే, వారికి దేశం చూడాలని

చాలా కోరికగా వుండేది. ఒకవేళ చెబితే పోనివ్వరేమోనని యిలా పోయి వుండాలి!"

"నీ కేమైనా కష్టంగావుంటే చెప్పమ్మా" ఒక్క క్షణం ఆగి "ఖర్చుకు ఏమైనా డబ్బు కావాల్నా? పంపమంటావా?" అన్నాడు దీనదయాళుడు.

జాలప అభిమానంగా అన్నది: "ఇక్కడ నాకేం కొరతలు వుంటయ్యి? మీ దయవల్ల నా కే కొరతా లేదు!"

దీనదయాళుడు కూతురు రాదని గట్టిగా నిశ్చయించుకున్నాడు. సాయంత్రము, తను వెళ్ళేప్పుడు ఒక యాభై రూపాయలు జాలప చేతికి అందిస్తూ "ఏ అవుసరానికయినా వుంటయ్యి. వీటిని దగ్గిర వుంచుకో" అన్నాడు.

జాలప నిరాకరిస్తూ "నాకు వీటి అవుసరం బొత్తిగా లేదు. మీ దయా, ఆశీర్వాదబలం, ఈ రెండూ వుంటే అంతే చాలు!" అన్నది.

దీనదయాళుడికి కళ్ళు చమ్మగిల్లినయ్యి. మారుమాట్లాడకుండా యాభై రూపాయలను అక్కడే మంచంమీద పడేసి వెళ్ళిపోయాడు.

కార్తీకమాసం వెళ్ళిపోయింది. నీరంతా సాంతంగా చివరిబొట్టువరకూ వర్షించి తేలికపడ్డ తెల్లని మేఘాలు నీలిఆకాశంలో పనీపాటా లేకండా అటూ యిటూ తిరుగుతున్నై. జాలప రోజూ మేడమీద వెల్లికింతలా పడుకుని నిరామయంగా మేఘాల క్రీడలను చూస్తూవుంటుంది. ఎన్నోరకాల మేఘాలు, కొన్ని అటూ, కొన్ని ఇటూ, కొన్ని బారులుతీర్చి, కొన్ని బడి వదిలింతరవాత ఇండ్లకు పోయే పిల్లల్లా వంకరటింకరగా తిరుగుతూ రకరకాల రంగుల్లో విచిత్రంగా వున్నై. అలా చూస్తూ వుండటంవల్ల శోకసంతప్తమైన జాలప హృదయానికి కొంత శాంతి, కొంత ఆనందమూ లభిస్తుందేది.

బాధల్లో మనుష్యులు సాధారణంగా అంతర్ముఖులౌతుంటారు. జాలపకూడా అలాగే అంతర్ముఖియై తన బాధలకు కారణాలను బయట వెతకడం మాని, తనలోనే వెతుక్కోవడం ప్రారంభించింది. "డబ్బులు చూసి సంతోషిస్తామేగానీ, దాని వెనుక వున్న చరిత్ర ఏమిటి? అది ఎలా వచ్చింది?" అన్న విషయాన్ని కొంచెమైనా ఆలోచించము! వారు తెచ్చిందే చాలని నగలను కులుకుతూ ధరించానేగానీ,లంచంరూపంలో వసూలైనడబ్బుతో తెచ్చారని ఒక్కరోజూ ఆలోచించలేదు. మరి అలాంటి పాపిష్టిసొమ్ముని యింట్లోకి తెచ్చుకుంటే కష్టాలురాక ఏమౌతయ్యి? కనుక నాకు తగిన శిక్షే పడ్డది" అనుకునేది తనలో తను. అంతేకాకుండా, క్రితం కొన్న విలాసవస్తువు లన్నింటినీ వాడటం పూర్తిగా మానేసింది.వాటిని చూస్తుంటే ఆమెకు పాముల్నీ, జెర్రుల్నీ చూసినట్టుగా వుంటున్నది.

"కఠోరంకాదు....మన బాధలకు కారణమైనవాటిని త్యజించలేకపోతే ఎలాగ ?" ఒక్కక్షణం ఆగి "వారు నాతో చాలా అమరికగా ప్రవర్తించారు. మనమైతే మనస్సిచ్చినచోట ఏమాత్రం దాపరికమూ వుంచం. మరి వా రెందుకనో హృదయాన్ని విప్పి నాతో ఎన్నడూ ప్రవర్తించలేదు. వారి స్థానంలో నేనే వుంటే ఇలా వెళ్ళేదాన్నా ?" అన్నది జాలప.

"పురుషుల స్వభావమే అంత ! పురుషులు తెరచివున్న పుస్తకం ఎన్నటికీ కాదు, మనం ఒక్కసారి చదివేయడానికి. ఎంతో హృదయాన్నిచ్చి, విశ్వాసాన్ని కలిగిస్తే....అప్పుడు మనమూ పుస్తకాల్లోంచి ఒకటి రెండు అక్షరాల్ని పెళ్ళగించ గలుగుతాం ! ఇది వారి తప్పుమాత్రమే కాదు. ఇందులో మన తప్పుకూడా వున్నది. మనమూ వాళ్ళదగ్గిర అలాగే దాపరికంగానే ప్రవర్తిస్తుంటాము. చప్పట్లు కొట్టాలంటే రెండుచేతులూ కలవాలి ! నీవరకు నీవు చెప్పు, కపటం లేకుండా సాఫీగా ప్రవర్తించావా ?"

"నేను ఎంత ఆలోచించినా, నా ప్రవర్తనలో కపటంగాని, దాపరికంగాని కనుపించటంలేదు."

"అబద్ధం."

జాలప తీవ్రంగా యోచించింది. రత్తన్ అన్నది నిజమే ! దాపరికం మొదలు తనవైపునుంచే ప్రారంభం అయింది.

గంగానది వచ్చింది. జాలప దిగి మూట తీసుకోబోతూవుండగా రత్తన్ ఆమె చేతుల్ని నెట్టివేసి "వద్దు....వీటిని తీసుకోనీయను....ఇక్కడే వదలి గంగలో కల్సినయ్యనుకో !" అన్నది.

"అదెలాగా ? కలవంది కల్సినయ్యనెట్లా అనుకోగలను ?"

"చూడు, నేను నీకు సోదరిలాంటిదాన్ని, నా మాట విను."

"నిజమే ! సోదరిలాంటిదానివే ! అట్లాగని, ఈ శూలాన్ని హృదయంలో ఎల్లా యిముడ్చుకోను ?"

"ఐతే, వినవన్నమాట ?"

"వినను."

రత్తన్ విరక్తిగా ముఖం రెండోపక్కకు తిప్పుకున్నది. జాలప తన మూటను తీసుకుని గబగబా నదిఒడ్డుకుపోయింది. అమాంతం మూటను నీళ్ళల్లో పారేసింది. తనలో ఎన్నాళ్ళనుంచో గూడుకట్టుకుంటున్న బలహీనతేదో శాశ్వతంగా తన్ను విడిచిపోయినట్టయింది జాలపకు. ఆమె ముఖం సంతోషంతో వికసించింది. జీవితంలో ఆమె ఇవ్వాళే ప్రథమంగా యదార్థమైన ఆనందాన్ని అనుభవించగలిగింది.

ఆమె స్నానంచేసి రాగానే రత్తన్ అడిగింది.

"పారేశావా ?"

"అవును."

"చాలా కఠినురాలివి !"

"అవును, ఇప్పుడయ్యాను. కొన్నాళ్ళక్రితమే ఐవున్నట్టయితే, ఇవ్వాళ ఈ పరిస్థితి వచ్చేదికాదు."

తరువాత ఇద్దరూ కారులో వెళ్ళిపోయారు.

# 25

రమానాథుడు కలకత్తా వచ్చి రెండు నెల్లయింది. ఇంతవరకూ దేవీదీన్ ఇంట్లోనే వుంటున్నాడు, ఎప్పుడూ డబ్బు సంపాదించే విధానాలగురించి తీవ్రంగా ఆలోచిస్తూవుంటాడు. కానీ, గడప కదిలి బయటికిరాడు. అవి కార్యరూపాన్ని దాల్చకుండానే అతని బుర్రలో శిథిలం అయిపోతున్నాయి. రోజూ బాగా చీకటిపడ్డ తరువాత దగ్గిరలోవున్న లైబ్రరీకి మాత్రం పోతూవుంటాడు. అంతకుమించి అతను మరే సమయంలోనూ బయటికి రావడం అంటూ జరగలేదు. బయటికివస్తే పోలీసులు పట్టుకుంటారని అతని భయం. ఆ లైబ్రరీకి పోవడమైనా తన ప్రాంతపు విషయాలు ఏమైనా తెలుస్తయ్యని, తనను గురించి ఎవరు ఏమనుకునేదీ పత్రికల ద్వారా తెల్సుకోవచ్చునే వుద్దేశంతోనేను. లేకపోతే అతనా మాత్రం బయటికయినా వచ్చేవాడుకాదు.

తండ్రి పత్రికల్లో ప్రకటించిన ప్రకటనను రమానాథుడు చూశాడు. అయినా ఆ ప్రకటన అతనిలో ఏమంత విశ్వాసాన్ని కలిగించలేకపోయింది. పోలీసులే తనను పట్టుకోవడానికి ఈ పన్నాగం పన్నేరనుకున్నాడు. కాకపోయినా ఇంటిదగ్గర 500 రూపాయల పారితోషికాన్నియడానికి ఎవరు సిద్ధంగా వున్నారని తనలో తనే వితర్కించుకున్నాడు.

ఒకరోజు అదే పత్రికలో జాలప రాసిన ఒక వుత్తరం ప్రకటించబడ్డది. వుత్తరం నేరుగా రమానాథుడినే సంబోధిస్తూ రాయబడ్డది. తన కేవిధమైన అప్పులూ లేవనీ, అన్నీ తీర్చబడ్డాయనీ, దయవుంచి రావల్సిందనీ అతి దీనంగా రాసింది వుత్తరం. అది చదివాక రమానాథుడి మనస్సు కొట్టుకులాడింది. వెళ్దామనుకున్నాడు. కానీ మరుక్షణంలోనే అతని కొక ఆలోచన తట్టింది. ఇదికూడా పోలీసులు చేసిన పనేనేమో? ఎవరు చూశారు. తన్ను పట్టుకోడానికి ఇదొక కొత్త ఎత్తు పన్నారేమో? ఒకవేళ వుత్తరం నిజంగా జాలపే రాసినా, అప్పులు తీర్చిన మాట యథార్థమే అయినా. తనెలా ఇంటికి పోవడం? పోగానే తలా ఒక మాట అనరా? నలుగురూ నాలుగువిధాల చెప్పుకోరా? ఎటూ అప్పులుచేసి పారిపోయాడనే పేరు రానేవచ్చింది. ఏనాటికయినా ఇంటికి పోవల్సివస్తే, తగినంత డబ్బు సంపాయించుకునే వెళ్తాను. లేదా ఇక ఇంటి ముఖం చూడను. ఈ జీవితంలో ఇక నాకు ఇల్లు అనేది లేదు. ఆ అదృష్టాన్నించి శాశ్వతంగా క్రిందకు తోయబడ్డాను.

తనలో తాను పై విధంగా అనుకునేవాడు.

దేవీదీన్ మేడకు క్రిందిభాగంలో రెండు గదులు వున్నై, రెండు గదులకూ మధ్య వరండా వున్నది. ఆ వరండాలోనే పగటిపూట దుకాణం పెడుతుంటారు. పోతే అటూ ఇటూ వున్న రెండుగదుల్లోనూ ఒకదాంట్లో సామాన్లు పెట్టుకుని, మరొకదాంట్లో వంటచేసుకుంటూవుంటారు. రాత్రిపూట కొట్టు సర్దింతరువాత వరండానే పడకగదిక్రింద వుపయోగించుకుంటూ వుంటారు. పోతే పైభాగంలో ఒకగది, గదిముందు కొంతమెల్లా వుంది. రమానాధుడు వచ్చినప్పటినించి దేవీదీన్ పూర్తి పైభాగాన్ని అతనికి వదలి తను క్రిందభాగంలోనే సర్దుకుంటున్నాడు.

దేవీదీన్‌కు ఇంటిపనిగానీ, కొట్టుపనిగానీ ఈషణ్మాత్రమైనా చేయవలసిన అవుసరంలేదు. అన్నీ ముసల్దే చేసుకుపోతుంది. బజారుకు పోయి సరుకులు తెచ్చుకోవడం, బేరం చూచుకోవడం, వంటవండటం-అన్నీ ముసలిదాని చేతి మీదుగా జరుగవల్సిందే! దేవీదీన్ సుష్టుగా భోంచేసి కబుర్లు చెప్పడం మినహాయిస్తే, చిన్న మెత్తుపనికూడా ముట్టుకోడు.

దేవీదీన్‌కు కొంచెం హిందీవచ్చు. ఉదయానే లేచి రామాయణమో, లేకపోతే కృష్ణలీలలో, చిలుకాగోరింకల కథలో, అదీ కాకపోతే మరియమ్మ కథలో పెద్దగా చదువుతూ కూర్చుంటాడు. రమానాధుడు వచ్చినప్పటినుంచీ అతను ఇంగ్లీషు కూడా చదవడం ప్రారంభించాడు. ఉదయాన్నే నిద్రలేవడంతో ఇంగ్లీషు ప్రైమరీ ఒకటి పట్టుకువచ్చి అక్షరాలు వల్లిస్తూ మధ్యమధ్య సహజమైన తన హాస్యాన్ని వెదజల్లుతూ తొమ్మిది గంటలవరకూ గడుపుతాడు.

కాని జగ్గోకుమాత్రం రమానాధు డిలా తమ యింట్లో తిష్టవేయడం సుతరామూ నచ్చలేదు. అక్కడికీ అతన్ని వూరికే కూర్చోనీయకుండా కొట్టు లెక్కలు, అమ్మకపు జమాఖర్చులు వేయిస్తూనేవుంటుంది. అయినా ఈ మాత్రం పనికని ఒకరిని పూర్తిగా భరించడం జగ్గో దృష్టిలో శుద్ధదండుగ వ్యాపారం. రమానాధుడు లేకముందు ఇవే లెఖ్ఖల్ని ఒక్క కానీ ఖర్చులేకుండా బేరానికి వచ్చినవాళ్ళనూ, వీళ్ళనూ బ్రతిమలాడి రాయించుకుంటూ వుండేది. కనుక రమానాధుడివల్ల ఏమైనా ఉపయోగంవున్నా, అది వుపయోగంగా మాత్రం జగ్గోదృష్టిలోలేదు. పోతే తన అభిప్రాయాన్ని ఖచ్చితంగా రమానాధుడి ముఖాన చెప్పేయడానికి వీలుకాకుండా వున్నది. రమానాధుడి అన్యోన్యంగా, సరళంగావుండే ప్రవర్తన జగ్గోను అంత నిర్మొగమాటంగా మాట్లాడనీయడంలేదు. అక్కడికీ వాళ్ళమీదా, వీళ్ళమీదా పెట్టి తన మనోభావాన్ని వెళ్ళగక్కుతూనే వుంటుందామె! అతనికికూడా ముసలిదానికి తను వుండటం ఇష్టంలేదని నికరంగా తెల్సు....కానీ, ఏంచేయగలడు? పరిస్థితులకు తలవంచక తప్పదు. తన ఆత్మాభిమానాన్ని చంపుకున్నాడు.

ఒకరోజు రమానాధుడు లైబ్రరీలో కూర్చుని చదువుకొంటుండగా, అతనికి అకస్మాత్తుగా రత్తన్ కనుపించింది. అతని గుండెలు వేగంగా కొట్టుకున్నై. హాల్లో చాలామంది కూర్చుని చదువుకుంటున్నారు, వాళ్ళ మధ్యనుంచి రత్తన్ కంటపడకండా, మెల్లిగా తలవంచుకుని బయటకివచ్చి, వరండాలో ఎడమవైపున వున్న పాతసామాన్లు పడేసినగదిలో కూర్చున్నాడు. అక్కడినుంచి రత్తన్‌ని పరికించి చూస్తున్నాడు. ఆమె వాలకం ఎవరినో వెతుకుతున్నట్టుగావుంది. ఆమెతో మాట్లాడాలనీ, అక్కడి పరిస్థితు లెలావున్నాయో తెలుసుకోవాలనీ అతని మనస్సెంతో తహతహలాడింది. కానీ, కాళ్ళుమాత్రం ఒక్క అంగుళమయినా అతని ముందుకు కదల్లేదు. జాలప ఎలావుంది? తననుగురించి ఏమనుకుంటున్నారు? పోలీసులు ఇంటిమీదికి వచ్చారా, రాలేదా? మొదలైన ప్రశ్న లెన్నో అతని బుర్రలో ఉదయించినయ్యి. ఈ ప్రశ్నలన్నింటినీ తత్కాలంలో సమాధానపర్చుకోవడానికి తగిన అవకాశంకూడావుంది. కానీ....కానీ, అతని కాళ్ళు కదల్లేదు. ముఖం చెల్లలేదు.... రెండుక్షణాల తరువాత రత్తన్ వెళ్ళిపోవడంకూడా జరిగింది.

ఒక్కొక్కసారి రమానాధుడికి ఈ రహస్యజీవితం మహా వెగటువేస్తోంది. తనంత తానే పోలీసులకు పట్టుబడదామా అన్నంతగా వుద్రేకపడతాడు. ఈ ఆజన్మకారాగారవాసంకంటే ప్రభుత్వం తరఫునుంచి వచ్చే ఒకటి రెండు సంవత్సరాల శిక్షే వాంఛనీయం అనుకుంటాడు....కానీ....కానీ మరుక్షణంలోనే ఆగిపోయి ఆ ఉద్దేశ్యానికి స్వస్తి చెబుతాడు.

ఈ విధంగా మరి రెండునెల్లు గడిచినయ్యి. పుష్యమాసంవచ్చింది. చలి మిక్కుటంగా వున్నది. రమానాధుడి దగ్గిర చలికాలపు బట్టలు ఏమీలేవు. అతను ఇంటిదగ్గర్నుంచి వచ్చేప్పుడు పైగుడ్డతో వచ్చాడు. ఇక్కడికి వచ్చిన తరువాత బట్టలుకొనే అవకాశం లభించలేదు. పగలంతా ఎలాగో గడిపేవాడు. రాత్రిపూట ఎముకల్నికొరికే ఆ చలిలో దుప్పటయినా లేకుండా గడపటం అసంభవం అయ్యేది. పాపం ఒక్కొక్క రాత్రి నిద్రలేకుండా చలికి వణుకుతూ కూర్చునేవాడు. అంతగా భరించలేకపోతే, తను కట్టుకున్న పంచనే దుప్పటిగా ఉపయోగించుకునేవాడు. అయినా చలి ఆగేదికాదు. దేవీదీన్ ఇతనికి వేసుకు పడుకోవడానికి ఒక చాప యిచ్చాడు. అది బాగా చినిగి పీలికలవడమే కాకుండా వాసనకూడా కొడుతున్నది. దేవీదీన్ ఇంట్లోవున్న పక్కకు పనికివచ్చే సాధనాల్లో అదొక్కటే కొంచెం మంచిది. ఇలాంటివాళ్ళు వేలకువేలు సంపాయిస్తారు. ఆపాదమస్తకం నగలతో నింపుకుంటారు పెళ్ళిళ్ళలాంటి సమయాల్లో ఎంతైనా ఖర్చుపెట్టడానికి సిద్ధపడతారు. కానీ, పక్కగుడ్డలూ, తుండుగుడ్డలదగ్గరకూ వచ్చేసరికి ఎక్కడలేని దరిద్రం వాళ్ళలోనే కనిపిస్తుంది. ఒక్కొక్కరోజు రమానాధుడు చలికి మరీ ఆగలేక ఆ చాపనే కప్పుకునేవాడు. సాయంత్రం అవుతున్నదంటే,

రాత్రి పడవల్సిన చలిబాధను జ్ఞాపకంచేసుకుని, అతని గుండెలు హడలిపోతూ వుంటయ్యి. పాపం రాత్రిపూట మధ్యమధ్యా కిటికీ తెరచి తెల్లవారడానికి ఇంకెంత సైముందా అని చూస్తూవుంటాడు.

ఒకరోజు రమానాధుడు లైబ్రరీకి పోతూ, దారిలో ఒక మేడముందు చాలా మంది దరిద్రులు ప్రోగుపడివుండటం చూశాడు. విషయం ఏమిటో తెలుసుకుందా మని తనూ దగ్గరకుపోయాడు. ఆ ఇంటి యజమాని ఆ దరిద్రులందరికీ దుప్పట్లు దానంచేస్తున్నాడు. దుప్పట్లు సన్నగా మహా చౌకబారుగా వున్నై. అయినా, అక్కడ వున్న దరిద్రులు ఒకళ్ళమీద ఒకళ్ళు విరగబడి ఆ దుప్పట్లను అందుకుంటున్నారు. రమానాధుడుకూడా దగ్గరకుపోయి ఒకదుప్పటి తీసుకుందామనుకున్నాడు. 'ఆ చుట్టు పట్ల తనను ఎరిగినవారు ఎవరూ లేరు. తీసుకుంటే నష్టం ఏమిటి? తనను యెవరు హేళనచేస్తారు? ఒకవేళ ఎగిరినవాళ్ళు వుంటేమాత్రమేం? తను బ్రాహ్మడు. పుట్టుకతోటే యాచించే అధికారం తన కొచ్చింది' అనుకుంటూ రెండడుగులు ముందుకు వేశాడు. కానీ దానాన్ని స్వీకరించడానికి అతని ఆత్మ సమ్మతించలేదు. ఇంతవరకు అతనెన్నడూ దానంపట్టి యెరగడు. అతనిలో వున్న ఆత్మాభిమానం అంతా ఒకసారి పైకుబికింది. వెళ్ళిపోవడానికి వెనక్కి తిరిగాడు. అదేసమయంలో సేటుగారి గుమాస్తా రమానాధుడిని చూడటం జరిగింది. రమానాధుడి ముఖాన కుంకుమబొట్టు వుండటం చూసి, తప్పకుండా బ్రాహ్మడు అయివుంటాడని నిర్ణయించుకున్నాడు. అంతమంది దరిద్రులు గుంపులు కూడినా, వాళ్ళలో ఒక్కడు కూడా బ్రాహ్మడు లేడు. 'విడివాళ్ళకు ఎంతమందికి ఎన్ని దానాలు ఇచ్చిమాత్రం ఏమిటి ప్రయోజనం? బ్రాహ్మడికి ఇచ్చినదారి వేరు. దాని ఫలితంకూడా వేరుగానే వుంటుంది!' అనుకుంటూ, సేటుగారి గుమాస్తా రమానాధుడిని "పంతులుగారూ! ఎక్కడికి పోతున్నారు? దుప్పటి తీసుకుపొండి" అన్నాడు. అతను మనస్సులో రమానాధుడికి దుప్పటి సమర్పించుకోవాలనుకున్నాడు.

రమానాధుడు వెనక్కి తిరిగి చూశాడు. తననుకూడా దానం పట్టడానికి పిలుస్తున్నాడని తెల్సుకుని నిలువునా క్రుంగిపోయాడు. నోటివెంట మాటకూడా సరిగా రాలేదు. అస్పష్టంగా "నాకు ఇష్టంలేదు" అంటూ ముందుకు నడిచాడు. ఇలా రమానాధుడు సరిగా సమాధానం చెప్పకుండా వెళ్ళడాన్ని గుమాస్తాగారు వేరుగా అర్థంచేసుకున్నాడు. కంబళులు మంచివిలేవని కోపంవచ్చి వెళ్ళిపోతున్నా డనుకున్నాడు. ఇంత ఆత్మగౌరవం, అభిమానం కల బ్రాహ్మడిని అతను జీవితంలో చూడలేదు. ఇంకో బ్రాహ్మడయితే నాలుగు తియ్యని కబుర్లు చెప్పి మంచి దుప్పటి గుంజుకుపోతాడు. ఇలామౌనంగా తిరస్కరించిపోయే బ్రాహ్మడిని అతనిదే మొదటిసారి చూడటం! దానం ఇచ్చినా ఇలాంటి

వాళ్ళకే ఇవ్వాలి అనుకుంటూ వెళ్ళి రమానాధుడి చేయిపుచ్చుకుని "దయచేయండి బాబూ! మీ కోసరం లోపల మంచి దుప్పట్లు వుంచాను! దానాన్ని స్వీకరించి మమ్మల్ని ఆశీర్వదించండి!" అన్నాడు గుమాస్తా, ప్రతిమలాడుతున్నట్టు.

అడక్కుండానే లభిస్తున్న యీ సౌభాగ్యాన్ని రమానాధుడు ఎక్కువసేపు తిరస్కరించలేకపోయాడు. వద్దువద్దంటూనే తను సేటుగారింట్లోకి నడిచాడు.

గుమాస్తా రమానాధుడిని ఇంట్లోకి తీసుకుపోయి ఒక వున్నతాసనంమీద కూర్చోపెట్టి, కాశీశాలువ, తమలపాకులూ, వక్కలూ యిస్తూ వాటితోబాటు ఒక పదిరూపాయల కాగితాన్నికూడా ఈయబోయాడు. కానీ రమానాధుడు డబ్బును స్వీకరించలేదు. జన్మజన్మాంతరాలనుంచీ కూడగట్టుకుంటున్న ఆత్మాభిమానం దుప్పటికే సరిపోయింది. ఇక డబ్బునుకూడా దానంపట్టడానికి సాహసించలేకపోయాడు.

"తమరు....ఈ కానుకనుకూడా స్వీకరించాలి. లేకపోతే, సేటుగారి మనస్సు చాలా నొచ్చుకుంటుంది" అన్నాడు గుమాస్తా.

రమానాధుడు విరక్తిగా అన్నాడు: "మీరు బలవంతం చేయడంవల్ల దుప్పటి తీసుకున్నాను. డబ్బు తీసుకోను. నేను వున్న ఇంటివాళ్ళు నాకు భోజనం పెడుతున్నారు. ఇతరఖర్చులన్నీ వాళ్ళే గడుపుతున్నారు. అలాంటప్పుడిక డబ్బుతో నా కేమిటి అవసరం?"

"మీలాంటివారికి దక్షిణ ఇవ్వకుండా పంపినందుకు సేటుగారు కోప్పడతారు."

"నేను చెప్పానుగా? వద్దన్నానని చెప్పండి."

"అయితే, సేటుగారు కొద్దిసేపట్లోనే వస్తారు. వారు వచ్చేవరకూ కూర్చోండి. మీలాంటి స్వార్థరహితులైన బ్రాహ్మలంటే వారి కెంతో భక్తి; పూర్తిగా భగవద్భక్తులు. త్రికాల సంధ్యావందనం చేస్తుంటారు. తెల్లవారుఝామున మూడుగంటలకు గంగాస్నానానికి పోతారు. స్నానం సంధ్యా అన్నీ ముగించుకుని ఎనిమిదిగంటలకు ఇంటికి వస్తారు అక్కడినుంచి పూజలో కూర్చుంటారు. మూడుగంటలదాకా పూజచేసి అప్పుడు రెండు మెతుకులు నోట్లో వేసుకుని విశ్రమిస్తారు. తిరిగి నాలుగుగంటలకు దేవాలయానికి పోయి, రాత్రి తొమ్మిదిగంటలకు ఇంటికి వచ్చి సంధ్య వార్చుకుని భోంచేసి విశ్రమిస్తారు.... అంత నిష్ఠపరులు! ఇప్పుడే వస్తారు కూర్చోండి!"

రమానాధుడు తనది ప్రయాగ అని చెప్పకండా కాశీ అని చెప్పాడు. దాంతో గుమాస్తాగారి భక్తిశ్రద్ధలు మరీ యెక్కువైనయ్యి. పోతే రమానాధుడికి

కడుపులో భయంగా వుంది. నిజంగా సేటుగారు వచ్చేస్తారేమో. ఏదైనా ధార్మిక మైన ప్రసంగం చేస్తారేమో. తను దేబిముఖం వేయవల్సివస్తుందే అనుకున్నాడు.

రెండు నిమిషాల తరవాత మళ్ళీ వస్తానని చెప్పి రమానాధుడు బయట పడ్డాడు.

శాలువా చూస్తూనే దేవీదీన్ అడిగాడు : "సేటు కరోడీమల్లు దగ్గరకు పోయావా ?"

"ఏ కరోడీమల్లూ ?"

"బజారులో ఎర్రని మేడలేదూ ? అతను !"

"ఆఁ, ఆ చివరిమేడ....అతని పేరు కరోడీమల్లా ? చాలా ధర్మాత్ముడిలా వున్నది....గుమాస్తా తీసుకునేవరకూ వదలలేదు !"

"ఏం ? అంత ధర్మాత్ముడిలా కనుపించాడా ? పాపం అతనివల్లనే ఈ భూమి ఇన్నాళ్ళు నిలబడింది. లేకపోతే ఏనాడో మునిగిపోయేది !" దేవీదీన్ హేళనగా నవ్వాడు

"నీవనేది నాకు అర్థంకావడంలేదు. ధర్మాత్ముడిలా కనుపించాడు కనక అలా అన్నాను. లేకపోయినా నిత్యం పూజలూ, పునస్కారాలూ చేస్తూ నిష్ఠగా జీవితాన్ని గడిపేవాళ్ళను ఇంకేమనాలి ?" అన్నాడు రమానాధుడు.

"వాడినా ? వాడిని మహాపాపి అనాలి ! దయా, జాలి అనేవి వాడిలో ఏకోశానా లేవు. వాడు ధర్మాత్ముడా ? వాడికి ఇక్కడొక జూట్ మిల్లు వున్నది. దాంట్లోవున్న పనివాళ్ళు ఎన్ని బాధలు పడుతుంటారో తెల్సా ? ఈ పట్నంలో వున్న ఇతర జూట్ మిల్లు యజమానులకన్నా వీడు మహాకర్కశంగా ప్రవర్తిస్తాడు. పనివాళ్ళను కొరడాలతో కొట్టిస్తాడు పాపం ఎవరైనా ఒక్కక్షణం ఆలశ్యంగా పనిలోకి వెళ్ళితే, రోజుకూలి కోసేయిస్తాడు. నెయ్యిలో కొవ్వు. బియ్యంలో మట్టిగడ్డలూ కలిపి లక్షలు సంపాయించాడు. మరి పాపపు సొమ్మును ఇలా అయినా ఖర్చుపెట్టకపోతే ఒక్కడికీ అరుగుతుందా ? వాడి నోరుపడ, వాడా?.... నే చెబుతున్నాగా, చివరకు పురుగులుపడి చస్తాడు! కోట్లకొలది ప్రజల్ని మోసం చేసి, లక్షలు ఆర్జించి పదిమందికి దుప్పట్లు కప్పితే పోతుందా చెప్పు? పుణ్యాత్ము డౌతాడా చెప్పు ?....అసలైన బ్రాహ్మ డెవ్వడూ వాడి ఇంటికి పోడు. నీవు తప్ప ఇంకెవడైనా బ్రాహ్మడు వచ్చాడా ?"

రమానాధుడు రాలేదన్నట్టు తల తిప్పాడు.

"నేను చెప్పలా ? ఎవ్వరూ పోరు ! ఒకవేళ పోయినా, ఎవరో లోభి, తెలియనివాడు పోవల్సిందే, తెలిసినవాడెవ్వడూ పోడు. చూడు రమాబాబూ ! నేను యింతవరకు ఎంతోమంది ఇలాంటి ధర్మాత్ముల్ని చూశాను. వాళ్ళను

ఎవ్వరినీ మనుషులు అంటానికి ఒప్పుకోను ! రాళ్ళను పూజించి, పూజించి వాళ్ళు కూడా రాళ్ళయిపోయారు ! హృదయంలేని రాళ్ళకు నైవేద్యాలు సమర్పిస్తూ, హృదయం, కోర్కెలూ, కదలిక - అన్నీవున్న మనుషుల్ని మలినంచేసేవాళ్ళను ఏమనాలో తోచడంలేదు....ఇతనికి మూడు ధర్మసత్రాలుకూడా వున్నై....అంతా మోసం !"

రమానాథుడు భోంచేసి దుప్పటి కప్పుకు పడుకుని తన భవిష్యత్తును గురించి యోచించసాగాడు. "ఇలా ఎన్నాళ్ళు గడపడం ? చివరకు అడుక్కుతినే స్థితికి వచ్చానే ! ఇంతకన్నా పోలీసులకు పట్టుబడటమో, ఏ గంగలోనైనా దూకి చావడమో మెరుగు ! ఇక యిలా గడపను. రేపు ఉదయాన్నే నౌకరీ వెతుక్కోవడానికి బయలుదేరుతాను. ఒకవేళ పోలీసులే పట్టుకుంటారా ? పోనీ, చిక్కేవదులుతుంది" అనుకుంటూ నిద్రపోయాడు.

# 26

తెల్లవారింది. రమానాథుడు ముఖం కడుక్కుంటున్నాడు. దేవీదీన్ ఒక ఇంగ్లీషు పేర్ల పుస్తకాన్ని పట్టుకువచ్చి "రమాబాబూ! ఏమిటీ, ఇంగ్లీషు విచిత్రం అయిన భాషగా వుంది? యస్. ఐ. ఆర్ - సర్ అయితే, పి. ఐ. టి - పిట్ ఎలా అవుతుంది? అదట్లావుంచి, బి. యు. టి - బట్ ఐతే, పి. యు. టి - పుట్ ఎల్లా అవుతుందో అర్థంకాకుండా వున్నది. నీవూ ఇలాగే బాధపడుతుంటావా?" అన్నాడు.

రమానాథుడు నవ్వుతూ "మొదట్లో నాకూ కష్టంగానే వుండేది. కానీ, ఇప్పుడు తేలిక అయింది" అన్నాడు.

"ఏమోనబ్బా, నాకుమాత్రం మహా కష్టంగావుంది. ఇది వస్తే, విశ్వేశ్వరుడికి కొబ్బరికాయలు కొడ్తానని మొక్కుకుంటాను!....సరేగాని, రమాబాబూ! నీకేమైనా పిల్లలా?"

"ఆఁ! పిల్లలే అనుకో! ఇప్పుడెందుకు వచ్చిందీ ప్రశ్న?"

"అది కాదు .... ఇంటిదగ్గరనుంచి ఏమైనా వుత్తరాలూ, పత్తరాలూ వస్తున్నయ్యా?"

"లేదు."

"మరి నీవేమైనా రాస్తున్నావా?"

"లేదు."

"అరె, భలేవాడివయ్యా! మూడు నెల్లు అయింది వచ్చి, ఇంతవరకూ ఇంటికి జాబైనా రాయలేదా? అక్కడ వాళ్ళెంత అమర్దా పడుతున్నారో? తల్లీ దండ్రి వున్నారుగా?"

"ఉన్నారు."

దేవీదీన్ మరీ గొంతు పెద్దదిచేసి "అయితే, నా మాట విని ఇవ్వాళే ఒక జాబు రాయి" అన్నాడు.

రమానాథుడు ఇప్పటికి చాలాసార్లు దేవీదీన్‌కు తన యదార్థస్థితిని చెబుదామనుకోవడము, చెప్పలేకపోవడమూ జరిగింది. కానీ, ఇవ్వాళ చెప్పకుండా వుండలేకపోయాడు. "నేను ఇంటిదగ్గరనుంచి చెప్పకుండా పారిపోయి వచ్చాను దేవీదీన్!" అన్నాడు గద్గదస్వరంతో.

"అది నాకు మొదట్లోనే తెల్సు!....తండ్రితో ఏమైనా పోట్లాడావా?"

"లేదు."

"అయితే, తల్లికీ, నీకూ మాటామాటా వచ్చివుండాలి!"

"అదికూడా ఏమీ జరగలేదు."

"అయితే, ఇక నీకూ, మీ ఆవిడకూ సరిపడివుండదు. ఆ అమ్మాయి విడిగా వుందామని అని వుంటుంది నీవు కాదు, కలిసేవుందామంటావు! అదీ కాక పోతే, ఆ అమ్మాయి నగలు కావాలని వేధించివుండాలి!"

"దాదాపుగా అలాగే జరిగింది. దానికి నగలంటే అంత ఆసక్తి ఏమీ లేదు. తెచ్చి ఇస్తేమాత్రం సంతోషపడేది. దాన్ని సంతోషపెట్టడానికి నేను వెనకా ముందూ ఆలోచించేవాడిని కాదు!"

దేవీదీన్ వెంటనే అన్నాడు: "అయితే, సర్కారువారి డబ్బేమైనా కాజేశావా?"

రమానాధుడికి దేవీదీన్ అడిగిన ఈ ప్రశ్న విద్యుత్‌ఘాతంలా తగిలింది. ఆఫీసు డబ్బువిషయం అతనికి చెప్పకుండా దాచిపెడదాం అనుకున్నాడు. కానీ ఇలా అకస్మాత్తుగా అనుకోని ప్రశ్న వేసేసరికి వెలాతెలాపోయాడు మనిషి. అతను సమాధానం ఆలోచించుకునేలోపే దేవీదీన్ అందుకున్నాడు:

"రమాబాబూ! నీవు చాలా చిన్నకుర్రవాడివి. ఇంకా నీకు జీవితానుభవం తక్కువ! ఈ ప్రేమా, మోహం వీటిల్లో పడకూడదు నాయనా! ఒక్కసారి పడ్డామా? ఇక జీవితాన్ని నాశనంచేసిగానీ వదలవు. ఇలా ప్రేమతో భార్య మాయలోపడి నాశనం అయినవాళ్ళను ఎంతోమందిని చూశాను. ఇక్కడే ఒక నాయుడుగారు వుండేవారు. ఈ ప్రేమా, నగలవల్లనే, చివరకు తన గొంతు తనే కోసుకు చచ్చాడు. తరువాత ఒక చౌదరిగారు ఉండేవారు. ఆయన నాకు బాగా పరిచయుడుకూడాను! భార్య నగలకోసరమని డబ్బు అపహరించి ఐదుసంవత్స రాలు జైలుకుపోయాడు. చివరకు, జైల్లోనే చచ్చిపోయాడు. ఇంకో పంతులు గారు ఇలాంటి సందర్భంలోనే నల్లమందూ, నూనె త్రాగి ప్రాణత్యాగం చేసు కున్నారు. ఇతర్ల విషయం అనవసరం. నావరకూ నేను మూడేళ్ళు జైలుచేసి వచ్చాను! అప్పుడు నీ ఈడులోనే వుండేవాడిని. క్రొత్తగా పెళ్ళయింది. ఈ ముసలిది అప్పుడు మహా అందంగా వుండేది. దీనికోసరం ప్రాణాన్నయినా ఇయ్య డానికి సిద్ధంగా వుండేవాడిని. ఇప్పటిలాగానే దీనికి నగలంటే అప్పుడుకూడా వెర్రి ఆపేక్ష! దీని ప్రేమలోపడి కన్నూ మిన్నూ కానక రోజూ ఏదో ఒక కానుక తెచ్చి ఇస్తూవుండేవాడిని. అయినా తను రోజూ అసంతృప్తిని చూపిస్తూనే వుండేది. ఆ రోజుల్లో నేను పోష్టుమ్యాన్‌గా వుండేవాడిని. మనియార్డర్లు పంచడం నా పని. ఒకరోజు ఇది లోలాకులు తెచ్చిపెట్టమన్నది. దొంగ సంతకం పెట్టి ఒక ముప్పైరూపాయలు కాజేశాను. నెలరోజులకు బయటపడ్డది. మూడేళ్ళు జైలు వేశారు. విడుదలయిన తరువాత ఇక మా వూరు పోకుండా ఇక్కడే వుండి

పోయాను. ఇంత అయినా, ఇంకా దీనికి నగలమీద మమకారం చావలేదు. ఇప్ప టికీ ఏదో ఒక నగ చేయిస్తూనేవుంటుంది..........అయితే నీవు పోలీసుల దృష్టిలో వున్నావన్నమాట! అట్లాగయితే నీవు రాయవద్దులే....నీ బదులు నేను రాయనా?" అన్నాడు దేవీదీన్.

"వద్దు....నామీద దయవుంచి ఆ పనిమాత్రం చేయబోకు! నాకు పోలీసుల కన్నా ఇంట్లోవాళ్ళదే భయం ఎక్కువ!"

"ఇంట్లోవాళ్ళు ఏమో అంటారని నీవేమీ భయపడ నవుసరంలేదు. వాళ్ళు నిన్ను ఎందుకు పోయావనికూడా ప్రశ్నించరు. నీవు కనపడటమే వాళ్ళకు పది వేలుగా వుంటుంది. పోతే, పోలీసుల విషయంలోనే జాగ్రత్త తీసుకోవాలి!"

"నాకు పోలీసులు పట్టుకుంటారేమో, శిక్ష వేస్తారేమోననే భయాలు బొత్తిగా లేవు. నా బాధల్లా ఇలాంటిపని చేశానే, ఇక అయినవాళ్ళకు ముఖం చూపడం ఎల్లాగా అనే! మొన్న నాకు మా ఇంటిపక్కనే వుండే ఒక వకీలుగారి భార్య లైబ్రరీలో కనుపించిందని చెప్పానే? ఆమె మా ఇంటికి తరచుగా వస్తూ వుంటుంది. ఎంతో సన్నిహితంగా వుంటుంది. ఆమె నడిగినట్టయితే ఇంటి పరి స్థితులన్నీ చెప్పేది. పైగా నేను కనిపించినట్టు ఎవ్వరికీ చెప్పేదికూడా గాదు. కానీ, ఏం చేయను? అడగలేకపోయాను....అంతేకాదు, హిః....హిః....హిః.... దాక్కున్నాను కూడాను!"

"మరయితే ఆమెకే ఒక వుత్తరం రాయరాదూ?"

"నా చేతిమీదుగా మాత్రం నేను రాయను!"

"ఇట్లా ఎన్నాళ్ళని?"

"చూద్దాం. ఎన్నాళ్ళయితే, అన్నాళ్ళు!"

"పోలీసులు నీ కోసరం వెదుకుతూ వుండాలి!" అంటూ దేవీదీన్ దీర్ఘ మైన ఆలోచనలో పడ్డాడు.

"నిజమే! పోలీసులు వెతుకుతూ వుండాలి. నేను మీ ఇంట్లో వున్నందుకు మీ నెత్తికేమైనా వస్తుందని భయపడకండి! నేను ఎల్లాంటి పరిస్థితిలోనూ, మిమ్మల్నిమాత్రం నాతోపాటు అధోగతికి లాక్కుపోను. అసలు ఇక్కడినుంచి ఇంతకన్నా సురక్షితమైన స్థానానికి పోదామని ఆలోచిస్తున్నాను" అన్నాడు రమా నాథుడు.

దేవీదీన్ నిర్భయంగా గర్వంగా అన్నాడు: "అబ్బే....నా కా భయం ఏమీలేదు. నేను ఆలోచిస్తున్నది నీగురించికాని, నాగురించికాదు. నేను ఒక పరాయి దేశస్థుడికి ఆసరా యిచ్చాను, అదేం తప్పుకాదు కదా? అంతే నాకు కావల్సింది. నే నాసరాయిచ్చిన నిరాశ్రితుడు పోలీసు నేరస్థుడో, ఇంకో నేర

స్తుడో అవన్నీ నాకు అనవసరం. కానీ నిన్ను నీవు జాగ్రత్తగా కాపాడుకో! ఇంకో విషయం....ముసలిదానికి ఈ విషయం ఏమాత్రం తెలియనీయబోక. దాని నోట్లో నువ్వుగింజకూడా నానదు!"

ఇద్దరూ ఒక రెండు క్షణాలు నిశ్శబ్దంగా వున్నారు. ఇద్దరికీ ఈ ప్రసంగాన్ని ఇంతటితో ఆపితే బాగుండుననిపిస్తున్నది. వున్నట్టుండి దేవీదీన్ ఏదో స్ఫురించినవాడిలా చెప్పసాగాడు: "అయితే రమాబాబూ! ఒక పని చేద్దాం? నేను వెళ్ళిరానా మీ ఇంటికి? మీ నాన్నగారినీ, అమ్మగారినీ చూస్తాను. మీ ఆవిడగారితో వివరంగా మాట్లాడి అసలు పరిస్థితులు ఏమిటో, ఏం చేస్తే మంచిదో కనుక్కొని వస్తాను. తరువాత కార్యక్రమాన్ని నిర్ణయించుకొందాము."

"కానీ నా దగ్గరనుంచి వచ్చినట్టు వుండకూడదు. మరి ఎల్లా అడుగుతావు? 'అసలు నీ కెందు కీ విషయాలు?' అనరా వాళ్ళు?"

దేవిదీన్ పెద్దగా "ఓస్ ఇది మహా తేలికైనపని. మెళ్ళో ఒకపోగు పడేస్తాను. ఎటూ ఎర్రగా వున్నానుగనుక బ్రాహ్మణు డనుకుంటారు. చేతులు చూసినట్టు నటిస్తాను....పోగానే మొదట మీ అమ్మగారు వస్తుంది. ఆమెను చూడంగానే 'తల్లీ నీ ముఖంలో పుత్రవియోగం కనిపిస్తున్నది. ఏ కొడుకైనా పరదేశంలో వున్నాడా అమ్మా!' అంటాను. ఇక అన్నీ ఆమె చెప్పుకువస్తుంది. ఈ విషయంలో నీవేమీ భయం పెట్టుకోనవసరంలేదు. నేను అన్నీ సరిచేసుకువస్తాను. పోతే, మాఘమాసంకూడా వస్తుంది. త్రివేణిలో స్నానంచేసినట్టుగా కూడా వుంటుంది" అన్నాడు.

ఇది వినగానే రమానాధుడి కండ్లు ఆనందంతో మెరిసినయ్యి. ఒక్కక్షణం మధురమైన కల్పనల్లో ఊపిరాడలే దతనికి.

"ఇంతకూ నా సలహా నచ్చిందా?" ప్రశ్నించాడు దేవిదీన్.

"ఫస్టుగావుంది....కానీ, పెద్దవాడివి బాధపడవల్సివస్తుందేమోనని ఆలోచిస్తున్నాను."

"బాధపడకండా పుణ్యం ఎక్కడినించి వస్తుంది? మళ్ళీ ఇంకోమాటు త్రివేణీతల్లి దర్శనం చేసుకుంటాను....నా మాట విని నీవుకూడా రా! పరిస్థితులు అనుకూలంగావుంటే అక్కడే వుందువుగాని, లేదా నాతో తిరిగివద్దువుగాని!"

"ఎంత తెలివితక్కువగా మాట్లాడుతున్నావు దేవిదీన్! నేనిలాంటి పరిస్థితుల్లో చస్తే రాను. స్టేషన్‌లో కాలుపెట్టగానే పోలీసులు పట్టుకుంటే ఏం చేయను?"

"పోలీసులు పట్టుకుంటారనా, భయపడుతున్నావు? వాళ్ళ తలకాయ! ఖూనీలూ, హత్యలూ చేసినవాళ్ళే నిర్భయంగా తిరుగుతూవుంటే, నువ్వెందుకు భయపడతావు? అలాంటివాళ్ళనే పట్టుకోంది నిన్నెన్ని గుండెల్తో పట్టుకుంటారు?

కాకపోతే కుక్కకు మాంసంముక్క వేసినట్టు వాళ్ళకు నాలుగు రూపాయలు పడేస్తేసరి!... అంతే....!"

ఈ మాటతో రమానాథుడు ఆలోచనలో పడ్డాడు. దేవీదీన్ చెప్పింది నిజమే కావచ్చు! అనుభవం లేకపోవడంవల్ల ఇదేదో మహా విపత్తనుకుంటున్నాను నేను. నిజంగా అనుభవం ఉన్నవాళ్ళకు ఇది అతి సామాన్యమయిన తప్పు! అయితే, వెళ్ళడమే వుత్తమమా? అయినా, ఈ మురికిగుడ్డల్లో అడుక్కుతినే వెధవలా ఎలా వెళ్ళడం? కనీసం ఒక కొత్తపాంటూ, షర్టూ వుంటే టీకుటాకుగా వెళ్ళవచ్చు....నన్ను చూడగానే అమ్మా, తమ్ముళ్ళూ, నాన్నా అందరు పరుగెత్తుకుంటూ వస్తారు. జాలపమాత్రం రాదు. కొంచెం అలుగుతుంది.... అయినా ఒక్కచూపు విసిరానంటే దాని అలకంతా మంచులా కరిగిపోతుంది.... పోతే ఎందుకు పోయావనిగానీ, డబ్బు ఎందుకు ఎత్తుకుపోయావనిగాని — అసలీ ప్రశ్నలే వేయరు! అని యోచిస్తున్నాడు.

ఏ సమాధానమూ ఈయకుండా యోచిస్తున్న రమానాథుని "ఏమిటి యోచిస్తున్నావు? వస్తావా?" అని అడిగాడు దేవిదీన్.

"నీవు, ఇంతగా చెబుతున్నావు గనక వస్తాను....కానీ, ఇలా యకాయకిన వద్దు, మొదలు నీవు పరిస్థితుల్ని చూసిరా!"

"అయితే....తరవాత వచ్చేమాట ఖచ్చితమేగా?"

"ఇంకొక్క విషయం."

"ఏమిటి?"

"ఈ బట్టల్లో ఎలా రాను? బట్టలు కుట్టించుకోవాలి!"

"దానికేం కుట్టించుకుందువుగాని."

"మరి నా దగ్గర డబ్బులేదాయె. ఇంటిదగ్గరకు పోయిన తరువాత డబ్బు ఇస్తాను."

"సరే, నీదగ్గరచదివే ఇంగ్లీషుకు గురుదక్షిణకూడా అక్కడే ఇస్తానులే!"

ఇద్దరూ ఒక్కసారి నవ్వారు.

"అట్లాకాదు, గురుదక్షిణకూడా నేనే నీకు ఇవ్వాలి. వెధవ ఇంగ్లీషు ముక్కలు నాలుగు చెప్పాను నేను. నీవు నాకు జీవితాన్ని గురించి ఎంతో నేర్పావు. ఒకవిధంగా నా కళ్ళు తెరిచావు. అదికాక ముక్కూ మొఖమూకూడా తెలియని నాకు ఆశ్రయాన్నిచ్చి ఎంతో వుపకారంచేశావు....నిన్ను నేను జీవితంలో మర్చిపోలేను. ఇదంతా ముఖస్తుతికి మాట్లాడుతున్నానని అనుకోబోక. యదార్థం!" అన్నాడు రమానాథుడు.

దేవిదీన్ హాస్యానికి "సరే వెళ్తాము. బ్రాహ్మడినికాదని నన్ను ఇంట్లోకి రానీయకపోతే....?" అన్నాడు.

"నిన్నా....? ఇంట్లోకి రానీయకపోవడమా ? అదెన్నటికీ జరుగదు. అసలు నీవిలా సాయంచేశావని తెలిస్తే ఇక వదిలిపెడతారా నిన్ను ? మానాన్నగారు సొంత సోదరుడుకంటే ఎక్కువగా చూసుకుంటారు. ఇక జాలప వదిలిపెట్టదంటే నమ్ము" అన్నాడు.

"అయితే, మా ముసలిది నన్ను చూసి మహా ఈర్ష్యపడుతుందిలే! గౌరవం అంతా నాకే లభిస్తున్నందుకు కుమిలి చస్తుంది....పోనీ మేమైనా ఈ చేసే వ్యాపారం అక్కడే చేయవచ్చు. పైగా పుణ్యక్షేత్రంకూడాను! కానీ మా ముసలిది వప్పుకోదు. బంగారం అంతా ఇక్కడే పాతిపెట్టినట్టు ఈ కలకత్తాను వదలనంటుంది సరే....ఖాయమేగా?"

"ఖాయమే!"

"కొట్లు తియ్యగానే పోయి బట్టలు తీసుకుంటాను. ఇవ్వాళే కుట్టటానికి ఇచ్చేస్తాను."

దేవీదీన్ లోపలికిపోయాడు. రమానాధుడు తియ్యని కలలుకంటములో మునిగిపోయాడు. ప్రయాగయొక్క నైసర్గిక స్వరూపం ఒక్కమాటు అతని కళ్ళముందు తిరిగిపోయింది. త్రివేణీ, ఖుశురోబాగ్, అల్‌ఫ్రెడ్‌పార్క్-వీటన్నింటినీ ఊహల్లోనే చూశాడు. తన మిత్రులూ తనూ తిరిగిన స్థలాల నన్నింటినీ జ్ఞాపకం చేసుకుని ...ఇప్పుడు కనపడితే, వాళ్ళంతా ఎలా ఆప్యాయంగా, ఆశ్చర్యంగా పలకరించేదీ తలచుకుని తన్మయుడై పోయాడు.

ఇంతలో దేవీదీన్ తిరిగివచ్చి "రమాబాబూ! పది కావస్తున్నట్టుంది. పద, బజారుకు పోయివద్దాం!" అన్నాడు.

"ఏమిటి పదయిందా?" రమానాధుడు వులిక్కిపడ్డాడు.

"పదేమిటి? పదకొండు కూడా కావచ్చును."

రమానాధుడు బయలుదేరి గడపవరకూ వచ్చాడు కానీ, ఎందుకనో ఆగిపోయాడు.

"ఏం? ఆగిపోయావేం?"

"నీవే వెళ్ళకూడదూ, నే నెందుకు?"

"భయమా?"

"కాదు....ఈ మాత్రానికి నే నెందుకులెద్దూ? నీవే పట్టుకురాక!"

"అదేమిటీ? నీవు లేకుండా ఎల్లా? నీవువచ్చి ఏ గుడ్డనచ్చితే, అది తీసుకో అక్కడే దర్జీకి ఇచ్చి వద్దాము"

"నువ్వు ఎల్లాంటిది పట్టుకువచ్చినా నాకు ఇష్టమే! సరే, పో."

"ఎందుకలా అనవసరంగా భయపడతావు? పోలీసులు నిన్ను ఏమీ చేయరు. అసలు నీవంక చూడనుకూడా చూడరు."

"నేను భయపడటంలేదు. రాదల్చుకుంటే ఎక్కడికయినా వస్తాను. కానీ ఎందుకులే అనవసరంగా అని.....!"

"భయపడటం లేదంటావేం అన్నీ స్పష్టంగా కనిపిస్తూవుంటే? బాధ్యత నాదన్నానుగా? ఇంకెందుకు భయం?"

దేవీదీన్ అనేక విధాల చెప్పిచూశాడు, కానీ రమానాధుడు వప్పుకోలేదు. పైకి తనకేమీ భయంలేదంటున్నాడేగానీ, అంతరంలో ఏమూలో భయమనేది వేధిస్తున్నది. "ఒకవేళ బయటికి పోగానే పోలీసులు పట్టుకుంటే? దేవీదీన్‌కు పరిచయంవున్నమాట యధార్థమే! అట్లాగని పోలీసులు ఈ విషయంలో పరిచయాన్ని లెక్కచేస్తారా? తనచేయిదాటిన తరువాత దేవీదీన్ మాత్రం ఏం చేయగలడు? తరువాత పశ్చాత్తాపపడి ప్రయోజనం ఏమిటి? ఖర్మంచాలకపోతే ప్రయాగకు పోవడం అటుంచి జైలుకుపోవటం జరుగుతుంది" అట్లా ఆలోచిస్తూ కూర్చున్నాడు. చివరకు విసిగి దేవీదీన్ ఒక్కడే బజారుకు పోయాడు.

ఒక గంట సేపటికి బజారునుంచి తిరిగి వచ్చాడు. అతను వచ్చేసరికి రమానాధుడు మేడమీద పచారుచేస్తున్నాడు.

"ఏమిటలా పచారు చేస్తున్నావు వంటమాని? టైము ఎంత అయిందో తెల్సా? పన్నెండయింది! ఇంటికిపోయే సంతోషంలో అన్నంకూడా తినవా ఏమిటి?" అన్నాడు దేవీదీన్.

"తొందరేముంది. చేసుకుంటాను."

"ఇవిగో! నమూనాలు పట్టుకువచ్చాను.........వీటిలో ఏది బాగుందో చెప్పు తీసుకుందాము" అంటూ దేవీదీన్ కొన్ని స్వదేశీ సిల్కు పీలికల్ని ముందు పడేశాడు.

రమానాధుడు వాటిని అటూ ఇటూ తిప్పిచూసి "ఇవి చాలా ప్రియం అనుకుంటాను చౌకలో ఏమీలేవా?" అన్నాడు.

"లేకేం? వున్నై. కాని, విదేశానివి!"

"ఏం? నీవు విదేశంబట్ట కట్టుకోవా?" ఆశ్చర్యంగా అడిగాడు రమానాధుడు.

"వెనక కట్టుకునే వాడినే. ఒక ఇరవై సంవత్సరాలనుంచీ మానేశాను. కాకపోతే, నాలుగు రూపాయలు ఎక్కువ అవుతయ్యి. అంతేనా?"

"అయితే....నీవు మహా గట్టివాడివి తాతా!" రమానాధుడు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

రమానాధుడు అన్న పైమాటకు దేవీదీన్ శరీరం పులకరించి నట్టయింది. ముఖం జేవురించింది, కళ్ళు ఒక్కసారి మెరిసినయ్యి. "ఈ దేశంలో పుట్టాము.

ఈ దేశంలో పెరుగుతున్నాము. చివరకు చచ్చినతరువాత ఈ దేశపు మట్టిలోనే కలిసిపోతాము. అలాంటప్పుడు ఈ దేశంకోసరం, ఇక్కడి ప్రజలకోసరం ఈ మాత్రమైనా చేయలేకపోతే ఇక మన బ్రతుకులు ఎందుకు తగలేయనా? చూడు రమాబాబూ! నేను యథార్థం చెబుతున్నాను. నాకు ఇద్దరు కొడుకులు వుండేవాళ్ళు. ఎలాంటివాళ్ళనుకున్నావు? రామలక్ష్మణుల్లా వుండేవాళ్ళు! కర్రలు పుచ్చుకుంటే ఇరవైమందికైనా సమాధానం చెప్పగల సమర్థులు! ఈ స్వదేశీ బట్టకోసమే ప్రాణాలను అర్పించారు. ఎలా అర్పించారో ఆద్యంతం చెబుతాను విను. నడిబజారులో పికెటింగు జరుగుతున్నది. శారీరకంగా ఎంత బలవంతులో మానసికంగా కూడా అంతే. దారుఢ్యతకలవాళ్ళు అన్నదమ్ములిద్దరూను! ఇంకేమిటి స్వరాజ్యపు ఆందోళనలో దూకారు. ఇద్దరూ పికెటింగ్ చేయడం మొదలుపెట్టారు. వాళ్ళు పికెటింగు చేస్తున్న కొట్లదగ్గిరకు ఒక్క మనిషయినా కొనడానికి వచ్చేవారుకాదు. ఇలా కొన్నాళ్ళు జరిగిన తరువాత వ్యాపారస్తులు ఈ వూరి కలెక్టరుగారితో మాట్లాడి ఇంగ్లీషు సిపాయిలను రప్పించుకున్నారు. ఇంగ్లీషు సిపాయిలువచ్చి పికెటింగ్ చేస్తున్నవాళ్ళను కొట్లముందునుంచి లెమ్మన్నారు. వూహూఁ. అన్నదమ్ములిద్దరూ రాతి స్థంభాల్లా నిలబడ్డారేగాని కదల్లేదు. ఇట్టాకాదని వాళ్ళమీదకు గుర్రాలను తోలారు. అయినా కదలలేదు. ఇక లాఠీలతో కొట్టడం ప్రారంభించారు. నిజంచెబుతున్నానుబాబూ, వాళ్ళిద్దరూ కర్రలుతీసుకుంటే, ఆ ఇరవైమంది ఇంగ్లీవాళ్ళనూ పచ్చడిలా నంజుకునేవాళ్ళు! కానీ....కానీ....అహింస....ఆ అహింస కోసరమనే నోరెత్తకుండా దెబ్బలన్నింటినీ భరించి వూరుకున్నారు. చివరకు స్పృహ తప్పి పడిపోయారు....ఆరోజు రాత్రే హాస్పిటల్లో చనిపోయారు.

"ఇంతటితోటే అయిపోయిందనుకున్నావా? ఆ మరుసటి వుదయాన్నె ఖాళీ అయిన కొడుకుల స్థానాన్ని నేను పూర్తిచేశాను. నాచుట్టూ ఎప్పుడూ వందల కొలది ప్రజలువుండేవారు. ఏ అపచారం జరుగుతుందోనని చివరకు వ్యాపారులు దిగివచ్చారు. విదేశవస్తువులు అమ్మమని ప్రమాణాలు చేశారు. ఆ తరువాత నేను విరమించాను. ఆనాటినుంచీ ఈనాటివరకూ నా ఇంట్లోకి విదేశపు అగ్గిపుల్లకూడా రాలేదు!"

రమానాధుడు దేవీదీన్ని చాలా ఆశ్చర్యంగా చూశాడు. అతని దర్శన భాగ్యం, లభించడంవల్ల తన జన్మ ధన్యమైందనుకున్నాడు.

"దేవీదీన్, నువ్వింత త్యాగివనుకోలేదు" గద్గదంగా అన్నాడు రమానాధుడు.

దేవీదీన్ రమానాధుడివైపు గర్వంగా చూసి "మరేమనుకున్నావు? మా సాధారణులు చేసినట్టు త్యాగాలు పెద్దపెద్దవాళ్ళు ఎవ్వరూ చేయలేరు.

లెక్చర్లు దంచడం, కబుర్లు చెప్పడం చాటుగా విదేశపు మత్తు పదార్థాలను సేవించడం-మినహా పెద్దవాళ్ళు చేసేది ఏమీవుండదు. పైగా మహా గొప్ప దేశ భక్తులైనట్టు విర్రవీగుతారు. బయటికి తిరిగేప్పుడు నలుగురికీ చూపడానికి నాలుగు ఖద్దరు చొక్కాలు కుట్టిస్తారు. ఇంట్లోకి పోయిచూస్తే వాళ్ళబండారం బయటపడుతుంది. భార్య కట్టుకునే చీరె విదేశపుది, తన జేబుగుడ్డ విదేశపుది, లాంతరు విదేశపుది. పిల్లలుతాగే పాలడబ్బాలు విదేశపువి. ఇంత అయినా మేము దేశాన్ని ఉద్ధరిస్తామంటారు కదా వీళ్ళనోళ్ళుపడ! ఒకసారి మహాసభలో ఒక మహానాయకుడు స్వరాజాన్ని గురించి మోతగా వుపన్యసిస్తున్నాడు. ముందున్న బల్లపగిలిపోయేట్టు గుద్దుతున్నాడు. ఎగురుతున్నాడు. గంతులువేస్తున్నాడు. చివరకు సభ ముగిసిన తరువాత అతను రొప్పుతూ క్రిందికి వచ్చాడు. అప్పుడు నే నతని దగ్గరకు పోయి ఇలా అడిగాను 'ఏమండీ, మీ ఉద్దేశ్యంలో స్వరాజ్యం అంటే ఎలా వుంటుంది. మీరుకూడా హాయిగా, ఇప్పుడున్న ఇంగ్లీషు గవర్నర్లలాగా విమానాల్లో తిరగడం, చిన్నకార్లలో షికార్లుచేయడం, సుష్టుగా విందు లారగించడం, మీ బంధువులందరికి పదవులు యిచ్చుకోవడమే గదా? కాదా? అట్లాంటి స్వరాజ్యం వల్ల మీరూ, మీ బంధువులకూ లాభం కలుగవచ్చు. పదవులు రావచ్చును. అశేషంగావున్న ఈ దేశపు పీడిత ప్రజానీకానికి ఏమి ప్రయోజనముండదు అన్నాను. ఇట్లా అడిగినందుకు ఆ మహానుభావుడు నావంక మిర్రి మిర్రి చూసుకుంటూ పోయాడు. నిజం చెప్తున్నాను: స్వరాజ్యంవచ్చి ఈ ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళకే గనక అధికారం యిస్తే బీదసాదల్ని అన్నంలో నంచుకుంటారు" అన్నాడు దేవీదీన్.

రమానాథుడికి చివరిమాట కొంచం కష్టాన్ని కలిగించింది. ఇంగ్లీషు చదివిన వాళ్ళల్లో (స్వల్పమేకావచ్చు) తనుకూడా ఒకడు కావటంవల్ల తమమీదవున్న ఈ దురభిప్రాయాన్ని పోగొట్టడానికి "అట్లాకాదు దేవీదీన్! ఇప్పటి చదువుకున్న వాళ్ళల్లో చాలామంది బీదవాళ్ళ సంతానమే. వాళ్ళు అధికారానికివస్తే నీ వన్నంత అన్యాయం జరగదులే!" అన్నాడు.

"అయితే, స్వరాజ్యంవస్తే ఈ పది పదిహేనువేల రూపాయల జీతగాళ్ళు వుండరా? ఈ వకీళ్ళ దోపిడీ, పోలీసుల అత్యాచారాలు పోతయ్యా?"

ఒక్క క్షణం రమానాథునకు సమాధానం దొరకలేదు. కొంచంసేపు ఆగి అన్నాడు. "అప్పటి పరిస్థితులు ఇప్పటి పరిస్థితులకు పూర్తిగా భిన్నంగావుంటయ్యి. అప్పుడు అధిక సంఖ్యాకులు ఏం చెబితే అది జరుగుతుంది. అధిక సంఖ్యాకులు ఎప్పుడూ రైతులూ కూలీలే అయివుంటారుగదా?"

దేవీదీన్ చిన్నగా నవ్వి "నేనూ ఆ రోజుకోసరమే ఎదురు చూస్తున్నాను. ఇంకొక పదేళ్ళు బ్రతికి ఆ శుభఘడియ చూడగలిగితే ? ఎంత అదృష్టశాలిని !" అన్నాడు.

తరువాత దేవీదీన్ వెళ్ళిపోయాడు. చీకటిపడ్డతరువాత తమ నిర్ణయం ప్రకారం దేవీదీన్ ప్రయాగకు వెళదాం రమ్మన్నాడు రమానాధుడితో. కానీ, రమానాధునకు ముఖంచెల్లలేదు; ప్రయాణం ఆగిపోయింది.

# 27

కొద్దిరోజులు గడిచినై. ఒకరోజు రాత్రి ఎనిమిదిగంటలా ప్రాంతంలో రమానాధుడు లైబ్రరీనుంచి తిరిగివస్తున్నాడు. దారిలో నలుగురైదుగురు యువకులు ఒక పత్రికలోపడ్డ శతరంజి పోటీనిగురించి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మాటల్ని వింటూ ఒక్కక్షణం ఆగాడతను. ఆ పత్రిక ప్రజామిత్ర. దానిలో ఒక పందెపు రేఖాచిత్రాన్ని అచ్చువేశారు. ఆ ప్రకారం ఆడి ఆటకట్టించిన వాళ్ళకు యాభై రూపాయలు బహుమతి అని ప్రకటించారు. ఆ పందేన్ని గురించిన వివరాలన్నీ తెల్సుకోవా లనిపించింది రమానాధుడికి. ఆ నలుగురు అపరిచిత యువకుల్ని అడిగాడు. "మీరు మాట్లాడుకునే పోటీ ఆట ఏ పత్రికలో వున్నదో, కొంచెం యిస్తారూ? నేనూ చూస్తాను" అన్నాడు. నలుగురూ తల యెత్తి చూశారు. కంబళి కప్పుకుని దరిద్రాకారంగా వున్న ఒక వ్యక్తి కొమ్ములు తిరిగిన ఆటగాళ్ళకే కుదరని పోటీనిగురించి వివరాలు అడగడం చూసి వాళ్ళకు నవ్వువచ్చింది.

ఆ నలుగురిలో ఒక అతను యిలా అన్నాడు. "మహా మహావాళ్ళకే అర్థంకాలేదు. నీ కేమర్థం అవుతుంది? చూసిమాత్రం ప్రయోజనం ఏమిటి?"

రెండో అతను, హేళనగా (కానీ హేళన అన్నట్టు తెలియకుండా) అన్నాడు "అదేమిట్రా అలా అంటావు? ఏ పుట్టలో ఏ పామున్నదో? ఎవరు చూశారు, ఇతనే సాల్వు చేస్తాడేమో!"

మొదటి యువకుడు రమానాధుడికి ప్రజామిత్రకాపీ ఇచ్చాడు. అందులో శతరంజి ఆటపోటీని, ఆట ఆకారాన్ని ముద్రించారు. దాన్ని చూసి రమానాధుడు విపరీతంగా ఆశ్చర్యపడ్డాడు. అతనెక్కడోగానీ, సరీగా ఇలాంటి పందాన్నే కట్టించాడు! ఎక్కడ ఆడివుంటానా అని యోచించసాగాడు.

నలుగురిలో ఒక అతను మళ్ళీ అందుకున్నాడు. "ఏమండీ, సాల్వుచేసినట్టున్నారే?" అన్నాడు.

రెండో అతను "ఇప్పుడు చేయకపోయినా ఇంకో రెండు నిమిషాల తరువాత తప్పకుండా చేస్తాడు!" అన్నాడు.

మూడో అతను "ఈయన కిలాంటివి ఒక లెఖ్ఖా? ఇంతక్రితం ఎన్ని చేశాడో!" అన్నాడు.

"ముఖం చూస్తే అలాగే కనుపిస్తున్నది!"

నలుగురూ నోటికివచ్చినట్టు హేళనచేశారు.

రమానాథుడు తల పైకి ఎత్తి "నేనీ ఆటను గెలుస్తానని ఖచ్చితంగా చెప్ప లేను. కానీ, కానీ ఇదే ఆటను ఎక్కడో ఆడాను" అంటూ వాళ్ళదగ్గిర కాగితము, పెన్సిలూ అడిగిపుచ్చుకుని, ఆట నమూనాను గీసుకొని ఇంటికిపోయాడు.

రాత్రి పన్నెండు గంటలయింది. రమానాథుడు ఇంకా నిద్రపోలేదు. ఆట నమూనా కాగితాన్ని ముందువేసుకు కూర్చున్నాడు. ఈ ఆటను తను ఎక్కడ చూసిందీ జ్ఞాపకం చేసుకోవడానికి విపరీతంగా ప్రయత్నం చేస్తున్నాడు. ఇదే పందేన్ని వెనక తను ఒకసారి ఆడినట్టు జ్ఞాపకం. కానీ, ఎక్కడ ? ఎవరితో ? అన్నది జ్ఞాపకంలేదు. అదిగనక జ్ఞప్తికివస్తే ఆట విధానం అంతా సులువుగా అర్థం అయిపోతుంది. చివరకు బుర్ర ఒకవిధంగా చెడగొట్టుకున్న తరువాత జ్ఞాపకం వచ్చింది. రాజాసాహెబుగారితో అత నిదే పందేన్ని ఆడాడు. గెలిచాడుకూడాను ! తరువాత ఆట ఎలా ఆడింది, ఎలా ఎలా ఎత్తువేసిందికూడా జ్ఞాపకానికి వచ్చింది. రెండు నిమిషాల్లో నమూనా పూర్తిచేశాడు. పూర్తిచేసిన తరువాత ఒకమాటు గర్వంగా అద్దంలో తన ముఖం చూసుకున్నాడు. 'ఇలాంటి పందెం నెలకు ఒకటి దొరికితే ఎంత బాగుండు !' అనుకుంటూ చాపమీదపడి నిద్రపోయాడు.

ఉదయాన్నే దేవీదీన్ పొయ్యి ముట్టిస్తుండగా రమానాథుడు వచ్చి 'దేవీ దీన్ ! ఇక్కడ ప్రజామిత్ర పత్రికాఫీసు నీకుతెల్సా ?" అన్నాడు.

నాకు తెలియక పోవడం ఏమిటి ? వూళ్ళోవున్న పత్రికల ఆఫీసులన్నీ నాకుతెల్సు ! ఈ ప్రజామిత్ర సంపాదకుడు మంచి యువకుడు. బహూసరదాగా వుంటాడు ధైర్యానికికూడా చెప్పుకోవాల్సిన వాడేను. ఇప్పటికి రెండుసార్లు జైలుకు పోయివచ్చాడు" అన్నాడు దేవీదీన్.

"అయితే, ఇవ్వాళ కొంచం అక్కడి వరకూ పోయివస్తా ?"

"పోలేను బాబూ !"

"ఏం ?దూరమా ?"

"కాదు....ముసలి కోప్పడుతుంది. ఈ పత్రికల ఆఫీసులకు పోననీ, స్వరాజ్యం విషయం పట్టించుకోననీ మాట యిచ్చాను .... అదికాక దాని కష్టార్జితం తినేప్పుడు దానిమాట వినవద్దా ?"

రమానాథుడు చిరునవ్వుతూ "ఛా, దేవీదీన్, నీదంతా ఎగతాళి — ! అది కాదు నాకు అక్కడొక పనివుంది. నీవు పోయివస్తేకానీ ఆ పనికాదు. ఆ పత్రికలో ఒక శతరంజి ఆటపోటీని ప్రకటించారు. దాన్ని సరిగా ఆడినవాళ్ళకు యాభైరూపాయలు బహుమతి ఇస్తారు. నేను దానిని ఆడాను. ఇది తీసుకుపోయి అక్కడ యిస్తే తప్పకుండా యాభైరూపాయలూ వస్తయ్యి. నేను స్వయంగా

భయం! చూడూ. రాత్రంతా కూర్చుని చాలా శ్రమపడి పూర్తిచేశాను. నీవు పోయిరా.... లేకపోతే.... నేనే పోతానులే!"

"ఒద్దుబాబూ! ఒద్దు. అలాంటిచోటికి పోవడం, ఏమంత మంచిదికాదు."

"అయితే పోస్టులో పంపనా?"

"వద్దు పోస్టులో పోతే, మూడు రోజులకుగానీ చేరదు. రేపు ఆదివారం, అక్కడ ఇయ్యరు ఎల్లుండి సోమవారానికి చేరుతుంది. ఈలోపు ఎవరైనా మన కంటే ముందు ఇచ్చారా? వాళ్ళు కొట్టేసుకుంటారు."

రమానాధుడు రెండు నిమిషాలు సందిగ్ధంలోవుండి చివరకు ఒక నిశ్చయానికి వచ్చినట్టు తలవూపుతూ "ఏమైనాకానీ, నేనే వెళ్తాను!" అన్నాడు.

"అమ్మ....బాబో! నిన్ను పోనీయను. ఖర్మంచాలక పట్టుపడితే?"

"పడనీ ఇంకా కొన్నాళ్లికయినా తప్పదుకదా?"

"అట్లాగని యిప్పుడే పట్టుపడతావా? .... సరే, ఇటులే, నేనే పోయి వస్తాను!" అంటూ దేవీదీన్ పైగుడ్డ మీదవేసుకుని రమానాధుడి దగ్గిరవున్న కవరుతీసుకుని బయలుదేరాడు.

దేవీదీన్ వెళ్ళిన రెండునిమిషాలకల్లా జగ్గో మార్కెట్టునించి సరుకులు తీసుకుని వచ్చింది. పక్కనే ఒక కూలివాడు గంపఎత్తుకు నిల్చునివున్నాడు. స్వయంగా తనుకూడా ఒక గంపఎత్తుకు నిల్చున్నది. వచ్చీ రావడంతోనే నెత్తిమీది బరువైనా దింపుకోకుండా భర్త ఎక్కడికిపోయాడని అడిగింది. భర్తలేడని తెల్సుకుని రమానాధునే బరువు దింపమన్నది. రమానాధుడు రెండడుగులు ముందుకి వేసి జగ్గో నెత్తిమీది గంప దింపాడు. గంప చాలా బరువుగావున్నది.

"ఆయన ఎక్కడికిపోయాడు?" జగ్గో అడిగింది.

"ఎక్కడికైందీ తెలియదు .... ఇప్పుడే యిటుపోయాడు!" అన్నాడు రమానాధుడు.

జగ్గో అలసి కూర్చున్నది. కూలివాడుకూడా గంప దింపుకున్నాడు. పమిట చెరుగుతో ముఖంమీది చమటను తుడుచుకుంటూ "గంజాయి దమ్ముకు వెళ్ళాడేమో! నేనేమో నానా బాధలుపడి డబ్బు సంపాయించడమూ. ఆయనేమో నిర్విచారంగా గంజాయిదమ్ము కొడుతూ తిరగడమూ" గట్టిగా నిట్టూర్చింది జగ్గో.

రమానాధుడికి దేవీదీన్ గంజాయి తాగుతాడని తెల్సు. అయినా తెలియనటుగా అన్నాడు. "ఏమిటి గంజాయి తాగుతాడా? అబ్బే .... నేనింతవరకూ చూడకనే పోతే!"

జగ్గో వీపుమీది పమిటనుదీసి పక్కనేవున్న విలనకర్రతో వీపుగోక్కుంటూ "సరేలే. ఒక్కగంజాయే అన్నమాటేం! కల్లూ, సారా, భంగూ అన్నీ తాగు

తాడు. ఒక్క నల్లమందు మాత్రం ఇంతవరకూ ముట్టుకోలేదు. లేక చాటుగా దాన్ని కూడా సేవిస్తూవున్నాడేమో తెలియదు! ఏదో ముసలివాళ్ళమయాము. చేతిలో నాలుగు డబ్బులువుంటే, చెయ్యిపడ్డా, కాలుపడ్డా డబ్బులకాసించి అయినా యెవరో ఒకరు చేస్తారు, లేకపోతే గొంతులో మంచినీళ్ళుకూడా పోసేవాళ్ళయినా వుండ రేమోనని నేను నానాబాధలుపడి కూడబెడుతున్నాను. ఆయనమాత్రం కన్నూ మిన్నూ కనుపించకుండా ఖర్చుపెడుతున్నాడు. ఇవ్వాళ కాశీ అంటాడు. రేపు ప్రయాగ అంటాడు. ఎల్లుండి గయ అంటాడు! నే నీయన వాలకమంతా కని పెట్టాను. ఎవరెలాపోతే నాకెందుకు భగవంతుడు కన్ను తెరిస్తే అంతేచాలని మెదలకుండా వూరుకుంటున్నాను. నా వూపిరికాస్తా గుటుక్కుమన్న తరువాతగానీ ఈయన పాట్లుకనపడవు, అప్పుడు కావాలంటేమాత్రం ఈ జగ్గో వస్తుందా?" అంటూ కూలివాడివైపు తిరిగి "ఎంత యివ్వాలి?" అన్నది.

కూలివాడు బీడి వెలిగించుకుంటూ "బరువు చూడండి అమ్మగారు.... మెడ కూడా పట్టుకుపోయింది!" అన్నాడు.

"నీవు మహా సుకుమారుడివి కదూమరి?" నిర్దయగా "ఇదిగో ఇది తీసుకు పో. రేపు రా మళ్ళీ" అన్నది.

"కష్టానికి చాలదమ్మా" అన్నాడు కూలివాడు. జగ్గో మరొక రెండు కాన్లు ఇచ్చి, కూలివాడిని పంపి దుకాణం సర్దుకోసాగింది.

మధ్యలో ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ఇవ్వాల్టి ఖర్చు రాసిపెట్టు.... బజారుకు పోతే. ఏది చూచినా మండిపోతున్నది" అన్నది జగ్గో.

ముసలిది ఒక్కొక్క వస్తువూ గంపలోనుంచితీసి సర్దుకుంటున్నది. అలాగే నసగా లెఖ్ఖకూడా రాయిస్తున్నది. బంగాళాదుంపలు, వంకాయలు, సొర కాయలు, పొట్లకాయలు ఇవన్నీ ఎన్నెన్ని తెచ్చిందీ ఎంత డబ్బయిందీ జగ్గోకు నోటి గుర్తే! లెఖ్ఖరాయడం పూర్తయిన తరువాత, ఒకసారి చదివి వినిపించుకుని సంతృప్తిగా బొడ్లోనుంచి పుగాకుకాడ తీసి నోట్లో వేసుకున్నది.

"నేను పడే బాధ చూస్తున్నావుగా బాబూ! తొలి కోడి కూయకముందు లేస్తాను. సామానులు తెచ్చుకోవడం, అమ్ముకోవడం లెఖ్ఖచూసుకోవడం అన్నీ నేనే! రాత్రికి కొట్టుకట్టేసి రెండు మెతుకులు నోట్లో వేసుకుపడుకునేసరికి పన్నెండు గంటలవుతుంది. ఇంత శ్రమపడితేగానీ నాలుగు డబ్బులు మిగలవు. కానీడబ్బు నిలవవున్నదని తెల్సిందా కడుపుచించి కడుపులోపెట్టినా లాక్కుపోయి మస్తుగా పట్టిస్తాడు. రత్నాల్లాంటి ఇద్దరి కొడుకుల్ని పెట్టనపెట్టుకున్నాడు. ఆ దుఃఖం మర్చిపోవడానికి ఎప్పుడైనా ఒక్క నగచేయించుకుంటే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది జగ్గో.

ఇన్నాళ్ళనుంచీ రమానాథుడు జగ్గోను ఒకేదృష్టితో చూస్తూవున్నాడు.ఆమెకు దయాదాక్షిణ్యాలు తెలియవనీ, ప్రేమలూ, మమకారాలూ లేవనీ. డబ్బే సర్వస్వంగా భావిస్తుందనీ, ఆమె హృదయం రసవిహీనమైనదనీ అనుకునేవాడు. కానీ, ఇవ్వాళ జగ్గో, కొడుకులను జ్ఞప్తితెచ్చుకుని కళ్ళనీళ్ళు పెట్టుకోవడం చూసిం తరువాత తన అభిప్రాయాన్ని మార్చుకున్నాడు. జగ్గోకూడా ఒక సమయంలో తల్లనీ, ఆమె హృదయంకూడా ప్రేమతోటి, వాత్సల్యంతోటి నిండి వుండేదని, సముద్రంలోపడ్డ ప్రతివాడూ కాళ్ళూ చేతులూ ఆడించడం ఎలా సహజమో, యీ సమాజంలో ఆమె డబ్బుకోసరం పాకులాడటంకూడా అంతే సహజమనీ అనుకున్నాడు.

అంతేకాకుండా జగ్గో ముఖంలోకి చూస్తున్న కొద్దీ రమానాథుడి హృదయంలో మాతృభావం ఉదయించసాగింది.

జగ్గోకూ్కడా రమానాథుడివంక చూస్తుంటే, తన యిద్దరు కొడుకులూ తిరిగి యీ విధంగా సాక్షాత్కరించారా అనిపిస్తున్నది. ఇద్దరిలోనూ ఏదో అవ్యక్తమైన ఆనందమూ, తృప్తీ వాళ్ళకు తెలియకుండానే కలుగుతున్నై. ఇన్ని రోజులుగా జగ్గోకి రమానాథుడిమీదవున్న ఈసడింపుభావం మెల్లిమెల్లిగా తిరోముఖమైనది.

కన్నీళ్ళు తుడుచుకుంటూ "ఏం బాబూ ముఖం కడుక్కున్నావా? ఇవ్వాళ సంత్రాలు మహాబాగున్నై. రెండుపళ్ళు తిను" అన్నది జగ్గో.

రమానాథుడు జగ్గో అందించిన సంత్రాలను తింటూ "ఇవాల్టినుంచి నిన్ను.... అమ్మా అనే పిలుస్తాను" అన్నాడు.

నిస్తేజంగా వున్న జగ్గో కళ్ళనుండి మరిరెండు కన్నీటి బిందువులు రాలినయ్యి.

ఇంతలో దేవీదీన్ అడుగుల్లో అడుగులు వేసుకుంటూ మెల్లిగా వచ్చాడు. జగ్గో మండిపడి "ఇంత పొద్దున్నే ఎక్కడికి పోయావు?" అన్నది.

దేవీదీన్ సౌమ్యంగా నవ్వి "ఎక్కడికీ పోలేదు .... వక చిన్న పని వుండి...." అన్నాడు.

"ఏం పనదీ? చెప్పు చూద్దాం నేనూ వింటాను...."

"కడుపులో నొప్పిగా వుంటేను....చూర్ణం తెచ్చుకుందామని...."

"ఎరగనివాళ్ళకు చెప్పేమాటలు గంజాయికోసం గాదూ పోయింది?"

"లేదు నీ తోడు. నామీద అభాండం వేస్తున్నావు."

"అయితే నిజం చెప్పు....ఎక్కడికి పోయావో?"

"చెప్పానుగా? రాత్రి ఎక్కువ అన్నం తిన్నాను. కడుపులో నొప్పి, పులితేపు...."

"అన్నీ అబద్ధాలే! నేను చస్తేనమ్మను. ఇంత ముసలివాడవయ్యావు, నీకింకా మత్తు కావల్సివచ్చిందా? ఇక్కడ ఒక్కదాన్నీ చేసుకోలేక నా ప్రాణాలు పోతున్నై. నిద్రమంచాన పోయినపోవడం ఇప్పుడు వచ్చాను. నీవేమో గంజాయనీ, సారాయనీ, కల్లనీ తిరుగుతున్నావు."

దేవీదీన్ ఏమీ సమాధానం చెప్పకుండా చీపురు పుచ్చుకుని గదిచిమ్మడం ప్రారంభించాడు. జగ్గో అతని చేతిలోని చీపురు విసురుగా లాక్కుని "ముందు నీవు ఎక్కడికి పోయావో చెప్పు. అది చెప్పనంతవరకూ లోపల అడుగుపెట్టడానికి వీలులేదు" అన్నది.

దేవీదీన్ తడబడుతూ "తెలిసి ఏం చేస్తావు? .... ఒక పత్రికాఫీసుకు పోయాను. ఇక చేసే దేమిటో చెయ్యి" అన్నాడు.

జగ్గో నెత్తిబాదుకుంటూ "మళ్ళీ - మొదలుపెట్టా? వెళ్ళ నన్నావుగా? అన్నావా లేదా?" అడిగింది.

"నీకేమీ సంగతి సందర్భం తెలియదు. వూరికే ఎగురుతావు నిప్పులు తొక్కిన కోతిలా!" అన్నాడు దేవీదీన్.

"నాకు బాగా తెల్సు!... ఈ పత్రికలవాళ్ళు ఉన్నవీ లేనివీ కల్పించి మిమ్మల్ని ఉసిగొల్పుతారు. మీరు పిచ్చికుక్కల్లా పోయి జైళ్ళల్లో పడతారు. ఈ ముసలితనంలో జైలుకుపోవాలని వున్నదా? నా మతి బండలుగానూ, యిప్పటికి ఇరవై సంవత్సరాలనుంచీ చూస్తూ యీమాత్రం తెల్సుకోలేనూ!"

దేవీదీన్ మారుమాట్లాడకుండా దుప్పటిక్రిందనుంచీ ఒక కవరుతీసి రమానాధుడి చేతికి యిస్తూ "దీంట్లో డబ్బువున్నది చూడు." జగ్గోవైపు తిరిగి "నే నీ డబ్బు తేవటానికి పోయా" అన్నాడు, నిష్ప్రయోజనమైన తనకోపాన్ని పళ్ళమీద చూపుతూ.

జగ్గోకు మరి కోపంవచ్చింది "దూకేవాడివి నీవు దూకక .... .... రమాబాబును కూడా దించుతున్నావన్నమాట? నీ రూపాయల్లో నిప్పుపడ! బాబూ, నీవు మాత్రం మట్టుకోక వాటిని. వెనకటి మనుషులు ఎట్లాగయినా కొంచం పిచ్చివాళ్ళలా వుండేవాళ్ళుగా? పేపర్లాళ్ళు చెప్పినట్లు వినేవాళ్ళు. ఇప్పటివాళ్ళు కొంచం తెలివిమీరి చెప్పుడుమాటలు వినడంలేదు. అందుకనే ఇలా డబ్బెరచూపి వల్లో వేసుకుంటారు. బాబూ నామాటవిని ఆ డబ్బు అవతల పారెయ్యి నీకు యెంత డబ్బు కావాలంటే అంత నేను యిస్తా. ఆ దొంగముండాకొడుకులు ఇతర్లు కన్నబిడ్డల్ని నీలాపనిందలు నెత్తినవేసి చంపుతారు నాయనా!" అన్నది.

చివరకు రమానాధుడు విషయమంతా వివరించి చెప్పిన తరువాత జగ్గో

శాంతించింది. ఒక్కక్షణం ఆగి నవ్వుతూ "అయితే, దాన్లో నా కేమి తెచ్చిపెడ తావు నాయనా!" అన్నది.

"ఈ డబ్బంతా నీకేనమ్మా. నీవుండగా నాకు యితర డబ్బుతో పనేమిటి?" అన్నాడు రమానాథుడు.

"మరి ఇన్నాళ్ళయిందికదా ఇంటిదగ్గరనుండి వచ్చి; ఇంతవరకూ ఏమైనా కానీడబ్బు పంపావా? దీంటో నన్నా పంపరాదూ?"

''నా ఇల్లు ఇదేగా? ఇం కెక్కడికి పంపమంటావు?''

ప్రేమకూ, ఆదరణకూ, ఇన్నాళ్ళుగా దూరమైన ముసలిదాని హృదయం వేసవిలోని భూమిలా బీటలువారింది. అలాంటి ఆమె హృదయానికి రమానాథు డన్న ఈ మాటలు తొలకరివానలా పనిచేసినయ్యి. ఆనందంలో ఆవేశంతో చెమ్మ గిలిన కనురెప్పల్ని ఒకమాటు గట్టిగా వత్తుకొని రమానాథుడి చేతిలోని కవరు అందుకుని డబ్బు లెక్కపెట్టింది. ''మొత్తం యాభై రూపాయలు బాబూ! వీటికి తోడు నే నింకొక యాభై ఇస్తాను తీసుకుని ఇక్కడే మన దుకాణం దగ్గర ఒక టీ బల్ల పెట్టుకో! నా దగ్గరికివచ్చే బేరగాళ్ళందరూ టీ తాగేవాళ్ళే! పొద్దునో గంటా సాయంత్రం ఒక గంటా బల్ల తగిలించావా, కడుపులో నీళ్ళు కదలకుండా రెండు రూపాయలు సంపాయించుకోవచ్చు. గిన్నెలూ తపాలాలూ ఎటూ వుండనే వున్నై, రెండు బల్లలుకూడా వేశామా? పెద్దమనుషులుకూడా వచ్చి కూర్చుం టారు" అన్నది జగ్గో.

దేవీదీన్ ఎగిరిపడి ''అయితే, ఇక నేను నిన్ను చిల్లర డబ్బులు అడగనే అడగను. మా రమాబాబు దుకాణంలోనుంచే తీసుకుంటాను!'' అన్నాడు సంతోషంగా.

''ఆ పప్పులేమీ ఉడకవు. ఏరోజులెఖ్ఖ ఆరోజు ఖచ్చితంగా చూపించాలి!'' జగ్గో నవ్వుతూ అన్నది. ఆమె నవ్వులో ఎన్నో దశాబ్దాలక్రితం నశించిన ఆమె కొంటెతనపు ఛాయలు తొంగిచూసినయి.

తరువాత రమానాథుడు తన గదిలోకి పోయాడు. ఇవ్వాళ అతనికి విపరీతం అయిన వుత్సాహంగావుంది, ఇంటిదగ్గిరకూడ అతని కెన్నడూ ఇంత ఉత్సాహం కలగలేదు నిజమే! మామూలు పరిస్థితిలో రుచికరమైన ఆహారానికి ఏమాత్రం విలువా ఇవ్వము. పస్తులుపడుకున్న తరువాత గంజినీళ్ళు లభిస్తే ఎంతో బంగా రంగా తింటాం.

రమానాథుడు త్వరత్వరగా స్నానంచేసి బొట్టుపెట్టుకొని సంధ్య వార్చు కోవడానికి కూర్చున్నాడు. ఇంతలో జగ్గో వచ్చింది. ''చూడు నాయనా! రోజూ నీకు అన్నం వండుకోవడం యిబ్బందిగా వున్నట్టున్నది. ఇక్కడొక వీధవైష్ణవి వున్నది. ఆమెను రోజూవచ్చి నీకు అన్నం వండిపెట్టి పొమ్మన్నా,

సరే నన్నది. పాపం చాలా పేదది. అప్పుడప్పుడూ నా దగ్గర సరుకులు అప్పు పట్టుకుపోతూ వుంటుందికూడా. ఆ ముఖమాటంవల్లనే ఒప్పుకున్నది" అన్నది జగ్గో. ఆమె కండ్లలో అపారమైన మాతృవాత్సల్యం కనుపించింది.

"అది కాదమ్మా, నీవు నాకు తల్లివైన తరువాత, ఇంకా యీ కులమూ, మతమూ-వీటి అభ్యంతరం ఏమిటి? నీ చేతిమీదుగానే వండిపెట్టు, తింటాను. ఇంకోళ్ళు ఎందుకు?"

"అట్టా వద్దు నాయనా! కులం చెడగొట్టుకోవద్దు. ఎట్టాగయినా బ్రాహ్మడివి, నాచేతి తిండి తింటావా?"

"అట్లా వీలులేదు. ఇవాల్టినుంచీ నాకు ప్రత్యేకం వంట అనవసరం. మీరు వండుకున్నదే తింటాను. ఇక్కడ మీరే నాకు తల్లిదండ్రులు. అలాంటప్పుడు మీకూ నాకు మధ్య భేదం ఏమిటి?"

"మరి మీ యింట్లోవాళ్ళకు నాచేతి తిండితిన్నావని తెలుస్తేనో?"

"ఏం? తెలియనియ్యి! ఎవరో ఏమో అంటారని నేను ఎన్నడూ భయపడను. లేకపోయినా మనిషిలోని మంచిచెడ్డల్ని నిర్ణయించేవి పనులుగానీ, తిండి కాదు."

జగ్గో హృదయంలో తన జాతిని గురించిన అభిమానం కలిగింది. "మేం కూడా అంత తక్కువ జాతివాళ్ళం కాము నాయనా! మాలోనూ మడీ ఆచారాలు వున్నై. మాంసం తినడం, తాగి తందనాలువేయడం మాకూ పనికిరావు .... కానీ ఏం చేయను మరి, యీయన ఏలా అలవాటుపడ్డాడో మత్తుకు అలవాటుపడ్డాడు. చక్కగా బ్రాహ్మల్లా మడికట్టుకు వండుతాను. నీకు బాగా నచ్చుతుంది నా వంట" అన్నది జగ్గో.

"ఎందుకు నచ్చదు? ప్రేమతో పెట్టేప్పుడు గంజి అయినా అమృతంలా వుంటుంది!"

జగ్గో ఏదో నిధి దొరికినట్టు ఆనందంతో మునిగిపోయింది.

# 28

రమానాధుడు వెళ్ళినప్పటినుంచీ జాలప విషయమై రత్తన్‌కు చాలా దిగులు పట్టుకున్నది. జాలపను ఎలాగయినా దుఃఖంనుంచి మరపించి సంతోషపెడుతూ వుండాలని శతవిధాలైన ప్రయత్నాలు చేస్తున్నది: చిన్నబుచ్చుకున్న జాలప ముఖం రత్తన్ చూడలేకపోయేది. అందువల్లనే రమానాధుడిని వెతకడానికి తను డబ్బుఖర్చుపెట్టడానికి కూడా సిద్ధంగా వున్నది. రోజూ జాలప దగ్గిరకు వెళ్ళి; ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పి సాధ్యమైనంతవరకూ వినోదాన్ని కలిగిస్తూవుంటుంది. అప్పుడప్పుడూ రాజేశ్వరిదగ్గిరికి కూడా పోయి కూర్చుని చెదిరిన ధైర్యాన్ని కూడ గడుతూ వుంటుంది. ఇక గోపీ, విశ్వంభరులకు రత్తన్ పెద్ద అక్కయ్యలా అయిపోయింది. రోజూ వాళ్ళ బంగళాదగ్గరకు పోయి ఆడుకుంటూ వుంటారు.

ఒకరోజు రత్తన్ చాలా దిగులుగా వచ్చింది. ముఖమూ కళ్ళూ వాచినై. తల రేగివున్నది. ఈ ఆకారాన్ని చూసి "ఏం వంట్లో బాగాలేదా ?" అన్నది జాలప.

"నాకేం నేను బాగానేవున్నాను. నిన్నటినుంచి వకీలుగారి వంట్లో ఏమీ బాగాలేదు. ఈ చలికాలంలో వారికి ఆయాసం ఎక్కువ అవుతుంది. అక్కడికీ ఆ మందులూ, ఈ మందులూ తింటూనే వున్నారు. కానీ ప్రయోజనం లేదు. వారినీ వ్యాధి వదిలేట్టులేదు. నిన్నరాత్రి అసలు కన్నుమూత పడలేదు. కలకత్తాలో ఒక మంచి వైద్యుడు వున్నాడు. ఇదివరకు ఒకటి రెండు సార్లు అతని దగ్గిరకు పోయి మందు పుచ్చుకున్నారు కూడాను ! మళ్ళీ అతని దగ్గిరకే పోవాలనుకుంటున్నాము. నా కా కలకత్తానీళ్ళు బొత్తిగా సరిపడవు. వెనక రెండుసార్లుపోయి రెండుసార్లూ జబ్బుపడ్డాను. అందువల్ల వకీలుగారు నన్ను ఇక్కడే వుండమంటున్నారు. కానీ, వారిని ఒంటరిగా విడిచి నేను ఇక్కడ వుండగలనా ? అక్కడ వారికి మంచీ చెడ్డా చూడటానికి ఎవరున్నారు? ఏమిటో జాలప, ఈబాధలన్నింటినీ తలచుకుంటే ఒక్కోసారి విషం తిని చచ్చిపోదామా, అనిపిస్తుంది !"

"ఇక్కడి డాక్టర్లకు చూపలేదా ?"

"అందరికీ చూపించడం అయింది."

"మరి తిరిగి రావడం ఎన్నాల్టికి ?"

"అది నేనెలా చెప్పను ? వారి జబ్బునుబట్టి వుంటుంది ! వారంలో నయం

అయితే, వారంలోనే వస్తాము. లేకపోతే, నెలా రెండు నెల్లూ — అంతకుపైన అయితే పైనానూ ! ఈ సారిమాత్రం జబ్బు నయంకాకుండా తిరిగి రాము !"

వయస్సులోనే నయంకాని జబ్బు వృద్ధాప్యంలో నయం అవుతుందా ? అయినా జాలప తనవిధి ప్రకారం "త్వరగానే నయం అవుతుందిలే !" అన్నది.

"జాలప ! నీవుకూడా రాకూడదూ ! కులాసాగా వుంటుందిగా ?"

"ఎల్లారాను రత్తన్ ? ఒకవేళ అత్తమామలు వప్పుకున్నా, నేనుమాత్రం రాలేను. ఇక్కడవుంటే ఏ సమయంలో నయినా, ఏదో ఒక కబురు అందవచ్చనే ఆశవుంటుంది. ఇక్కడనుంచి వెళ్ళినా, ఆ ఆశకూడా లేకుండా, జీవితం మరీ నిస్సారం అయిపోతుంది !"

"రమానాధుగారు.... ఒకవేళ కలకత్తాలోనే వున్నారేమో ?"

"ఏమో ! నీవు వెళ్ళిన తరువాత కొంచం ప్రయత్నం చెయ్యి. ఎక్కడైనా వారి జాడ తెలిస్తే వెంటనే ఉత్తరం రాయి."

రత్తన్ నవ్వి, "ఆ విషయం నీవు చెప్పాలా ?" అన్నది.

"నిజమే ! నేను వేరే చెప్పాల్నా ? సరేగాని, వారానికో వుత్తరమైనా రాస్తుంటావుకదూ !"

"రాస్తాను. నీవు సమాధానంకూడా వెంటవెంటనే రాస్తూవుండాలి."

జాలప తమలపాకులు మడతపెడుతున్నది. రత్తన్ ఆమె ముఖంవంక ఏదో చెబుదామన్నట్లు చూస్తున్నది. కానీ, నోట్లోనుంచి మాట పెగలడంలేదు. చివరకు జాలప ఆకులు అందిస్తూ రత్తన్ సందిగ్ధాన్ని గమనించి అడిగింది.

"ఏం ! ఏమైనా చెప్పాలా ?"

"ఏమీలేదు. నాదగ్గిర కొద్దిగా డబ్బువున్నది. అనవసరంగా నాదగ్గిర ఖర్చయిపోతుంది. నీ దగ్గిరవుంచమని...."

జాలప నవ్వి "మరి నాదగ్గిర ఖర్చయితే ?" అన్నది.

"కానీ, పరాయివాళ్ళయితే బాధగానీ. మనలోమనం ఖర్చుపెట్టుకుంటే మాత్రం బాధేమిటి ?"

జాలప ఏమీ సమాధానం చెప్పలేదు. మౌనంగా వూరుకున్నది.

"ఏ సమాధానమూ చెప్పవేం ? నా డబ్బు యాభయ్యో, వందో నీవు ఖర్చుపెట్టుకుంటేమాత్రం ఏం ?"

"నీవేమీ అనుకోకుండావుంటే చెబుతాను."

రత్తన్ ఏమీ మాటాడలేదు. జాలప చెప్పుకుపోతున్నది.

"నీ మనస్సును కష్టపెడదామనే ఉద్దేశంతో నేనీ ముక్కలు అనడంలేదు. నీవు చూపించే ఈ ఆత్మీయతలో ఆత్మీయతకన్నా 'దయ' ఎక్కువగా కనిపిస్తున్నది. నేను బీదదాన్ని. నీవు భాగ్యవంతు....

జాలప మధ్యలోనే ఆపి ''చాలు ఇక మాట్లాడబోక; నీ కా భావంవుంటే వుండవచ్చు. నా కలాటిభావమేమీ లేదు. బీదా-ధనికులూ అనే వ్యత్యాసం నాలో కోసినా దొరకదు. ఆకలయితే నీ దగ్గర అన్నంకూడా అడిగి పెట్టించుకుంటాను" అన్నది రత్తన్.

జాలప నవ్వి ''మనం మనకు అవుసరంలేని వస్తువుపట్లా, మన దగ్గిర సమృద్ధిగావున్న వస్తువుపట్లా చాలా నిర్లక్ష్యంగా బాధ్యతలేకండా ప్రవర్తిస్తాము. ఇప్పుడు నీ దగ్గర అన్నం సమృద్ధిగావున్నది. కనక నువ్వు నిజంగానే అడగ్గలవు ! ఈ అడగడంలో అవుసరం కన్న సరదా ఎక్కువగా కనిపిస్తూవుంటుంది. నిజంగా అన్నంలేని పరిస్థితివచ్చి, అవుసరంవుండి అడగడం ఇప్పుడడగడంత అంత తేలిక కాదు !" అన్నది జాలప.

''కానీ, నేను అల్లాంటి పరిస్థితిలోకూడా నిన్ను అడుగుతాను. నేను నీతో స్నేహం చేస్తున్నాను. ఒక సోదరిలా నీలో కల్సిపోదాం అనుకుంటున్నాను. అల్లాంటప్పుడు ఈ వ్యత్యాసాలకూ, మన స్నేహానికీ బొత్తిగా సంబంధంలేదు.... కాకపోయినా, నీ వీటితో ఎందుకు నా మనస్సును బాధపెడుతున్నావు ?" అంటూ రత్తన్ కళ్ళనీళ్ళు తుడుచుకోసాగింది.

జాలప బాధలో, విచారాల, మనోవ్యధల్లో చిక్కుకుని వున్నది. అలాంటి వాళ్ళు యధార్థాన్ని మాట్లాడటానికి ఏమాత్రం వెనకాడరు. కానీ ఒక విధంగా చూస్తే జాలప బాధలకన్నా, వ్యధలకన్నా రత్తన్ బాధలూ, వ్యధలూ-దారుణమైనవని చెప్పవచ్చు ! జాలప బాధలకు ఒక అంతం అంటూ వున్నది. రమానాధుడు యువకుడు. ఇవ్వాళ కాకపోతే రేపువస్తాడు. అతనిరాకతో జాలప బాధలు తీరతాయి. కానీ రత్తన్ జీవితంలోని బాధలకు అలాంటి ఆశేలేదు.ఆమెభర్త వృద్ధుడు. వున్నకొద్దీ జీవితం అడుక్కుపోతుందిగానీ, ముందుకు పోయేభాగ్యం లేదు. రాత్రి గడిస్తే, సూర్యోదయం అవుతుంది. వెలుగువస్తుందని జాలప ఆశిస్తుంది. కాని రత్తన్ కలా ఆశించడానికి బొత్తిగా అవకాశంలేదు.

జాలప కళ్ళు చెమ్మగిల్లినయి. ''వుత్తరాలకు సమాధానం రాస్తూవుండు. డబ్బు ఇవ్వులే" అన్నది రుద్ధకంఠంతో.

రత్తన్ ంగా పర్సులోనుంచి డబ్బు తీసి ఇచ్చింది.

‘‘మనస్సుకు కష్టంగా వున్నదా ? అడిగింది. జాలప.

‘‘వుంటేమాత్రం నీకేం ?’’

జాలప అమాంతం రత్తన్‌ని కౌగిలించుకుని తన తలను ఆమె హృదయంలో దాచింది. జాలపకు ఎన్నడూ లేని అనురాగం పుట్టుకువచ్చింది రత్తన్ మీద.

ఒక్క క్షణంతరువాత రత్తన్ చిరునవ్వుతో వెళ్ళిపోయింది.

# 29

వకీలుగారు కలకత్తాలో మందుపుచ్చుకోడానికి వెళ్ళారు. పట్టణానికి చివర ప్రశాంతంగావున్న ఒక బంగాళాలో రెండు గదుల్ని అద్దెకు తీసుకున్నారు. రత్తన్ వంటబ్రాహ్మడిని, పనిచేసే నౌకరిని వెంటపెట్టుకుని పోయింది. ఇందువల్ల ఏ విషయంలోనూ అట్టే బాధగాలేదు. వంట బ్రాహ్మణుడు, నౌకరు, ఇద్దరూ చాలా రోజులుగా వుంటున్న వాళ్ళుకావడంచే ఏ అరమరికలూ లేకుండా ఇంటివాళ్ళలా పనులు చేసుకుపోతున్నారు. బంగాళాకూడా చక్కగా వసతిగా వుంది. ముందు ఒక పూలతోట కన్నులపండువుగా వున్నది. పట్టణానికి చివరి ప్రదేశమేమో కొంచెం ఆరుబయలుగా వుంటుంది. సాయంత్రంపూట చల్లగాలి ఎంతో హాయి నిస్తూ వుంటుంది. పట్టణపురొద, సందడి ఇక్కడలేవు. పగలంతా పట్టణంలో తలలు దిమ్మెక్కించుకున్న రకరకాల మనుషులూ సాయంత్రానికి ఇటు చల్లగాలికి వస్తుంటారు చెరలోనుంచి బయటపడ్డట్టు.

ఇక్కడకు వచ్చిన మొదటి రెండురోజులూ బహుశా ప్రయాణపు బడలిక వల్ల కావచ్చు వకీలుగారి ఆరోగ్యం పూర్తిగా తారుమారైంది. తరువాత మెల్లిగా సర్దుకొన్నది. రత్తన్ వకీలుగారిని విడిచి ఒక్కక్షణమైనా అవతలికి కదలదు. ఇలా రత్తన్ ఎప్పుడూ తనదగ్గిరే అంటిపెట్టుకుని వుండటం వకీలుగారికి బాధగా వున్నది. తన రోగపు వుధృతాన్ని ఆమెకు తెలియనీకుండా వుంచాలని వారి అభిప్రాయం. ఇలా భార్య ఎప్పుడూ దగ్గరే వుండటంవల్ల తను గట్టిగా మూలిగినా, కాళ్ళూ, చేతులూ విసురుకున్నా ఆమెమనస్సు ఎక్కడ బాధపడుతుందోనని సంకోచిస్తూ వుండేవారు. ఆమె ఆదుర్దాని తగ్గించడంకోసం తన బాధనంతా కప్పిపుచ్చేవారు. ఆకలి ఏమాత్రం లేకపోయినా కొద్దో గొప్పో పథ్యం నంజుతూవుండేవారు. తనకు వైద్యంచేస్తున్న కవిరాజుగారితోకూడా బాధలు ఏమీలేవనీ, కులాసాగా వున్నాననీ చెబుతూవుండేవారు. రోగం తిరుగుముఖం పట్టిందని అందరూ సంతోషించారు.

ఒకరోజు వకీలుగారు రత్తన్‌తో ఇలా అన్నారు "నాకు రోగం నయమయ్యి, నీవు మందు పుచ్చుకోవల్సి వస్తుందేమోనని భయంగా వున్నది."

"అంతకన్నా కావల్సిందేమిటి? మీకు జబ్బులేకుండాచేసి, కావాలంటే నన్ను రోగిని చేయమని రోజూ భగవంతుడికి మొక్కుకుంటున్నాను" అన్నది రత్తన్.

"రోజూ కొంచం చల్లగాలికి తిరిగి వస్తూవుండు. అంతగా జబ్బుపడాలని మనస్సుగా వుంటే నాకు నయమయిం తరువాత పడుదువుగాని."

"ఎక్కడికి పోను ? ఎటూ పోవాలని వుండదు."

వకీలుగారికి అకస్మాత్తుగా రమానాధుడు జ్ఞాపకానికి వచ్చాడు.

"పోనీ రోజూ సాయంత్రంపూట పార్కులవైపు పోతుండకూడదూ ? రమానాధుడు కనుపిస్తాడేమో !"

రత్తన్‌కు జాలప చెప్పినమాటలు జ్ఞాపకానికి వచ్చినయ్యి. నిజంగా ఏ పార్కులోనైనా కనుపిస్తే ఎంతబాగుండు ! అనుకుంటూ "నేను వెతుకుతానని జాలపకు మాట ఇచ్చాను. తీరా ఇక్కడికి వచ్చి మర్చేపోయాను" అన్నది రత్తన్.

"ఇవ్వాళ వెళ్ళు ! ఇవ్వాళే ఏం ? రోజూ సాయంత్రంపూట ఒక గంట తిరిగిరా !"

"కానీ....మీ గురించి....మనస్సు బాధపడుతుంది. వెళ్ళబుద్ధికాదు."

"నాగురించా ? ఎందుకూ బాధపడటం ? హాయిగా నయమవుతూవుంటే !"

"సరే, వెళ్తూవుంటాను !"

నిన్నటినుంచి భర్త మాటలమీద రత్తన్‌కు నమ్మకం తప్పింది. రోజు రోజుకూ మనిషి కృశించిపోతున్నాడు. ముఖం పాలిపోతున్నది. ఎప్పుడూ కళ్ళు మూసుకుని అర్ధమగతగా పడివుంటున్నాడు. వకీలుగారు తను నోటిమీదగా బాధలు ఏమీలేవని ఎంత చెబుతున్నా, యీ లక్షణాలు దాయగలడా ? భర్త తనకు రోగం విషయంలో అబద్ధం చెబుతున్నాడని ఆమె తెల్సుకోసాగింది. రోగం ఎల్లావున్నదో కవిరాజుగారిని అడుగుదామంటే, ధైర్యం చాలడంలేదు. ఇలాంటి పరిస్థితిలో రమానాధుడేవుంటే, తనకు ఎంత అండా, ధైర్యంగా వుండేది !

రత్తన్‌కు ఈ కవిరాజు వైద్యంమీద విశ్వాసం దినదినం సడలిపోతున్నది. రమానాధుడేవుంటే తనిలా ఏమీచేతకానట్టు, గోళ్ళుగిల్లుకుంటూ కూర్చునేదా ? ఇంకో డాక్టర్ని ఎవరినైనా పిలిపించేది. రోగనిర్ణయం చేయించి, అవుసరం అయితే మందు మార్పించేది.

ఇక ఈ కవిరాజువల్ల లాభంలేదనుకున్నది మనస్సులో.

రత్తన్ రమానాధుడేమైనా కనుపిస్తాడేమోనని షికారుగా బయటికి పోయింది. ఆమె వెళ్ళింతరువాత పనివారినిపిల్చి "కొంచం నన్ను పైకిలేవతియ్యి. పడుపని, పడుకొనీ నడుములు పట్టుకుపోయినయ్యి. ఇదిగో ఒక కప్పు టీ

కూడా పట్టుకురా అబ్బ....ఈ కవిరాజు వైద్యం నా చావు చూసేట్టుగా వుంది!" అన్నారు వకీలుగారు.

వకీలుగారిని లేవదీసి, వీపుక్రింద రెండు దిండ్లు ఎత్తుగావేసి పడుకున్నట్టుగా కూర్చోబెట్టి "చూడండి బాబూ! నే నీ మాట మొదట్లోనే చెబుదామనుకున్నాను....చూడండి బాబూ! అమ్మగారి మనస్సు కష్టపడుతుందని చెప్పలేదు!" అన్నాడు పనివాడు.

ఒక్కక్షణం ఆగి వకీలుగారు అన్నారు: "నాకు చావంటే భయంలేదురా! నరకం, స్వర్గం అనే నమ్మకాలు కూడాలేవు. మన కర్మలనుబట్టే మనకు ఉత్తర జన్మ లభించడంగనక నిజం అయితే, నేను వుత్తమజన్మకే పోతాననేది నిశ్చయం! అయినా చావాలనిలేదు....చస్తే ఏమవుతుంది!"

పనివాడు కొంచెం బాధగా, "చూడండి బాబూ! మీ రలాంటి మాటలు మాటాడబోకండి....మీరు పెద్ద చదువులు చదువుకున్న దొరలు. అయినా నామాట కొంచెం వినండి. ఇక ఈ మందుల్లో లాభంలేదండయ్యా! నామాట విని బంగమీ దేశస్తుడొక మంచి భూతవైద్యుడున్నాడు. చూడండి బాబూ! వాడిని పిలిపించండి" అన్నాడు.

వకీలుగారు అయిష్టంగా ముఖాన్ని అవతలికి తిప్పుకున్నాడు.

దయ్యాలూ, భూతాలూ అంటే వారికి నమ్మకంలేదు. అదంతా మోసం అని వారివుద్దేశ్యం. ఇద్దరు ముగ్గురు భూతవైద్యులను కొట్టారుకూడాను. కానీ, ఈ సమయంలో పనివాడు తెచ్చిన ఈ ప్రస్తావనని గట్టిగా వ్యతిరేకించడానికి కూడా వారికి ఓపిక లేకపోయింది. వూరికే తలతిప్పేసి వూరుకున్నారు.

ఇంతలో వంటబ్రాహ్మడు టీ తెచ్చి ఇచ్చాడు. టీ వారికి నిషేధం. అయినా, తాగడానికి తీసుకున్నాడు. ఒక్కక్షణం బాధగా టీ కప్పువంక చూసి "వద్దు తీసుకు పో! దానికి తెలిస్తే మనస్సు కష్టపెట్టుకుంటుంది" ఒక్క నిమిషం ఆగి, "చూడు పంతులూ! ఇక్కడికి వచ్చింతరువాత నాముఖ మేమైనా తేటపారిందా?" అన్నారు వకీలుగారు.

వంటపంతులు వకీలుగారి మాటలు విని పక్కనేవున్న పనివాడివైపు చూశాడు. అతను స్వయంగా ఏ విషయంమీదా అభిప్రాయాన్నియ్యడు. పనివాడు గనక బాగున్నారంటే తనూ బాగున్నారంటాడు. పనివాడు బాగాలేరంటే తనూ బాగా లేరంటాడు.

పనివాడు వంటపంతులి సందిగ్ధాన్ని గమనించి "చూడండి బాబూ! మీకేం? మీరు చక్కగా తేరుకుంటున్నారు. కానీ, తేరుకోవల్సినంతగా తేరుకోవడంలేదు" అన్నాడు.

వెంటనే వంటపంతులు అందుకున్నాడు: "అవునండి, మీరు తేరుకున్నారు. కాని బహూస్వల్పం!"

వకీలుగారు ఏమీ మాట్లాడలేదు. మెసలకుండా కళ్ళు మూసుకున్నారు. వారిస్థితి మరీ విషమంగావుంది. రెండుమూడు మాటలకన్నా ఎక్కువ మాట్లాడ లేకపోతున్నారు. ఆ మాత్రం రెండు మూడు మాటలు మాట్లాడినందుకే పది నిమిషాలవరకూ మత్తుగా పడివుంటున్నారు. వీరికి తనస్థితి పూర్తిగా తెలిసిపోయింది. ముఖంమీద మృత్యుఛాయలు పూర్తిగా అలుముకున్నై. మధ్యమధ్య ఆయాసం ఎక్కువవుతున్నది. ఒక్కొక్కమాటు త్రుటికాలం శ్వాస ఆడటంలేదు. ఏమిటి నమ్మకం? ఆ విరామమే మరో రెండు క్షణాలవరకూ నిలిస్తే!

కాసేపటి తరువాత వకీలుగారు కళ్ళు తెరిచారు. కళ్ళు చెమ్మగిలివున్నై. క్షీణించిన స్వరంతో "పంతులూ! సిద్ధూ వచ్చాడా?" అన్నాడు. కానీ మరుక్షణం లోనే తనకు తనే సిగ్గుపడి "ఏమీలేదు. సిద్ధూ వచ్చినట్లుగా వుంటేను!" అన్నాడు తలవంచుకుంటూ.

సిద్ధూ వకీలుగారి మొదటి భార్య కొడుకు. ఇరవై ఏళ్ళు పెరిగి చచ్చి పోయాడు. వకీలుగారికి పాపం అతను జ్ఞాపకానికి వస్తున్నాడివ్వాళ. వారికి వుండి వుండి తన జీవితంలోని వివిధ దశలూ కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తున్నై. మధ్య మధ్య తల్లివచ్చి తన్ను ఆరోగ్యాన్ని గురించి కుశలప్రశ్నలు వేస్తున్నట్టుగా వుంది.

రెండు క్షణాలు కళ్ళుమూసుకు పడుకున్న వాడల్లా వులిక్కిపడిలేచి "ఇదిగో నీవు కొంచెం బయటికిపోయి, ఎవరయినా మంచివకీలుంటే పిల్చుకురా" అన్నాడు పనివాడితో. పనివాడు వెళ్ళడానికి తయారైనాడు. ఇంతలో "వద్దు.... వద్దు....అది వచ్చేవేళ అయింది" అన్నారు వకీలుగారు. బయలుదేరిన పనివాడు ఆగిపోయాడు.

రత్తన్ కారుహారన్ మోగించుకుంటూ వచ్చింది.

వకీలుగారు లేని చిరునవ్వును తెచ్చుకుంటూ "ఎక్కడికి పోయావు? అత నెక్కడైనా వున్నట్టు తెలిసిందా?" అన్నారు. రత్తన్ ఏమీ సమాధానం చెప్ప లేదు. ఎందుకనో ఆమె హృదయంలో అజ్ఞాతమైన భయం గూడుకట్టుకుంటున్నది.

రత్తన్ మౌనంగా మందుసీసా తెచ్చి మందు తాగించి "వాళ్ళకు ఎవరి కైనా టెలిగ్రాం యిప్పించమంటారా?" అనడిగింది.

ఎవరికన్నట్టు ఒకమాటు ప్రశ్నార్థకంగా రత్తన్ ముఖంలోకి చూసి, తిరిగి తనే అర్థంచేసుకున్నట్టు తల ఆడించి, "వద్దు.... ఎవ్వరినీ పిలవ నవసరంలేదు.... నేను చక్కగా బాగుపడుతున్నాను" అన్నారు వకీలుగారు.

రత్తన్ మౌనంగా వూరుకున్నది.

ఒక్కక్షణం ఆగి "వీలునామా రాయిద్దా మనుకుంటున్నాను" అన్నారు వకీలుగారు.

ఒక్కసారిగా రత్తన్‌కండ్లు అశ్రుపూరితాలయినయ్యి. ఏదో అవ్యక్తమైన శక్తి తన శరీరాన్ని ముక్కలు ముక్కలుగా చీల్చి పారేసినట్టయింది. నిల్చోడానికీ, శ్వాస పీల్చుకోడానికీకూడా తన కిక యీ ప్రపంచంలో తావులేదనిపించింది. "ఇంటిదగ్గిరనుంచి ఎవ్వరినైనా పిలిపిస్తాను. మాట సాయానికయినా ఇక్కడ మనవాళ్ళంటూ ఎవ్వరూ లేరాయె!" రత్తన్ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అన్నది.

రత్తన్‌కు ఎవరినైనా బంధువులనుపిలిపిస్తే బాగుండనిపిస్తున్నది.అన్నలూ తమ్ముళ్ళూ ఎంతోమంది వున్నారు. కానీ, ఎందుకనో ఎవ్వరినీ పిలవ వద్దంటారు వకీలుగారు.

వకీలుగారు వీలునామా విషయం తేవడంవల్ల ఆమె మరీ క్రుంగిపోయింది. ఒకవేళ కవిరాజుగారు "లాభంలే" దన్నారేమో ననుకున్నది. నిజంగా అంత పనీ జరిగితే తన గతి ఏమిటి? ఆదరించేవాళ్ళు ఎవరు? ఈ కష్టాన్నంతా చెప్పుకు విలపిద్దామంటే తల్లయినా లేకపోయెకదా?

ఇంతలో వంటపంతులు వచ్చి "అమ్మగారూ! వంట సిద్ధం అయింది. వడ్డించమంటారా?" అన్నాడు.

రత్తన్ తలఎత్తి ఒకమాటు కోపంగా వంటపంతులు ముఖంలోకిచూసింది. పాపం వంటపంతులు బిక్కముఖంవేసి మారుమాట్లాడకుండా లోపలికిపోయాడు. అతను లోపలికి వెళ్ళిం తరువాత రత్తన్‌కు జాలివేసింది. తను ఎందుకని అతని వంక అలా చూసింది? అతనేం తప్పుచేశాడు? అన్నానికి పిల్చాడు అంతేనా? అని తర్కించుకుంటూ లోపలికిపోయి "పంతులుగారూ! నా కీపూట ఆకలిలేదు. మీరు తినండి!" అన్నది.

"రెండు మెతుకులు తినండమ్మా! మానుకుంటే ఎల్లా?" అన్నాడు అనునయిస్తున్నట్టు వంటపంతులు.

వెళ్ళడానికి వుద్యుక్తమైన రత్తన్ ఆగిపోయింది. వంటపంతులు గొంతులో ఆమెకు ఆత్మీయతా, ఓదార్పూ కనుపించినయ్యి. ఇన్నాళ్ళనుండి ఇక్కడ తన కెవ్వరూ లేరనుకుంటున్నది. అది పొరపాటు!

"ఏమండీ పంతులుగారూ! ఈ కవిరాజు వైద్యంవల్ల ఏమైనా లాభంవున్న దంటారా?" జాలిగా అడిగింది రత్తన్.

వంటపంతులు భయపడుతూ గంటక్రితం వకీలుగారిదగ్గర అన్నమాటలే

మళ్ళీ అన్నాడు. "ఏదో మార్పు వస్తున్నట్టుగానే వున్నది. కానీ కావల్సినంతగా రావడంలేదు!"

రత్తన్ అవిశ్వాసాన్ని ప్రకటిస్తూ "పంతులుగారూ, మీరుకూడా నన్ను మభ్యపెడుతున్నారా?" అన్నది,

వంటపంతులు కండ్లు చెమ్మగిల్లినయ్యి. "భయపడకండి. భగవంతుడు నమ్మినవాళ్ళని ఎన్నటికీ వదలిపెట్టడు .... మనం అధైర్యపడి మాత్రం చేసే దేముంది?" అన్నాడు.

"ఇక్కడ ఎవరైనా సిద్ధాంతులు దొరికినా బాగుండు. పూజలూ, పునస్కారాలూ చేయిస్తే ఏమైనా శాంతిస్తుందేమో!" అన్నది రత్తన్.

వంటపంతులు తృప్తిగా "నేనీమాట మొదట్లోనే అందాం అనుకున్నా. బాబుగారి మనస్తత్వం మీకు తెల్సుకదా? ఇలాంటివంటే మండిపడతారు. అందుకనే అనలేదు!" అన్నాడు.

"పరవాలేదు, నీ వెరిగిన వాళ్ళెవరైనావుంటే రేపు పిల్చుకురా!"

"బాబుగారు, కోప్పడతారు."

"నే వున్నాగా" అంటూ రత్తన్ గదిలోకివచ్చి దీపంముందు కూర్చుని జాలపకు వుత్తరం రాయసాగింది.

సోదరి జాలపకు!

"ఇవ్వాళ మనస్సంతా ఆందోళనగా వున్నది. వీలునామా రాయాలంటున్నారు. ముందు ఏ అరిష్టం సంభవిస్తుందో అనేభయం నరనరాలకూ వ్యాపిస్తున్నది. ఇన్నాళ్ళనుంచీ, వకీలుగారు తన రోగస్థితిని నాకు తెలియకుండా దాచారు. అలా దాయడం ఇక వారికి సాధ్యంకాలేదు. భగవంతుడికి ఎందుకు నామీద ఇంత కోపం? అతను దయామయుడనీ ఆపద్బాంధవుడనీ చెబుతుంటారే. నాపట్ల ఎందుకిలా ప్రవర్తిస్తున్నాడు? నా జీవితం అంధకారంతో — ముళ్ళతో, రాయిరప్పలతో నిండివున్నది, ఈ జీవితానికి వకీలుగా రొక వెలుగు. ఈ వెలుగుకాస్తా పోతే, ఇక నేనేం కావాలి?

"పోతే, ఇంతవరకూ రమానాధుగారిని వెదకడానికి అవకాశం దొరకలేదు. ఇవ్వాళమాత్రమే కొంచం బయటికి పోయాను.

"అమ్మగారికి నమస్కారాలని చెప్పవలసింది."

ఉత్తరంరాసి రత్తన్ బయటికి వచ్చింది. వకీలుగారికి నిమిష నిమిషానికీ గుండెల్లో బాధ ఎక్కువవుతున్నది.

# 30

రాత్రి మూడుగంట లైంది. అప్పటివరకూ మేలుకునివున్న రత్తన్ అప్పుడే కన్నుమూసింది. ఇంతలో ఆయాసం ఎక్కువకావడంచేత వకీలుగారు పెద్దగా గురకపెట్టసాగారు. గురకవిని రత్తన్ ఉలికిపడి లేచింది. తలవైపుకు పోయి కూర్చుని భర్తతలను తన తొడమీనకు తీసుకున్నది. విషాదంగా రత్తన్ ఒకమాటు భర్తముఖంలోకి, మరోమాటు గోడనువున్న గడియారంలోకి చూసింది. దాదాపుగా ఇంకొక మూడు గంటలకుగానీ తెల్లవారదు. అప్పుడుగానీ కవిరాజు గారు రారు. అంతవరకూ భర్త ప్రాణాలను రక్షించడం ఎల్లాగ అన్నట్లు గట్టిగా నిట్టూర్చింది.

కొంతసేపటికి వకీలుగారి గురక ఆగిపోయింది. దానితోపాటు శ్వాసకూడా ఆగింది. ఒళ్ళంతా చమటలతో నిండిపోయింది చేత్తో రత్తన్‌ని అవతలికి వెళ్ళ మని సౌంజ్ఞచేసి, తల ఆమె తొడమీదనుంచి తీసి దిండుమీద పెట్టుకుని మెల్లిగా కళ్ళుమూసుకున్నారు వకీలుగారు.

ఒక్క క్షణం తరువాత క్షీణంగా "రత్తన్ .... ఇక శలవు .... నా అప రాధం...." మాట పెగలక ఆపారు. రెండుచేతులూ జోడించి ఒకమాటు దీనంగా భార్యవంక చూశారు. ఏదో చెప్పడానికి పెదాలు కదిలిస్తున్నారు. శబ్దంమాత్రం పెగిలి రావడంలేదు.

"టీమల్ ! పంతులూ ! ఎక్కడ చచ్చావు !" రత్తన్ పెద్దగా అరిచింది.

"మేల్కొనే వున్నానమ్మా !" అంటూ పంతులు వచ్చాడు.

"వాగకండా పోయి, కవిరాజును పిలుచుకురా ! వెంట తీసుకురావాలి ! తెలిసిందా ? ఫో !"

పంతులు వెళ్ళాడు. రత్తన్ లేచి స్టౌ వెలిగించింది గుండె కాయడంవల్ల ప్రయోజనం వుండవచ్చునని ! ఆమెలోని దుఃఖమూ, బలహీనతా, భయమూ అన్నీ ఒక్కసారి మాయమైనయ్యి. నిండా మునిగినట్లయిం దామెపని.

పదిహేను నిమిషాలు త్వరత్వరగా గుండెలకు వేడినీళ్ళకాపు వేసింతరువాత వకీలుగారి స్థితి కొంచెం శాంతించింది. శ్వాస ఆడుతున్నది. మాటకూడా వచ్చింది. రత్తన్ చేతులను తన బుగ్గలమీద పెట్టుకుని రత్తన్ .... నీకు చాలా అన్యాయం చేశాను. ఈస్థితి ఇంత త్వరలో వస్తుందని నేనూ అనుకోలేదు. మనస్సులోని కోర్కెలన్నీ మనస్సులోనే వుండిపోయినయి....క్షమించు !" అన్నారు వకీలుగారు.

వకీలుగారు మాటలకు రత్తన్ ఏమీ సమాధానం చెప్పలేదు. కవిరాజు

కోసం ఎదురుచూస్తున్నది. ఇంతవరకూ అతను రాలేదు. పనివాడు టీమల్ పక్కనే నిలబడివున్నాడు.

రత్తన్ టీమల్‌తో "టీమల్! కొంచం నీళ్ళు వెచ్చపెడతా?" అన్నది.

టీమల్ అక్కడే నిలబడి నిలబడి "వేడినీళ్ళు ఏంచేసుకోనమ్మా? తులసి నీళ్ళు పోయండి!" అన్నాడు.

రత్తన్ ఒక్కసారి భర్త గుండెలమీద చేయిపెట్టి చూసింది. గుండెలు ఇంకా వెచ్చగానే వున్నై. కవిరాజుగారు వస్తున్నారేమోనని వాకిలివైపు చూసింది. రావడంలేదు. అసలు ఇక్కడికి ఎందుకు పట్టుకువచ్చానా? ప్రయాణపు బడలిక, వాతావరణపు మార్పువల్లనే ఇంతపని అయిందేమో అనుకున్నది. ఇక్కడికి రావడం, ఇలా జబ్బు ముదరడం - అంతకీ తనే కారణం అనుకుని పశ్చాత్తాప పడసాగింది.

ఈ ఎనిమిది సంవత్సరాల వైవాహిక జీవితమూ ఆమె కళ్ళముందు సినిమాలా కనుపించింది. ఆ సినిమాలో తన ప్రవర్తనలోని లోపాలన్నీ విపులంగా, పెద్దవిగా కనుపించినయ్యి. వకీలుగారు చూపిన ప్రేమా, వారు తనను హృదయంలోకి తీసుకోవడానికి ఎంతగా ప్రయత్నించిందీ, తను వినోద విలాసాల్లోపడి వారిని వట్టి డబ్బు పుట్టించ్చే యంత్రంగా మాత్రమే చూడటం, వారి ప్రేమనీ, బాధనీ ఎన్నటికీ గమనించకపోవడం వివరంగా కనిపించినై.

వకీలుగారు రాత్రింబగళ్ళూ శ్రమించి తనకోసం డబ్బు సంపాయించారు. దానికి ప్రతిగా తనే మివ్వగలిగింది? అశాంతీ, బాధా! తనను దగ్గరకు తీసుకోవాలనీ, ఏకాంతంలో తనతో మాట్లాడాలనీ ఎంతో ప్రయత్నం చేశారు. తను ఏనాడైనా దగ్గరకు పోయిందా? తన సినిమాలూ, షోకులూ, నగలేగానీ, వారి మనస్థితిని అర్థంచేసుకోవడానికి ఏమాత్రం ప్రయత్నం చేయలేదు. పరిశ్రమతోటీ, మనోవ్యథల్తోటీ దహించుకుపోతున్న వారి హృదయానికి తను ఏమాత్రం శాంతి నివ్వలేదు. అనాసక్తినీ, అయిష్టాన్నీ ప్రకటిస్తూ ఎప్పటికప్పుడు వారి ఉత్సాహం మీద నీళ్ళు చల్లుతూ వుండేది. అలా కాకుండా ఆ హృదయానికి ఏమాత్రం శాంతి నీయగలిగినా, ఈ విపత్తు ఇప్పుడప్పుడే వచ్చివుండేది కాదేమో! మేడ లేదని వున్న పూరిగుడిశను అశ్రద్ధచేసి, దాన్నికూడా పోగొట్టుకున్నట్టుంది నా పని!

వకీలుగారి కండ్లు తెరచివున్నై. వాటిల్లో ఏ భావమూ కనుపించడంలేదు.

ఇక రత్తన్ ఎంత ఏడ్చినా, మొత్తుకున్నా వారికి స్ఫురణశక్తి తిరిగిరాదు. ఇహలోకపు చింతలకూ, బాధ్యతలకూ అతీతుడైపోతున్నారు. అంతరాంతరాల్లో ఎక్కడో అస్తాచలగామి అయిన సూర్యభగవానుడి తుది కిరణంలా మిణుకు మంటున్నది వారి స్ఫురణశక్తి.

టీమల్ త్వరగాపోయి పంచపాత్రలో నాలుగు తులసిదళాలు, కొంచం గంగాతీర్థమూ తీసుకువచ్చి వుద్ధరిణితో వకీలుగారి గొంతులో తులసితీర్థంపోశాడు. వకీలుగారు తన జీవితకాలంలో ఇలాంటి మూఢాచారాలకు చాలా వ్యతిరేకి. ఆ క్షణాన్న తన అభ్యంతరాన్ని తెలియచేయడానికి కనీసం తలైనా ఆడించలేదు. తుది శ్వాసల్ని పీలుస్తున్న వకీలుగారి హృదయంలో మూఢాచారాలకు స్థానం దొరికిందని కాదు! ఇక వారికి లోకమే అనవసరం। అలాంటప్పుడు ఈ క్షుద్ర ఆచారాలూ, వ్యవహారాలూ పట్టవచ్చినయ్యా! నిరభ్యంతరంగా గుటకవేశారు.

భూమ్యాకాశాలు కలిసే తుదిభాగాల్ని గిరిగీసి సరీగా తెల్సుకోడం, నిర్ణయించడం ఎలా కష్టమో, అలాగే జనన మరణాలనుకూడా నిర్ణయించి వేలెట్టి సూచించడం కష్టం। 'జీవితం' అనే స్థితికి అంత్యం 'మృత్యువు' అనేదాని ప్రారంభం మానవుడికి ఎలా ప్రాప్తిస్తయ్యో ఎవ్వరూ నిర్ణయంగా చెప్పలేదు. ఈ పరివర్తన అనివార్యమైనది. దీన్ని ఆపడం దుస్సాధ్యం। ప్రపంచంలోకి వచ్చిన ప్రతి వ్యక్తి ఏదో ఒక రోజు ఆ స్థితికీ, ఆ నిద్రలోకీ పోవల్సిందే!

వకీలుగారు తులసితీర్థాన్ని రెండు గుక్కలు మింగారు. మూడో గుక్క మింగుడుపడలేదు. నోట్లో నీరు చెంపలమీదుగా క్రిందకు పోయినయ్యి. పక్కనే వున్న టీమల్ "అమ్మగారూ! బాబుగారు మనల్ని విడిచి వెళ్ళిపోయారు. అటు పట్టండి క్రింద పడుకోపెడదాం!" అన్నాడు.

టీమల్ కళ్ళు చెమ్మగిల్లినయ్యి. రెండు కన్నీటి బిందువులు వకీలుగారి ఆత్మకు కృతజ్ఞత తెలియచేయడానికా అన్నట్టు క్రింద రాలినయ్యి. నిలబడలేక పోయాడు. క్రింద చతికిలబడి ఏడవసాగాడు. ముప్పై సంవత్సరాలనుంచీ ఇంటో పనిచేస్తూవుంటే, ఈనాటివరకూ 'నువ్వు' అని సంబోధించి ఎరగరు వకీలుగారు. ఇక నలాంటి యజమాని తనకు ఎక్కడ దొరుకుతారు.

రత్తన్ ఇంకా కవిరాజుకోసం ఎదురుచూస్తున్నది. టీమల్ అన్నమాట ఆమెకు గొడ్డలిపెట్టులా తగిలింది. వకీలుగారి గుండెలమీద చేయిపెట్టి చూసింది. ఆ గుండెలు డెబ్భై సంవత్సరాలపాటు అవిశ్రాంతంగా పరిశ్రమచేసి, ఇప్పుడు విశ్రాంతి తీసుకుంటున్నై. రత్తన్ నోటివెంట మాటరాలేదు. విభ్రాంతి ఆమె మేధస్సును వశంచేసుకున్నది.

"ఎందుకమ్మా ఇంకా అలా చూస్తారు? జరగవల్సిందేదో జరిగింది. క్రిందకు దింపుదాం పట్టండి" అంటున్న టీమల్ మాటలు విని, ఆమె తిరిగి మన స్పృహలోకి వచ్చింది.

చెరోవైపూ పట్టి శవాన్ని క్రిందకు దింపారు.

# 31

ఆరోజే వకీలుగారి శవాన్ని కాశీకి తెచ్చారు. మాలవాలో వారి తమ్ముడి కుమారు డొకతనున్నాడు. అతన్ని టెలిగ్రాం యిచ్చి పిలిపించారు. అతనే దహనక్రియలు జరిపాడు. ఈ పనులన్నీ రత్తన్ మన స్పృహలో లేకుండా మిషన్‌లా జరిపించింది.

తరువాత యథాప్రకారం నివాస స్థానానికి వచ్చింది. జాలప రోజూ పుదయం, సాయంత్రం వచ్చి చాలాసేపు కూర్చుని వెళ్తూవుంటుంది. శోకసంతప్త మైన రత్తన్ హృదయానికి జాలప కొంచెం అండగా వున్నది.

ఎప్పుడూ రత్తన్‌హృదయాన్ని ఏదో అవ్యక్తమైనబాధ పీడిస్తూవుంటుంది. నలుగురిలో కూర్చున్నప్పుడు బాధ కొంచెం సమసినట్టుగా వుంటుంది. కానీ, ఎవరిఇళ్ళకు వాళ్ళు పోగానే తన వంటరితనాన్ని పోగొట్టటానికా అన్నట్టు బాధ పిలవకుండానే వచ్చేస్తుంది. ఎప్పుడు తను ఒంటరిగా కూర్చున్నా ఈ ఎనిమిది సంవత్సరాల సాంసారిక జీవితము, నగలమీద తన ఆసక్తి, సినిమాలూ, షికార్లూ ఇవన్నీ జ్ఞాపకానికి వస్తున్నయ్యి. వివశంగా కన్నీళ్ళు పెట్టుకోవల్సి వస్తుంది. ఇదే కాకుండా ఆమెకు ఇంకో దిగులుకూడా బయలుదేరింది. ఇన్నాళ్ళనుంచి తన బాధ్యతను భరించే రక్షకుడొకడు ఈ లోకంలో తనకు వున్నాడు. ఇప్పుడతను దారితప్పుకున్నాడు. ఇదివరకు యెంత నిశ్చింతగావున్నా జరిగిపోయేది. ఇప్పుడలా కాదు, జాగ్రత్తగా వుండాలి తను :

వకీలుగారి తమ్ముడికొడుకు ఈ నెలరోజులనుంచీ ఇక్కడే వుంటున్నాడు. చాల తెలివి, కలుపుగోలుతనం కలవాడు. ఈ ఒక్క నెలరోజులలోనే అత నీ పట్నంలో అనేకమంది పరిచయుల్ని, మిత్రుల్ని కల్పించుకున్నాడు. వకీలుగారి ఆత్మీయుల్నీ, మిత్రుల్నీ తనవైపు ఆకర్షించుకున్నాడు. బేంకు అకౌంటు తన పేరుకు మార్చుకున్నాడు. అలహాబాదు బేంకులో వకీలుగారికి 20 వేలు వున్నయి. చూస్తూ చూస్తూండగానే ఆ 20 వేలకూ వారి అన్నకొడుకు అధికారి అయినాడు. తరువాత మెల్లిగా అద్దెలుకూడా తనే వసూలుచేయసాగాడు. దీనితో రత్తన్ పూర్తిగా అధికారచ్యుత అయింది. తనిలా అనధికారి అయినట్టు చివరివరకూ రత్తన్‌కు తెలియనే తెలియదు.

ఒకరోజు టీమల్ అన్నాడు : "చూడండమ్మగారూ ! పోయినవారు ఇక ఎల్లాగూరారు. వారిని గురించి దిగులుపడి కూర్చుంటే ఎల్లా ? చూడండమ్మగారు,

చినబాబుగారు బేంకిలో డబ్బంతా తన పేరున మార్పించుకున్నారని తెల్సింది. కొంచం జాగ్రత్తగా వుండడం మంచిది. చూడండమ్మగారు! లేకపోతే....!"

చాడీలు చెబుతున్నందుకు రత్తన్ చాలా కోపంగా చూసింది. అతను నోట్లోమాటల్ని నోట్లోనేమింగి తలవంచుకు వెళ్ళిపోయాడు. సాయంత్రానికే అతనిమీద ఒక దొంగతనపు నేరాన్ని వేసి మణిభూషణ్ అతన్ని ఇంట్లోనుంచి వెళ్ళగొట్టాడు. రత్తన్ నోరెత్తి మాట్లాడలేదు.

ఇకపోతే, వెనకటినుంచి వున్నవాడు ఇంట్లో వంటపంతులు ఒక్కడేను. అతనికి భంగుతాగడం అలవాటు. దానికి మణిభూషణ్ కొంత ప్రోత్సాహాన్నిచ్చాడు. ఈ ప్రోత్సాహంతో వంటపంతులు మణిభూషణుడికి భృత్యుడయాడు. ఈ వంటపంతులు దాసీలదగ్గర, ఇంటికివచ్చే ఇతర్లదగ్గర మణిభూషణుడిలోవున్న వుత్తమ గుణాలను ఏకరువుపెట్టసాగాడు. దీంతో మణిభూషణుడికి ఇంట్లోవున్న ఇతర దాసీల హృదయాల్లోనూ, చుట్టుపట్లవారి హృదయాల్లోనూ గౌరవం ఎక్కువయింది. ఇదంతా రత్తన్‌కు తెలియకుండా పన్నిన చక్రవ్యూహం!

ఒకరోజు మణిభూషణుడు రతన్‌తో ఇలా అన్నాడు: "పిన్నీ! ఇక నేను ఇక్కడ వుండటం అనవసరం. పోతే నీవుమాత్రం ఇక్కడ వంటరిగా దేనికి? నా దగ్గరకువచ్చేస్తే, కోడల్ని, మనుమళ్ళనీ చూసుకుంటూ కాలం గడుపవచ్చును ఇలాంటప్పుడు ఇక ఇక్కడ బంగళామాత్రం మన కెందుకు? మంచి ధరవస్తున్నది. అమ్మదాం!"

ఈ మాటలు రత్తన్‌ని నిద్రలోంచి లేపేసయ్యి. సాశ్చర్యంగా మణిభూషణుడివంక చూస్తూ, "ఏమన్నావూ!" అన్నది.

"ఆఁ ఏమీలేదు. ఇక నేను ఇక్కడ ఎందుకు? నిన్ను తీసుకుని ఇంటికి పోతే బాగుంటుందికదా? అని యోచిస్తున్నాను!"

"బాగానే వుంటుంది...." ఉదాసీనంగా అన్నది రత్తన్.

"బాబాయిగారు ఏమైనా వీలునామా రాస్తే చూపించు. వారి యిష్టప్రకారం జరపడం మన ధర్మం."

"వీలునామా రాయలేదు. అయినా, ఏమిటి అవసరం?"

"ఒకవేళ రాసి ఎక్కడైనా పెట్టారేమో!"

"ఏమో! నా దగ్గిర ఎన్నడూ ఆ ప్రస్తావనే తేలేదు."

మణిభూషణుడు నవ్వుతూ "బాబాయి జ్ఞాపకార్థం ఏమైనా చేయిస్తే బాగుంటుంది" అన్నాడు.

రత్తన్ వుత్సాహంగా "అవును. తప్పకుండా చేయించాలి!" అన్నది.

"అయితే.........పొలాలమీద వచ్చే ఆదాయం దాదాపు రెండువేలు వుంటుంది. పోతే, వారు సంవత్సరానికి రెండువేలు దానధర్మాలక్రింద ఖర్చు పెడుతున్నారు. అంటే పొలాలమీద వచ్చే మొత్తం ఆదాయాన్ని దానధర్మాల క్రింద ఖర్చుపెడుతున్నారన్నమాట! ఆ ఆచారాన్ని అలాగే కొనసాగిద్దామా?"

"తప్పకుండా!"

"సరే భూమిమీద ఆదాయం ధర్మాలక్రింద ఖర్చు. ఇకపోతే, ఇంటిఅద్దెల మీద నెలకు వచ్చే ఒక వందరూపాయలతో ఒక సంస్కృత పాఠశాల నడుపుదామా?"

"అదీ, బాగానే వున్నది."

"పోతే, ఇక ఈ బంగళాను అమ్మి డబ్బు బేంకిలో వేద్దాం!"

"అట్లాగే వేద్దాం, నాకు డబ్బుతో అవుసరం ఏమిటి?"

"మీకు ఏమైనా పనులుంటే చేసిపెట్టడానికి మేమంతా వున్నాముకదా? ఇంక ఈ మోటారెందుకు? దీన్నికూడా అమ్ముదాము. ఇప్పుడు మనం అనుకున్న పనులన్నీ జరగాలంటే చాలా డబ్బు అవుసరం!"

"అంత త్వరగా కారు అమ్మడం దేనికి? బేంకిలో కొద్దో గొప్పో డబ్బు వున్నదిగా?"

"బేంకిలో ఏమున్నదని మీ వుద్దేశ్యం? మహావుంటే వెయ్యో, ఐదు వందలో వుండవచ్చు: పట్నమాయె! ఈ నెలరోజులనుంచీ, దానికనీ, దీనికనీ వాడుతూనే వున్నానా? అవికూడా అయిపోవచ్చినయ్యి. ఈ కారును అమ్మడమే మంచిది."

"సరే....అలాగే!"

రత్తన్ మనస్థితి దారుణంగావుంది. మానసికశక్తి క్షీణించినప్పుడు మనిషి అతి సాధారణమైన విషయాన్నికూడా ఆలోచించలేదు. శోకంలో మునిగిన వాళ్ళకు ఏమాత్రం సానుభూతి చూపినవాడైనా పరమ ఆత్మీయుడుగా కనుపిస్తాడు. రత్తన్ స్థితికూడా అలాగేవున్నది. ఇప్పుడామె ఎవరేం చెప్పినా యథార్థమనే నమ్ముతుంది....ఆచరిస్తుందికూడాను! ఆమెకు ఎవ్వరిమీదా అనుమానం కలగదు. ఎవ్వరినీ శంకించదు. తనలో కలుపుకోవడం తప్పితే ఎదిరించి వేరుచేయగల శక్తి ఆమెకు లేదు.

# 32

శ్రాద్ధకర్మలు ముగిసిన తరువాత జాలప రత్తన్ ఇంటికి పోవడం తగ్గించింది. రోజూ ఒక్కసారో, లేకపోతే రెండురోజులకు ఒక్కసారో పోయి కనబడి వస్తున్నది. ఇటు దయానాధుడికి కొద్దిరోజులనుంచి జ్వరం వస్తున్నది. అందువల్ల జాలపకు రత్తన్ ఇంటికి వెళ్దామన్నా తీరుబాటు కావడంలేదు.

దయానాధుడిది బాధను ఓర్పుగా భరించే మనస్తత్వంకాదు. జ్వరంతో పడే బాధకన్నా, తను ఇతర్లను పెట్టే బాధ ఎక్కువగావుంది. పాటలూ, పద్యాలూ, మతిలేని మాటలూ, యములవాళ్ళనీ, అవనీ, ఇవనీ హడలగొడుతూ వుంటాడు. అదీకాక వృద్ధాప్యంలో వచ్చిన ఈ జ్వరం తన ప్రాణాలను బలిగొంటుందని అతనికో గట్టి అనుమానం। దాంతో చుట్టాల్ని, పక్కాల్ని, బంధువుల్ని, అందరినీ తన మంచంచుట్టూ కూర్చోమంటాడు. కావాలంటే అతనికి ఎంతైనా సేవచేస్తారు ఇంట్లోవాళ్ళు. కానీ, అతని ఏడుపుల్నీ, నవ్వుల్నీ, పిచ్చి మాటల్నీ వింటూ కూర్చోవడమనేది దుర్భరమైన విషయం।

అతని పిచ్చిచేష్టలకు ఏ దయ్యమో భూతమో ఆవేశించిం దనుకుంటున్నారు ఇంట్లో వాళ్ళు.

దయానాధుడికి దినపత్రిక చదవటం ఒక వ్యసనం. అతడు పడుకున్న గదిలో పాత దినపత్రికల మోపు ఒకటి పడేసివుంది. జాలప మామగారి దగ్గిర కూర్చుని బాగా అలసిపోయినప్పుడు చేసేపని ఏమీలేక ఆ దినపత్రికలను తిరగేస్తూ వుంటుంది. ఒకరోజు మామూలుగా పత్రికలు తిరగేస్తూవుండగా ఆమెకు ఒక దాంటో చదరంగం ఆటపోటీ కనుపించింది. దాన్లో ఆ ఆటను చక్కగా కట్టించినవాళ్ళకు బహుమతికూడానని వున్నది. దయానాధుడి దగ్గిర ఈ ఆటల నమూనాల అచ్చుపుస్తకం వున్నట్టు జాలపకు తెల్సు. వెంటనే లోపలికిపోయి ఆ నమూనా పుస్తకాన్ని పట్టుకువచ్చింది. దాన్లో కొన్ని ఆటల నమూనాలూ, అదే-విధానాలూ, చివరకు ఆటకట్టే విధంకూడా రాసి వున్నది.

తనుకూడా యీ పుస్తకంలోని ఒక నమూనాను ఏ పత్రికకైనా ప్రకటించడానికి ఎందుకు పంపకూడదు? సక్రమంగా ఆడినవాళ్ళకు తనుకూడా పదిరూపాయల బహుమానాన్ని యిస్తానని సంపాదకులకు రాసేస్తే? ఎవడుపడితే, వాడల్లా ఆడటానికి అంత తేలికయిన ఆటేమీకాదు. దయానాధుడు గనక చూడడం జరిగితే తప్పకుండా, పాల్గొనవచ్చు. పైగా తను యిచ్చేది ఏమంత పెద్ద బహుమానం

కాదు కనకపెద్ద పెద్ద ఆటగాళ్ళు దీని జోలికిరారు. ఎల్లాగయినా, దీనిద్వారా వారు ఎక్కడవున్నదీ తెల్సుకోవాలి అనుకున్నది జాలప.

జాలప ఉదయంనుంచీ యిదే ఆలోచిస్తున్నది. ఈ ఆలోచనలోపడి రత్తన్‌దగ్గిరకుకూడా పోలేదు. రత్తన్ అంతవరకూ జాలపకోసం ఎదురుచూసి యిక రాదని నిశ్చయించుకుని తనే బయలుదేరింది. భర్త చనిపోయిన తరువాత ఆమె యిదే బయటికి రావడం. బజార్లన్నీ నిరాశగా, నిశ్శబ్దంగా వున్నై. నెల రోజులనుంచీ ఆమెకారును ముట్టుకోలేదు. మహా వేగంగా పోనిద్దామనుకున్నది. కానీ, నడపడం ఎద్దుబండికంటే హీనంగా వున్నది. మధ్య మధ్య కారాపుతూ, రోడ్డుమీద అడుక్కునే అనాథలకూ, దరిద్రులకూ అణా బేడా ధర్మం చేస్తూ జాలప యింటికి చేరుకున్నది.

జాలప రత్తన్‌ని చూడగనే నమస్కరించి, "ఇవ్వాళ రాలేకపోయినందుకు క్షమించు అక్కా. మా మామగారికి వంటో ఏమీ బాగాలేదు" అన్నది.

రత్తన్ వెంటనే దయానాథుడి గదివైపుకు తిరిగి "ఇక్కడేనా వున్నది? నాతో మాటమాత్రమైనా అనలేదేం?" అన్నది.

దయానాథుడి జ్వరం అప్పుడు కొంచెం తగ్గివున్నది. రత్తన్‌ని చూసి "చాలా బాధలో వున్నావమ్మా! ఏం చేస్తాం? అనుభవించక తప్పదు. పుట్టిన ప్రతివాడూ గిట్టాల్సిందేకదా! అట్టే కూర్చునేవాడు ఒకడూలేడు. నా పనీ అయిపోయింది తల్లీ! ఈ ముసలితనంలో యీ జ్వరం వూరికే రాలేదు. నన్నెత్తుకుపోడానికే వచ్చింది! ఆపదసమయంలో గొంతులో కాసిన్ని నీళ్ళుపోసే కొడుకు చేయిదాటిపోయాడుకదా? ఇక మిగిలిన ఇద్దరూ వున్నారంటే వాళ్ళకు నా అతీగతీ పట్టిందా? వాళ్ళ ఆటలేమో, వాళ్ళ తిరగడాలు ఏమో! ఒక్క క్షణం ఎవ్వరూ దగ్గిర కూర్చోరు. ఎవరికి చెప్పుకోను తల్లీ? ఇక బ్రతకడంవల్ల ....!?" అన్నాడు నిరాశగా.

రత్తన్ "అబ్బే....మీ రంతగా అధైర్యపడవల్సిన పనిలేదు. ఇది మలేరియా. రెండురోజుల తరువాత అదే పోతుంది" అన్నది.

దయానాథుడు దీనంగా చూస్తూ "కూర్చో అమ్మా! నీ వంటున్నావుగాని, నా కేమీ బ్రతుకుతానని నమ్మకంలేదు. ఒకవేళ నీ నోటివాక్యాన బ్రతుకుతానేమో! అయినా ఒక్క విషయ మమ్మాయీ! చావంటే నాకు బొత్తిగా భయంపోయింది. అక్కడకూడా ఆత్మలు ఇక్కడిలాగానే అనేక వ్యవహారాలు చేస్తూవుంటయ్యట. దేవాలయాలూ, కచేరీలూ, వార్తాపత్రికలూ అన్నీ వుంటయ్యట! అలాంటప్పుడు ఇంక నా కెందుకు భయం?" అన్నాడు.

రెండునెల్ల తర్వాత రత్తన్‌కు ఇవ్వాళే నవ్వు వచ్చింది. పై మాటలు అనేటప్పుడు దయానాథుడి ముఖం వినోదసూచకంగా లేకుండా గంభీరంగా

వున్నది. అంటే, ఆ లోకంలోకూడా ఇక్కడిలాగే అనేక వ్యవహారాలు వుంటయ్యని అతని గాఢ విశ్వాసం! రత్తన్‌కు నవ్వు ఆగలేదు. ఎదురుగా నవ్వితే ఏమైనా అనుకుంటాడేమోనని బైటికి పోయింది. రత్తన్‌తోపాటు జాలపకూడా బయటికి వచ్చింది.

"బాబుగారు ఏమనుకుంటారో! నేను జ్వరంతో చస్తూవుంటే వాళ్ళకు నవ్వులుగా వుంది అనుకుంటారేమో?" అన్నది రత్తన్.

"ఇప్పుడు నయం, జ్వరం తక్కువగా వున్నది. జ్వరం బాగా వున్నప్పుడు ఇంకా సుతీమతీలేని విషయాలు మాట్లాడుతూ వుంటారు. పొట్ట చక్కలయ్యేట్టు నవ్వు వస్తుంది! ఇంట్లోకి పోదాం పద" అంది జాలప.

"ఐతే, నాతో రావా?"

"ఇవ్వాళ రాలేనక్కా!"

"మరి రేపో?"

"చెప్పలేను. వారికి కొంచెం నిమ్మళంగావుంటే వస్తాను."

"అలా వీలులేదు; రేపు తప్పకుండా రావాలి. నీ సలహాకూడా తీసుకోవాలి!"

"ఏం సలహా? ఏ విషయంలో?"

"మణిభూషణుడు బంగళా అమ్మి ఇక్కడినుంచి పోదాం అంటున్నాడు."

నడుస్తున్న జాలప ఠకీమని ఆగిపోయింది. "ఏమన్నావు? నీవీ గ్రామం నుంచి వెళ్తావా? నేను పోనీయను తల్లీ! నీవు లేకపోతే నాకు ఒక్కక్షణం గడవదు. కనీసం వారు తిరిగి వచ్చేవరకైనా నీవుండాలి. మొన్నమాత్రం మొన్న ఒక్క వారంరోజులు నీవు కలకత్తాలోవుంటే, ఇక్కడ నేనొక్కొక్క క్షణం యుగంలా గడిపాను. నిజం, రత్తన్! నీమీద నాకు అంత ప్రేమ వున్నదని వెనక తెలియదు. కావాలంటే మణిభూషణ్‌తో నేను చెబుతాను. బంగళా అమ్ముకున్నా వుంచుకున్నా, నిన్ను మాత్రం కొన్నాళ్ళు వుంచాల్సిందే!" అన్నది.

రత్తన్ కళ్ళు చెమ్మగిల్లినయి. "నాకూ అలాగే వుంది. నేను నిన్ను వదలి వుండలేను. మణిభూషణుడితో రానని ఖచ్చితంగా చెబుతాను" అన్నది.

జాలప రత్తన్ చేయిపట్టుకుని పైకి తీసుకుపోయింది. ఆమెను మరీ దగ్గరగా తీసుకుంటూ, "చేతిలో చెయ్యివెయ్యి వెళ్ళనని" అన్నది జాలప.

"ఇదిగో వెళ్ళను. వెళ్ళనంటే వెళ్ళను! రెండువందల రూపాయలు అద్దెలమీద వస్తయ్యి. అవి నా ఖర్చులకు సరిపోతయ్యి. బంగళాకూడా అమ్మనీయను. సరేనా?" అంటూ క్రిందవున్న చదరంగం నమూనాలను చూసి, "చదరంగం ఎవరితో ఆడుతున్నావు?" అడిగింది రత్తన్.

జాలప తన అభిప్రాయాన్నంతా చెప్పి వినిపించింది. ఇదంతా అనవసరం. దీనివల్ల ప్రయోజనం లేదు అంటుందేమో అనుకున్నది. కానీ, రత్తన్ విని సంతోషించింది. ''పదిరూపాయలు చాలవు. యాభైరూపాయలు పెట్టు. కావా లంటే డబ్బు నేను యిస్తాను" అన్నది.

జాలప తన అనుమానాన్ని తెలియజేసింది. ''మరీ పెద్ద పారితోషికం పెట్టేటట్లయితే, పెద్దపెద్దవాళ్ళు ఆడి....వాళ్ళు కొట్టుకుపోతారు. అసలుపని జరగక పోగా డబ్బు దండగ అవుతుంది'' అన్నది.

''అలా ఏం జరగదు భయపడకు! రమానాధుడుగారు చూశారా? తప్పని సరిగా పూర్తిచేస్తారు.అసలు వారే మొదట పూర్తిచేస్తారని నా నమ్మకం! భగవద నుగ్రహంవల్ల వారే పూర్తిచేశారా? వారి అడ్రసు పత్రికాఫీసులో దొరుకుతుంది. కనీసం ఎక్కడ వున్నదీ, తెల్సుకోవచ్చు!''

''అయితే, దీనివల్ల ప్రయోజనం వుందంటావు?"

''పూర్తిగాను!''

''సరే....అయితే, ఇవ్వాళే ఒక వుత్తరం రాస్తాను. ఏ పత్రికకు పంపనూ?"

''ప్రజామిత్ర మంచి పత్రిక.''

''అయితే దానికే పంపుదాం! ఒకవేళ డబ్బు కాస్తా మింగి మనం పంపిన నమూనా అచ్చు వెయ్యకపోతే?"

''అట్లా జరగదు....ఒకవేళ పోయినా యాభైరూపాయలేగా? వాళ్ళ బుద్ధి తెల్సిపోతుంది....ఇప్పుడు నాతో ఇంటికి వస్తావా? డబ్బు ఇచ్చిపంపుతాను!"

''ఇప్పుడెక్కడ. రేపు వస్తాను!''

ఇంతలో దయానాధుడు ఎందుకో జాలపను పిల్చాడు. జాలప లోపలకు పోయింది. రత్తన్ బయటికి పోతుండగా విసినకర్రతో విసురుకుంటూ రాజేశ్వరి ఎదురైంది.

"ఏం? బాగా వుక్కపోస్తున్నదాండి? నాకు చలివేస్తున్నట్టుగా వుంది!.... అరె....రె....ఏమిటీ కాళ్ళనిండా తెల్లగా పిండి? ఏమైనా విసురుతున్నారా?" రత్తన్ అడిగింది.

రాజేశ్వరి సిగ్గుతో తలవంచుకుని "ఏం చేయను? వైద్యుడు మరపిండితో చేసిన రొట్టెలు వారికి పెట్టవద్దన్నాడు. విసరిన పిండి బజారులో ఎక్కడా దొరక లేదు....కూలివాళ్ళను పలకరిస్తే బేడలూ పావులాలూ, అడుగుతున్నారు!"అన్నది.

"అయితే, మీరు పిండికూడా విసరగలరన్నమాట?"

"ఆఁ ఎన్నివున్నయ్యిలే! మొత్తం అర్ధశేరుకూడా లేవు. అసలు జాలపే విసురుతున్నది. కాని నాకు వారిదగ్గర కూర్చోవడం మహావిసుగు! అందువల్ల దాన్ని వారిదగ్గిర కూర్చోవడానికి పంపించి నేను విసురుతున్నాను."

మాట్లాడుతూ, మాట్లాడుతూ రత్తన్ తిరగలిదగ్గరకుపోయి కూర్చున్నది. తిరగలిని ఒకమాటు అటూ ఇటూ కదిపి, "గోధుమలు వుంటే కొంచెం ఇటుతెండి విసురుతాను!" అన్నది.

"నీవల్లకాదు. నీవిటు లేచిరా అమ్మా!"

"నావల్ల కాకపోవడం ఏమిటి? మా అమ్మగారింట్లో రోజూ విసిరేదాన్ని! మీ కెందుకు, కాసిని పట్టుకురండి."

"చేతులు బొబ్బలు ఎక్కుతయ్యి. లే అమ్మా!"

"ఏమీ ఎక్కవు. మీరు పట్టుకురండి."

రాజేశ్వరి రత్తన్ చెయ్యిపుచ్చుకు లేవదీస్తూ, "ఇంట్లో గోధుమలు నిండుకున్నై అమ్మా. బజారునుంచి ఎక్కడ తెప్పించను!" అన్నది బ్రతిమలాడుతున్నట్టు.

"సరే, ఎల్లావుండవో, నే వచ్చిచూస్తా. రత్తన్ సరుకుల గదిలోకి పోయింది. డబ్బాలన్నీ గాలించి చివరకు గోధుమల్ని తెచ్చింది. "చూశారా? తెచ్చాను!" అన్నది సంతోషంగా.

రత్తన్ ఒక గిన్నెలో గోధుమల్ని పోసుకుపోయి విసరడం ప్రారంభించింది. రాజేశ్వరి జాలపదగ్గిరకు పోయి "చూడు మీ స్నేహితురాలు ఏం చేస్తున్నదో; తిరగలిముందు కూర్చుని గోధుమలు విసురుతున్నది! ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు?" అన్నది.

జాలప దయానాధుడి గదిలోనుంచి బయటకు వచ్చి అత్తగారిని యింకొంచెం వుడికించడానికి "అయ్యో! నిజంగానా? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? పరువూ, మర్యాదా ఏమైనా వుంటుందా? పదండి నేనూ వస్తున్నాను" అన్నది నవ్వు ఆపుకుంటూ.

"ఏం చెయ్యను ఎంత చెప్పినా వినందే!"

జాలప వెళ్ళి చూసేసరికి రత్తన్ నిజంగానే విసురుతున్నది. ఆమె ముఖం మీద సన్నగా చెమటపోసింది. చేతులు మిషన్లలా తిరుగుతున్నై. ముఖం సంతోషంతో వికసించింది.

"ఇదిగో, అమ్మా! పిండి మెత్తగా విసరాలె! లేకపోతే కూలిరాదు!" నవ్వుతూ అన్నది జాలప.

"అట్లాగేనమ్మా, ఎంత మెత్తగా కావాలంటే అంత మెత్తగా విసురుతాను. ఒక్కకానీ, అదనంగా పారేయించండి అమ్మగారూ!" రత్తన్ పకపకా నవ్వింది.

ఇద్దరూ ఒక్కసారి పెద్దగా నవ్వారు. తిరగటి శబ్దంలో నవ్వు కలిసిపోయింది.

# 33

రమానాథుడు టీషాపు పెట్టాడు. పగలంతా మూసివుంటుంది. రాత్రిపూట మాత్రం ఒక్క రెండు మూడు గంటలు పెడతాడు. సాధారణంగా దేవీదీన్‌కూడా కొట్టు వున్నంతసేపూ అక్కడే కూర్చుని వుండటంవల్ల, ఎటు తిరిగీ నలుగు రైదుగురు సరదాకయినా అతని దగ్గరకు వచ్చి కూర్చుంటారు. అతని దగ్గరకు వచ్చేవాళ్ళల్లో ఒకరిద్దరు మినహా మిగిలినవాళ్ళందరూ టీ తాగుతారు. రమానాథుడు కూడా టీ బాగా ఇవ్వడం మొదలుపెట్టాడు. ఒక్కసారి తాగినవాడు మళ్ళీ ఇంకో చోటికి పోడు. మొదటిరోజున మూడు రూపాయలు అమ్మింది. మర్నాడు నాలుగు రూపాయలు అమ్మింది. పదిరోజులకల్లా నాలుగు డబ్బులు కూడబెట్టాడు. వాటితో ఒక పాత టేబిలూ, రెండు కుర్చీలూ కొన్నాడు. సాయంత్రంపూట కూరల వ్యాపారం ఏమీ వుండదు. అందుచేత కూరల తట్టల్ని అవతలికి సర్ది టేబులూ, కుర్చీలూ పడేస్తాడు. అత డొకపేకా, రెండు దినపత్రికలనూకూడా పడేశాడు. దీనితో వ్యాపారం ఏడు ఎనిమిది రూపాయలవరకూ పెరిగింది.

రమానాథుడు టీషాపుపెట్టి నాలుగు నెల్లయింది. కొద్దిగా చేతులో డబ్బులు మెసుల్తూ వుండటంవల్ల తిరిగి వెనకటి షోకులూ, సరదాలూ అన్నీ యథాస్థితిని చేరుకున్నై. ఇన్నాళ్ళనుంచీ డబ్బులేక అణచుకోబడ్డ కోర్కెలన్నీ ఇప్పుడు ద్విగుణీకృతమైన వేగంతో బయటపడ్డయ్యి. సెంట్లూ, అత్తర్లూ, సినిమాలు, అన్నీ ప్రారంభమయినయ్యి. దేవీదీన్నీ, జగ్గోనీ సంతోషపెట్టడానికి రోజూ ఏదో ఒక పారితోషికాన్ని తెచ్చి ఇవ్వడం మొదలుపెట్టాడు. ఒకసారి దేవీదీన్‌కు ఒక పట్టుశాలువా తెచ్చి యిచ్చాడు. ముసలిది తలనొప్పిగా వున్నదనుకోవడం విని రెండు హెయిరాయిల్ బాటిల్స్ తెచ్చియిచ్చాడు. దీనితో జగ్గో ప్రాణం కొండెక్కినట్టయింది. ఇప్పుడు ముసలిదాన్ని సరుకులు మోయనీయటంలేదు ఒకవేళ తన మాట వినకుండా మోసిందా కోప్పడతాడు. కొట్టూగిట్టూ అన్నీ వదిలేసి వెళ్తాననీ బెదిరిస్తాడు. జగ్గోకూడా రమానాథుని చూసి భయపడుతూవుంటుంది నెత్తిన గంప పెట్టుకుని రమానాథుడు యింట్లో లేకుండా చూసి దొంగలా ప్రవేశిస్తుంది.

ఒకరోజు మనోహర్ థియేటర్‌లో రాధాకృష్ణ నాటకం జరుగుతున్నది. నాటకం చాలా బాగుంటుం దనుకుంటున్నారు రెండురోజుల ముందునుంచీ టిక్కెట్లు అమ్ముతున్నారు. అయినా, టిక్కెట్లు అందటంలేదు. రమానాథుడికి

కూడా నాటకం చూడాలనిపించింది. ముందుగానే తాను టిక్కెట్లు సంపాదించుకోవడం మంచిదనుకున్నాడు. రాత్రి పదిగంటల తరువాత తలకో గుడ్డ చుట్టుకుని టిక్కెట్టు తెచ్చుకోవడానికి బయలుదేరాడు. పోలీసులు పట్టుకుంటారేమోననే భయం హృదయంలో ఒకమూల కలకవేస్తూంది. అయినా ధైర్యంచేసి బయలుదేరాడు. వెళ్ళేప్పుడు జగ్గో అడిగింది : "ఎక్కడికి నాయనా !"

"ఎక్కడికీ లేదమ్మా, ఇప్పుడే వస్తా"నంటూ, రమానాథుడు బయటికి పోయాడు.

పెద్దబజారుకయితే ధైర్యంగా వచ్చాడేగానీ, తీరా వచ్చింతరువాత అతని ధైర్యం మంచులా కరిగిపోయింది. అడుగడుక్కీ ఏ పోలీసయినా వస్తూన్నాడేమోననే భయమూ, అనుమానమూ అతన్ని వేధించసాగినయ్యి. ఏ క్షణాన ఎటునుంచి ఎవరువచ్చి చేతులు పుచ్చుకుంటారోనని వణకిపోసాగాడు. తల పూర్తిగా వంచుకు నడుస్తున్నాడు. తన పక్కన ఎవరు నడుస్తున్నా ఏ పోలీసో, లేక సి. ఐ. డీ యో అయివుంటాడని అనుకుంటున్నాడు. అయినా ధైర్యాన్ని చిక్కబట్టుకు నడుస్తున్నాడు. ఇంతలో ముగ్గురు కానిస్టేబిళ్ళు ఎదురుగుండా వస్తూ కనిపించారు. వెంటనే రమానాథుడు రోడ్డువదలి పక్కకు తప్పుకున్నాడు. సరీగా అదే సమయానికి పోలీసులుకూడా రోడ్డువదలి సరీగా రమానాథుకు ఎదురు రాసాగారు.

దీంతో రమానాథుడి గుండెలు వేగంగా కొట్టుకోసాగినయ్యి. అనవసరం అయిన బెడద నెత్తిన పెట్టుకున్నానే అని పశ్చాత్తాపపడసాగాడు. వాళ్ళుముగ్గురూ తనను తీక్షణంగా చూస్తున్నట్టూ, తనను గురించే మాట్లాడుకుంటున్నట్టూ అనిపించింది. నెత్తిమీద తలగుడ్డను బాగా ముఖంమీదకు వాల్చుకుని, తలవంచుకు మనుషుల్ని చాటుచేసుకు దాటిపోచూస్తున్నాడు.

పై చేష్టలవల్ల పూర్తిగా అనుమానాస్పదుడైనా డతను.

పోలీసుల్లో ఒకడు "వీ డెవడో దొంగలా వున్నాడు. ఆ నడక చూడు ఎల్లా నడుస్తున్నాడో !" అన్నాడు తోటివాళ్ళతో.

రెండవవాడు "నిజమే ! అలాగే వున్నది" అన్నాడు.

మూడవవాడు సాయబు "ఏయ్ తలగుడ్డా ! కొంచెం ఇటురా. నీ పేరేమిటి ?" అన్నాడు.

రమానాథుడు వెనక్కి తిరిగి ప్రాణాలను అరచేతుల్లో పెట్టుకుని "నా పేరుతో మీ కేమిటి పని ? నే నేం దొంగనా ?" అన్నాడు.

"దొంగవి కాదు దొరవేలే ! పేరు ఎందుకని చెప్పవు ?"

రమానాథుడు ఒక్కక్షణం తటపటాయించి "హీరాలాల్" అన్నాడు.

"ఇల్లు ఎక్కడా ?"

"ఇల్లా !"

"అవును ఇల్లే అడుగుతున్నా !"

"షాజహాపురంలో."

"ఏ బజారు ?"

రమానాధుడు ఎన్నడూ షాజహాపురం వెళ్ళలేదు. సమయానికి ఏ పేరూ జ్ఞాపకం రాలేదు. ధైర్యంచేసి అన్నాడు : "ఏమిటి నా అడ్రసు రాసుకుంటు న్నారా ?"

"నీ అడ్రసు ఇవ్వాళ రాసుకోవడమేం ? ఎన్నడో రాసుకున్నాం ! పేరు మార్చావు. పేట మార్చావు. బజారు దగ్గిరకు వచ్చేసరికి గుడ్లు తేలేశావు. ఆరు నెల్ల నుంచీ నీ కోసరం వెదుకుతున్నాము. ఇవ్వాళ దొరికావు. పద స్టేషన్‌కు" అంటూ, చెయ్యి పుచ్చుకున్నాడు పోలీసు.

రమానాధుడు చెయ్యి విడిపించుకోడానికి ప్రయత్నం చేస్తూ, "వారంటు చూపించు వస్తాను. నేనేం పల్లెటూరివాడిని కాదు. దబాయించి లాక్కుపోవ డానికి !" అన్నాడు.

"పట్టుకోరా రెండోచెయ్యి. వారంటు స్టేషనుదగ్గర చూపుదాం !" అన్నాడు రెండోవాడితో.

ఇంతలో ఏమిటో చూద్దామని జనం నాలుగువేపులా గుంపు పోగుపడ్డారు. వాళ్ళల్లో నల్లమందు తెచ్చుకోవడానికి బయటికి వచ్చిన దేవీదీన్‌కూడా వున్నాడు.

రమానాధుని పోలీసులు ఈడ్చుకుపోవడం చూసి విభ్రాంతిచెంది "అరె.... రె....ఇదేమిటయ్యా ! వీరు మా యింట్లో వుంటున్నారు. వీరి నెందుకు లాక్కె ళ్తున్నారు ?" అన్నాడు పోలీసుల్తో.

ముగ్గురు పోలీసులూ దేవీదీన్‌కు పరిచయులే. "మీ ఇంట్లో వుంటున్నాడా ? ఎన్నాళ్టినుంచీ ?" అన్నారు.

"నాలుగునెల్లయింది. మే మిద్దరం ప్రయాగలో కల్సుకున్నాము. అసలు వీరి నివాసస్థానంకూడా ప్రయాగేలే, నాతోపాటే వచ్చారు."

సాయబు పోలీసు మనస్సులోనే సంతోషపడ్డాడు.

"అయితే వీరి పేరేమిటి ?"

"మీకు...చెప్పలేదా ? అదే !" అన్నాడు దేవీదీన్. దీంతో పోలీసుల అనుమానం దృఢమైంది.

"నువ్వుకూడా ఇతన్తో కల్సినట్టుంది. లేకపోతే, పేరు ఎందుకు చెప్పవు?"

దేవీదీన్ జాలిగా రమానాధుడివంక చూసి, "మేము రమానాధు డంటాము, మరి అసలు పేరు ఇదేనో, కాదో తెలియదు" అన్నాడు.

ఇంతలో సాయిబుపోలీసు అందుకున్నాడు : "అద్గదీ.... ఏమండీ పంతులు గారూ ! మీ అసలు పేరు ఏమిటి ? రమానాధా, హీరాలాలా ? లేకపోతే రెండు పేర్లూ మీవేనా ? ఒకటి అత్తింట్లోకి.... ఇంకొకటి పుట్టింట్లోకీ.... హి.... హి.... హి ఔనా ?" అన్నాడు.

మూడవ పోలీసు చుట్టూవున్న జనాన్ని వుద్దేశించి, "అసలు పేరు.... రమానాధుడు. చెప్పేది వేరేపేరు ! మీ రందరూ వింటూనే వున్నారుగా ?" అన్నాడు.

చుట్టూ మూగిన మనుష్యుల్లో గుసగుసలు బయలుదేరినయ్యి.

"నిజమే ! అనుమానించవలసిన మనిషిలాగే వున్నాడు."

"పేరూ, అడ్రసూ రెండూ మార్చాడు."

"అనుమానంలేదు; దొంగే !"

"పాతకేడీ !"

రమానాధుడికి ఇంక నోరెత్తడానికి అవకాశం లేకపోయింది. దేవీదీన్ కూడా ఏమీ మాట్లాడలేదు. రమానాధుడు మాట్లాడకుండా పోలీసుల వెంట నడిచాడు. స్టేషన్ దగ్గిరకు వచ్చేసరికి ప్రజలు ఎటువాళ్ళు అటు పోయారు. రమానాధుడు దేవీదీన్ వున్నాడేమోనని తల ఎత్తి చూశాడు. లేడు; అతను ముందే వెళ్ళిపోయాడు. గట్టిగా నిట్టూర్చి స్టేషన్‌లో కాలు పెట్టాడు అతను.

# 34

పోలీసులు స్టేషన్‌లో అప్పుడు సార్జంటూ, సబినస్పెక్టరు, సర్కిలూ, ఒక జిల్లా సూపరింటెండెంటూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఆ నలుగురి ముఖ భావాలూ ఏదో గంభీరమైన విషయాన్ని గురించి చర్చిస్తున్నట్టుగా వున్నై.

డి. యస్. పి. పొగ వదిలి "ఇక బయటి సాక్ష్యంతో పని జరగదు.... వాళ్ళల్లోనే ఎవరో ఒకరు అప్రూవరుగా తయారుకావాలి. ఎవరినైనా ఒక్కరిని లాగలేరా ?" అన్నాడు.

సార్జంటు, "మేము అన్ని ప్రయత్నాలూచేసి వూరుకున్నామండి.... ఎంతో ఆశ చూపాము కానీ, వాళ్ళల్లోనుంచీ ఒక్కడుకూడా చీలిరాలేదు. బయటనుంచి అయినా సాక్ష్యం దొరుకుతుందేమోనని చూశాము. అదీ లాభం లేకపోయింది. ఒక్క ముండాకొడుకూ సాక్ష్యం ఇయ్యలేదు" అన్నాడు.

డి. యస్. పి. "అయితే ఆ మార్వాడీ కుర్రాడిని మళ్ళీ పట్టుకరాక పోయారా ! అతని తండ్రిని బెదిరిస్తే పని జరుగుతుందేమో ?" అన్నాడు.

సార్జంటు "ఉదయంనుంచీ మేము చేసేపనే అది.... పాపం తండ్రి వాడిని ఎంతో బ్రతిమలాడాడు" అన్నాడు.

ఒక్క క్షణం అందరూ నిశ్శబ్దంగా వున్నారు. తరువాత డి. యస్. పి. "ఇక లాభంలేదు. కేసు నడవదు. అనవసరంగా చెడ్డపేరు తెచ్చుకున్నాము" అన్నాడు నిరాశగా.

"ఇంకొక్కవారం టైము యివ్వండి. యీలోపు ఎవరైనా అనుకూలం అవుతారేమో చూద్దామన్నాడు సబినస్పెక్టర్."

తరువాత సార్జంటు మినహా మిగిలిన ముగ్గురూ వెళ్ళిపోయారు. సార్జంటు హుంకా పీకుతూ కూర్చున్నాడు. ఇంతలో సాయిబు కానిస్టేబులు వచ్చి "చూశారా, దెబ్బకొట్టాను ? ఎవరో రమానాధుడుట ప్రయాగనుంచి వచ్చి దేవీ దీన్ యింట్లో వుంటున్నాడు.... అనుమానించతగ్గట్టుగా వున్నాడు. పేరూ, అడ్రసూ అన్నీ మార్చి చెప్పాడు. పట్టుకువచ్చాను. రెండు దబాయింపులు పడ్డయ్యా. విషయం అంతా బయటపడిపోతుంది" అన్నాడు.

"దేవీదీన్ అంటే.... అతనే కదూ.... వాడి యిద్దరి కొడుకులూ.... ?"

"అవునండీ వాడే !"

ఇంతలో రమానాధునికూడా సార్జంటుదగ్గిరకు తీసుకొచ్చారు. సార్జంటు అతనొన్నొకమాటు క్రిందనుంచీ పైవరకూ పోల్చుకుంటున్నట్టుగా చూశాడు.

"అయితే నీవు ప్రయాగ రమానాధుడివా? నీకోసం ఆరునెల్లనుంచీ వెతుకుతున్నాము, ఆకారం అంతా అచ్చంగా అదే గుడ్డివాళ్ళుకూడా గుర్తుపట్టవచ్చు!"

కానిస్టేబులు అనుమానిస్తున్నట్టు "అసలు ఎవరో? ఏమిటో? నిజం చెప్పు నిన్నేమీ బాధపెట్టను" అన్నాడు.

రమానాధుడు లేని నవ్వు తెచ్చుకుంటూ, "మీ చేతుల్లో చిక్కిపోయాను. బాధ పెట్టినాసరే లేక దయతలచినాసరే! నావల్ల ఒక పొరపాటు జరిగింది. దాన్ని నేను మీ దగ్గిర స్పష్టంగా ఒప్పుకుంటున్నాను. నేను ప్రయాగ మున్సిపాలిటీలో వుద్యోగిని. ఒక రోజున ఆఫీసు డబ్బు నాలుగువందలు స్వంతానికి ఖర్చుపెట్టుకున్నాను. ఆ విషయం ఇంటిదగ్గిర చెబితే వెంటనే చెల్లించేవారు. కాని, అలా చేయడానికి సిగ్గేసింది. ఇక జరగబోయే పరిణామాన్ని తల్చుకుని భయపడి ఇలాగ ఇల్లువిడిచి వచ్చాను....ఇదీ నా తప్పు!" అన్నాడు.

సార్జంటు కొంచెం గంభీరంగా "విషయం గడ్డుదే! అయితే, సారాయి గీరాయి ఏమైనా అలవాటున్నదా?" అన్నాడు.

"దాని వాసనకూడా నాకు తెలియదండీ."

కానిస్టేబుల్ వినోదంగా, "అయితే ఏ అమ్మాయి వల్లోనో పడివుంటావు పాపం!" అన్నాడు.

రమానాధుడు నవ్వి, "అలాంటివాడిని కాదు" అన్నాడు.

"అదీ కాకపోతే, పేకాటలోనైనా పెట్టాలి. భార్యకు నగలైనా చేయించాలి!"

రమానాధుడు వెర్రిగా నవ్వాడు ఔనన్నట్టు.

"బాగున్నది! అయితే భార్యకు నగలు చేయించావన్నమాట? పోనీలే; ఇక్కడ మేముకూడా నీకు చక్కని లావాటినగలు చేయిసాము చేతులకు!" సార్జంటు తన మాటలను ఆపి పక్కకు చూశాడు, పక్కన దేవీదీన్ చేతులు కట్టుకుని నిలబడి వున్నాడు.

సార్జంటు కఠోరంగా అరిచాడు, "ఇక్కడేం పని నీకు?"

"ప్రభువుల దర్శనం చేసుకుందామని వచ్చాను. పాపం ఇతడు చాలా అమాయకుడు; తమరు దయచూపాలి!" అన్నాడు దేవీదీన్.

"ఇతను నేరస్తుడు. నేరస్థుడిని ఇంట్లో వుంచుతున్నదే కాకుండా, పైగా సిఫార్సు చేయడానికి వచ్చావా?"

"బాబూ! కూట్లో నల్సు ఏరుకోలేని ముండాకొడుకుని, నేనేం సిఫార్సు చేసానండీ?"

"ఇతనిమీద వారంటు వున్నది. మున్సిపాల్టీ సొమ్ము అపహరించాడు. నీకు తెల్సుకదా?"

"బాబూ! ఏదో పొరపాటు జరిగివుంటుంది. కుర్రతనమవడంచేత ఖర్చు పెట్టుకుని వుంటాడు" అంటూ దేవీదీన్ రొంటినించీ ఒక చిన్న గుడ్డమూటను తీసి సార్జంటు ముందు పెట్టాడు.

సార్జంటు మండిపడి, "ఏమిటది?" అన్నాడు.

"అబ్బే ఏమీలేదండి....ఏదో తమకు సిగరెట్టు ఖర్చు....!" కని మధ్య లోనే ఆపాడు దేవీదీన్.

"అయితే లంచం పెడదాంవనుకుంటున్నావా? జాగ్రత్త నిన్నుకూడా బొక్కలో తోయిస్తాను!"

"కాటికి కాళ్ళుచాచాను. ఇక నేను ఎక్కడవున్నా చావుకేగదా ఎదురు చూడాల్సింది? కానియ్యండి. ఆపని అక్కడే జరుగుతుంది!"

"ఏయ్ ముసిలాడా! వూరికే వాగక నేను చెప్పేది విను. ఇతనిమీద డబ్బు అపహరించినట్టు కేసు వున్నది. ఇతన్ని పట్టుకున్నవాళ్ళకు ప్రభుత్వం ఐదువందల రూపాయలు యిస్తుంది, కనుక నీవు ఐదువందలూ తెచ్చి ఇచ్చినట్లయితే విడిచిపెడతాను!"

"ప్రభువులు, తమరు చాలా పెద్దమనుష్యులు....వెధవ ఐదువందలకోసం పరాయి దేశస్థుడిని బాధపెడతారా? వదలిపెట్టండి బాబూ, జీవితాంతం మీ పేరు చెప్పుకుంటాడు."

"ఏయ్, నోరుముయ్! మేము పుణ్యం సంపాయించుకోవడానికి నౌకరీలు చేయడంలా. అంత జాలిగా వుంటే, డబ్బు యిచ్చి విడిపించుకు పో!"

"నాదగ్గిర డబ్బెక్కడిది బాబూ?"

"ముసలిదానిని అడుగు పోయి!"

"దానిదగ్గిరమాత్రం నాకు తెలియకుండా డబ్బెక్కడిది?"

"ఏయ్, కానిసేబుల్! వీడిని బయటికి నెట్టు."

"సరే, మీరంటే కోప్పడితే పోతానులెండి, మనుష్యుల్ని పెట్టి నెట్టించడం దేనికి"

సార్జంటు కానిస్టేబుల్‌వంక చూచి "ఈయన్ని లోపలికి తీసుకు పో, రైటర్‌ని రిపోర్టు రాయమను" అన్నాడు.

గడపలోనుంచి వెళ్ళబోతున్న దేవీదీన్‌కు ఈ మాటలు వినపడ్డయ్యి. కొంపకు నిప్పంటుకున్నట్టు ఆదుర్దా పడసాగాడు. ఏదో చెబుదామని పెదాలు కదిపాడు. కానీ, చెప్పలేకపోయాడు. ఏదో స్థిరమైన నిర్ణయం చేసుకున్న

వాడిలా శిరఃకంపనచేస్తూ రెండడుగులు ముందుకు వేశాడు. మళ్ళీ ఆగి వెనక్కి వచ్చి, ''బాబూ ఒక్క రెండు గంటలు అవకాశాన్ని ఇప్పించండి'' అన్నాడు.

రమానాథుడిన్ని లోపలకు తీసుకుపోలేదు. తనమీద దేవీదీన్ చూపుతున్న మమకారాన్ని చూసి రెండు కన్నీటి బిందువులు రాల్చాడు.

''తాతా! నాకోసరం నీవేమీ బాధపడబోక. నీకు సాధ్యమైనంతవరకూ చూశావు. కానీ, నీకు సాధ్యంకానప్పుడు ఏం చేయగలవు? నా జాతకంలో జైలు ప్రాప్తి వున్నదేమో! నీ స్థానంలో మా నాన్నగారే వుంటే మాత్రం యింతకన్నా యింకేం చేయగలరు?....నీ వుపకారాన్ని....''

దేవీదీన్ కళ్ళు చెమ్మగిలినయ్యి.

"ఏంటి నాయనా ఆ మాటలు? డబ్బుమాట వచ్చేసరికి వెనక్కు తీస్తానను కుంటున్నావా? నే నలాంటివాడిని కాదు. అవుసరం అయితే యిల్లయినా అమ్మి తాను! పదివేల రూపాయీలమేడ వున్నది. నెత్తిన కట్టుకుపోతానా? ఇదిగో సార్జంటుగారూ, రిపోర్టు వ్రాయకండి, యిప్పుడే డబ్బు పట్టుకొస్తాను."

దేవీదీన్ వెళ్ళిపోయాక సార్జంటు సహృదయంగా ''ముసలివాడు మంచి వాడు. ఎట్లాగో వల్లో వేసుకున్నావు!'' అన్నాడు.

''ఇందులో వల్లో వేసుకునేదేమున్నది? బాధల్లో వున్నవాళ్ళను చూసి ప్రతి వాళ్ళూ దయచూపుతారు!'' అన్నాడు రమానాథుడు.

సార్జంటు నవ్వి "పోలీసువాళ్ళను మినహాయించి చెప్పండి .... వీళ్ళల్లో వుండదు. అయినా ఈ ముసలివాడు ఐదు వందలూ తెస్తాడని నమ్మకంగాలేదు" అన్నాడు.

'ఒకవేళ తాత పట్టుకువచ్చినా, అతని డబ్బుఖర్చు పెట్టించడం నాకే మాత్రమూ ఇష్టంలేదు. నిరభ్యంతరంగా రిపోర్టు రాసి జైలులోపెట్టండి' అన్నాడు రమానాథుడు.

ఒక్క క్షణం ఆగి "నేను పోలీసుల కంటపడకండా తిరుగుదాం అను కున్నాను. అది ఒక మూర్ఖత్వం అని తేలింది. నిత్యం ఎక్కడ పట్టుబడతామో అనే భయంతో జీవితమంతా గడిపేకన్నా, ఒకరోజు పట్టుబడిపోవడమే వుత్తమం!" అన్నాడు రమానాథుడు.

ఒక్కక్షణం తరువాత సార్జంటు దేన్నో ఆలోచించుకుని పులిక్కిపడ్డాడు. ముఖం వికసించింది. "ఇదిగో, రమానాథ్! నేనొక వుపాయం చెబుతాను, అల్లాగనని చేశావా? ముసలివాడి డబ్బుతో అవుసరం లేకుండానే నీకు జైలు తప్పుతుంది" అన్నాడు.

రమానాథుడు నీరసంగా తలవూపాడు సరే అన్నట్టు. అలాంటి మహదవ కాశం తనకు లభిస్తుందని అతనికి నమ్మకంలేదు.

"నీ వేమీ పెద్ద కష్టపడ నవుసరంలేదు. ఒక కేసులో సాక్ష్యం చెప్పాలి అంతే!"

'అయితే, అది తప్పుడు సాక్ష్యం అయివుంటుంది!'

'కాదు....యథార్థమేనండే!....ఈ సాక్ష్యం గనక ఇచ్చావా? ఈ మునిసిపాలిటీ గొడవ పోవడమే కాకుండా, నీవు చాలా వృద్ధిలోకి వస్తావు .... గవర్నమెంటు నౌకరీకూడా ఇస్తుంది. కాదంటావా? ఐదు సంవత్సరాలపాటు కృష్ణజన్మస్థానం తప్పదు. ఆలోచించుకో!'

ఏ కేసులో తను సాక్ష్యం చెప్పవల్సినది, ఆ కేసు లక్షణాలు ఏమిటీ వగైరా వివరాలన్నీ సార్జెంటు చెప్పేడు.

'అయితే నేను అప్రూవరుగా మారాలన్నమాట! నేనుకూడా ఆ బందిపోటు దొంగల్లో వున్నానని కోర్టులో ఒప్పుకోవాలంటారు. మరి ఇది తప్పుడు సాక్ష్యం కాదా?'

'అబ్బే....అట్లా కాదు. మీరు ఎవ్వరిమీదా అబద్ధం చెప్పబోవడంలేదు. బందిపోటు జరిగినమాట వాస్తవం. ఆ దొంగల భయంవల్ల అక్కడనుంచీ మాకు ఎవ్వరూ సాక్షులు దొరకలేదు. మీరు చెప్పే ఈ సాక్ష్యంవల్ల ఏ నిరపరాధికీ శిక్ష పడదని హామీ ఇస్తున్నాను. బాగా ఆలోచించుకుని చెప్పండి. ఒక మార్గం జీవితాన్ని స్వర్గతుల్యం చేస్తుంది. రెండోది నరకప్రాయం!'

రమానాథుడికి ఈ మార్గం బాగా నచ్చింది. ఒక చిన్న అబద్ధంతో వెనకటి తప్పులు మాసిపోగా, భవిష్యత్ జీవితం కూడా బాగుపడుతుందంటే,దాన్ని చూస్తూ చూస్తూ విడిచిపెట్టేంత మూర్ఖుడు కాడతను. నౌకరీ ఇస్తారనీ, మునిసిపాలిటీ కేసు పోతుందనీ ఏమిటీ నమ్మకం? అనుమానంగా అడిగాడు. 'మరి మీ పని గడిచిన తరువాత మునిసిపాలిటీవాళ్ళు నా గొంతు నులుమడానికి తయారైతే?'

'అట్లా ఎన్నటికీ జరగదు! నేనూ హామీ!'

'మరి నౌకరీ?'

'గవర్నమెంటు స్వయంగా కల్పించి ఇస్తుంది. మీరు బాగా నమ్మేట్టుగా సాక్ష్యం చెప్పి, బారిష్టరువాదాన్ని చిత్తుచేస్తే....మేము ఎన్నటికీ మర్చిపోము.'

వెంటనే సార్జంటు కారు తెప్పించి, రమానాథుని కూర్చోబెట్టుకుని డిప్యూటీ కలెక్టరు దగ్గరకు తీసుకుపోయాడు.

కలెక్టరుగారితో చాలాసేపు ఏకాంతంగా మాట్లాడిన తరువాత, చివరకు సార్జంటిలా అన్నాడు: 'మనిషిని చూడగానే ఏదో నేరంచేసే వుంటాడని అనుకున్నాను. చివరకు నేను అనుకున్నట్లుగానే అయింది. ప్రయాగ మునిసిపాలిటీలో డబ్బుకాజేసి వచ్చాడుట! ఇప్పుడు మనకేసులో అప్రూవరుగా సాక్ష్యం

ఇయ్యడానికి సిద్ధంగావున్నాడు. చదువుసంధ్యలు కలవాడు. మనిషికూడా చురుగ్గానే వున్నాడు."

కలెక్టరు సందిగ్ధంగా అన్నాడు: "అవును, చూడటానికి మనిషి చురుకుగానే వుండవచ్చు....!"

"మరి ఇంకో విషయం, మనం మొదలే అతని లోగడ తప్పును క్షమించి నట్టు పత్రాన్నివ్వాలి ....అప్పుడుగానీ అతనికి మనమీద విశ్వాసం కలగదు. లేకపోతే, సరైన సమయానికి తప్పుకోవచ్చు!"

"సరే, ఆ పని మొదట్లోనే చేద్దాం: మీరు ప్రయాగ పోలీసుస్టేషనుకు ఫోన్ చేసి, అసలు ఇతనిమీద ఏం కేసు వున్నదో కనుక్కోండి.

సార్జంటు ప్రయాగ పోలీసుస్టేషన్‌తో ఫోనులో మాట్లాడటం ప్రారంభించాడు.

ఒక్క క్షణంలో ఆ కలెక్టరు సార్జంటుని అడిగాడు: "ఏమంటున్నాడు?"

"వాళ్ళదగ్గిర ఈ పేరుగల యెవ్వరిమీదా వారంటులేదుట!"

"అయితే, ఏదో ఆశ్చర్యకరమైన విషయమేనే! ఇతనేం పేరు మార్చుకో లేదుకదా?"

పైగా అక్కడ మునిసిపాలిటీలో అసలు డబ్బే పోలేదుట! ఆ మునిసిపాలిటీకి యిలాంటి కేసేమీ లేదుట!"

"ఇది మరీ బాగుంది! ఇతనేమో డబ్బుతీసుకు పారిపోయి వచ్చానంటాడు. వాళ్ళేమో అసలు డబ్బే పోలేదంటున్నారు! మతిస్థిరం లేదేమో ఇతనికి?"

నాకూ ఆశ్చర్యంగానే వుంది. ఇప్పుడితనికి, నీమీద ఏ కేసూ లేదని చెప్పేసెయ్యడమా? మానడమా? అట్లా చెబితే మన మాట వింటాడా?"

"సరే, ఒకపని చేయండి నేరుగా మున్సిపాలిటికే ఫోన్‌చేసి....ఇతనెవరో ఏమిటో తెల్సుకోండి."

సార్జంటు ప్రయాగ మునిసిపాలిటీ ఆఫీసుకు ఫోన్ కనెక్షన్ చేశాడు.

"హల్లో....కలకత్తా పోలీసుస్టేషన్‌నుండి.... మీదగ్గిర రమానాధనే క్లర్కు ఎవరైనా వున్నాడా?"

"అవును—వుండేవాడు."

"అతను మీ మున్సిపాలిటీలో డబ్బేమన్నా అపహరించాడా?"

"లేదు. అతను ఇంట్లోనుంచీ చెప్పకుండా పారిపోయాడు. అంతేగానీ, ఇక్కడ డబ్బేమీ అపహరించలేదు. ఐతే, అతను మీ దగ్గిర వున్నాడా?"

"అవును, వున్నాడు. మేము అరెస్టు చేశాము. అతను స్వయంగా డబ్బు అపహరించానని చెబుతున్నాడు....అసలు విషయం ఏమిటి?"

"మరి పోలీసులు కదా మీరు, కనుక్కోండి చూద్దాం?"

"అబ్బే....ఈ విషయంలో మా బుర్రలు ఏమాత్రం పనిచేయడం లేదు."

"హి....హి....హి....లెఖ్ఖల్లో కొంచెం పొరపడ్డాడు. అందుకు భయ పడి పారిపోయాడు, తరువాత చూస్తే లెక్కలు సరిగానే వున్నై!"

పక్కనేవున్న డిప్యూటీ కలెక్టరు ఇదంతా తెల్సుకున్నాడు.

"మరి ఇప్పుడేం చేసేట్టు? పిట్ట తప్పించుకు ఎగిరిపోతుంది!"

సార్జెంటు తెలివితేటలు చూపాడు.

"ఎట్లా ఎగిరిపోతుందండి? అసలు మన మీ విషయాన్ని అతనికి తెలియ నీయకుండా వుంచేది! ఇక అతన్ని బయటికి పోనీయకండా బయటి విషయాలు అతనికి తెలియకండా చేద్దాము. పోతే, ఇంటివాళ్ళకు ఎటూ ఇత నెక్కడ వున్నదీ ఇక తెలిసిపోతుంది. కనుక వాళ్ళు రాకుండా వుండరు. అయినా సాధ్యం అయి నంతవరకూ ఇతన్ని యితర్లతో కలవనీయవద్దు!"

ఇక్కడిలా పరామర్శ జరుగుతుండగానే దేవీదీన్ డబ్బుపట్టుకుని పోలీసు స్టేషనుకు వచ్చాడు. కానిస్టేబులు, సార్జంటు కలెక్టరుగారితో మాట్లాడటానికి పోయారని చెప్పాడు."

"అయితే బాబుగారిని జైల్లో వేశారా?"

"లేదు; వారినికూడా వెంటబెట్టుకుపోయారు."

"ఛా....ఛా....పోలీసువాళ్ళ మాటల్లో ఏమాత్రమూ నిజం వుండదు. నేను ఒక గంటలో వస్తానన్నానుకదా? నా దగ్గిర సరేనని ఇంతలో ఎందుకింత తొందర పడాలి! అటునుంచీ అటే ఎక్కడికయినా పంపుతారుగామాలు! ఇక కంటి కయినా కనిపించడుగా? వారికీ ఐదువందలేగా వచ్చేది. నే నింకో వందకూడా యెక్కువ పట్టుకువచ్చానే! ముసలిది గోలగా ఏడుస్తున్నది" అంటూ దేవీదీన్ కూలబడ్డాడు.

"ఇంటికి వెళ్ళు, ఇక్కడెందుకు కూర్చున్నావు!"

"ఆ సార్జంటునే రానీ, అడిగేదేవో నాలుగూ ముఖాన్నే అడిగి వెళ్తా నింటికి! కాకపోతే నన్నుకూడా జైలుకు పంపుతాడు. అంతేనా? అయినా, ఇంత అన్యాయమా? ఆయనకు మాత్రం పిల్లలూ-పాపలూ లేరు? పాపం! వెళ్ళే ప్పుడు ఎంత దిగులు పడ్డాడో?"

"దిగులూ లేదు; పాడూ లేదు. నవ్వుతూనే వెళ్ళాడు! ఇద్దరూ కారులో కూర్చుని వెళ్ళారు."

దేవీదీన్‌కు కానిస్టేబుల్ చెప్పిన మాటమీద నమ్మకం కలగలేదు.

"నవ్వుతూ ఏం వెళ్తాడు? ఒకవేళ పైకి నవ్వినా మనస్సులో ఎంత బాధ పడేదీ నాకు తెలియదనా?"

దేవీదీన్ వచ్చి దాదాపుగా గంట అయింది. ఇంతలో జగ్గోకూడా దుకాణం సర్ది పరుగెత్తుకుంటూ వచ్చింది.

"ఇంతసేపటినుంచీ ఏం చేస్తున్నావు? బాబు ఏడి?"

"బాబుగార్ని సూపరెంటెండెంటుగారి దగ్గరకు తీసుకుపోయారుట. మళ్ళీ ఇక్కడికి తెస్తారో, లేకపోతే అటునుంచి అటే పంపుతారో!"

"డబ్బు యిస్తే విడుస్తారంటివిగా? ఇంతలోనే ఎందుకు పంపారు?"

"అదే అడుగుదామని కూర్చున్నాను."

"అడగడం ఏమిటి? ముఖం వాచేట్టు పెట్టాలి! ఒక్కమాటమీద నిలబడలేనివాడు ఒక తండ్రికి కొడుకుకాదు. నేనైతే నాలుగూ దులుపుదును. నన్నేం జేస్తాడు?"

"దుకాణంమీద ఎవరున్నారు?"

"కట్టేసే వచ్చాను. పాపం ఇంతవరకూ అన్నమైనా తినలేదు బిడ్డ. వెధవ నాటకం, ఆ నాటకం చేసింది ఇంతా! ఎన్నడూ బయటికి కదిలేవాడు కాదు; ఆ పాడైన నాటకంకోసం టిక్కెట్టు కొనుక్కుందామని వచ్చాడు. లేకపోతే, ఇంత ప్రారబ్ధం పట్టేదేకాదు!"

"ఇక ఇక్కడికి తేకుండా అటునుంచీ అటే ప్రయాగ పోలీసుస్టేషన్‌కు పంపితే?"

"కానీ, అంతగా అయితే అక్కడికే వెళ్ళి చూసొద్దాం."

"శిక్ష తప్పదు."

"ఎందుకు తప్పదూ? వాళ్ళ డబ్బు వాళ్ళకు కట్టేస్తే సరి. డబ్బేగా వాళ్ళకు కావల్సింది?"

"నీవు ఒక పిచ్చిముండవి - డబ్బు యిచ్చినమాత్రాన వదిలిపెడతారా? దొంగతనం. దొంగిలించిన సొమ్మును తిరిగి యిస్తే శిక్షవెయ్యకుండా వదుల్తారా?"

జగ్గోకు పరిస్థితి విషమించిందని తెల్సింది. ఒక్కక్షణం ఆగి, "సార్జంటు గారు" అనబోతూవుండగానే, సార్జంటు కారువచ్చి ఆగింది. కారులో రమానాధుడుకూడా వున్నాడు. దేవీదీన్‌నూ, జగ్గోనూ చూసి నవ్వుతూ కారు దిగాడు.

"తాతా! నీ వెంతసేపయింది వచ్చి? అరె....అమ్మకూడా వచ్చిందే? నీ వెంతసేపయిందమ్మా వచ్చి?"

సార్జంటు నవ్వుతూ "ఏం తాతా! డబ్బు తెచ్చావా?" అన్నాడు.

"నేను కొద్దిసేపట్లో వస్తానని చెప్పేపోయానుగా? ఇంతలో మీ రెందుకు తొందరపడ్డారు? లోపలికి పదండి డబ్బు లెక్కచూసుకుందురుగాని!"

"ఇన్నాళ్ళనుంచి పాతిపెట్టినవన్నీ బయటికి తీసినట్టుంది?"

"మీ దయవల్ల ఈ మాత్రానికే నేల తవ్వనవుసరం లేదులెండి." రమానాథువంక చూసి, "ఇంకా నిల్చుని చూస్తున్నావేం రమాబాబూ? ఇంటికి పద నేను డబ్బు చెల్లించివస్తాను" అన్నాడు దేవీదీన్.

"తాతా, డబ్బు తెచ్చినా ప్రయోజనం లేకపోయింది. పై అధికార్లు వదల డానికి వీలులేదన్నారు....ఎక్కడనుంచి తెచ్చావో అక్కడ పెట్టిరావొచ్చు!" అన్నాడు సార్జంటు.

సార్జంటు మాటలు వినేసరికి దేవీదీన్‌కు కళ్ళు తిరిగినట్లయింది.

"ఇదిగో, సార్జంటుగారూ! మాట అని తప్పుకోవడం మర్యాదస్తుల పని కాదు. డబ్బు అడిగారు, పట్టుకువచ్చాను. ఇక మీ మాట మీరు చెల్లించుకోండి. మీలాంటివారు మాట అని తప్పుకోవడం బాగుండదు!"

మామూలు పరిస్థితిలో అయితే ఈ మాటలకు సార్జంటు ఉగ్రుడయ్యేవాడే! దేవీదీన్‌కు రెండు తగిలించేవాడేమోకూడా. ఎందుకనో అతనికి కోపం రాలేదు. నవ్వుతూ అన్నాడు: "ఇదిగో, తాతా! మర్యాదస్తుడిని కాదనే అనుకో, మరేమైనా అనుకో! ఇతన్ని వదలడంమాత్రం నావల్లకాదు. ఇలాంటి కేసులు కావాలంటే రోజూ దొరుకుతయ్యా? వెధవ డబ్బుకు ఆశించి, భవిష్యత్తును పాడు చేసుకుంటానా?"

సార్జంటు నవ్వడం చూసి దేవీదీన్ మరో మెట్టు ఎక్కాడు.

"మరి, మీ రీ నోటితోనే చెప్పారుకదా?"

"అవునూ, ఈ నోటితోనే చెప్పాను! నోటికేం ఎలా కావాలంటే అలా తిరుగుతుంది! దూషించనూవచ్చు. భూషించనూవచ్చు!"

"మాటలు తప్పిన తరువాత నేనూ మొగవాడినేనని. మీసాలెందుకూ? గొరిగించేసెయ్యండి!"

సార్జంటు పెద్దగా నవ్వాడు.

"నాకు ఇన్నాళ్ళనుంచీ గొరిగించాలంటే సిగ్గుగా వుండేది. ఇప్పుడా సిగ్గు పోయింది. నిరభ్యంతరంగా గొరిగిస్తాను."

"మీరలా నవ్వబోకండి సార్జంటుగారూ! నాకు ఒళ్ళు మండుకొస్తున్నది. ఇదంతా వున్నదున్నట్లు కలెక్టరుగారి దగ్గరకు పోయి చెబుతాను. నేనెంత ముసలివాడిని, చదువుసంధ్యలు లేనివాడినయినా, ఆమాత్రం కలెక్టరుగారితో మాట్లాడగలను!"

"అయితే, తాతా! కొంపతీసి, నిజంగా నా గురించి కలెక్టరుగారికి చెబుతావా యేమిటి?"

దేవీదీన్ మనస్సులో సార్జంటు బలహీనతను చక్కగా కనిపెట్టాను అనుకున్నాడు.

"మరి మీ యిష్టంవచ్చినట్టు మీరు నడిస్తే, మాకు చేతనయింది మేము చేసుకోవాలిగా! తప్పేముంది?"

దేవీదీన్‌కు కోపం యెక్కువవడం చూసి. అంతవరకూ మెదలకండా తమాషా చూస్తున్న రమానాధుడు నవ్వి, "తాతా! సార్జంటుగారు నిన్ను వూరికే వుడికించడానికి అంటున్నారు. మేము ఒక ఏర్పాటు చేసుకున్నాము. నన్ను డబ్బు పుచ్చుకోకుండా వదలిపెట్టడమే కాకుండా, నౌకరీకూడా యిస్తారు. అయితే కొన్నాళ్ళపాటు యిక్కడే వుండాలి!"

దేవీదీన్ ఒక్కసారి విభ్రాంతి చెందాడు. కొంచెం ఆగి, "దీన్లో ఏదో మోసం వుంది. పాము ఎక్కడైనా ముద్దు పెట్టుకుంటుందా?" అన్నాడు.

రమానాధుడు తేలిపోయే స్వరంతో, "అబ్బే .... యిందులో మోసం ఏముంటుంది? వూరికే ఒక కేసులో సాక్ష్యం యివ్వాలి అంతే!" అన్నాడు.

దేవీదీన్ అనుమానంగా తలవూపి, "అట్లాగయితే అది దొంగ కేసయి వుంటుంది" అన్నాడు.

దేవీదీన్‌కు అనుమానం తీరలేదు.

"నా డబ్బు ఖర్చు అవుతుందేమోనని నీ విలాంటిపని చెయ్యవద్దు. నేను డబ్బుకు వెనక్కుతీసేవాడిని కాదు. అట్లా డబ్బుకే వెనకాడేవాడినయితే లక్షలు గడించేద్దును యీపాటికి. ఈ చేత్తోనే వేలు సంపాయించాను. వేలు ఖర్చుపెట్టాను. కనుక డబ్బుకోసం వెనకాడిమాత్రం నీ వీ పని చేయవద్దు! పోనీ, నీవు సాక్ష్యం ఇవ్వవలసిన కేసేమిటో, దాని వివరాలు ఏమిటో తెల్సుకున్నావా?"

పక్కనేవున్న సార్జంటు రమానాధుడుకి సమాధానం చెప్పే అవకాశా న్నియలేదు.

"ఆఁ అదే! ఆ బందిపోటు దొంగలవిషయం నీవు వినలా? వాళ్ళదుంప తెగ. వాళ్ళు మహా గందరగోళం చేసేశారు. వాళ్ళుచేసే హడావిడీలకు భయపడి ఒక్కళ్ళూ సాక్ష్యం ఈయడానికి రావడంలేదు. వాళ్ళనుంచి ఎంతమంది బీదలకు కొంపలు నాశనం అయినయ్యి" అన్నాడు సార్జంట్.

"అయితే రమాబాబూ! నీవు అప్రూవరవుతున్నావన్నమాట? .... ఇదే మంత మంచిపనికాదు! బయటవున్నవాళ్ళము అపరాధులు ఎవరో, నిరపరాధులు ఎవరో మనకేం తెలుస్తుంది? ఈ పోలీసులు ఎవరిమీద చెప్పమంటే వాళ్ళమీద కళ్ళుమూసుకుని చెప్పడం చాలా అన్యాయం!.... నీ స్థితిలో నేనే వుంటే, లక్ష రూపాయలు యిచ్చినా ఈపని చేయను.... చూడు నాయనా, నీ మూలంగా కొంత మంది నిరపరాధులుకూడా.........!"

సార్జంటు అందుకున్నాడు. "అబ్బే....అల్లా జరగదు. ఇప్పుడు కేసులో వున్నవాళ్ళంతా ఖచ్చితమైన దొంగలు!"

"అని మీరు చెబుతున్నారు. మాకయితే తెలియదుగదా?"

"అసలు ఒక్క విషయం! నిరపరాధులను మే మెందుకు పట్టుకుంటాము?"

"ఎందుకు పట్టుకునేదీ, నేనేం చెప్పగలను? కానీ, ఇలాంటివి నేను చాలా అనుభవించాను, చూచాను, విన్నాను! ఇదిగో రమాబాబూ! నీ విలా ఏ దౌర్భాగ్యులగొంతో నులమడంకన్నా, నీ అపరాధాన్ని ఒప్పుకుని, ఒక సంవత్సరమో, రెండు సంవత్సరాలో శిక్ష ననుభవించడం వుత్తమం!"

"నేను బాగా ఆలోచించాను తాతా! కాగితాలన్నీ చూచాను! వాళ్ళల్లో అపరాధి కానివాడు ఎవ్వడూలేడు" అన్నాడు రమానాథుడు.

"అవును; ఒకవేళ నీవన్నట్టు అందరూ అపరాధులే కావచ్చు! అయినా మన కీ వుద్యోగం తగదు! మన ప్రాణం మనకెంత తీపో, వాళ్ళప్రాణం వాళ్ళకు అంత తీపి" అంటూ దేవీదీన్ వెనక్కి తిరిగాడు. తన అభిప్రాయాన్ని అంతకన్నా స్పష్టంగా వివరించడం అనవసరం అనుకున్నాడు.

వెళుతెన్న దేవీదీన్‌కు ఏదో స్ఫురించి వెనక్కు తిరిగాడు. "ఏం బాబూ! నీ కేమైనా డబ్బు అవుసరం అవుతుందా? పోనీ దీన్ని నీ దగ్గిరవుంచు. ఎందుకయినా పనికివస్తుంది అన్నాడు."

"నా కేమవసరా లుంటయ్యి?"

సార్జంటు, "ఇవ్వాల్టినుంచి వీరు ఇక్కడే వుంటారు. వీరికి కావలసిన సౌకర్యాలన్నీ గవర్నమెంటు స్వయంగా చూస్తుంది" అన్నాడు.

"అవును, అది నాకు తెల్సు! ఇవ్వాల్టినుంచి వీరిని కార్లల్లో తిప్పుతారు. విందులు చేస్తారు. ఒంటరిగా ఎక్కడికీ పోనీయరు....ఇవన్నీ నాకు తెల్సు!" దేవీదేన్ గొంతు కర్కశంగా మారింది.

చరచరా వెళ్ళిపోయాడు.

వెళ్తున్న దేవీదీన్‌ని జగ్గో అడిగింది:

"ఇక బాబుగారు రారా?"

"రారు. మనవాళ్ళే మనకు కానప్పుడు, పరాయివాళ్ళు అవుతారా?"

ఇద్దరూ గొణుక్కుంటూ వెళ్ళిపోయారు.

# 35

జాలప ప్రజామిత్రకు పంపిన చదరంగపుయోచన ఫలించింది. రమానాధుడు కలకత్తాలో వున్నట్టు తెలిసింది. ఇది తెలిసినప్పటికి జాలపస్థితి విచిత్రం ! ఆమె కండ్లనుండి అశ్రుధారలు పోటీపడి గంగా, యమునల్లా ప్రవహించినయ్యి. అల్లాగే గడపలో నిలబడి ఆసందాతిరేకంవల్ల భోరున ఏడ్చింది. మనసు పరిపరివిధాలైన ఆలోచనల్లో పడ్డది. ఇన్నాళ్ళుగా రమానాధుడు ఇలా పోవడానికి తనే కారణం అనుకుంటున్న జాలపలో కోపమూ, కాఠిన్యమూ గూడు కట్టుకుంటున్నాయి. యధార్థంకూడా అంతే. మనకు కావల్సినవీ, మనం కోరేవీ, అకస్మాత్తుగా లభిస్తే, వాటిని మనం స్వీకరించలేకపోగా తప్పులు వెతుకుతాము.

భర్త తన్ను వదిలి ఇన్నాళ్ళు అక్కడ ఎందుకు వున్నట్లు ? వుత్తరమైనా ఎందుకు రాయలేదు ? అసలిలా నిరాశ్రయంగా ఏమనుకుని వదిలినట్టు ? మొదలైన విషయాలను తర్కిస్తూ గడపలో నిల్చున్నది.

ఇంతలో రమేశ్‌బాబు గడపలో నిల్చుని కేక వేశాడు, "గోపీ ! గోపీ ! ఇటురా !"

గదిలో మూలుగుతున్న దయానాధుడు "ఎవరు బాబూ ! ఇటురండి.... అరెరే... మీరా ? రమేశ్ బాబుగారూ ! చాలా రోజులకు కనిపించారు. ఏదో, ఈ భూమిమీద నాలుగుగింజలు వుండబట్టి మళ్ళీ మిమ్మల్ని చూడగలుగుతున్నాను. లేకపోతే, ఈపాటికి చెల్లుకోవల్సినవాడిని కదా ?-ఏం చెప్పను ? మంచి ఖాయలా పడ్డాను బాబూ. రత్నంలాంటి కొడుకుకేమో అలా దేశాలవెంట పోయాడు. ఉన్న ఇద్దరు కొడుకులూ ఒఠ్ఠి దొంగముండా కొడుకులయ్యారు. చెప్పినమాట సుతరామూ వినడంలేదు. భార్యకు నన్ను చూస్తేనే భయంగా వుంటుందిట ! ఇక ఆ కోడలే గనక లేకపోతే నా పాట్లు కుక్కలుకూడా పడేవికావు !" అన్నాడు రమేశ్‌బాబును చూసి.

"ఏమిటీ, మీరింత జబ్బుపడ్డారా ? నాకు మాటమాత్రమైనా తెలియచేయలేదేం ? ఒక్క కాగితం ముక్కమీద నాలుగు అక్షరాలుగీసి పంపితే వచ్చేవాడినిగా. అయితే, ఆఫీసుకు శలవు పెట్టారా ?"

"ఏం చెయ్యను ? కబురు పంపాను. మరి శెలవు మంజూరైందో కాలేదో తెలీదు ! నేను డాక్టరు సర్టిఫికెట్టు పంపలేదు. ఒకరోజు గవర్నమెంటు హాస్పిటలుకు పోయాను. కానీ, డబ్బులేంది అక్కడ ఎవ్వరూ మాట్లా

దేట్టుగాలేరు. అందుకని మంజూరైతే అవుతుంది. లేకపోతే లేదని ఒక చీటీమీద రాసి పంపాను. ఇట్లావుంది డాక్టర్లపని ! మనిషిచస్తున్నా వాళ్ళకు డబ్బు కావాలి!"

"మంచి చిక్కుల్లో పడ్డారే ! మరి ఇప్పుడు శలవు మంజూరు కాకపోతే?"

"పోనీయండి, ఇంట్లో కూర్చుంటాను. అంతగా దొర అడిగితే, గవర్నమెంటు సర్జను సర్టిఫికేట్ ఇవ్వలేదని చెబుతాను. మరి లేకపోతే వాళ్ళక్కడ వున్నది దేనికి ? ఊరికే కుర్చీలను అలంకరించడానికా ? పోనీ ఇంకెవరిచేతనైనా కబురు పెడదామనుకుంటే, ఒక్కడూ నా దగ్గిర వుండడాయె ? ఏం చేయను ?"

తరువాత రమేశ్‌బాబు గడపలో నిల్చున్న జాలపను పిల్చి "ఏమమ్మా,నీకో శుభవార్త పట్టుకు వచ్చాను ! ముందు మిఠాయి పంచు, తరవాత చెబుతాను !" అన్నాడు.

జాలప తమలపాకుల పళ్ళాన్ని రమేశ్‌బాబు ముందుపెట్టి "మొదలా విషయం ఏమిటో చెప్పండి, తరువాత మిఠాయి పంచుతాను. అసలు మీరు చెప్పబోయే విషయం మీకంటే ముందు మాకే తెలిసిందేమో ?" అన్నది నవ్వుతూ.

"ఎక్కడో వున్నాడనుకుంటున్నామా ? మనవాడు కలకత్తాలోనే వున్నాడుట !"

"ఓస్.... ఇది నాకు యింతకుముందే తెల్సు!"

ఇది విని దయానాథుడు మామూలు మనిషిలా చివుక్కున లేచికూర్చుని, "తెలిసిందా ? ఉత్తరం ఏమైనా వచ్చిందా ?" అన్నాడు.

"ఉత్తరం రాలేదు. పోలీసులు ఎంక్వయిరీకి వచ్చారు. అతనిమీద ఏ కేసూ లేదని చెప్పి పంపించాను. మరి నీ కెల్లా తెల్సిందమ్మా ?"

జాలప తన ప్లానంతా చెప్పి ప్రజామిత్ర పత్రికనూ, మనియార్డరు ఫారం మీద రమానాథుడు పెట్టిన సంతకాన్నీ చూపించింది.

"అవును,సంతకం అతనిదే ! సందేహంలేదు.... ఇంకా ఆలశ్యం ఎందుకు, చెవులు పుచ్చుకు లాక్కురండి.... ఇంకెట్లా తప్పించుకుంటాడో చూద్దాం !"

ఇంతలో రత్తన్ కూడా వచ్చింది.

జాలప సంతోషంతో పొంగిపోతూ, "రత్తన్ ! కలకత్తానుంచి వుత్తరం వచ్చింది !" అన్నది.

"నిజం ! నాతోడు !"

"నిజంగా నీతోడు ! కావాలంటే ఇదిగో వుత్తరం చూడరాదూ !"

"అయితే నీవు ఇవ్వాళే వెళ్ళు !"

"నేనూ, అదే అనుకుంటున్నాను. మరి నీవు రావా ?"

"రావడానికి నాకేమీ అభ్యంతరంలేదు. కానీ, ఇక్కడ ఇల్లు ఎవరిమీద వదిలిరాను ? మణిభూషణుడి నడవడిక చాలా అనుమానాస్పదంగావుంది. అతను ఎలాగయినా నన్ను మభ్యపరచి బంగళా అమ్మి ఆ డబ్బు పుచ్చుకుని స్వస్థానం చేరాలని చూస్తున్నాడు. బేంకిలోవున్న ఇరవై వేలూ ఖర్చుపెట్టాడు. ఖర్చుల వివరం అడిగితే చెప్పడు; పోనీ వారి ఆఫీసు తాళంచెవులు ఇయ్యమంటే ఇయ్యడు. ఇప్పుడు బంగళాకు బేరాలు వస్తున్నై. నాకుకూడా బంగాళా అమ్మి ఆ డబ్బు పుచ్చుకుని ఏ పల్లెటూళ్ళోనయినా కూర్చుని మిగిలిన జీవితాన్ని ప్రశాంతంగా గడుపుదామని వుంది. ఇలాంటి పరిస్థితిలో నేను ఇక్కడ లేకపోతే నా చేతికి కానీ రాదు. పైగా ఇతను కోర్టుద్వారాకూడా ఏవో చర్యలు చేస్తున్నాడని తెల్సింది. నామాట విని గోపీని వెంటపెట్టుకొని ఇవ్వాళే వెళ్ళు !"

"బహుశా, గోపీ నాతో రావడానికి వీలుండదు. ఇక్కడ మామగారికి మందూ మాకూ అందించేవాళ్ళు వుండవద్దా ?"

"ఆ బాధ్యత నాది ! సరేనా ? వుదయం, సాయంత్రం నేనొచ్చి చూసిపోతుంటాను."

జాలప నవ్వి, "మరి పగలంతా దగ్గిరకూర్చునే దెవరు ?" అన్నది.

"పోనీ. నే రోజూ కాసేపువచ్చి కూర్చుంటాను. నువ్వుమాత్రం ఇవ్వాళే వెళ్ళాలి ! పాపం అక్కడేం బాధలు పడుతున్నాడో !" అంటూ రత్తన్ దయానాథుడున్న గదిలోకి పోయింది.

రమేశ్‌బాబు సగౌరవంగా లేచి నిల్చుని, "రండి, రమానాథుడిజాడ తెల్సింది. విన్నారా" అన్నాడు.

"ఆఁ విన్నాను. వినడమేం ? దాన్లో సగంబాధ్యత నాది !"

"అవునవును, మీ సలహాకూడా వున్నదని విన్నాను. ఇక్కడికి తీసుకురావాలి ! దాన్నిగురించి...."

రత్తన్ రమేశ్‌బాబుని మధ్యలోనే ఆపి, "దాని కేమిటండి ! జాలప గోపీని తీసుకుని ఇవ్వాళే వెళ్ళి లాక్కురాదూ !" దయానాథుడిని వుద్దేశించి, "జాలప లేనందువల్ల మీ కేమైనా యిబ్బందిగా వుంటుందా ?" అన్నది.

అసలే బిక్కుబిక్కుమంటున్న దయానాథుడి ప్రాణానికి జాలపను పంపడం మహా బాధాకరంగానేవుంది. అయినా ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఇక గోపీ విషయం అడగనే అవుసరంలేదు. ఈ మాటలు విని ఏడు గుర్రాల్ని ఎక్కినట్టు సంబరపడ్డాడు. కలకత్తా ప్రయాణాన్ని రకరకాలుగా వూహించుకుని తన్మయుడౌతున్నాడు. విశ్వంభరుడు మాత్రం తనను తీసుకుపోనందుకు మూతిముడుచుకు కూర్చున్నాడు.

రాత్రిబండికి జాలప బయలుదేరింది. వెంట గోపీ వున్నాడు. అత్తమామల పాదాలకు నమస్కరించింది. ఏడుస్తున్న విశ్వంభరుడిని ఓదార్చి, స్టేషనుకు బయలుదేరింది. రతన్ స్టేషన్‌దాక పంపడానికి వచ్చింది.

కారు బయలుదేరింది.

"రతన్ ! కలకత్తా చాలా పెద్దపట్టణం అంటున్నారు. అంత పెద్ద పట్టణంలో ఎక్కడ వున్నారో ఎల్లా తెల్సుకోవడం ?" అన్నది జాలప.

"మొదటగా ప్రజామిత్ర ఆఫీసుకు పో, వాళ్ళే చెబుతారు. అదీకాక చేతిలో మొగపిల్లవాడు వుండగా భయమెందుకూ ?"

"అది సరే, మరి వుండటం ఎక్కడ ఏర్పాటుచేసుకోను."

సత్రాలు వుంటయ్యి. లేకపోతే, ఎక్కడయినా హోటల్లో దిగు. డబ్బు అవసరమైతే బిడియపడక ఒక వుత్తరం రాయి. ఎంత త్వరగా అయితే అంత త్వరగా పట్టుకురావాలి ! ఇక్కడ నాకు కూడా అండగా వుంటుంది. మణిభూషణుడు ఏదో కుతంత్రం చేస్తున్నాడు."

"హోటల్లోవాళ్ళు దుర్మార్గులై వుంటారేమో ?"

"నీ వలా భయపడవద్దు. ఎవరైనా హద్దుమీరి మాట్లాడితే ఒక్కటి తగిలించు" అంటూ బొడ్లోనుంచి ఒక కత్తినితీసి, "యిదిగో యిది నీదగ్గరవుంచుకో ఇలాంటి పరిస్థితిలో నే నెప్పుడూ కత్తిని దగ్గిర వుంచుకుంటాను. అసలు సాధారణంగా ఆడవాళ్ళజోలికి వచ్చేవాడు పిరికివాడు, లంపటుడు అయివుంటాడు. కనుక మనం కొంచెం కళ్ళెర్రచేసి కత్తి చూపామా, ఇక నా చాయల మెసలడు. ఒకవేళ శృతిమించి కత్తి వుపయోగించవల్సిన అవుసరమే వస్తుందనుకో, అప్పుడు నిస్సంకోచంగా వుపయోగించడమే !" అన్నది రతన్.

జాలప మాట్లాడకుండా కత్తి నందుకున్నది. మనస్సంతా బాధగావుంది. అనేక సంశయాలు బుర్రలో మెదుల్తున్నై. వా టన్నింటినీ అడిగి నివృత్తిచేసుకునే ఓపిక శరీరానికి లేదు.

స్టేషన్ వచ్చింది. కూలీలు సామాన్లను ప్లాట్‌ఫారం మీదకు పట్టుకు పోతున్నారు. గోపీ టిక్కెట్టు పట్టుకువచ్చాడు. జాలప మౌనంగా రాబోయే సంగ్రామానికి శక్తిని కూడగట్టుకుంటున్నట్టు నిల్చున్నది.

"జాగ్రత్తగా వుండు" రతన్ గోపీతో అన్నది. తమలో అలుముకుంటున్న నిశ్శబ్దాన్ని పారద్రోలడానికే అన్నట్టు.

గోపీ కొన్నాళ్ళనుంచీ గుంజీళ్ళూ, బస్కీలూ తీస్తూవున్నాడు. ఇతర్ల దృష్టికి అతనిలో ఏ మార్పూ కనుపించకపోయినా, తనకు తను మహాబలశాలినని అనుకుంటూ వుంటాడు. బజార్న నడిచేటప్పుడు విర్రవీగి నడుస్తుంటాడు.

"ఎవడైనా ఆ, ఊ అంటే నడుము విరగ్గొడతాను" అన్నాడు.

"అది నాకూ తెల్సు లేవోయ్ ! అందుకుకాదు. రైల్లో నిద్రపోతావేమోనని జాగ్రత్తగా వుండమన్నాను" అన్నది రత్తన్.

"నిద్రకాదు; దాని బాబు వచ్చినా కన్నుమూయను."

బండివచ్చింది. గోపీ ఒక పెట్టెలోకి దూరి చోటుచేశాడు. జాలప కన్నీళ్ళు కారుస్తూ, 'వెళ్ళివస్తా' నన్నది.

రత్తన్‌కుకూడా కళ్ళనీళ్ళు తిరిగినయ్. మారు సమాధానం చెప్పలేక పోయింది. ఇంతలో రైలు కూతవేసింది. రత్తన్ "వెళ్ళగానే వుత్తరం రాయి" అన్నది.

జాలప తలవూపింది.

"ఒకవేళ నాతో ఏదైనా పనివస్తే, వెంటనే వుత్తరం రాయి. మర్చిపోబోకు."

జాలప తలవూపింది.

"దారిలో కన్నీళ్ళు పెట్టుకోక !"

జాలప నవ్వింది.

బండి కదిలింది.

2268

# 36

రమానాధుడు పట్టుబడిన రోజునే దేవీదీన్ టీ దుకాణం మూసేశాడు. మూడురోజులనుంచీ బందిపోటు దొంగల కేసులో రమానాధుడి సాక్ష్యం తీసుకొంటున్నారు. ఈ మూడు రోజులనుంచీ దేవీదీన్ కాలికి బలపం కట్టుకు తిరుగుతున్నాడు. ఉదయాన్నే నాలుగు మెతుకులు నోట్లోవేసుకుని పోయి, సాయంత్రం కోర్టు మూసేవరకూ అక్కడ వుండివస్తాడు. ఇవ్వాళ నాలుగోరోజు; ఇవ్వాల్టితో క్రిందికోర్టు విచారణ ముగుస్తుంది.

దేవీదీన్ సాయంత్రం ఇంటికి వస్తూనే, తలపాగాతీసి విసిరేసి, ఏమంత వుక్కగా లేకపోయినా విసనకర్ర తీసుకుని విసురుకొంటున్నాడు.

ఎప్పుడూ నవ్వుతూ ఆనందంగావుండే అతని ముఖం కోపంతోటీ, బాధతోటీ మలినం అయింది.

దగ్గర నీళ్ళు తెచ్చిపెట్టి, "చిలుమునింపి ఇయ్యనా ?" అన్నది జగ్గో.

జగ్గో ఎన్నడూ దేవీదీన్‌ని ఇంత ఆప్యాయంగా పలకరించలేదు! ఎందుకనో ఈ మూడు రోజులనుంచీ జగ్గో అడక్కుండానే దేవీదీన్‌కు సపర్యలు చేస్తున్నది,

దేవీదీన్ తలఎత్తి జగ్గో ముఖంలోకిచూసి, "వద్దు"అని మాత్రం అన్నాడు.

"మరయితే, ముఖమూ, కాళ్ళూ, చేతులూ, అయినా కడుక్కో! ఒళ్ళంతా మట్టికొట్టుకుని వున్నది."

"కడుక్కుంటాలే, తొందరేం వొచ్చింది."

"సరే, పొద్దున్నకూడా ఏమీ తినలేదుగా ? ఏమైనా తిను. ఆ విసనకర్ర యిటుతే, నే విసురుతాను!"

జగ్గోకు ఇవ్వాల్టి కోర్టువిషయాలను వినాలని వున్నది. అందుకనే ఈ వుపచారాలు చేస్తున్నది.

దేవీదీన్ విసనకర్రను జగ్గోకు ఇచ్చాడు. జగ్గో విసురుతున్నది. రెండు నిమిషాలు కళ్ళుమూసుకుకూర్చున్న తరువాత, "ఇవ్వాల్టితో బాబుగారి సాక్ష్యం ముగిసింది" అన్నాడు.

జగ్గో విసరడం ఆపి, ''అయితే రేపు ఇంటికి వస్తాడా ?" అన్నది.

''రేపు రాడు. ఇదే సాక్ష్యాన్ని జిల్లాకోర్టులోకూడా ఇవ్వాలి! ఒకవేళ ఆ తరువాత విడిచిపెట్టినా, ఇక మన యింటికి వచ్చే అవుసరం వుండదతనికి! మంచి వుద్యోగం వస్తుంది. కార్లల్లో తిరుగుతూవుంటాడు. మన దగ్గిరకు ఎందుకు వస్తాడు ?....తన పబ్బంగడిస్తే చాలనుకునే రకం!....ఇతని సాక్ష్యం

వల్ల దాదాపుగా పదిహేనుమందివరకూ నాశనం అయిపోతున్నారు. వాళ్ళల్లో ఐదుగురికయినా ఉరిశిక్షలు తప్పవు! మిగిలినవాళ్ళకు కనీసం పది పన్నెండు సంవత్సరాలైనా శిక్షలు పెబుతారు. వీళ్ళల్లో తప్పు చేసింది ఎవరో, చెయ్యంది ఎవరో ఆ భగవంతుడికే తెలియాలి! ఇతనివల్ల అందరికీ శిక్షలు పడుతున్నై. నదురూ, బెదురూ లేకండా కళ్ళతో చూసినట్టు చెప్పాడు. అసలతను మొదటి నుంచీ దుర్మార్గుడే. మనం పొరపాటున ఆశ్రయమిచ్చాంగాని."

"అదేమి టలా అంటావు? ఎవరి మంచిచెడ్డలు వాళ్ళవి! ఒకళ్ళకోసం యింకోళ్ళు తమకు వచ్చేదాన్ని పోగొట్టుకుంటారా? ఇతనూ అంతే!"

"అట్లాగని పదిమంది గొంతులు కోయడమే? అట్లాంటివాడిని ఏంచేసినా తప్పులేదు."

ఇంతలో ఇద్దరు వ్యక్తులు దేవీదీన్ కొట్టుముందుకు వచ్చి నిలబడ్డారు. ఆ వచ్చినవాళ్ళల్లో ఒకతను పదహారు పదిహేనేళ్ళ కుర్రవాడు.

"ఎవరికోసం చూస్తున్నారు?" దేవీదీన్ అడిగాడు.

వచ్చినవారిలో ఒకతను, "దేవీదీన్ అంటే మీరేనా? ఇతను రమానాధు గారి తమ్ముడట. ప్రజామిత్ర ఆఫీసుకు వచ్చాడు. సంపాదకులు మీ దగ్గిరకు పంపించారు" అంటూ, ఆ వ్యక్తి గోపీని అక్కడ వదలి వెళ్ళిపోయాడు.

దేవీదీన్ ఒకసారి గోపీని ఆపాదమస్తకమూ పరికించి చూశాడు. పోలికలు రమానాధుడితో కలుస్తున్నై.

"రా నాయనా! ఇటు వచ్చి కూర్చో. ఇంటిదగ్గిరనుంచి ఎప్పుడొచ్చావ్?" అన్నాడు దేవీదీన్.

గోపీకి ఒక కూరగాయల దుకాణంలోకిపోయి కూర్చోవడం తన హోదాకు తగినపనిగా కనుపించలేదు. నిలబడే మాట్లాడాడు. "ఇవ్వాళే వచ్చాము......... వదినెకూడా వచ్చింది. సత్రంలో వుంచి వచ్చాను."

దేవీదీన్ లేచి నిలబడి "అదేమిటి బాబూ! సత్రంలో ఎందుకు వుంచావ్? ఇక్కడికే తీసుకురాలేకపోయావ్? పైన రమానాధుడిగారి గది ఎటూ వుండనే వుంది. హాయిగా ఇక్కడే వుండేదికదా! పద తీసుకొద్దాం" అన్నాడు.

తరువాత దేవీదీన్ పైగది శుభ్రంచేసి వుంచమని జగ్గోతో చెప్పి, గోపీని తీసుకు సత్రానికి పోయాడు. జగ్గో చీపురు పుచ్చుకుని పైకిపోయి గది శుభ్రం చేసింది. పెరుగూ, పాలూ తెచ్చిపెట్టింది. తలదువ్వుకుని మంచిచీర కట్టుకున్నది. ఒంటినిండా నగలు పెట్టుకుని జాలపకోసం ఎదురుచూస్తూ కూర్చున్నది.

కొద్దిసేపట్లో బండి వచ్చింది. జగ్గో జాలపను బండిలోనుంచి దించింది. జాలప మొదట కూరగాయల దుకాణంలోకి పోవడానికి కొంచెం సంకోచించినా,

ముసలిదాని ప్రేమాతిశయాలు ఆమె హృదయంలో అరమరికలేకుండా చేసినయ్యి. పైకిపోయి ఒకమాటు గదివంక చూసింది. గది చక్కగా అలంకరించబడి వున్నది.

జగ్గో గ్లాసుతో నీళ్ళు తెచ్చి అక్కడపెట్టి, "పంచదార వున్నది. గట్టి పెరుగు తెచ్చాను. కొద్దిగా తినండమ్మా! ఉదయంనుంచీ ఏమైనా తిన్నారో, లేదో. పాపం రమానాధుడుగారు, ఈ గదిలోనే వుండేవారు. పదిహేను రోజుల నుంచీ గది ఖాళీగా వున్నది....మరి వారి సంగతి తెలిసిందా?" అని అడిగింది.

"వివరంగా తెలియలేదు....పత్రికాఫీసువారు పోలీసులు అరెస్టు చేశారని చెప్పారు."

"మొదట పట్టుకున్నారు కానీ, తరువాత సర్కారువారు తమకు సాక్షిగా వుండమన్నారు. ఇక వారికి జైలు భయం లేదు. పైగా మంచి నౌకరీకూడా ఇస్తారు."

"అయితే, వారు జైలు భయంతోనేనా ఈ సాక్ష్యానికి వప్పుకున్నది? అసలు వారిమీద కేసే లేదుగా!"

దేవీదీన్ సంకోచిస్తూ, "అది కాదమ్మా....మీకు తెలియకపోవచ్చు.... మున్సిపాలిటీలో....ఏదో డబ్బుకు సంబంధించిన...." అని ఆపాడు.

"అరె....అది మాసిపోయి ఎన్నాళ్ళయింది! ఈయనగారు ఇటు రాగానే, మున్సిపాలిటీలో కొంత డబ్బు చెల్లించవలసివున్నారని తెలిసింది. వెంటనే చెల్లించాము. ఆ భయంతోనే ఇన్నాళ్ళుగా ఇంటికి ఉత్తరముక్కయినా రాయలేదు."

దేవీదీన్ ముఖం మహా ఆపదలోనుంచి బయటపడ్డట్టుగా సంతోషంతో వికసించింది.

"మరావిషయం మాకేం తెల్సు? ఇక్కడికి వచ్చిన తరువాత ఇంటికి వుత్తరముక్కయినా రాయమని ఎన్నోసార్లు చెప్పాను. కానీ, వింటేనా? ఒకటే సిగ్గు! ఒకటే భయం! పాపం ఈ విషయం తెల్సివుంటే ఈ సాక్ష్యానికి ఒప్పుకునేవాడు కాదు."

భర్త పోలీసులకు సాక్షిగావున్నాడని జాలపకు తెల్సిపోయింది. ఏ కేసులో నైనా పోలీసులకు సాక్ష్యం ఎందుకు అవసరం అయ్యేది, ఆ సాక్ష్యం ఇచ్చే వ్యక్తికి వాళ్ళు ఎలాంటి ఆశలు చూపేది, ఆ ఆశల్లోపడి సాక్షి ఎల్లా అభాండాలను అమాయకుల నెత్తిన రుద్దేదీ, మొదలైన విషయాలు జాలపకు బాగా తెల్సు!

భర్త సాక్ష్యంవల్ల కనీసంగానైనా కొన్ని జీవితాలు ధ్వంసం కాక తప్ప దని జాలప వూహించింది. సిగ్గుతో, బాధతో ఆమె తల నేలకు వరిగింది.

"అయితే, ఇక్కడకూడా ఏమైనా జరిగిందా?" జాలప అడిగింది.

దేవీదీన్ జాలప ముఖభావాలను జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

"అఁ, ఇక్కడేం జరగలేదు. రమానాథుగారు నాతోపాటే ఇక్కడికి వచ్చారు. వచ్చినప్పటినుంచీ మా ఇంట్లోనే వున్నారు. ఎక్కడికీ బయటికిపోయే వాడుకాదు. ఎవరైనా పోలీసులు పట్టుకుంటారేమోనని ఎప్పుడూ భయపడుతుండే వాడు. ఒకమాటు తెగించి బయటికి వెళ్ళాడు. అంతే! ఇతని భయాన్నీ, తడ బాటునూ గమనించి పోలీసువాడు పట్టుకున్నాడు. నేను విడిపించుకు రావడానికి స్టేషన్‌కు పరుగెత్తాను. ఇనస్పెక్టరు లంచం యిస్తేగానీ విడిచిపెట్టనన్నాడు. తీరా డబ్బు తీసుకుని వెళ్ళి చూద్దునుకదా, రమానాధుడుగారు సాక్ష్యం ఇస్తానని వప్పుకోవడం, వాళ్ళు నౌకరీ ఇస్తామని వాగ్దానం చేయడం అన్నీ జరిగిపోయి నయ్యి! ఇక తలవంచుకుని ఇంటికి వచ్చాను!"

"ఆ పోలీసుముండాకొడుకులు ఏం మాయచేశారో తెలియదమ్మా! ఎంత మంచివాడు! ఎంత మంచివాడు! ఎప్పుడూ అమ్మా అమ్మా అంటూ వెనకాలే తిరుగుతుండేవాడు బిడ్డ" అన్నది జగ్గో.

"చాలా మంచివాడు; ఈ కాలపువాళ్ళల్లో నేనలాంటి బుద్ధిమంతుడిని చూడలేదు" అన్నాడు దేవీదీన్.

జాలప ఒక్కక్షణం యోచించి అడిగింది:"వారిసాక్ష్యం అయిపోయిందా?"

"మూడురోజులుగా జరిగింది. ఇవాళతో పూర్తయింది."

జాలప ముఖంలో అశాంతి కనుపించింది.

"అయితే, ఇక మనం ఏం చేయడానికీ వీలులేదా?....పోనీ, వారిని నువ్వే ఒకసారి కల్సుకోవడానికి వీలుంటుందా?"

దేవీదీన్ మృదువుగా నవ్వి, "పోలీసువాళ్ళంత తెలివితక్కువవాళ్ళు కాదు. ఇప్పు డెవరినైనా కలుసుకోనిస్తే, వాళ్ళ ప్రయత్నమంతా బూడిదపాలౌతుంది. రాత్రింబగళ్ళు పహరా వుంచుతారు. ఈగనుకూడా వాలనీయరు!"

జాలప ఇంకేమీ మాట్లాడలేదు. మాట్లాడటానికి వీలుకూడాలేదు. ముందున్న సమస్య చప్పుచప్పున వేడివేడిగా పరిష్కరింపబడేదికాదు. అందుకని జాలప యీ సంభాషణని అంతటితో ఆపి, గోపీని కేకవేసింది. గోపీ బాల్కనీలో నిల బడి తన్మయంగా బజారును చూస్తున్నాడు. వదినెగారి కేకవిని లోపలకి వచ్చాడు.

"పెరుగంటే నీకు చాలా యిష్టంగా? కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చి తిను!"

గోపీకి మనస్సులో అయితే తినాలనే వుందిగానీ, కొత్తప్రదేశం కావడం వల్ల సిగ్గుపడి వెళ్ళిపోయాడు.

దేవీదీన్ నవ్వి "మేము వున్నామని సిగ్గుపడుతున్నాడు. చూడమ్మా! మీకేమైనా కావాల్సివుంటే అడగండి! మీ యిల్లే అనుకోండి. రమానాధుడు మాలో కల్సిపోయారు" అంటూ బయటికి వెళ్ళాడు.

జగ్గో కొంచెం గర్వంగా, "మా బాబుకు గర్వమన్నమాటే లేదు. నే వండి పెట్టినా తినేవాడు" అన్నది.

జాలప నవ్వి, "ఇక నీకా బాధ వుండదులే! పెద్దదానివయావు, నేను వండుతుంటాను" అన్నది.

"లేదమ్మా! మా కులంలో ఇతర్ల చేతివంట తినం. ఇక బ్రతికేది నాలుగు రోజులు. నియమాన్నెందుకు పాడుచేసుకోవడం" జగ్గో అభ్యంతరాన్ని తెలియ చేసింది.

"మా కులంలోనూ అంతే."

"అయినా, ఇక్కడ మిమ్మల్ని ఎవరు చూడొచ్చారు? అదీకాక మీరు చదువుకున్నవాళ్ళు, మీకీ పట్టింపులు వుండవు. మేమంటే చదువు సంధ్యలు లేని మూర్ఖులం! మాకు పట్టింపులు చాలా ఎక్కువ."

"నిజమే, నీవు చెప్పేది నాకేమీ బాగాలేదు. నీవు పెద్దదానివి. నీవు వండి పెడితే తిని కూర్చోవడం ఏమంత బాగుండదు. కాకపోయినా నేను కోడల్నిగా, నా చేతి అన్నం తినడానికేం? అంత పట్టుదల అయితే మరి నన్నెందుకు కోడలిగా చేసుకున్నారు?"

దేవీదీన్ నవ్వుతూ, "మంచి ప్రశ్నే వేసింది. సమాధానం కొంచెం ఆలోచించుకు చెప్పు. ఇక మనం వెళ్దాం పద. వాళ్ళు విశ్రాంతి తీసుకుంటారు" అన్నాడు.

దేవీదీన్, జగ్గో ఇద్దరూ వెళ్ళిపోయారు. గోపీ లోపలికి వచ్చాడు.

"అయితే, అన్నయ్య వీళ్ళదగ్గిరే వున్నాడా? వీళ్ళు శూద్రుల్లా వున్నారుగా?"

"శూద్రులైతే ఏం? మాల మాదిగ లయితే ఏం? బుద్ధికి చెప్పుకోవాలి! ఆరునెల్లు ముఖమెరికకూడా లేని పరాయిదేశస్థుడికి ఆశ్రయ మిచ్చారంటే. నీ కంటే, నా కంటే ఎంత గొప్పవాళ్ళయివుండాలి?"

గోపీ కాళ్ళూ చేతులూ కడుక్కు వచ్చాడు. పెరుగన్నం తింటూ "ఎవరినైనా నాలుగునెల్లు ఇంట్లో ఉంచుకున్న మాత్రాన గొప్పవాళ్ళేంకారు. మాదిగవాడు ఎంత దానధర్మాలు చేసినా మాదిగవాడే!" అన్నాడు.

"అవును! అది నిజమే! కానీ, ఎప్పుడూ ఇతర్ల సొమ్ముతినే శాస్త్రుల్లుగారి కంటే, తనకున్నదాంట్లో ఇతర్లకు కానీ ధర్మంచేసే మాదిగవాడే నయం!"

గోపీ ఫోంచేసి వూరుచూడడానికని వెళ్ళాడు. జాలప భర్తనుగురించే ఆలోచిస్తున్నది. ఈ వూబిలోనుంచి వారి నెలా బయటికి లాగడం ? ఈ పనివల్ల వారికి అపకీర్తి వస్తుంది. నలుగురిలో తలఎత్తుకోవడానికి వీలుండదు.... అంతేనా? ఈ కేసులో ఎంతమంది అపరాధులో, ఎంతమంది నిరపరాధులో ఎవరికి తెల్సు ? ఎక్కువమంది నిరపరాధు లనేదిమాత్రం నిర్వివాదం ! మరి ఈ నిరపరాధుల్ని జైలుకో, వురికో పంపించడం ఏమంత మంచిపని ?.... మరి అట్లాఅని ఇప్పుడు తప్పుకోవాలన్నా మార్గం ఏది ? కొండమీదనుంచి క్రిందకు దూకి నడిమధ్యానికి వచ్చిన తరువాత, భయపడి మళ్ళీ పైకిపోవాలంటే మాత్రం పోగలమా ? అయితే ఏం చేయడం ?"

ఉండి ఉండి జాలప బుర్రలో ఏదో మెరుపులా మెరిసింది.

ఒకవేళ వీరు తన సాక్ష్యాన్ని మార్చుకుంటే ? అవును; మార్చుకోవచ్చు. మున్సిపాలిటీ కేసు పోయిందనీ, పోలీసులు తన్నేమీ బాధించరనీ తెలిస్తే మార్చుకుంటారు. ఇది ఆయనకు తెలియజేయడం ఎల్లా ?

జాలప చప్పున దేవీదేన్‌ని పిల్చి, "ఏం, తాతా, వారికి వుత్తరం రాసి అందజేయటానికి వీలుంటుందా ? పోనీ, ఐదో, పదో కాపలావాళ్ళ చేతుల్లో పెడితే నన్నా మాట వింటారేమో !" అడిగింది.

"కష్టమే ! కాపలావాళ్ళు మహా గట్టివాళ్ళు ! అట్లాంటివాళ్ళను ఏరి తెచ్చి పెట్టారు."

"పోనీ; ఆ బంగళాదగ్గరకు మనం పోడానికి వీలుండదూ ? చుట్టుపట్ల ఏమున్నైవి ?"

"ఒకవైపు తోట. ఎదురుగా బజారు. రెండవవైపు మరో బంగళా."

"అయితే సాయంత్రంపూటైనా బయటికి కదలరా ?"

"అక్కడే వరండాలో కుర్చీవేసు కూర్చుంటారు. ఒకరిద్దరు పోలీసు ఆఫీసర్లు వుంటారు వెంట !"

"మరి మనలో ఎవరైనా ఆ తోటదగ్గిర దాక్కుని, అవకాశం చూసి వుత్తరం ముక్క పడేస్తే ? తప్పకుండా తీసుకుంటారు; ఔనా !"

"అవును అలా చేయవచ్చు. కానీ అవకాశం దొరకినప్పటిమాట గద ?"

బాగా చీకటిపడ్డ తరువాత జాలప, దేవీదీన్‌ను వెంటతీసుకుని రమానాధుడున్న బంగళాదగ్గరకు బయలుదేరింది.

సగందూరం పోయాక జాలపకు ఒక వ్యతిరేకమైన ఆలోచన తట్టింది. ఒకవేళ వుత్తరం తీసుకునికూడా తన అభిప్రాయాన్ని మార్చుకోకపోతే ? వెనకటి ప్రేమా, అభిమానాలు తనమీద ఇంకా వున్నాయన్న నమ్మకం ఏముంది ?

ఈ ఆలోచనతో జాలప హృదయం ఎందుకనో ఒక్కసారి కంపించి పోయింది. ఒక్కక్షణం మౌనంగా వుండి, అతిదీనంగా దేవీదీన్నడిగింది: "ఎప్పు డైనా ఇంటివిషయం ఎత్తేవారేనా ?"

"ఊఁ హూఁ....నాతో ఎన్నడూ ఇంటి ప్రస్తావన ఎత్తేవాడుకాదు. ఎప్పుడూ ఏదో దిగులుగా వుండేవాడు."

ఈ మాటలు జాలప సంశయాన్ని మరీ దృఢపరచినయ్యి. దానితో జాలప నోరు మెదపలేదు. ఇద్దరూ మౌనంగా వెళ్తున్నారు. జనసమ్మర్దమైన పట్నాన్ని దాటారు. బంగళాలు, భవనాలు పల్చబడినయ్యి. దారికి రెండువైపులా తోట లున్నాయి. తోటల్లోనుంచి వచ్చే రకరకాలైన సువాసనలు, వెన్నెల్లో కలిసి మత్తు గొల్పుతున్నై. ఆమె నిరాశగా నిస్పృహగా "ఇక ఈ పయనానికి అంత్యం లేదేమో" అన్నట్టు నడుస్తున్నది.

వెళ్తూవున్న దేవీదీన్ ఠకీమని ఆగిపోయాడు. అతనితోపాటు జాలప కూడా ఆగిపోయింది. ఒక పెద్ద బంగళావైపు వేలెట్టి చూపుతూ "ఇదే వారి బంగళా !" అన్నాడు దేవీదీన్.

జాలప తలయెత్తి అటు చూచింది. బంగళా అంతా నిశ్శబ్దంగా వున్నది. అక్కడ ఎవ్వరూలేరు. గేటుకూడా తాళం వేసివున్నది.

"ఇక్కడ ఎవ్వరూ లేనట్టున్నదిగా ?"

దేవీదీన్ గేటులోనుంచి ఒక మాటు లోపలికి తొంగిచూచి, "ఈ బంగ ళాను మార్చారేమో !" అన్నాడు.

లేకపోతే, ఎక్కడికయినా పనుండి పోయారేమో ?"

"ఊఁ అట్లా అయివుండదు. ఎక్కడికయినా పోయివుంటే గేటు తాళం వేసివుండదు. కాపలావాడు వుండేవాడే. వీళ్ళసలు ఖాళీచేసినట్టుగానే వుంది !"

"అయితే, తిరిగి వెళ్ళిపోదామా ?"

"ఉండు, వెళ్దాం అసలు వీళ్ళు ఎక్కడికి పోయారో, మకాము ఎక్కడికి మార్చారో కను -కుండా పోతే ఎల్లా ?"

ఎడమ వైపునవున్న తోటలోనుంచి కొద్దిగా దీపపుకాంతి కనిపిస్తున్నది. దేవీదీన్ అక్కడికిపోయి "ఎవరిక్కడ ? ఎవ రీ తోటను తీసుకున్నది ?" అని కేక వేశాడు.

కేక విని ఒక మనిషి మామిడిగుబుర్లలోనుంచి బయటికి వచ్చాడు. అతను దేవీదీన్‌కు పరిచయుడే.

"అరే....సువ్వుట్రా ? అయితే నీ వీ తోటను తీసుకున్నావా ?"

"అవును తాతా ! తీసుకున్నాను. ఏం పనిమీద వచ్చావు యిటు ?"

"ఏమీలేదు, ఊరకనే వచ్చాను. సరేగానీ, ఈ బంగళాలో వున్న వాళ్ళు ఏమయ్యారు ?"

ఎవరైనా వున్నారేమోనని అటూ ఇటూ తేరిపారచూసి, "ఎవడో చదువుకున్నవాడట. పోలీసువాళ్ళకు దొంగసాక్ష్యం ఇయ్యడానికి వచ్చాడు. ఇవ్వాళే వెళ్ళారు. మళ్ళీ పదిహేనురోజులకు వస్తారు. నెయ్యన్నంతినే పెద్దవాళ్ళే యింతటి ఘోరాలు చేస్తూవుంటే ఎట్టా చెప్పు ? అన్నీ పచ్చి అబద్ధాలు చెప్పాడట. మరతనికి పిల్లా పాపావున్నారో లేరో !" అన్నా డతను.

జాలప అక్కడే నిలబడి వింటూండటంవల్ల దేవిదీన్ సంభాషణను అంతటితో ఆపుచేస్తూ, "అయితే, పది పదిహేనురోజుల్లో వస్తారుకదూ ? నీకు బాగా తెల్సునా ?" అన్నాడు.

"మరి కాపలావా డట్టా చెప్పాడు !"

"ఇంతకూ అసలు ఎక్కడికి పోయారో తెల్సా ?"

"నేరం జరిగినచోటికి పోయారన్నారు."

దేవీదీన్ చిలుం ముట్టించాడు. జాలప బజార్లోకి వచ్చి పచారుచేయసాగింది. రమానాధుడికి రాబోయే అపకీర్తిని తల్చుకుంటే, ఆమె హృదయం దహించుకుపోతున్నది. ఇలాంటిపని చేసినందుకు ఆమెకు అతనిమీద కోపమో, లేక దయో కలగవల్సింది. ఇప్పు డతన్నెలా యీ నరకలోకంలోనుంచి, మహాపాపంలోనుంచి బయటికి తీయడమా అని యోచిస్తున్నది.

ఇద్దరూ అక్కడినుండి బయలుదేరారు.

"ఆ మనిషితో వారు వచ్చిన తరువాత తెలియచేయమని చెప్పలేదా ?"

"చెప్పాను."

# 37

ఒక నెల గడిచింది. మొదటి నాలుగురోజులూ గోపీ మహా సంతోషంగా వున్నాడు. పట్నమంతా తిరిగి చూశాడు. కానీ తరువాత యింటిమీద గాలి తిరిగింది. వెళ్తానని గోలచేయడం మొదలుపెట్టాడు. జాలపకూడా పంపించడమే మంచిదనుకొని పంపించింది.

రమానాధుడు నేరం జరిగిన ప్రదేశం చూడటానికిపోయి నెలరోజులైంది. ఇంతవరకూ తిరిగి రాలేదు. రాలేదని జాలపకు నికరంగా తెల్సికూడా, చాలాసార్లు అతనున్న బంగాళావరకూ వెళ్ళివచ్చింది. అలా వెళ్ళి రావడంలో ఆమె కో విధమైన ఆనందం లభించేది.

జాలప మనస్సుకు బాధగా వున్నప్పుడు పై అంతస్తు ఎడమవైపు గదిలో కూర్చుని, కిటికీ తెరిచి బజారువంక చూస్తూవుంటుంది. అలా కూర్చుని రకరకాలైన వ్యక్తుల్తో ప్రవాహంలా సాగుతున్న బజార్ను చూస్తుంటే, ఆమెకు తన బాధ శమిస్తున్నట్టుగా వుండేది. అదొక అభ్యాసంగా మారిపోయింది.

ఇవ్వాళకూడా మామూలు అలవాటు ప్రకారం కిటికీ తలుపు తెరిచి బజారు వంక చూస్తున్నది. చూస్తూ కూర్చున్న జాలపదృష్టిని బజార్నపోయే ఒక కార్ల పంక్తి విశేషంగా ఆకర్షించింది. ఆ కార్లపంక్తిలో ఆరు కార్లదాకా వున్నై. ఇన్ని కార్లు ఒక్కసారి ఎక్కడికి పోతున్నయ్యీ? అని కుతూహలంగా చూడసాగింది. మొదటిదాంట్లో పోలీసు అధికార్లు కూర్చుని వున్నారు. రెండవదానినిండా పోలీసులు క్రిక్కిరిసివున్నారు. జాలపదృష్టి ఆఖరి కారుమీదకు పోయింది. ఆమె ఒక్కక్షణం ఎలక్ట్రిక్ షాక్ కొట్టినట్లు కంపించింది. కారును ఆపడానికి రెండడుగులు ముందుకు వేసిందికూడ; కాని ఆగిపోయింది. తను క్రిందకు పోయేసరికి కారు చాలా దూరం వెళ్ళిపోతుందనే వుద్దేశ్యం కలగడంవల్ల ఆమె ఆగిపోయింది. మళ్ళీ యధాస్థానానికి పోయి, కిటికీలోనుంచి చూడసాగింది. ఆ చివరికారులోనే రమానాధుడున్నాడు.

కారు కిటికీకి బాగా దగ్గిరకు వచ్చింది. రమానాధుడుకూడా కారులోనుంచి కిటికీవైపు చూశాడు. దేవిదీన్ అతన్ని చూసి కొట్లోనుంచి కేకవేశాడు కూడాను; కానీ, కారు ఆగలేదు. రమనాధుడు మాత్రం వెళ్తూవున్న కారులో నుంచి అదే పనిగా కిటికీవంక చూడసాగాడు.

జాలప క్రిందకు వచ్చి "తాతా" అన్నది.

దేవీదీన్ దగ్గిరకు వచ్చి, "బాబుగారు, వచ్చారు! అరుగో కారులో!" అన్నాడు.

"నీతో ఏమైనా చెప్పారా?"

"ఏం చెబుతాడు? కారులోనుంచే పోతూ పోతూ రాం రాం అన్నాడు. కులాసా అడిగాను. సౌఖ్యం కులాసాగానే వున్నట్టు చెప్పాడు. మరి నీవు చూశావా?"

"చూడకేం? కిటికీదగ్గిర నిల్చుని చూశాను!"

"మరి అతను చూశాడా నిన్ను?"

"ఏమో! కిటికీవైపుమాత్రం చూస్తూ పోయారు."

"'ఎవరా ఈమె?' అని ఆశ్చర్యపడివుండాలి!"

"పై కోర్టులో కేసు విచారణ ఎప్పుడో తెల్సిందా?"

"రేపే."

"రేపే? ఇంత త్వరలో! అయితే మనం చేయవల్సిందంతా యివ్వాళే చెయ్యాలి! నా ఉత్తరం ఎలాగా వారికి చేర్చడం?"

దేవీదీన్ సమాధానం చెప్పకుండా జాలపవంక చూస్తూ వుండిపోయాడు. ఈ పని అసాధ్యం అంటున్నై ఆ చూపులు.

"వారు సాక్ష్యాన్ని మార్చుకునే విషయంలో నీకు సందేహం వున్నట్టుంది?"

"అవును; సందేహిస్తున్నాను. అసలు యింతవరకు వచ్చాక, ఇక సాక్ష్యం మార్చుకోవడం కష్టం! ఒకవేళ అతను మార్చుకోడానికి సిద్ధపడ్డా పోలీసులు మార్చుకోనియ్యరు.... ఇది కాకపోతే, మరో నేరాన్ని కల్పించి దాని భయం చూపి సాక్ష్యాన్ని చెప్పించుకుంటారు."

"అది కాదు తాతా! నేను వారిని పోలీసులనుంచి రక్షిస్తానని చెప్పడం లేదు. వారిని ఈ అపకీర్తినుంచి బయటపడేయాలనేదే నా తపత్రయం. వారి చేతి మీదుగా యింతమంది, యిన్ని కాపురాలు అధోగతిపాలుకావడం నా కిష్టంలేదు. వారు నిజంగా ఆ బందిపోటుల్లోవుండి, యీ పోలీసులు చెప్పే నేరాలు యధార్థాలే అయినా, సాక్ష్యం ఇయ్యడానికి నేను ఒప్పుకోను. వారు నా అభిప్రాయాన్ని విని కూడా, తనమీద కేసులేదని తెల్సుకునికూడా యీ సాక్ష్యాన్ని ఇయ్యడానికే సిద్ధపడేపక్షంలో, నేనే నేరుగా న్యాయస్థానంలో బయటపెడతాను. నేనిలా చేసినందుకు అంతగా వారికి కోపమువస్తే, యిక నా ముఖం చూడనంటారు. నాతోటి

సంబంధాలను తెగతెంపు చేసుకుంటామంటారు అంతేనా? అయినా నాకు యిష్టమే! ఈ విషయాలన్నీ ఉత్తరంలో రాశాను."

దేవీదీన్ ముఖం వికసించింది. ఆదరసూచకంగా చూస్తూ, "ఇంత ధైర్యంగల నీవు ఏ పనైనా చేయగలవమ్మా!" అన్నాడు.

"అయితే తొమ్మిదిగంటల ప్రాంతాన వెళ్దామా?"

"సరే."

# 38

పోలీసుల భయంవల్ల గడప కదలడానికే హడలిపోతూవుండే రమానాధుడు రెండునెల్లనుంచీ, జమీందారులా భోగ విలాసాలను అనుభవిస్తున్నాడు. ఉండటానికి అందమైన బంగళా, పనిపాటలు చేసిపెట్టటానికి దాసదాసీ జనాలు, తిరగడానికి కారు, వంట వండిపెట్టటానికి ఒక కాశ్మీరు బ్రాహ్మణుడు. జమీందారులా రోజులు గడుపుతున్నాడు. అతని కోర్కెలు పెదాలనుంచి బయట పడకముందే నెరవేరుతున్నై.

పై నుదహరించిన బాహ్యమైన మార్పుల ననుసరించి ఈ రెండునెలల్లో అతని మనస్తత్వంలోకూడా చాలా మార్పు వచ్చింది. విలాస జీవితం అతని నరనరాల జీర్ణించుకుపోయింది. అత నసలు తను ఆ విలాస జీవితాన్ననుభవించడానికే పుట్టినట్టు భావించుకున్నాడు. తను చేయబోయే యే పనిలోనూ మంచిచెడ్డల్ని నిర్ణయించుకునే శక్తి అతనిలో నశించింది. దానికితోడు పోలీసు ఆఫీసర్లు అతన్ని ఒంటరిగా ఒక్కక్షణమూ ఆలోచించుకోనీయడంలేదు. సినిమాలూ, నాటకాలూ, నృత్య ప్రదర్శనాలూ ఎక్కువైనయ్యి. కేసు సెషన్సు విచారణకు పంపబడింది.

సెషన్సు జడ్జీ భారతీయుడు. బహు నిష్పక్షపాతంగా వుంటాడు. ఆ కారణంవల్లనే రమానాధుడు ఒకమాటు బందిపోటు జరిగిన స్థలాన్ని చూడ్డం మంచిదనుకున్నారు పోలీసులు.

ఈ నెలరోజులనుంచీ అక్కడ ఒక జమీందారుగారి ఇంట్లో బస ఏర్పాటు చేసుకున్నారు. పగలంతా పక్కనేవున్న అడవికి వేటకి వెళ్తారు. రాత్రిపూట రేడియోలూ, చీట్లపేకలూ, నానా హంగామాగా వుంటుంది వాళ్ళపని! వేటకు పోయేటప్పుడు రమానాధుడు రాజకుమారుడిలా అలంకరించుకు మరీ బయల్దేరుతాడు.

రమానాధుడికి ఈ విలాస జీవితంలో సర్వం లభిస్తున్నై. అయినా జాలప లేని లోటు లోటుగానేవున్నది. భవిష్యత్తులో తనకు రాబోయే గొప్ప వుద్యోగం, అప్పుడు తానుండే ఉన్నతమైనస్థితినీ తల్చుకుని వియోగాన్ని సహిస్తున్నాడు. ఈ కేసు అయిపోగానే ఏదో గొప్ప ఉద్యోగం వస్తుంది. ఇక తనను ఆర్థికలోపాలు వెనకటిలా వేధించవు. జీవితమంతా ఒక క్రొత్తబాటలో అతినవ్యంగా వుంటుంది. అప్పుడు జాలపతో మితిలేని అభ్యంతరాలులేని ఆనందాన్ననుభవించవచ్చు అనుకుంటూవుంటా డెప్పుడూను!

ఇట్లా ఒక నెలరోజులు పల్లెటూళ్ళల్లో విలాసార్థం తిరిగి, పోలీసులతో బంగళాకు చేరుకుంటున్నాడు రమానాధుడు. దారిలో దేవీదీన్ మేడ కనిపించింది. చాలాదూరంనుంచీ రమానాధుడు తన గదిని చూస్తూ వస్తున్నాడు. కారు బాగా దగ్గిరకు వచ్చింతరువాత, అతనికి తన గదిలో కిటికీదగ్గిరగా జాలప కనుపించింది. ఎక్కడలేని ఆశ్చర్యం కల్గింది. జాలప ఇక్కడకి ఎలా వచ్చింది? అని ఒక్క క్షణం ఆలోచించి, తనకు ప్రక్కనే కూర్చున్న సార్జంటుతో కాదు ఆపించమని చెప్పాడు. సార్జంటు కారు ఆపించబోయికూడా, ఏమాలోచించుకున్నాడో ఏమో అలాగే పోనిచ్చాడు. రమానాధుడికి సార్జంటుమీద ఎక్కడలేని కోపం వచ్చింది.

"ఏమిటిదీ? మీరు నన్నొక ఖైదీగా, నీచంగా చూస్తున్నారు" రమానాధుడు అరిచాడు.

"ఖైదీగా చూడటం కాదండి....డిప్యూటీ దొరగారు కోప్పడతారు!"

రమానాధుడు బంగళాకు వచ్చాడు. అన్యమనస్కంగా వుండి, బట్టలైనా మార్చలేదు. జాలపను ఎల్లా కల్సుకోవడం? అని దీర్ఘంగా యోచించి, ఏ యుక్తీ తోచక మంచంమీద కూలబడ్డాడు.

ఒక్కక్షణం తరువాత రమానాధుడు మంచంమీదనుంచి లేచి బయటికి వచ్చాడు. అప్పుడే దీపాలు పెట్టారు. గేటులో ఒక సిపాయి కాపలా కాస్తున్నాడు. వాడిని చూసేసరికి, రమానాధుడికి అరికాలిమంట నెత్తి కెక్కింది. "ఉద్యోగం వచ్చిన తరువాతగానీ వీళ్ళందరి పనీ చెప్పను!" అనుకున్నాడు మనసులోనే!

"బాబూ! సార్జంటుగారు పిలుస్తున్నారు....ఇవ్వాళ కొత్తసరుకు దిగింది!"

రమానాధుడు వెనక్కి తిరిగి చూశాడు. చౌకీదారు చేతులు కట్టుకు నిలబడి వున్నాడు.

"నాకు ఇప్పుడు తీరికలేదు" అరిచాడు రమానాధుడు.

'జాలప ఎల్లా వచ్చింది? ఆమెకూడా ఇక్కడే తనదగ్గిరే వుంటే ఎంత బాగుండు! ఎల్లా తీసుకురావడం?' అని ఆలోచిస్తున్నాడు రమానాధుడు. అతని ఆలోచనలకు అంతరాయాన్ని కలిగిస్తూ, వంటబ్రాహ్మడు ఒక పింగాణి ప్లేటులో భోజనం పట్టుకువచ్చాడు. ఈ రెండునెలల్లో అతను భోజన విషయంలో చాలా నాజూకులో పడ్డాడు. ఒకటి రెండు కూరల్తో అతని కసలు భోజనం సయించనే సయించడంలేదు.

"నీ తలకాయలావుంది, ఒక్కకూరతో ఎల్లా తినను?"

"సైములేంది నేనేం చెయ్యను బాబూ!"

"ఫైము లేదూ?"

"ఎక్కడిది బాబూ!"

"నోరు ముయ్యి!"

రమానాధుడి మనస్తత్వం అతి సున్నితంగా తయారైంది. వంటవాడు మారుమాట్లాడకుండా అవతలికిపోయి, ఒక బ్రాందిబాటిల్ తెచ్చి పెట్టాడు బల్ల మీద. ఒక పెగ్గు బ్రాందీని గొంతులోకి పోనిచ్చి "ఎవరనుకున్నావో నుంచున్న పళంగా బయటికి నెడతాను!" అన్నాడు రమానాధుడు. బ్రాందీ అగ్నిమీద ఆజ్యంలా పనిచేసింది.

వంటవాడు అధికం అవుతున్న రమానాధుడి కోపాన్ని గమనించి, మెదలకుండా వెళ్ళిపోయాడు.

రమానాధుడు 'పానీయాన్ని' సేవించి బయట వరండాలో పచారు చేయసాగాడు.

పచారుచేస్తున్న అతనికి ముళ్ళతీగెకు వెనుక ఎవరో నిలబడివున్నట్టని పించింది. తీక్షణంగా చూచాడొకమాటు....ఎవరో నిలబడినమాట యధార్ధమే! పైగా అత నెవరో, సరీగా తన కభిముఖంగా నిలబడి వున్నాడు.

ఈ కేసులో దిగిన మరుసటిరోజునుంచీ ఏరోజునైనా ఎదటి పార్టీవాళ్ళు తనకు అపకారం చేయవచ్చునే భయం రమానాధుడిని వేధిస్తూంది. ఆ భయమే ఈ క్షణాన నరనరాల్నా వ్యాపించింది.

ఒక్క క్షణం తరువాత రోడ్డున ఏదో బస్సు వెళ్ళింది. దాని వెలుగుతోటలో పడ్డది. తోటలో నిల్చున్న వ్యక్తి స్త్రీ అని పోల్చుకోగలిగాడు. దీనివల్ల అతని భయం కొంతవరకూ తగ్గింది. కానీ ముందుకు పోయి ఎవరని అడగడానికి ధైర్యం చాలలేదు. అతను తటపటాయిస్తూనే వున్నాడు. ఆ వ్యక్తి ముందుకు వచ్చి, ఒక కవరు అతని ముందుకు విసిరిపడేసి గబగబా వెళ్ళిపోయింది.

రమానాధుడు దాన్ని తీసుకుని కుతూహలంగా గదిలోకి వచ్చి తలుపులు బిగించి, పై దస్తూరి చూశాడు.

దస్తూరి జాలపది!

త్వరత్వరగా చింపి చదివాడు.

ప్రయాగలో తనమీద ఏ విధమైన కేసూ లేదని తెల్పుకున్నాడు. ఆర నెల్లనుంచీ తను అనుభవిస్తున్న పశ్చాత్తాపము, సిగ్గూ, బాధా అన్నీ ఒక్క క్షణంలో సూర్యోదయంముందు మంచులా మాయమైపోయినయ్యి. అతని మనః స్సులో నిత్యం గూడుకట్టుకుంటున్న దుర్మార్గపు ఆలోచనలూ, ఆశలూ, కోర్కెలు అన్నీ తల్లక్రిందులు అయినయ్యి. పోలీసుల భయం పూర్తిగా పోః

డంతో, మంచి వాడుగా, సన్మార్గుడిగా బ్రతకడానికి పునాదులు వేసుకో సాగాడు.

జాలపను ఒక్కసారి ఎలాగయినా కల్సుకోవాలనే కోర్కె అతనిలో బల వత్తరం కాజొచ్చింది. విషయాలన్నీ సవిస్తరంగా మాట్లాడి ఈ పోలీసుల కుట్రకు తగిన సమాధానం చెప్పాలనుకున్నాడు.

పదిగంటలైంది. బజార్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. లైట్లు ఆర్పే శాడు. రమానాధుడు తలుపులు దభేల్న శబ్దం అయ్యేట్టు వేసుకున్నాడు. చీకటిగదిలో అల్లాగే రెండు నిమిషాలు నిశ్శబ్దంగావుండి. మెల్లిగా పక్కతలుపు తెర్చుకుని ముళ్ళతీగె దగ్గరకు వచ్చాడు తను. జాలప, దేవీదీను యింకా తోటలోనే వుండి వుంటారని అతని వుద్దేశ్యం.

తోటలోకి పోయి జాలపను కల్సుకోవాలంటే ముళ్ళతీగె దాటాలి. అంత ఎత్తు దాటడం అసంభవం గనక దూరిపోవడానికే నిశ్చయించుకున్నాడు.

ఒక భుజాన్నీ, తలా కొంతవరకు అవతలి భాగంలోకి పోనిచ్చి ధోవతి కొంగుల్ని ఒక చేత్తో పట్టుకుని మెల్లిగా, బట్టలు ముళ్ళకు పట్టుకోకుండా, అవ తలి వైపుకు జరుగుతున్నాడు. ఎంత మెల్లిగా జరిగినా, చొక్కా వీపున, ధోవతి కొంగుల్నా ముళ్ళు పట్టుకోనేపట్టుకున్నై. వాటిని విదిలించుకోవడానికి ప్రయ త్నించిన కొద్దీ ముళ్ళు పెనవేసుకుంటున్నై. గుడ్డలు చినిగితే చినిగినై అని తెగించి ఒక్క వూపున మనిషి సాంతం అవతలి వైపుకు పోయాడు. చొక్కా వీపంతా చినిగిపోయింది. పంచె చీలికలు పేలికలయింది. తోటలోకి పోయి చొక్కా విప్పి అవతలపారేసి జాలపకోసం వెతకసాగాడు. కాపలావాడు అన్నం తింటున్నట్టున్నది. ఎక్కడా మనుషులువున్న అలికిడి లేదు. తోటంతా వెతికి లేరని నిర్ధారణ చేసుకున్న తరువాత, నేరుగా దేవీదీన్ యింటికి బయలుదేరాడు. అతనికి ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది.

పన్నెండు గంటలు కావస్తున్నది. దేవీదీన్ అప్పుడే వచ్చి అన్నంముందు కూర్చోబోతుండగా. రమానాధుడి కేక వినిపించింది. చొక్కాలేకుండా చినిగిన ధోవతితోవున్న అతన్ని మొదట దేవీదీన్ గుర్తుపట్టలేదు. ఒక్కక్షణం తరువాత గుర్తుపట్టి, "నువ్వా, బాబూ! బాగావుంది వేషం! గుడ్డలేమయినయ్యి?"

"ముళ్ళతీగల్లోనుంచి దూరివచ్చాను. ముళ్ళుపట్టుకుని చినిగిపోయినయ్యి!"

"రామ, రామా! వంటికికూడా గుచ్చుకోలేదుకదా?"

"లేదు."

"అమ్మాయి రాసిన చీటీ అందిందా ?"

"ఇప్పుడే అందింది. ఇక్కడే వున్నదా ?"

"ఆఁ."

"అయితే, నువ్వేమన్నా యింటికి వుత్తరం రాశావా ?"

"నేనేమీ రాయలేను. ఆ చదరంగపు పందెపు నమూనా వున్నదే, దాన్ని అమ్మాయేనంట పత్రికలో వేయించింది. పందెపు డబ్బుకూడా అమ్మాయే ఇచ్చిందట !"

రమానాధుడికి విపరీతం అయిన ఆశ్చర్యం వేసింది. జాలప తెలివికి సంతోషించాడు. వెంటనే కొంచెం ఖిన్నమనస్కు డయ్యాడుకూడాను.

జగ్గో పైన కూర్చుని జాలపతో మాట్లాడుతున్నది. దేవీదీన్ మెట్ల దగ్గరకు పోయి, "ఇదిగో ! ఏం చేస్తున్నావ్ ? ఎవరో మాట్లాడటానికి వచ్చారని అమ్మాయితో చెప్పు !" అని అరిచాడు.

"పద, నిన్ను అమ్మగారికి (జాలపకు) వప్పచెబుతాను. ఇన్నాళ్ళనుంచీ ఎక్కడికి పోయిందీ, ఏం చేస్తున్నదీ చెప్పుకుందువుగాని !" దేవీదీన్ పెద్దగా నవ్వాడు.

రమానాధుడికి విపరీతం అయిన సిగ్గుగా వున్నది. అభిమానం, పశ్చాత్తాపం అతన్ని ఘోరంగా బాధిస్తున్నై. జాలప అడగబోయే ప్రశ్నలకు అతనిదగ్గిర సమాధానం లేదు. బయలుదేరినప్పుడున్న వుత్సాహమంతా నీరుగారిపోయింది.

"ఊఁ. పద !" దేవీదీన్ మెట్లు ఎక్కబోతూ రమానాధుడి చేయి పుచ్చుకుని ఎక్కమన్నట్టు సంజ్ఞచేశాడు.

రమానాధుడు తల గోక్కుంటూ, "నీవు పద...." అన్నాడు.

ఇంతలో జగ్గో పైనుంచి, "ఎవరో, ఎందుకొచ్చారో కనుక్కో" అన్నది.

"అమ్మాయికే చెబుతాడుట" దేవీదీన్ వినోదానికన్నాడు.

"అయితే, ఏమైనా చీటీ పట్టుకువచ్చాడా ?"

"లేదు."

రెండు నిమిషాలు నిశ్శబ్దం.

"మరి వెళ్ళమని చెప్పమంటావా ?"

ఇంతలో జాలప పైవరుస మెట్లదగ్గిరకు వచ్చి, "ఎవ రా మనిషి ?" అడిగింది.

"చాలా దూరాన్నుంచి వచ్చానంటున్నాడు."

"ఎక్కడ వున్నాడు ? ఏడి ?"

"ఇదిగో ? నిలబడి !"

"సరే, పైకి రమ్మను."

రమానాధుడు పైగుడ్డ కప్పుకుని నిదానంగా మెట్లు ఎక్కాడు. చూస్తూనే జాలప గుర్తుపట్టింది. ఏదో ఆకస్మికమైన సంఘటన జరిగినట్టు రెండడుగులు వెనక్కివేసింది. బహుశా దేవీదీన్ ఎదురుగా లేకపోతే, ఆ రెండడుగులూ ముందుకు పడేవో ఏమో !

# 39

జాలప, రమానాధులు ఇద్దరూ ఆ రాత్రంతా తమ తమ కష్టసుఖాలను చెప్పుకోవడంతో గడిపేశారు. జాలపకు తన కష్టాలను భర్తదగ్గిర వున్నవి వున్నట్టుగా చెప్పడం యిష్టంలేదు. అందువల్ల భర్త మనస్సు బాధపడుతుందని ఆమె అభిప్రాయం. అందుకనే తన కష్టాలన్నింటినీ క్లుప్తీకరించి, సంక్షిప్తంచేసి చెబుతున్నది.

రమానాధుడుమాత్రం అలా కాదు. జాలపనుంచి తను అధికాదికంగా సానుభూతిని పొందాలంటే ఉన్నవీ, లేనివీ - కష్టాలను పెంచి గోరంతలు కొండంతలుగా వర్ణించడం ఒక్కటే మార్గం. అందుకనే తన బాధలకు చిలవలు పలవలు చేర్చి మరీ జాలపకు చెబుతున్నాడు.

జాలప ఎక్కిళ్ళు పెడుతూ, "ఎన్ని బాధలు పడ్డారు! ఒక్క ఉత్తరమైనా రాశారుకాదేం? అవునులే ఎందుకు రాస్తారు, కండ్లకు కనుపిస్తున్నంతసేపేగానీ. తరువాత మేము జ్ఞాపకంవుంటేనా?" అన్నది.

"అబ్బె....అదికాదు జాలపా! రాయడానికి ముఖం చెల్లలేదు. ఇంట్లో చెప్పకుండా పారిపోయిన నేను, కష్టాలు పడుతున్నానని ఎల్లా రాయగలుగుతాను చెప్పు? బాగా డబ్బు సంపాయించేవరకూ ఉత్తరం రాయకూడదనుకున్నాను!"

"ఆ మాటా నిజమే మరి! మీకు డబ్బుమీదవున్న విలువ మనుషులమీద లేదు....పైగా అందరూ మీలాగే అనుకుంటారు. నాకు ఉత్తరం రాయడానికీ, డబ్బుకూ ఏమిటి సంబంధం చెప్పండి? నాకు డబ్బే ముఖ్యంకాదు."

"అవును. నీకు డబ్బు ముఖ్యంకాదు. డబ్బు సంపాయిస్తేగాని వీలులేదని నీవు నన్ను బలవంతం చేయలేదుకూడాను! కానీ, నా మోసాన్నీ, పిరికితనాన్నీ.... అన్నింటినీ డబ్బుతో కప్పిపుచ్చుకుందా మనుకున్నాను. డబ్బుతో గనక తిరిగి వస్తే, నీవు వేసే ప్రశ్నలన్నింటికీ ఆ డబ్బు సమాధానంగావుపయోగపడుతుందనుకున్నాను."

"అవును. మొగవాళ్ళు అలాగే అనుకుంటారు. నే నా డబ్బును కన్నెత్తి అయినా చూసేదాన్ని కాదు! అంత పాపానికీ, స్వార్థానికీ నేను ఒడికట్టుకోలేను....కాకపోయినా మిమ్మల్నని ప్రయోజనం ఏమిటిలే, వెనకటి నా నగలమీది మమకారాన్ని చూచి మీ రలాగే అనుకునివుండవచ్చును! ముప్పైరూపాయల జీతగాడి భార్యని, నేను రోజుకు రెండు మూడు రూపాయలు ఖర్చుపెట్టడంలో అర్థం ఏమిటి? తాహతుకు మించిన నగలను ధరించాను....దానికి తగిన శిక్షను కూడా అనుభవించాను యీ ఆరునెల్లనుంచీ! ఇక మన కా నగలూ వద్దూ, ఆ

విలాసజీవితమూ వద్దు....ఈ ప్రాయశ్చిత్తాలూ వద్దు! ఈ పాపాలూ, స్వార్థాలూ, వాటికి మూలమైన విలాసాలూ లేని కొత్త జీవితాన్ని గడుపుదాము....రేపు సెషన్సు జడ్జిదగ్గర యథార్థాన్ని చెప్పండి....ఈ రొంపినుంచి బయటపడితే, జీవితం ఇలాంటి బాధలేమీ లేకుండా ప్రశాంతంగా వుండేటట్లు చూసుకుందాము!"

రమానాథుడు కొంచెం బాధగా "నీ వుత్తరం అందినప్పటినుంచీ దీన్ని గురించే ఆలోచిస్తున్నాను. ఒకసారి ఔనని, రెండోసారి కాదనడం ఎట్లాగా?"

"ఎలాగైనాగానీ మీరు సాక్ష్యం మార్చుకోక తప్పదు."

"అదే....ఎట్లాగా అని....?"

"అంత తీరని సమస్య ఏమున్నదీ! ఎటు తిరిగీ మీ మీద మున్సిపాలిటీ కేసు లేదాయె!"

"నిజమే! నీ వన్నట్టు మున్సిపాలిటీ కేసు లేనిమాట వాస్తవమే! అయినా నిన్న ఔనన్న ముఖంతోనే ఇవ్వాళ కాదనడం ఎల్లాగా? అదీకాక మంచి వుద్యోగం వస్తుంది. ఇహ జీవితం సుఖంగా గడుస్తుంది. ఇదంతా పోగొట్టు కోవడమే!"

జాలప ఏమీ మాట్లాడలేదు. మనిషి తన స్వార్థానికి ఎంత క్రూరాన్నైనా చేయడానికి ఎట్లా సిద్ధమౌతాడా? అని ఆలోచిస్తున్నది.

ఒక్క క్షణం ఆగి, రమానాథు డిలా అన్నాడు :

"అదీకాక, కేసు నా ఒక్కడి సాక్ష్యంమీదే ఆధారపడిలేదు. ఒకవేళ నేను విరమించుకున్నా, పోలీసులు ఇంకోడిని పట్టుకువచ్చి సాక్ష్యం చెప్పించుకుంటారు. నేరస్థుల్ని కాపాడటం ఎవ్వరితరమూ కాదు. అలాంటప్పుడు నే నీ సదవకాశాన్ని వదులుకోవడం ఎందుకు?"

జాలప మండిపడ్డది.

"ఏమిటీ ఇంత అభిమానంలేకుండా మాట్లాడుతున్నారు? వెధవ ఉద్యోగం కోసం, నాలుగురోజులు సుఖంగా బ్రతకడంకోసం ఇతర్ల ప్రాణాలు తీస్తారా? ఇంతకంటే కూలిచేసుకోవడం, పస్తులు పడుకోవడం ఉత్తమం! నాకు ఇతరుల గొంతులుకోసి సంపాయించిన స్వర్గంకంటే....నరకమే ఎక్కువ యిష్టం."

రమానాథుడికికూడా కోపం వచ్చింది. "అయితే, నేను కూలి చేయాలనా నీ వుద్దేశం?" అన్నాడు.

"నే నలా కావాలని కోరడంలేదు. ఒకవేళ కూలి చేయవలసివచ్చినా, ఈ నెత్తురు కూటికన్నా అదే మేలంటున్నా. అంతే."

రమానాథుడు కొంచెం శాంతించాడు.

"నేను నీ వనుకున్నంత నీచుడిని కాదు. ఈ పని చేయకూడదనీ, పది

మంది ప్రాణాలు తీసినవాడనౌతాననీ నాకూ తెల్సు! కానీ, ఏం చెయ్యను? పరిస్థితులు అల్లా నా చేత చేయిస్తున్నై. ఇక నేను ఈ ఎదురుదెబ్బలు తినలేను. గడపగడపకూ నౌకరీ కావాలంటూ ఎక్కి దిగటం నావల్లకాదు. అదీకాక.... పోలీసులతో ఎవరు వేగగలరు?....కాకపోయినా, అందరూ నీలాగే ఆదర్శవాదులు వుంటారా? ఆదర్శాలను వల్లించడం తేలికే; వాటిని ఆచరించడంలోనే వుంది కష్టం! నావల్లకాదు బాబూ, నే నీ పర్వతాన్ని ఎక్కలేను. నేను చేయలేని పనిని నాచేత చేయించాలనే పట్టుదల నీ కెందుకు?"

"ఇది నేను ఒప్పుకోను. చంపడానికి శక్తివున్నప్పుడు చంపకుండా వుండటానికి శక్తివుండదా? పరుగెత్తగలవాడు వూరికే నిల్చోలేడా? నీవు వూరకే మనస్సులో సాక్ష్యం మార్చుకోవాలనే వుద్దేశ్యాన్ని దృఢం చేసుకో. మిగిలిన పనులన్నీ వాటంతటవే జరుగుతయ్యి."

రమానాధుడు వింటూ కూర్చున్నాడు.

"ఒకవేళ, నీకు ఈ పాపంనుంచీ, అన్యాయంనుంచీ బయటపడడం ఇష్టం లేకపోతే, నన్ను ఇవ్వాళే ఇక్కడనించి పంపించేసెయ్యి. ఇక ఇక్కడే వుండి నీ దారికి అడ్డం రావడం నాకేమీ ఇష్టంలేదు. ఎక్కడో ఏ అంట్లు తోముకునో బ్రతుకుతాను. బహుశా, మనకు ఇంకా చెడ్డరోజులు వున్నాయేమో! అందుకనే నీ బుద్ధిలిలా పెడమార్గాన పడుతున్నై!"

రమానాధుడు గుటకలు మింగాడు.

"నాకు మాత్రం ఈ పాపం ముడివేసుకు కూర్చోవాలని వున్నదా?"

"మరయితే, దీన్లోనుంచి ఎందుకని తప్పుకోవు? ఒకవేళ నీకు సిగ్గుగా వుంటే, నేను వచ్చి మీ సూపరెన్టెంటుగారితో మాట్లాడతాను....పద....నే వచ్చి ఇంతవరకూ జరిగింది చెబుతాను!"

దీంతో రమానాధుడి తటపటాయింపంతా మాయమైంది. "వద్దు....నేనే చెప్పగలను" అన్నాడు.

జాలపకు విశ్వాసం కలిగింది. తరువాత ఇతర విషయాల్ని గురించి మాట్లాడుకోసాగారు. తండ్రి, తల్లి, ఇల్లూ-అన్నీ అయిన తరువాత భవిష్యత్ జీవితాన్ని గురించి చర్చించారు.

"హాయిగా ఇంటికి పోయి, రత్తన్ దగ్గిర నాలుగెకరాల భూమి తీసుకుని, సాగుచేసుకుంటూ బ్రతకవచ్చు" అన్నది జాలప.

"అంతకన్నా యీ వూళ్ళో టీ షాపు పెట్టుకుంటే మంచి ఆదాయం వుంటుంది."

చివరకు జాలప ప్రస్తావనే నెగ్గింది. ఈ వూబిలోనుంచి బయటపడి, వ్యవసాయం చేసుకుంటూ ప్రశాంతంగా బ్రతకాలని నిర్ణయించుకున్నారు.

# 40

తెల్లవారుజామునే రమానాధు డెవ్వరికంటా పడకుండా తన బంగళాకు పోయాడు. అతను రాత్రి బంగళాలో లేనివిషయం అక్కడ ఎవ్వరికీ తెలియదు. కాఫీ త్రాగి, డ్రస్ మార్చుకుని నేరుగా సార్జంటుదగ్గిరకు పోయాడు. వాలకం కొంచెం మార్పుగా వున్నది.

రమానాధుడిని చూస్తూనే సార్జంటు ఇలా అన్నాడు : "ఏమండి అలా వున్నారు? నౌకర్లు ఏమన్నా చెప్పినమాట వినడంలేదా? గోలచేస్తున్నారా?"

"నౌకర్లుకాదు. మీరు చేశారు! మీరూ, మీ అధికార్లూ కల్సి నన్నొట్టి వెధవను చేశారు!" రమానాధుడు నిలబడే అన్నాడు.

సార్జంటు కొంచెం గాభరాపడి "అసలు ఏమైందో చెప్పండి" అన్నాడు.

"ఏమీ లేదు. ఇక నే నీ కేసులో సాక్ష్యం ఈయను............నాకూ ఈ కేసుకూ బొత్తిగా సంబంధం లేదు. నాకు వారంటుభయం చూపి, ఇలా మోసం చేశారు మీరు. నే నిప్పుడే జడ్జీదగ్గరకు పోయి అంతా చెబుతాను....ఇంతమంది నిరపరాధుల్ని నాశనం చేయడం నావల్లకాదు!"

"అదేమిటి, వారంటుభయం మేము చూపామంటారేం? మీరేగా డబ్బు అపహరించినట్టు స్వయంగా ఒప్పుకున్నారు?"

"అది ఒక లెఖ్ఖల్లో పొరపాటు....తరవాత సరిపోయింది..........మున్సిపాలిటీ నామీద ఏవిధమైన కేసూ నడపలేదు...."

"నడపలేదని మీ కెట్లా తెల్సు?"

"అదంతా మీకు అనవసరం! నేను జడ్జీగారితో వున్న యధార్థాన్నంతా చెప్పేస్తాను. అంతగా వారు నమ్మకపోతే. ఈ కేసు జరిగిన రోజుల్లో నేను ప్రయాగ మున్సిపాలిటీలో వున్నానని, కావాలంటే అక్కడి రిజిష్టర్లని చూడ వచ్చునికూడా చెబుతాను. మీరు నాచేత బలవంతాన మోసంగా సాక్ష్యం ఇప్పించారనికూడా చెబుతాను."

సార్జంటు నవ్వుతూ "పోనీ మోసంగా సాక్ష్యం ఇప్పించామే అనుకో! దానికి తగిన ప్రతిఫలంకూడా చూపుతున్నాంగా? ఏదైనా మంచి వుద్యోగం. చక్కని కారు, మంచి బంగళా — ఇవన్నీ వదిలి పెట్టుకుని, రేపటినుంచీ 'వుద్యోగం ఎవ్వు యిస్తావా, నీ విస్తావా' అంటూ తిరగడం నాకేమీ బాగాలేదు. నీవు గనక చక్కగా సాక్ష్యం ఇచ్చావా, గుమ్మ పట్టడానికే వీలులేకుండా మారి పోతావు!" అన్నాడు.

రమానాథుడిమీద ఈ మాటలు ఏమీ పనిచేయలేదు.

"గుర్తు పట్టడానికి కూడా వీలులేని ఈ దౌర్భాగ్యపు మార్పుకన్నా, అలా బజార్లవెంట నౌకరీ యాచిస్తూ తిరగడమే వుత్తమం! నాకు ఇదేమీ ఒద్దు!

ఇంతలో డిప్టీకలెక్టరు, సబిన్స్పెక్టరు ఇద్దరూ వచ్చారు.

సబిన్స్పెక్టరు నవ్వుతూ "ఇదిగో? రమానాథుగారు అప్పుడే తయారయ్యారు!.... ఈ దెబ్బతో పక్షి పడిందన్నమాటే!" అన్నాడు.

"ఓ....తప్పకుండా! కానీ, ఇన్నాళ్ళనుంచీ గురి మీరుచూసి నన్ను కొట్టమనేవారు. నేను కళ్ళుమూసుకుని కొడుతూ వుండేవాడిని.... ఈసారి అలా కాదు. నేనే గురిచూసి కొడతాను!" అన్నాడు రమానాథుడు.

అధికారులు ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

"ఏమిటీ మీ రదో విధంగా మాట్లాడుతున్నారు? కోపంగా వున్నా రేంటు కని?" అన్నాడు సబిన్స్పెక్టరు.

"ఇవ్వాళ నా సాక్ష్యన్ని మార్చుకోవడానికి నిర్ణయించుకున్నాను .... నిరప రాధుల్ని నాశనం చేయడం నావల్ల కాదు."

"ఏమిటి మీరిలా మాట్లాడతారు? నిరపరాధుల్ని నాశనం చేయడమేమిటి?....నేను నిజం చెబుతున్నాను....ఇది మీరు ఇంకొకరికి ద్రోహం చేయడం కానేకాదు. మీనవరూ మీరు బాగుపడుతున్నారు అంతే! నిజం చెబుతున్నాను. ఇలాంటి అవకాశం చాలా కొద్దిమందికి లభిస్తుంది. ఇక్కడెవరైనా మీతో అనుచితంగా మాట్లాడితే చెప్పండి. తుపాకితో కాల్చేస్తాను" అన్నాడు సబిన్స్పెక్టరు. "ఉండండి ఇప్పుడే వెళ్ళి తెల్సుకుంటాను!" అంటూ, లేచి నిలబడ్డాడు.

"అబ్బే....నన్ను ఎవ్వరూ. ఏమీ అనలేదు....మీరు లేవడం అనవసరం. కొద్దిపాటి లాభాని కాశించి ఇంత అన్యాయానికి ఒడికట్టలేను."

ఒక్కక్షణం నిశ్శబ్దంగా గడిచింది. రమానాథుని బుట్టలో వేసుకోడానికి కొత్త వుపాయాల్ని ఆలోచిస్తున్నారు.

రెండు క్షణాల తరువాత డిప్టీకలెక్టరు "రమానాథుగారూ! మీ పోకడ మంచిది గాదు" అన్నాడు గంభీరంగా.

"బహుశా, మీ కలా కనిపించకపోవచ్చు, నాకు మాత్రం చాలా మంచిదిగా ...న్నది."

...మాత్రం ఎలా మంచవుతుంది? మేము మా కేసు పాడయిపోయినా ... మిమ్మల్ని మాత్రం విడిచిపెట్టము. మీరుగనక మధ్యస్తంలో

ఏదైనా కుట్రచేసినా, లేక సాక్ష్యన్ని తల్లకిందులు చేసినా, తత్ఫలితాన్ని వడ్డీతో సహా అనుభవిస్తారు. మొదట ఇచ్చిన సాక్ష్యాన్నే ఈసారి కూడా యివ్వాలి మీరు, తప్పదు. అలా కాదంటారా ? ఆ జన్మం జ్ఞాపకం ఉండేట్టు చేస్తాము" కలెక్టరు కళ్ళెర్రచేసి రమానాధుడివంక చూశాడు. అతని చూపులు రమానాధుడిని మింగేద్దామా అన్నట్టున్నై. రమానాధుడు కొంచెం జంకాడు.

"అయితే, నాచేత బలవంతాన సాక్ష్యం ఇప్పిస్తారా ?"

"అవును, ఇప్పిస్తాము."

"బాగుంది !"

"లేకపోతే, పోలీసులకే సున్నం పూద్దామనుకున్నావా ? నిన్ను రాజద్రోహం క్రిందపెట్టి, ఇప్పుడే నిల్చున్న పళంగా పదేళ్ళు పంపిస్తాను ! ఈ నునుపు బుగ్గలూ, క్రాపింగులూ సర్వం ఎగిరిపోతాయి."

రమానాధుడికి జైలంటే భయం. ఆ భయంవల్లనే ఈ సాక్ష్యం ఒప్పుకున్నాడు. అధికారి మాటలవల్ల అతని ముఖంలో ఏర్పడ్డ విషాదఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నై.

కలెక్టరు తన మాటలకు మరికొంత పదును పెట్టాడు.

"అక్కడ ఇక్కడ జరిగిన సౌఖ్యాలు ఏమీ వుండవు ! అన్నంలో రాళ్ళు కలిపిపెడతారు. రోజూ నీళ్ళ పప్పుచారు పోస్తారు. వార్డర్లు నోటికివచ్చిన బండ బూతులు తిడతారు. చెప్పుల్తో కొడతారు. ఒక్క నాలుగునెల్లున్నావా ఇక బతకవు!"

మాట మాటకూ రమానాధుడి గుండెదడ అధికమవుతూ వచ్చింది. ముఖం నల్లపడ్డది. కళ్ళు చెమ్మగిల్లాయి.

రుద్ధకంఠంతో "మీరు నన్ను జైలుకు పంపదల్చుకుంటే, పంపండి. నిజంగానే మీరన్నట్టు అలా చచ్చినా ఈ బాధలు పోవు ! మీరంతగా నన్ను జైలుకు పంపితే, నేను చావడానికి సిద్ధమేలెండి !" అన్నాడు రమానాధుడు.

రమానాధుడి నిరాశ హద్దుల్ని దాటింది. అల్లాంటి పరిస్థితిలో ఏమాత్రం సానుభూతి చూపినా, మనిషి దాసుడైపోతాడు. సార్జంటు రమానాధుడి మనస్థితిని చక్కగా గమనించాడు. అతని పక్షం తీసుకుని కలెక్టరుతో ఇలా అన్నాడు : "మీ రసలు మనుషుల్ని గమనించరండీ. అందరిదగ్గిరా ఒకే అస్త్రాన్ని వాడతార పోలీసులకు అనుకూలంగా సాక్ష్యం ఇవ్వాలంటే మొదట్లో ఎవ్వరికయినా
బంగానే వుంటుంది. అలాగే వీరికికూడాను. ఈ మాత్రానికి మీరు
చేయడం దేనికి ? మీకెందుకు మీరు వెళ్ళండి. రమానాధుగారిని ఒపి
నాది" అంటూ, రమానాధుడి చేయి పుచ్చుకుని "రండి
వచ్చింద. పిందాం !" అన్నాడు.

రమానాథుడు అలిగిన కుర్రవాడిలాగా "నన్ను అనవసరంగా బాధించకండి, సార్జంటుగారూ! నాగీతలో జైల్లోనే చావాలని వుందేమో!" అన్నాడు.

"మీకేం ఖర్మమండీ జైల్లో పడటానికి?" అంటూ సార్జంటు, రమానాథుడి భుజంమీద చేయివేసి అవతలికి తీసుకుపోయాడు.

ఇంతలో ప్రభుత్వపు వకీలు కారుదిగి లోపలికి వచ్చాడు.

352

# 41

రతన్ జాలపకు తరచుగా వుత్తరాలు రాస్తూవుంది. ప్రతి వుత్తరంలోనూ కుశల ప్రశ్నలతోపాటు ధైర్యాన్నిచ్చే వాక్యాలుకూడా రాస్తుంటుంది. జాలపకు వచ్చిన ఈ విపత్తుకు తనెంతో విచారిస్తున్నట్టు, దాని నివారణకు తనుకూడా ప్రయత్నం చేస్తున్నట్టూ రాస్తూవుంటుంది. ఎంతకీ ఇల్లాగ తన వుత్తరాలను జాలపను గురించిన మంచి చెడ్డల్తో నింపుతుందేగాని, తన పరిస్థితి ఏమిటి? తన కష్టసుఖాలు ఏమిటి? మొదలైన వేమీ రాయదు.

తన కష్టాల్ని తెలియచేసి అసలే బాధపడుతున్న జాలప మనస్సుకు మరీ దుఃఖాన్ని కల్గించడం రతన్‌కు ఇష్టంలేదు.

ఈ ఒక్క నెలరోజుల్లోనే రతన్ జీవితం గుర్తించడానికి వీలులేనంతగా మారిపోయింది. డబ్బును లెఖ్ఖచేయక, రూపాయిని చిమ్మిడిగా వాడిన ఆమె, తన తిండికికూడా ఇంకోళ్ళమీద ఆధారపడవల్సిన స్థితికి వచ్చింది. ఆమె వైవాహిక జీవితంలో ఎన్ని లోపాలువున్నా ఆర్థికలోపం మాత్రం లేదు. ఈ సమృద్ధి మిగిలిన అన్ని లోపాలను కప్పిపుచ్చుతూ వుండేది. తన తోటి యువతులు నవవయస్కులైన భర్తలతో వుల్లాసంగా జీవితాల్ని గడపడం చూసి, తనుకూడా అలాంటి జీవితంకోసం ఉవ్విళ్ళూరేది. లభ్యం కాలేదని దుఃఖించేది మాత్రం కాదు. వాళ్ళందరికన్నా తనకో ప్రత్యేకత వుందనీ, తను ఒక విషయంలో వాళ్ళకన్నా మిన్న అనీ అనుకుంటూ సంతృప్తిపడుతూ వుండేది. ఆర్థికమైన తన ఆధిక్యతను తల్చుకుని ఎప్పుడూ గాలిలో తేలిపోతూ వుండేది. ఈ విధంగా ఆమెకు సంతృప్తిని యిచ్చే ఈ ఒక్క సాధనం-'ధనం-'కూడా చెయ్యి జారిపోయింది.

చివరి దశలోనైనా కొంచెం జాగ్రత్త పడ్డట్లయితే స్థితి ఇంత శోచనీయంగా పరిణమించేది కాదు. వకీలుగారికి తను చాలారోజులు బ్రతుకుతాననే ఒక పిచ్చి నమ్మకం వుంది. ఆరోగ్యం తక్కువైనవాడు పథ్యపానాల్లో జాగ్రత్తగా వుంటే, దీర్ఘకాలం బ్రతకవచ్చునని వారి విశ్వాసం। పథ్యంలో, ఇతర విషయాల్లో చాలా జాగ్రత్తగా వుండేవాడు. అందువల్లనే తన జీవిత పరిమితి ఇంత త్వరలో ముగిసిపోతుందనుకోలేదు. తీరా మునిగి ప్రమాదం నెత్తిమీదకు వచ్చిం తరువాత కళ్ళుతెరిచాడు. వీలునామా రాయించా లనుకునేప్పటికి రతన్ సుముఖంగాలేదు. వీలునామా మాట ఎత్తితేనే శోకవిహ్వాల అయిపోతున్నది. ఇక ఆమెను యెక్కువగా దుఃఖపెట్టడం యిష్టంలేక వకీలుగారు

తాత్కాలికంగా ఆ ప్రస్తావనను ఆపేశారు. తరువాత చనిపోయేవరకూ ఆయనకు స్పృహే లేదు.

వకీలుగారు చనిపోయిన తరువాత రత్తన్ ఎంతో విరక్తిలో పడిపోయింది. ఎంతో సతర్కంగా వుండవల్సిన ఆ సమయంలో, బాధ్యతలన్నింటినీ మణిభూషణ్ మీద వదిలి కళ్ళుమూసుకు కూర్చున్నది. మణిభూషణుడు ఈ అదన్ను ఎందుకు పోనిస్తాడు? వల నాలుగువైపులనుంచి పన్నుకువచ్చాడు. పాపం సరళ హృదయ రత్తన్ అతని వల్లో చిక్కింది. ఆమె కళ్ళుతెరచి తనచుట్టూవున్న పరిస్థితుల్ని తలయెత్తి చూడబోయేసరికి, వల నాలుగువైపులనుంచి బిగించడంకూడా జరిగింది.

ఒక రోజు మణిభూషణ్ రత్తన్‌తో, ఇలా అన్నాడు: "ఇక ఈ బంగళా ఖాళీ చెయ్యాలి. అమ్మేశాను!"

రత్తన్ విభ్రాంతి చెందింది. కఠోరంగా "నేను వద్దన్నానుగా? ఎలా అమ్మావు?" అన్నది.

మణిభూషన్‌కూడా గొంతు పెదదిచేసి "మీరు ఇప్పుడన్నమాట మరో నిమిషానికే మర్చిపోతారు. ఈ గదిలో కూర్చుని వుండగానే నేను మిమ్మల్ని ఒక మాట అడిగాను. అప్పుడు అమ్మమన్నారు. తీరా అమ్మింతరువాత ఇలా మాట్లాడుతున్నారు. ఇప్పుడేం లాభంలేదు. అమ్మేశాను. ఖాళీచేసి మీరు నాతో రావాలి!.....ఎక్కువ వ్యవధికూడా లేదు.....ఇవ్వాళే!"

"నేను ఇంకా కొన్నాళ్ళు ఇక్కడే వుండాలనుకుంటున్నాను."

"నేను మిమ్మల్ని ఇక్కడ వుండనీయను."

"నే నేం నీ దాసీని కాను. నీవు వుండనీయడానికీ, వుండనీయకపోవడానికీ!"

"కాదు. ఆ మాట నిజమే! కానీ, మీ రక్షణభారం నామీద వుంది. మిమ్మల్నీ, మన వంశగౌరవాన్నీ కాపాడే బాధ్యతలు నావి. అందుకని మిమ్మల్ని నా వెంట తీసుకుపోక తప్పదు."

"నన్నూ, నా మర్యాదనూ నేను కాపాడుకోగలను. నా సమ్మతి లేకుండా ఇక్కడి వస్తువుల్లో ఏ ఒక్కటీ అమ్మటానికి వీలులేదు."

"మీకు ఈ ఇంటిమీద కానీ, బాబాయిగారి ఆస్తిమీదగానీ ఏవిధమైన అధికారమూ లేదు. ఈ ఆస్తి నాది.....కాకపోతే, మీరు మీ తిండిగురించి అడగ్గలరు!"

రత్తన్ నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది. సాశ్చర్యంగా "నీవేం తాగి వచ్చావా?" అన్నది.

దీంతో మణిభూషణుడికి విపరీతం అయిన కోపం వచ్చింది. అతికఠినంగా అన్నాడు : "నేను తాగలేదు. ఒకవేళ తాగినా, ఒళ్ళు తెలియనంతగా తాగలేదు. కాకపోయినా చదువుకున్నావు. ప్లీడరుగారి ధర్మపత్నివి. వేరుపడని కుటుంబపు ఆస్తి అన్నదమ్ములకు చెందుతుంది. విధవరాలైన భార్యకు చెందదని నీకు తెలియదా ? మేమూ, మా బాబాయి వేరుపడలేదు. లేకపోతే బాబాయి కాశీలో వుంటున్నాడు. మేము కనూజ్‌లో వుంటున్నాము. ఈ మాత్రానికి వేరుపడ్డామని ఎవ్వరూ అనరు. అదీకాక ఆస్తి మీకు చెందడం బాబాయికి ఏమాత్రం ఇష్టంలేదు. ఇష్టమేవుంటే వీలునామా రాయకుండా వదిలేవాడా ? వీలునామా రాయకపోవడంతో వారి వుద్దేశ్యం ఏమిటో స్పష్టంగా తెల్సిపోతున్నది....ఇవ్వాళ మీరు తప్పనిసరిగా బంగళా ఖాళీచేయాలి. ఇక్కడ సామాన్లన్నీ అమ్మేస్తాను. వస్తారా నావెంట రండి....లేదా నెలకు పదో, పదిహేనో వీలునుబట్టి తిండికి పంపుతాను. మీ ఇష్టం ఎక్కడైనా వుండండి !"

రత్తన్ ఏమీ మాట్లాడలేదు. రెండు క్షణాలు మౌనంగావుండి తరువాత కారు వేసుకు బయటికి పోయింది.

రత్తన్ తన భర్తకు స్నేహితులైన ఎంతోమంది ప్లీడర్ల దగ్గరకుపోయింది. పరిస్థితిని వివరంగా చెప్పి ఏంచెయ్యడానికి వీలుంటుందో కనుక్కొన్నది. పరిస్థితిని విన్న ప్రతి ప్లీడరూ, వకీలుగారు వీలునామా రాయనందుకు చాలా విచారాన్ని తెలియజేశారు.

చివరకు తేలిన సారాంశం ఏమిటంటే, రత్తన్ గనుక వకీలుగారికి, వారి తమ్ముడికీ ఏ సంబంధమూ లేదని. వేర్లుపడ్డారని నిరూపించగలిగితే ఆస్తి దక్కుతుంది. లేదా, పోతుంది.

పోతే, అలా నిరూపించడం అసాధ్యమైన విషయం !

ఇలా సాయంత్రంవరకూ గడిచింది.

మణిభూషణుడు బయట రెండుబండ్లను నిలబెట్టి వచ్చి ఇలా అన్నాడు : "మీకు ఏఏ వస్తువులు కావాలో చెప్పండి. అక్కడ ఒక యిల్లు మాట్లాడాను. చేరుద్దాం !"

"నాకేమీ వద్దు. నా అధికారంలో లేని వస్తువులు నాకు అనవసరం.... నాకోసం నీవు ఇల్లుకూడా చూడనవుసరంలేదు. నేను ఇంటినుంచి వచ్చేప్పుడు ఏమీ తేలేదు. పోయేప్పుడూ అంతే !"

మణిభూషణుడు కొంచెం సిగ్గుపడ్డాడు.

"అదేమిటి ? మీకు అధికారం లేకపోవడమేం ? వున్నది. ఆ యిల్లు చాలా బాగున్నది. పదిహేను రూపాయల అద్దె ! ఒక్కసారి మీరు పోయి చూసి

రండి. మీకు తప్పకుండా నచ్చుతుంది ! ఇక్కడి వస్తువుల్లో మీకేం కావాలో చెప్పండి; పంపుతాను !"

"అరె....పదిహేనురూపాయలా! ఎందుకు అనవసరంగా ఖర్చుపెడతావు? ఎక్కడైనా రెండు మూడు రూపాయిల్లో దొరికితే చూడు....పడుకోవడానికి ఎటూ నేల వుండనే వుందికదా! ఇతర్ల 'దయ' మనమీద యెంత తక్కువగా వుంటే అంత మంచిది" రత్తన్ వ్యంగ్యోక్తిగా అన్నది.

"ఇంతకూ మీరు కావల్సిందేమిటో చెప్పరేమిటి ?"

రత్తన్ ఒక్కసారిగా వుద్రేకపడ్డది.

"నా కేమీ అవుసరంలేదు. ఈ ఇంట్లోవున్న పూచిక పుల్లకూడా నేను తీసుకోను. నావి కానివాటికోసరం ప్రాకులాడి, ఇంకోళ్ళ దయాధర్మాలకు ప్రాకులాడ్డం నాకు గిట్టదు. నీ వీ వస్తువులకు యజమానివి. పట్టుకుపో ! నే నేమీ అనుకోను. లోకంలో ఎంతోమంది దరిద్రవిధవలు అంట్లూ చెంబులూ తోముకు బ్రతుకుతున్నారు. నేనూ అల్లాగే బ్రతుకుతాను. ఒకవేళ బ్రతకలేనా విచారించను. తన్ను తాను పోషించుకోలేనివాళ్ళకు నిజంగా బ్రతికే అధికారంమాత్రం ఎక్కడిది ?" అంటూ రత్తన్ లేచి బయటికి పోయింది.

మణిభూషణుడు అడ్డంవచ్చి "మీ కంత కష్టంగావుంటే ఇప్పుడప్పుడే అమ్మనులెండి !" అన్నాడు.

రత్తన్‌లో అంతవరకూ రాజుకుంటున్నఅగ్ని కళ్ళల్లో జ్వలించింది. కన్నీళ్ళను ఆపుకుంటూ ఆవేశంతో అన్నది: "ఈ ఇంట్లో వస్తువులు నావి కావు. నాకు సంబంధంలేదని చెప్పాను. మళ్ళీ నన్ను అనవసరంగా అడ్డగిస్తున్నావు ! నే నీ ఇంటి వధువును కాదు. దాసీని. దాసీకి ఇంటి వస్తువుల్లో అధికారం ఎక్కడినించి వస్తుంది ? ఇంత దుర్మార్గమైన చట్టాన్ని తయారుచేసిన ఆ మూలపురుషుడికి చెల్లెళ్ళూ, అక్కలూ, వున్నారో లేదో నాకు కనుపిస్తే అడుగుదును. కాకపోయినా పెళ్ళిచేసుకునే ముందే జాగ్రత్తపడవల్సింది. తరువాతనైనా, వేరుపడేవరకూ నిద్రపోకుండా వుండవల్సింది. అవిభక్త కుటుంబంలో భార్య స్థితి దాసీకంటే హీనంచి వుండదని ఇవ్వాళ తెల్సుకున్నాను" అలుపు తీర్చుకుంటానికి సంభాషణ ఆపింది ఆమె.

సాయంత్రం అయింది. దీపాలు పెట్టబోతున్నారు. ప్రకృతంతా మసగ్గాపోతున్నట్టుంది. రత్తన్ పమిటచెంగు వంటినిండా కప్పుకుని కాలినడకన పోతున్నది. ఎంతోమంది యెరిగినవాళ్ళు కనిపించారు. స్నేహితురాండ్రు కొందరు తమ కార్లలో ఎక్కమని బలవంతం చేశారు. కానీ, రత్తన్ వాళ్ళతో సరిగా మాట్లాడలేదు. నేరుగా జాలప ఇంటివైపు వెళ్ళింది.

# 42

సరిగా పదిగంటలకు జాలప, దేవీదీన్ కచ్చేరీకి చేరుకున్నారు. న్యాయస్థానమంతా మహా సందడిగావుంది. పైగ్యాలరీలలో సభ్యపురుషులు నిండివున్నారు. లోపల స్థలంలేక ఎంతోమంది ఎదురుగావున్న ఆ మెల్లాలోనూ. వరండాలోనూ నిలబడిపోయారు. జాలప ఎల్లాగో పై గ్యాలరీలలో చోటు సంపాయించుకున్నది. దేవీదీన్ వరండాలో నిలబడ్డాడు.

ఎత్తయిన పీఠంమీద జడ్జీ కూర్చునివున్నాడు. ఒకవైపున బంట్రోతు, ఇతర వుద్యోగులు నిలబడివున్నారు. మరోవైపు పోలీసు అధికార్లు నిలబడివున్నారు. ఎదురుగా కొంచెందూరంలో రెండు వరుసలుగా నిలబడ్డ ప్లీడర్లు కేసు వప్పగింతకోసం ఎదురుచూస్తున్నారు. నేరస్థులు పదిహేనుగురికి తక్కువవుండరు. అందరూ ఒకవైపు ఏ చీకూ చింతా లేనట్టు నిరామయంగా కూర్చున్నారు.

పన్నెండుగంటలా ప్రాయల కేసు వప్పగింత జరిగింది. మొదట కేసు వివరాలూ, పోలీసుల సాక్ష్యాలూ జరిగినయ్యి. చివరకు మూడుగంటల ప్రాంతాల రమానాధుడిని పిల్చారు.

రమానాధుడు సాక్ష్యం ఇయ్యడానికి రాగానే, ప్రేక్షకుల్లో సన్నని కలవరం బయలుదేరింది. ప్రతివారూ రమానాధువంకకే చూస్తూ, ఏం చెబుతాడో విందామనుకుంటున్నారు. జాలపకూడా అతనివైపు తదేక దీక్షగా చూడసాగింది.

రమానాధుడు తలవంచుకుని నిలబడివున్నాడు. అతను ఒక్కసారి తల ఎత్తి తనవైపుకు చూస్తే బాగుండును. అతను అతిభయంగా, లజ్జగా, ఎటూ పోవడానికి మార్గంలేక వివశంగా నిలబడ్డట్టుగా కనుపిస్తున్నాడు. తల పైకి ఎత్తకుండా అధోలోకాలను చూస్తున్నాడు. అతని ఈ వాలకాన్ని చూడగానే జాలప గుండెలు దడదడ కొట్టుకోసాగినై.

రమానాధుడి సాక్ష్యం ప్రారంభమైంది. మొదటి వాక్యానికే జా ముఖం మలినం అయింది. తను ఆశించనిది ఏమో జరుగుతున్నట్టు నలుపుకున్నది. ఒక్క క్షణం తరువాత పూర్తిగా నిరాశపడి, పెద్దగా కుర్చీకి చేరగిలబడ్డది. ఇంకేం చెబుతాడో అనే ఆదుర్దావల్ల మళ్ళీ లేచి కూర్చున్నది. రమానాధుడి దృష్టి నాకర్షించడానికి రెండు మూడుసార్లు దగ్గింది.

అతను ఎటూ చూడకుండా పోలీసులు నేర్పిన మాటలను చిలకలా వల్లిస్తున్నాడు........

జాలపకు ప్రక్కనేకూర్చున్న ఒక నడికారు స్త్రీ, రమానాథుడి సాక్ష్యానికి మండిపడి ఇల్లా అన్నది : "ఇలాంటి దుర్మార్గులను కోసినా పాపం లేదు. ఈ దౌర్భాగ్యదేశంలో, ఏ చిన్న నౌకరీ కాసించో, కొద్దిపాటి డబ్బుకాసించో ఇలాంటి అన్యాయాలకు తలపడుతున్నారు. ఇందుకు ఏడవాలో, నవ్వాలో బోధపడటం లేదు !"

జాలప మెల్లిగా ఆమెవైపు చూసింది.

కళ్ళద్దాలు పెట్టుకున్న ఇంకో స్త్రీ ఇలా అన్నది : "ఇలాంటివాళ్ళు వున్న దేశం ఎలా బాగుపడుతుంది ? మహాఅయితే, ఒక చిన్న క్లర్కుపోస్టు దొరుకుతుంది. ఈ మాత్రానికి ఇంత అన్యాయమా ? పరమ నీచుడిలా వున్నాడు !"

ఇంకో ఆమె కళ్ళద్దాలామెతో "మనిషి చూస్తే ఫాషన్‌గానే వున్నాడు. చదువుకున్నట్టుగాకూడా కనుపిస్తున్నాడు. ఒకవేళ అతను నీకు ఎక్కడైనా తటస్థపడితే ఏం చేస్తావు ?" అన్నది.

"నాకు తటస్థపడితేనా ? ముఖాన పేడనీళ్ళు కొడతాను !"

"మరి నే నేం చేస్తానో తెల్సా ?"

"తెలియదు. బహుశా గొంతు నులిమి చంపేస్తావు."

"కాదు. కాదు. నడిబజారులో నిలబెట్టి చెప్పుతో శృంగారం చేయిస్తాను."

"పాపం, చంద్రబింబంలాంటి ముఖం, మాసిపోతుంది. కొంచెం దయ చూపుదూ."

"దయచూపబట్టే. చెప్పుదెబ్బలు ! అతనికి తగినశిక్ష, ఒక పెద్ద కొండ మీదకు తీసుకుపోయి, అక్కడినించి క్రిందకు నెట్టడం ! ఇక్కడ గనక సరిపోయింది, ఇదే అమెరికా అయితేనా ? నిలువునా తగలబెట్టేవాళ్ళు !"

ఇంతలో వాళ్ళకు ప్రక్కనేవున్న ఒక పెద్దమనిషి వాళ్ళను వారిస్తూ ఇలా అన్నాడు : "పాపం, అనవసరంగా అతన్నంటా రెందుకండి ? అతను వస్తుతహా మంచివాడిలాగానే వున్నాడు.... అతని కీ సాక్ష్యం ఇష్టంలేదనీ, పోలీసుల భయం వల్ల తప్పనిసరై చెబుతున్నాడనీ, అతని స్వరమే చెబుతున్నది. పోలీసులు ఇతన్నీవిధంగా తయారుచేసివుంటారు !"

జాలప ఇక అక్కడ కూర్చోలేకపోయింది. ఒక్కొక్క మాట ఆమె గుండెల్లో శూలాలై పొడుచుకొంటున్నది. అప్పుడే జడ్జీదగ్గరకు పోయి వున్న యథార్థాన్నంతా చెబుదామా అనుకున్నది. రెండడుగులు ముందుకూ డావేసింది. మళ్ళీ ఏమౌతుందోననే భయంతో ఆగిపోయింది.

మెల్లగా అక్కడనుండి వెళ్ళిపోయింది.

మెట్లు దిగుతున్న ఆమె దగ్గరకు వచ్చి "ఇంటికేనా అమ్మా ?" అన్నాడు దేవీదీన్.

"ఇక యిక్కడ కూర్చోవడం నావల్ల కాదు."

ఇద్దరూ బయటికి వచ్చారు. కొంచెం ఓదార్పు స్వరంతో "ఒక్కమాటు పోలీసుల చేతుల్లో పడ్డతరువాత....ఇక తప్పుకోవడం కష్టం!"అన్నాడు దేవీదీన్.

"ధైర్యంవుంటే మహా లక్షణంగా తప్పుకోవచ్చు....పిరికివాళ్ళు తప్పుకో లేరు!" తిరస్కారంగా అన్నది జాలప.

ఇద్దరూ కొంతదూరం వెళ్ళారు. వుండివుండి జాలప అకస్మాత్తుగా అడి గింది : "ఏం తాతా ! ఇక నెక్కడా అప్పీలు చేసుకోవడానికి వీలులేదా? ఇక్కడే శిక్షలు చెబుతారా ?"

"హైకోర్టులో అప్పీలు చేసుకోవచ్చు !"

మరికొంతదూరం ఇద్దరూ నిశ్శబ్దంగా నడిచారు. జాలప ఒక చెట్టుక్రింద ఆగి "తాతా ! నా కివ్వాళ జడ్జీని కల్సుకుని పరిస్థితినంతా చెప్పేద్దామనిపిస్తున్నది. బాగుంటుందా ?" అడిగింది.

"జడ్జీగారితోనా ?"

"అవును !"

"నేనేమీ చెప్పలేనమ్మా! అధికారుల్తో పని....ఎటు తిరిగినా, తిరుగుతారు!"

"మరి జడ్జీగారు పోలీసులమీద చర్యతీసుకోవడానికి వీలులేదా ?"

"లేకేం? వున్నది !"

"అయితే, నే నివ్వాళ కల్సుకోనా ? కలుస్తారా అసలు ?"

"కలుస్తారు. అడ్రసుకూడా కనుక్కుందాము. కానీ, మహాకష్టమైన పని!"

"ఏమి టా కష్టం ?"

"రమాబాబుగారికి, దొంగసాక్ష్యం చెప్పాడనే నేరంక్రింద శిక్ష పడవచ్చు!"

"అంతగా పడితే పడనీ, చేసుకున్నవాళ్ళకు చేసుకున్నంత.........మహ దేవా !"

"పోనీ, అది వదిలిపెట్టినా ఇంకో చిక్కు వున్నది !"

"ఏమిటది ?"

"మనం ఈ విషయం తెలియచేసిన తరువాత జడ్జి తప్పనిసరిగా పోలీస్ కమిషనర్ను పిలిపించి విషయం యావత్తూ చెబుతాడు. అప్పుడు....వున్న కేసును

బయటపెట్టకపోగా, ఈ రహస్యాన్ని బయటపెట్టచూసే నిన్ను అరెస్టు చేస్తారు. ఇలాంటివి పోలీసులు సాధారణంగా చేస్తూవుంటారు. ఇప్పుడు నీ విషయంలోనూ అంతే."

జాలప హృదయం ఒక్కసారి తీవ్రంగా కొట్టుకున్నది. తమ మార్గానికి అడ్డువస్తే పోలీసువాళ్ళు ఏ యే క్రూరాలు చేసేది తెల్సుకున్నది. తనను బాధిస్తారనే బాధ ఆమెకు లేదు. భర్తను బాధిస్తే? కాళ్ళూ చేతులూ విరగ్గొడితే? ఆమె తల తిరిగింది.

కొంత దూరం నిశ్శబ్దంగా నడిచి మళ్ళీ ఆగింది.

"పోనీ, వారిని కల్సుకోలేమా?"

"ఎవరినీ, రమానాధుగారినా?"

"ఆఁ."

"ఊఁహుఁ, ఏవిధంగానూ కల్సుకోలేము. వెనుకటికంటే ఎక్కువ జాగ్రత్తగా వుంటారు ఒకవేళ బంగళాకూడా మార్చవచ్చు!....కల్సుకున్నా ప్రయోజనం వుంటుందనుకోను."

రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచినయ్యి.

"తాతా! ఇక నేను ఇంటికి వెళ్తాను. ఇక్కడ అనవసరంగా ఎందుకు?"

దేవీదీన్ కళ్ళు అశ్రుపూరితాలైనయ్యి.

"లేదమ్మా! నీ విప్పుడే వెళ్ళడానికి వీలులేదు. నీవుకూడా వెళ్ళిపోతే, మా యిల్లు చీకటైపోతుంది. ముసల్ది ఇక ఏడుపులే ప్రారంభిస్తుంది. అదీకాక, తీర్పు ఏం చెబుతారో ఏమిటో, వినకుండానే ఎల్లా వెళ్తావు?"

ఇల్లు చేరుకునేవరకూ ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. కానీ, జాలప హృదయంలో అగ్నిపర్వతం రగులుకుంటున్నది. నిమిష నిమిషానికి రమానాధుడిమీద ద్వేషం ఎక్కువ అవుతున్నది. ఒక్క తన ప్రాణంకోసం, వుద్యోగంకోసం ఇంతమంది ప్రాణాలు తీస్తాడా? తనెంత? తన వుద్యోగ మెంత?"

ఇట్లా ఆలోచిస్తూనే జాలప ఇల్లు చేరింది.

# 43

ఒక నెల గడిచింది. జాలప కొద్దిరోజులు రమానాధుడి ఈ ప్రవర్తనకు బాగా బాధపడ్డది. విపరీతమైన ఆవేశంతో, వుద్రేకంతో కొన్నాళ్ళు గడిపేసింది. ఆ వుద్రేకపు రోజల్లో సరాసరి జడ్జీ ఇంటికిపోయి ఇదంతా ముఖాన చెబుదామను కునేది ఒకసారి. ఒక్కొసారి ఈ కథనంతా ఏదైనా పత్రికలో ప్రచురిద్దామను కునేది. మరోసారి రమానాధుడిమీద విపరీతమైన కోపాన్ని తెచ్చుకునేది. ఇక అతని ముఖమే చూడకూడదని నిర్ణయించుకునేది. రోజులు గడుస్తున్నకొద్దీ అన్నీ పోయినయ్యి. ఇప్పుడామె హృదయంలో భర్తమీద కోపంగానీ, ద్వేషంగానీ, అనురాగంగానీ-ఏమీ లేవు. విచిత్రమైన వుదాసీనత ఆమెను ఆవరించింది. ఎవరైనా వచ్చి అకస్మాత్తుగా రమానాధుడు చనిపోయాడని చెప్పినా, ఏమాత్రం చలించకుండా, కలలో సంఘటనలా తలవూపి వూరుకుంటుంది. రెండు సంవత్సరాలక్రితం, వివాహసందర్భంలో మెళ్ళో కట్టిన మాంగల్యం అప్పుడప్పుడూ కనుపించి 'అతను నీ భర్త' అని చెబుతూ వుంటుంది.

ఈ నెలరోజులలో రమానాధుడు చాలాసార్లు కారువేసుకుని దేవీదీన్ ఇంటి ముందుగా పోయాడు. అతని కండ్లల్లో విపరీతమైన నిస్సహాయత కనుపిస్తూవుండేది.

జాలప మాత్రం కన్నెత్తి అతన్ని చూడలేదు. ఆమె హృదయపు అట్టడుగు పొరల్లో ఎక్కడో, కారుమేఘాల్లో చిక్కుపడిపోయిన శశికిరణంలా రమానాధుడి జ్ఞాపకాలు గొల్లున ఏడుస్తున్నై. అలాంటి సమయాల్లో జాలప అవర్ణనీయమైన వ్యాకులతకు లోనవుతుంది. తిరిగి మరుక్షణంలోనే స్తిమితపడుతుంది.

చంచలంగా, చపలంగా, మాట మాటకు అలుగుతూ నగలకోసం, జీవితపు ఆనందాలకోసం అర్రులుచాస్తూవుండే జాలప, ఈ నెలరోజుల్లో పూర్తిగా మారిపోయింది. గంభీరమైన కర్తవ్యాలను నెత్తినపెట్టుకున్నదానిలా ఎప్పుడూ దీర్ఘంగా ఆలోచిసూవుంటుంది. ఆమెకు భవిష్యత్తు అంధకారం! వర్తమానం పాషాణం!!

కేసు విచారణ పూర్తయింది. తీర్పుకూడా చెప్పారు. ఇవ్వాళే ప్రకటిస్తారు. జాలప ఇంటిపనులన్నీ పూర్తిచేసుకుని దినపత్రికకోసం ఎదురు చూస్తున్నది. దేవీదీన్ పత్రిక తెచ్చి ఇచ్చాడు.

జాలప చదువుతున్నది.

"తీర్పు పడిందా అమ్మా!"

"ఆ-"

"ఎవరెవరికి శిక్షలు పడ్డయ్యి?"

"అందరికీ! ఒకడికి ఉరిశిక్ష .... ఐదుగురికి పదేసి ఏండ్లు .... ఎనిమిది మందికి ఐదేసి సంవత్సరాలు! పాపం దినేశ్‌కు ఉరిశిక్ష పడది" అంటూ ఆమె దిన పత్రికను కిందపెట్టి గట్టిగా శ్వాసవదిలి, "వీళ్ళ పెళ్ళాం బిడ్డలగతి ఏంకానో" అన్నది.

"నీవు చెప్పినప్పటినించీ. నే నందరి అడ్రసులూ తెల్సుకుంటూనే వున్నా నమ్మా! వీళ్ళల్లో ఎనిమిది మందికి అసలు పెళ్ళిళ్ళే కాలేదు. ఐదుగురికి పెళ్ళిళ్లు అయినయ్యి. కొంచెం వున్నవాళ్ళు; ఫరవాలేదు. పాపం, ఈ దినేశుదే అన్యాయం. ఇద్దరు పిల్లలూ, ఒక ముసలి తల్లీ, భార్యా ఇతనిమీద ఆధారపడి వున్నారు. ఆస్తి అంటూ దమ్మిడీలేదు. పూర్తిగా నాశనం అయిపోయారు."

"అతని ఇంటి అడ్రసు తెల్సుకోగలవా?"

"ఎందుకు తెల్సుకోలేనూ?"

"అయితే ఎప్పుడు పోయి చూసివద్దాం? నన్ను వెంట తీసుకుపో...."

"మొదట నేను పోయి ఇల్లు చూసివస్తాను, తరవాత నీవు వద్దువుగాని."

జాలప ఎదురు చెప్పలేదు. తలవంచుకున్నది.

దేవీదీన్ వెళ్ళిపోయిన తరువాత జాలప చాలాసేపు వార్తాపత్రికను చూస్తూ కూర్చున్నది. దినేశుడి విషయమే ఆమెను ఎక్కువగా బాధించసాగింది. సాధారణమైన స్కూలు మాష్టరతను. దరిద్రుడు. పాపం ఉరిశిక్ష పడ్డదని విన్నప్పుడు ఎంతబాధపడ్డాడో? భార్యా. తల్లీ ఎంత దుఃఖించారో? ఏ పాపపుణ్యాలూ ఎరుగని ఆ యిద్దరు పసికూనల జీవితాలూ ఏమయ్యేట్టు? ఇక ఆ సంసారం తెల్లవారేదెల్లా?

జాలప హృదయం ఆవేదనతో దగ్ధమైపోయింది.

సాయంత్రం అయినా ఇంతవరకూ దేవీదీన్ రాలేదు. జాలప మాటిమాటికీ బయటికి వచ్చి బజారువంక చూస్తున్నది. ఎక్కడా వస్తున్న జాడలులేవు. ఎనిమిది గంటలైంది.

జాలపకు ఆదుర్దా ఎక్కువైంది. ఎందుకు రాలేదా అనుకుంటున్నది. ఇంతలో ఒక కారువచ్చి వాకిట్లో ఆగింది. కారులోనుంచి రమానాధుడు దిగి జగ్గోను కేకవేసి ఇలా అన్నాడు:

"ఏం అమ్మా? అందరూ కులాసా? తాతేడీ?"

"ఎక్కడికో పోయాడు; నాకు తెలియదు."

రమానాధుడు జేబులోనుంచి నాలుగు బంగారుగాజుల్ని బయటకితీసి జగ్గో పాదాలదగ్గిర పెట్టి, "ఇవి నీకోసం తెచ్చానమ్మా! వదులుగావున్నయ్యేమో వేసుకు చూడు" అన్నాడు.

జగ్గో గాజుల్ని అవతలికి విసిరి, "ఇంత పాపానికి స్థానంవుండగా, ఆ న్యాయస్థానంలో ఈ నాలుగు గాజులకే చోటులేకపోయిందా? భగవంతుడి దయవల్ల నాదగ్గిర చాలా బంగారముంది. ఎంతో తిన్నాను. ఎన్నో నగలు పెట్టుకున్నాను.... ఎంతో సుఖాన్ని అనుభవించాను. కానీ నీలాగా ఇతర్ల గొంతు కోసికాదు....నీ డబ్బునీ, నగల్నీ చూసి ఇక్కడ ఎవరైనా మురిసిపోతా రనుకున్నావు గావును! ఒకవేళ నీవు అంత డబ్బుమూట పట్టుకువస్తే, నీ భార్య సంతోషిస్తుందనుకుని వుంటావు. ఆ అమ్మాయి నీలాంటిది కాదు. ఇన్నాళ్ళనుంచీ కాపురం చేస్తున్నావు. ఏం లాభం? ఆ అమ్మాయి మనస్సునే కనుక్కోలేక పోయావు! బంగారంలాంటి అమ్మాయిని....నీలాంటి రాక్షసుడి చేతుల్లో పెట్టారు. ఆ మహాతల్లి ఇంత దుర్మార్గుడి నెలాకన్నదో? అనుకుంటాను అప్పుడప్పుడూ. ఆ అమ్మాయి కంటపడకుండా, వచ్చినదోవనే త్వరగా వెళ్ళు! ఎందుకు అనవసరంగా కంటపడి ఆ అమ్మాయి మనస్సుని కష్టపెడతావు?" అన్నది.

అంతవరకూ మెదలకుండా తలవంచుకు వింటున్న రమానాధుడు నిదానంగా తలయెత్తి యిలా అన్నాడు:

"అమ్మా! నేను తప్పుచేశాను. చేసిన యీ తప్పుకి జీవితమంతా పశ్చాత్తాప పడతానుకూడానూ! కానీ, నీవనుకుంటున్నంత నీచుణ్ని మాత్రం కాను. నన్నక్కడ పోలీసులు యెలా బాధలుపెట్టేరో, యెంత యిరుకున పడేశారో తెలిస్తే నువ్విలా అనవు. వాళ్ళు నాకు అనేక భయాలు చూపించారు. ఎంతో బెదిరించారు."

పైన వున్న జాలపకు యీ మాటల సవ్వడి వినిపించింది. మెట్లదగ్గరికి వచ్చి తొంగిచూసింది. ఒక విలువైన సిల్కు కోటుతో, బంగారు తీగలుగల కళ్ళద్దాలతో రమానాధుకు కన్పించాడు. ఈ నెలరోజుల్లో మనిషి బాగా మారాడు. పచ్చబడి లావెక్కాడు. జాలప రివరివా కిందికి వచ్చి అందుకున్నది.

"బెదరింపులకీ, దబాయింపులకీ, లొంగిపోయావంటే, నువ్వు వొట్టి పిరికివాడివి. ఇక నీకు మనిషి అని చెప్పుకునే అధికారం కూడా లేదు. ఐనా యేమాత్రం బాధలుపెట్టేరో చెప్పు వింటాను! మాటకోసం, నిజాయితీకోసం ప్రాణాల నర్పించినవాళ్ళూ వున్నారు. విషాల్ని స్వయంగా తమ చేతుల్తో తాగిన వాళ్ళూ వున్నారు. జయిళ్ళలో కుళ్ళి కృశించినవాళ్ళూ వున్నారు. ఐనా

చెప్పు; నువ్వు యెల్లాంటి బాధలుపడ్డావో ? పోనీ, బహుమతి యేమిచ్చారో చెప్పు: అదీ తెలుస్తుంది. ఊఁ చెప్పు ! విని సంతోషిస్తాను !"

"ఇంక యేమీ ఇయ్యలేదు."

"నాకు చాలా సంతోషం ! నీకు అసలు ఏమీ యియ్యకుండావుంటే మరీ సంతోషిస్తాను. నీలాంటి వాళ్ళు పోలీసులకు యెంతో అవసరం. అందువల్ల ఏదో ఒక చిన్న నౌకరీ యివ్వకపోరు. నేను యిదివరకూ చెప్పేను. ఇప్పుడూ చెబుతున్నాను. నాకు నువ్వు లేవు, నీకు నేను లేను. వెళ్ళు సుఖపడు. ఆడదాన్ని, బలహీనురాల్ని-ఐనా నాచేత ఎవ్వరూ పాపం చేయించలేరు. నే నెవ్వరికీ లొంగను. ఏం, ఒక ఆడదానికున్న ధైర్యంకూడా నీలో లేదా ?"

రమానాధుడు అతిదీనంగా, "నేను చెప్పబోయేదాన్ని కొంచెం ఆలోచించు" అన్నాడు.

''లేదు, ఆలోచించ నక్కరలేదు."

''ఐతే వెళ్ళనా ?"

''లక్షణంగా !"

''పోనీ ! నన్ను క్షమించనయినా క్షమించవా ?"

''అలా యెన్నటికీ జరగదు."

రమానాధుడు ఒక్కక్షణం తలవొంచుకుని నిలబడి, తరువాత మెల్లిగా జగ్గోతో యిలా అన్నాడు :

''అమ్మా ! తాత వచ్చిం తరువాత, నన్ను కలుసుకోమని చెప్పు; యెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాను."

''రేపు యిక్కడికి వచ్చి కలుసుకో" జగ్గో కొంచెం మెత్తబడ్డది.

రమానాధుడు కారు యెక్కాడు.

''ఇక నేను యిక్కడికి రాను."

కారు వెళ్ళిపోయింది. జాలప మండిపడుతూ, "కారు కొన్నాడుగావును. తన వెలుగు చూపటానికి వచ్చాడు" అన్నది.

జగ్గో మందలిస్తూ "నీవు మరీ హద్దుమీరి మాట్లాడావమ్మా ! అట్లా, మనస్సు విరిగేట్టు మాట్లాడతారా ?" అన్నది.

''అంత అభిమానం కూడానా ?"

''ఐనా ఆలాంటి మాటలు అనవచ్చా ? ఎక్కడ చెయ్యి చేసుకుంటాడో నని భయపడ్డాను. నిజంగా ఇంకో మగవాడైతేనా ?"

ఇంతలో దేవీదీన్ వచ్చాడు.

''ఇక్కడి కతను వచ్చాడా ? నా క్కారులో కనిపించాడు."

''ఔను వచ్చాడు. నిన్నొకసారి కల్సుకోమన్నాడు."

"సరే కల్సుకుంటాను. ఏమైనా చెప్పాడా ?"

"చెప్పేదేముంది, మొదట నేను నాలుగూ వడ్డించాను.తరువాత అమ్మాయి వచ్చి కొసరు పూర్తిచేసింది."

"జాలప సంభాషణను మారుస్తూ"దినేశ్ అడ్రసు తెల్సిందా తాతా"అన్నది.

"తెల్సింది. హోబడాలో కాపురం. అడ్రసు పట్టుకొచ్చాను."

జాలప సంకోచంగా, "ఇప్పుడు వెళ్దామా ? లేక రేపా?" అన్నది.

"నీ యిష్టం. ఇప్పుడే వెళ్దామనుకుంటే బయల్దేను."

"అలిసిపోయావేమో ?"

"ఇలాంటి పనుల్లో అలుపు వుండదు....!"

తరువాత యిద్దరూ వెళ్ళారు.

# 44

రమానాధుడు కారు నడుపుకుంటూ వెళ్తున్నాడు. ఎటు వెళ్తున్నదీ, ఏ బజార్న వెళ్తున్నదీ అతనికి బొత్తిగా తెలియడంలేదు. తను రోజూ తిరిగే పరిచయమైన దారులన్నే మర్చిపోయాడు. అతని స్థితి అయోమయంగా వుంది. అతనికి జాలపమీద కోపంలేదు. జగ్గోమీద అంతకంటే లేదు. తన బలహీనతమీద వివశంగా మండిపడుతున్నాడు.

మొదట్లో రమానాధుడు తను చేస్తున్న ఈ పనివల్ల కలిగే అనర్థాన్ని వూహించలేదు. అసలు పోలీసులు మొదట్లో అతనికి స్థిమితంగా ఆలోచించే అవకాశాన్నే ఇయ్యలేదు. మొదటగా జాలపను కల్సుకున్నప్పుడు మాత్రం తను చేస్తున్న పనేమిటో, ఎంత ప్రమాదమైందో, దానివల్ల వచ్చే ఫలితాలేమిటో తెల్సుకున్నాడు. కానీ, పోలీసుల రకరకాలైన ప్రవర్తనలముందు తెల్సుకునికూడా ప్రయోజనం లేకపోయింది.

తను యే అభ్యంతరాన్ని చూపినా దాన్ని చిటికల్తో ఎగరగొట్టేసేవాళ్ళు.

'భార్యా! భార్యా దేముందండి? రెండు బంగారపు నగలూ, రెండు మంచి చీరెలూ గనక పట్టుకుపోయారా. కుక్కిన పేనల్లే వూరుకుంటుంది' అనేవాళ్ళు. తనుకూడా యథార్థమే ననుకునేవాడు. అలాంటి వుదాహరణలుకూడా చూపారు.

ఆ తరువాత మళ్ళీ జాలపను కల్సుకునే అవకాశం లభించలేదు. తీర్పు అయ్యాక, ఇదే భార్యను ప్రథమంగా కల్సుకోవడం. ఒక వజ్రాల హారాన్ని తీసుకుని పొంగిపోతూ వచ్చాడు. హారాన్ని చూడగానే జాలప సంతోషంతో మైమరచిపోతుందనీ, రెండుమూడు రోజుల తరువాత దేవీదీన్, జగ్గోలతోసహా ఇంటికి పోదామనీ అతని వుద్దేశ్యం! తను ఆశించినది జరక్కపోగా, తద్వ్యతిరేకంగా జరిగింది ఇక్కడ. జాలప, జగ్గోల ఈ తిరస్కారంవల్ల ఒకమేలుకూడా జరిగింది. రమానాధుడికి తను చేసినపనియొక్క యదార్థస్థితి ఇవ్వాళే తెలిసింది. పోలీసుల మధ్యనుంచి చాలా రోజుల తరువాత స్వతంత్రమైన వాయువుల్ని పీలుస్తున్న అతనికి అంధకారంలోనుంచి వెలుగులోకి వచ్చినట్టుగా వుంది.

జాలపకు అవుసరంలేని, జాలప సానుభూతి చూరగొనలేని ఈ ఉద్యోగం, డబ్బూ ఏం చేసుకోను? తగలేయనా? అన్యాయం చేసినా, అక్రమం చేసినా జీవితం సుఖంగా వుండాలనే! ఆ ప్రధానాశయానికే దెబ్బ తగిలినట్టయితే, ఇవన్నీ

చేసి ప్రయోజనం! జాలప హృదయంలోనుంచి చెరిగిన తన స్థానాన్ని మళ్ళీ కూడగట్టుకోవడం ఎలా?"

రమానాథుడు కారు ఆపాడు. కారులోనుంచి దిగి నాలుగువైపులా కలయ చూశాడు. తను బొత్తిగా పరిచయంలేని ఒక కొత్తస్థానంలో వున్నట్టు తెలుసుకున్నాడు. రోడ్డుకు ప్రక్కనే నిలబడివున్న పోలీసు నడిగి, జడ్జిగారి బంగళా ఎక్కడో తెల్సుకున్నాడు. విషయాన్నంతా చెప్పుకుందామనే వుద్దేశ్యంతో జడ్జి బంగళాకు బయలుదేరాడు. ఒకవేళ అతనుగనక న్యాయం చేయకపోతే, పత్రికల్లో ప్రకటిద్దామనుకున్నాడు.

జడ్జీగారి భవనం చౌరంగీలో వున్నది. రమానాథుడు కారుని మహా వేగంగా పోనిస్తున్నాడు. బజార్లు ఇంకా జనసమ్మర్దంగా వున్నై. రమానాథుడు కారు వేగాన్ని ఏమాత్రం తగ్గించడంలేదు. చివరకు ఒక పోలీసు ఎర్రలైటు చూపడంవల్ల కారాపి, తల బయటికిపెట్టి చూశాడు. ఆ పోలీసు మరెవరో కాదు; చిరపరిచితుడైన సార్జంటే!"

"ఏమండీ! ఇంతవరకూ బంగళాకు పోలేదా? అంత స్పీడ్‌గా కారు నడపకండి, ప్రమాదం సంభవించగలదు. ఐతే, మీ శ్రీమతిగారిదగ్గిరకు పోయి వస్తున్నారా? బాగా సంతోషపడి వుండాలి. ఔనా?"

రమానాథుడికి అతన్ని 'చంపుదామా' అన్నంత కోపం వచ్చింది. కోపాన్నంతా దిగమింగి, "అవును, సంతోషించింది!" అన్నాడు.

"నేను చెప్పలేదుటండీ. ఆడవాళ్ళ కోపానికి అదే మందు. మీరు వూరికే భయపడతారు!"

"ఔను, అది నా పొరపాటే!"

"పదండి నేనూ బంగళాదాకా వస్తాను. నాలుగుపట్లు పేకఆడితే కొంచెం వుత్సాహంగా వుంటుంది. ఇవ్వాళ జోహరా వస్తుందట. మంచి సందడిగా వుంటుంది. సరేగానీ, మీ రిక మీ శ్రీమతిగారినికూడా బంగళాలోకి తెచ్చుకోకూడదూ? ఆ కూరలదుకాణంలో వుండటం ఏం బాగుంటుంది?"

"నేను వేరే పనిమీద పోవాలి. కావాలంటే మీరు కారు తీసుకుపొండి. నేను నడచిపోతాను!"

సార్జంటు కారులోపలికి పోయి, "నా కంత తొందరపనులేమీ లేవు. మీ పనులు అయింతరువాత నిదానంగానే వెళతాను" అన్నాడు కూర్చుంటూ.

"నే నసలు ఇప్పుడప్పుడే బంగళాకు పోనయ్యా!"

"నాకు తెల్సలే....మీరు శ్రీమతిగారిదగ్గరకు....ఔనా? అయినా, ఫరవా లేదు. కాస్సేపు కూర్చుంటాను!"

"కాదు. నే నక్కడికి పోవడంలేదు."

"అయితే, కొత్త పిట్టేమైనా? దేనికండీ, బంగళాలోకూడా ఇవ్వాళ మంచి మజా వుంటుంది!"

రమానాథుడి కళ్ళు ఎఱ్ఱబడ్డయ్యి.

"ఏం? మీరు నన్ను తిరుగుబోతనుకుంటున్నారా? నే నంత నీచుడిని కాదులే!"

సార్జంటు సిగ్గుపడ్డాడు.

"సరే బాబూ, పొరపాటైంది. ఇక ఎన్నడూ మాట్లాడను. మీ రిప్పుడప్పుడే ఒంటరిగా బయటకిపోవడం ఏమంత మంచిదికాదు. మీకు ఎంతోమంది విరోధులు వుంటారు. నేను మీవెంట తప్పనిసరిగా వుండితీరాలి! ఇది మీ మంచి కోరే చెబుతున్నాను."

రమానాథుడు వివశంగా పెదాలు కొరుక్కొంటూ, "మీరు నా మంచి కోరకుండావుంటే ఎంతో బాగుండేది. మీ రింతవరకూ నా మంచి కోరే సర్వనాశనం చేశారు. అయినా విడిచిపెట్టనంటున్నారు. నన్ను మరీ పసిపిల్లవాడినిచేసి కాపలాలు కాయబోకండి. ఒంటరిగా వదిలిపెట్టండి. మీకు కారు కావల్నా? తీసుకోండి. నే నడిచేపోతాను. బంగళాలో వుండటానికీ, బస్సుల్లో తిరగడానికీ పదిహేనుమందిని హత్య చేయవల్సివచ్చింది. ఇక వుద్యోగంవస్తే పదిహేనువందల మందినే చేయాల్సివస్తుందేమో! స్వామీ! మీ కో నమస్కారం.... మీ కారు మీరు తీసుకొండి!" అన్నాడు.

రమానాథుడు, సార్జంటు కేకల్ని వినిపించుకోకుండా, రివరివా వెళ్ళిపోయాడు. చూస్తూండగానే సందుతిరిగి మాయమయ్యాడు. అతను పోయిన సందులోనే జడ్జిగారి బంగళా. నంబరుకోసరం ఒకమాటు ఈ చివరనుంచీ ఆ చివరకు తిరిగాడు. కనిపించింది. ఎవరైనా బయటికి వస్తారేమో, జడ్జి వున్నదీ, లేందీ తెల్సుకుందామని రెండు నిమిషాలు అక్కడ నిలబడ్డాడు. ఎవ్వరూ రాలేదు.

సమయం గడిచినకొద్దీ అతని పట్టుదల క్షీణించసాగింది. ఒకవేళ జడ్జి మొదటెందుకు తప్పుడుసాక్ష్యం ఇచ్చావంటే ఏం చెప్పేట్టు? వాళ్ళ దబాయింపులకూ, బెదరింపులకూ లొంగిపోయాననటం ఎంత నామర్దా? వెధవ రెండుమూడు సంవత్సరాల జైలుకు భయపడి, ఇంతమంది ప్రాణాలు తీయడానికి సిద్ధపడ్డావా అంటే ఏం సమాధానం చెప్పను?

ఇట్లా ఐదు నిమిషాలపాటు యోచించి, మెల్లిగా తలవంచుకుని వెళ్ళిపోయాడు రమానాథుడు.

# 45

ఆ రాత్రి రమానాధుడు నిద్రపోయేసరికి చాలా పొద్దుపోయింది. అందువల్ల మరునాడు ఉదయం తొమ్మిదిగంటలకు నిద్రలేచాడు. నిద్రలేవడానికి ఒక క్షణం క్రితం అత నొక కలకన్నాడు. ఆ కల్లో - దినేశుడిని వురికి తీసుకుపోతున్నట్టు, జాలప ఒక పెద్దకత్తిని పట్టుకువచ్చి వురిత్రాడును తెగకోసినట్టు, తరువాత ఆ కత్తితోనే తనమీదకు దూకినట్టు చూశాడు - వులిక్కిపడి లేచి కూర్చున్నాడు.

కళ్ళు తెరిచేసరికి సార్జంటూ, ఇన్‌స్పెక్టరూ ఎదురుగా నిలబడివున్నారు. కలెక్టరు కుర్చీలో కూర్చునివున్నాడు.

"ఇవ్వాళ చాలాసేపు నిద్రపొయ్యారు. రాత్రి ఎన్నిగంటలకు తిరిగివచ్చారేమిటి ?" అన్నాడు సార్జంటు.

రమానాధుడుకూడా కుర్చీమీద కూర్చుంటూ "మీ దగ్గిరనుంచి వెళ్ళిన కాసేపటికి వచ్చాను. అయితే, ఈ కేసు హైకోర్టుక్కూడా పోతుందా ?" అన్నాడు.

"ఇక అప్పీలూ లేదు; గిప్పీలూ లేదు. కేసుకు అసలు అప్పీలు చేసుకునే అవకాశమే లేకుండా చేశారు మీరు."

అంతవరకూ సిగార్ పొగ వదుల్తూ కూర్చున్న కలెక్టరు యిలా అన్నాడు : "ఇదిగో ఈ జి. ఓ. మీకు కమీషనర్ ఇచ్చాడు. ఇది యు. పి. రాష్ట్ర హోమ్ సెక్రటరీ పేరున వుంది. అక్కడికి వెళ్ళి మీరు దీన్ని చూపితే చాలు, వెంటనే వుద్యోగం యిస్తారు."

"నిజంగా చెబుతున్నాను....కమీషనరుగారు మహా సంతోషించారు లెండి" అన్నాడు సబిన్‌స్పెక్టరు.

"చాలా సంతోషపడ్డారు. వారు యు. పి. కి నేరుగాకూడా ఒక జాబు రాస్తున్నారు. ఇంతకూ మీ అదృష్టం పండింది !" అన్నాడు కలెక్టరు. తరువాత అతను జి. ఓ. ను రమానాధుడి చేతికి ఇచ్చాడు. రమానాధుడు దాన్ని అందుకుని కవరులోనుంచి తీసి ఒకమాటు చదివి, ముక్కలు ముక్కలుచేసి అవతల పారేశాడు. ముగ్గురు అధికార్లూ తెల్లబోయారు.

"రాత్రి బాగా తాగినట్టుంది ? ఇది మంచిదికాదు !" అన్నాడు సార్జంటు.

"నిజంగా చెబుతున్నాను. ఇట్లా చింపినట్లు తెలిస్తే మహా కోపగించుకుంటారు కమీషనర్‌గారు !" అన్నాడు సబినస్పెక్టరు.

"ఎందు కలా చింపావ్ ?" కలెక్టరు అడిగాడు.

"ఎందుకంటే, నా కీ జీ. ఓతో నిమిత్తం లేదు. నాకు వుద్యోగం వద్దు. నేను ఇవ్వాళే ఇక్కడినుండి వెళ్ళిపోతాను !"

"హైకోర్టు తీర్పుకూడా వెలువడేంతవరకూ నీ వెక్కడికీ పోవడానికి వీలులేదు."

"ఎందుచేత ?"

"కమీషనర్‌గారి ఆజ్ఞ."

"ఇదిగో, మిష్టర్ రమానాథ్! ఏమిటిది; వచ్చిందాన్ని చేతులారా పోగొట్టు కుంటున్నావు ? నిజం చెబుతున్నాను. జరిగిపోయిందేదో జరిగిపోయింది. వచ్చిన వుద్యోగాన్ని చేసుకుంటూ, మిగిలిన జీవితాన్ని ప్రశాంతంగా గడుపుకోవడం మీకు వుచితం ! ఎటూ పదిరోజుల్లో హైకోర్టు తీర్పు రానేవస్తుంది. ఈలోపు కాదని మూర్ఖించి ఎదురు తిరిగారా ? మీరే అనుభవిస్తారు ! కాకపోయినా మీరు దీన్ని పిల్లకాయల ఆట అనుకుంటున్నారు. ఒక్కమాటు కన్ను విప్పిచూశామా ? పది సంవత్సరాలు కృష్ణజన్మస్థానానికి పోతారు ! జైలంటే యేమనుకుంటున్నారో, నరకంకన్నా కనాకష్టం ! నిజం చెబుతున్నాను. నరకం జైలుకన్నా వెయ్యిరెట్లు నయం !" అన్నాడు సబిన్‌స్పెక్టరు.

"పాపం వీరు మంచివారేనండి. వీరి శ్రీమతిగారే .... ఈ పెటకం పెడు తున్నది. వారినిచూస్తే వీరికి భయం !" అన్నాడు సార్జంటు.

"అదేమిటండి, నిన్న హారాన్ని ఇచ్చారుగా ! ఇంకా రాజీ కుదర్లేదా !?" అడిగాడు. ఇన్‌స్పెక్టరు.

రమానాథుడు హారాన్ని జేబులోనుంచి తీసి టేబిల్‌మీద పెట్టాడు.

"అయితే, వారు స్వీకరించలేదన్నమాట ?" అడిగాడు ఇన్‌స్పెక్టరు.

కలెక్టరన్నాడు. "ప్రవుడ్ లేడీలా వుంది."

ఇన్‌స్పెక్టరు అన్నాడు "అయితే, వారినికూడా దారికి తేవాల్సుంటుంది."

"వీరు గనక సవ్యంగా మార్గానికి వస్తే వారిని దారికితెచ్చే పనేలేదు !" అన్నాడు సార్జంటు.

"ఆ కూరలమ్మేవా డున్నాడే ? వాడినికూడా కొంచెం దారికి తేవాలి...." అన్నాడు కలెక్టరు.

రమానాథుడు దీనితో పూర్తిగా పోలీసుల చేతుల్లో చిక్కుకుపోయాడు. తనవరకూ కావాలంటే త్యాగం చేయగలడు .... రెండు మూడు సంవత్సరాలు జైల్లో వుంటానికికూడా సిద్ధపడవచ్చు ! కానీ, జాలప నీ అగ్నిగుండంనుంచి

తప్పించడం ఎట్లా ? ఇది తన వక్కడితో, జాలపతో పోతుందని నమ్మకం యేమిటి ? జగ్గో.... దేవీదీన్ .... నాన్నా .... అమ్మా — వీళ్ళందరికీ చుట్టుకోదా ?

రమానాథుడు ఒక్కసారిగా నీళ్ళు కారిపోయాడు.

"ఇంతకూ నన్నేం చేయమంటారు ?"

"మీరేమీ చేయనవుసరం లేదు. హైకోర్టు తీర్పు బయటికి వచ్చేవరకూ ఇక్కడినుంచి బయటికి కదలకుండా వుంటేచాలు. ఇక్కడ మీకు కావల్సిన అన్ని సౌకర్యాలూ లభిస్తయ్యి. తీర్పు వచ్చినతరువాత మీ ఇష్టం వచ్చినచోటికి వెళ్ళండి, మాకేమీ అభ్యంతరం వుండదు. మీరు తెలివిగలవారై మేము ఇచ్చే యోగ్యతా పత్రాన్ని తీసుకుంటారా, జీవితాన్ని సుఖంగా గడుపుకుంటారు. లేదా, ఎదురు దెబ్బలు తింటూ వుంటారు. పైన అదంతా మీ ఇష్టం !" అన్నాడు ఇనస్పెక్టరు.

రమానాథుడు అతి దీనంగా, "పోనీ, షికారుకైనా పోనిస్తారా ? అదీ వీల్లేదంటారా ?" అన్నాడు.

"అనండి.... వెధ్ధురుగాని !"

"మీకు షికారు వెళ్ళడానికి ఒక అవకాశం ఇచ్చాము. కానీ, ఆ అవకాశాన్ని దుర్వినియోగం చేయరనే నమ్మకం మాకు కలిగేవరకూ, వెళ్ళడానికి వీలులేదు" అన్నాడు సార్జంటు.

ముగ్గురు ఆఫీసర్లూ ఒకళ్ళముఖాలు వొకళ్ళు విజయగర్వంతో చూసుకుంటూ వెళ్ళిపోయారు. రమానాథుడు సిగార్ ముట్టించి ఈ చిక్కు సమస్యను గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

# 46

ఒక నెల గడిచింది. కేసు హైకోర్టులో ఒప్పగించే తేదీకూడా నిర్ణయించ బడ్డది. రమానాథుడి స్వభావంలో వెనుకటి పిరికితనాలన్నీ తిరిగి యథాస్థానాన్ని చేరినయ్యి. ఈసారి వెనుకటికన్నా చాలా మారిపోయాడు. సారా మోతాదు పెరిగింది. జోహరా అనే వేశ్య అప్పుడప్పుడూ వచ్చిపోతూ వుంటుంది. ఆమె పాటంటే అతని కెంతో ఇష్టం!

ఒకరోజు నవ్వుతూ జోహరాతో ఇలా అన్నాడు రమానాథుడు:

"నాకు అప్పుడప్పుడూ నిన్నెక్కడ ప్రేమిస్తానోనని భయం వేస్తుంది. మీ వృత్తిలో ప్రేమకు స్థానంలేదు. ఆ తరువాత వేడినిట్టూర్పులే నాకు మిగుల్తయ్యి".

జోహరా మనస్సులో చాలా సంతోషించింది. తన విశాలమైన నేత్రాలను తిప్పుతూ, "ఔనులెండి మేము వేశ్యలమైతిమి మా దగ్గిర ప్రేమెలా లభిస్తుంది?"

"అబద్ధమా?"

"కాదు. అక్షరాలా నిజం! పాపం, మీరు ప్రేమతో తొణికిసలాడే హృదయాన్ని బరువుగా మోసుకువస్తారు మా దగ్గరకు. కానీ, తగిన ప్రతిఫలం లభించదు. ఔనా?"

"అంతేగా!"

"క్షమించండి, మీరు మొగవాళ్ళను వెనుకవేసుకు మాట్లాడుతున్నారు. మీరు మా దగ్గరకు వచ్చేది ప్రేమించడానికి కాదు. పొద్దుపుచ్చుకోడానికీ, లేకపోతే, శారీరకమైన సుఖాలను అనుభవించటానికీ, అవ్వెట్టూ లభిస్తూనే వుంటయ్యి. ఇక మీకసలు ప్రేమతో పనేలేకపోతే, అది ఎల్లా లభిస్తుంది? మాలో ఎంతోమంది అమాయకులు మీ మొగవాళ్ళ మాయలోపడి నాశనం అయిపోతున్నారు. ఈ మొగవాళ్ళ చేతుల్లో మోసపోయినవాళ్ళను మాలో ఎంతమంది కావాలంటే, అంతమందిని చూపిస్తాను! అసలు మిమ్మల్ని ప్రేమించడం మాది పొరపాటు. మీరేదో పొద్దుపోకకు గృహచ్ఛిద్రాలను మర్చిపోవడానికి మా దగ్గరకు వస్తారు. అలాంటి మిమ్మల్ని ప్రేమించడం మూర్ఖత్వం కాదా?"

ఆ రాత్రి వెళ్ళేప్పుడు ఈ సంతోష వార్తను సార్జంటుకు వినిపించింది జోహరా.

"ఈ రాత్రి బాగా మంత్రం చదివించాను. ఇక రెండు మూడు రోజుల్లో భార్య పేరుకూడా మర్చేపోతాడు."

"ఆ సమర్థత నీలో వున్నది గనుకనే నిన్ను పిలిపించాము. అసలామె ఈ వూరినించి వెళ్ళిపోయిందా, ఇక మనకు చింతేలేదు !" అన్నాడు సార్జంటు.

జోహరా రోజూ రాసాగింది. రోజు రోజుకూ రమానాథుడు అధికాధికంగా ఆమె ప్రేమపాశాల్లో చిక్కుకుంటున్నాడు. అతనికి అలా తను చిక్కుకోవడం ఒక అభిమానమైన సంగతిగా, గర్వించదగ్గ విషయంగా వుంది. జోహరా అతని కంటికి విశ్వసనీయంగా, ప్రేమమూర్తిగా కనుపిస్తున్నది. ఆమెలో జాలపలోని సౌందర్యం కనిపించకపోయినా, అంతకుమించిన మాటల చాతుర్యం వుంది.

ఒకరోజు రమానాథుడు జోహరాతో ఇలా అన్నాడు : "జోహరా, మనం విడిపోవాల్సిన టైం దగ్గిరకొచ్చింది. నాలుగైదు రోజుల్లో నే నిక్కడనుంచి వెళ్ళి పోతాను. తరువాత నన్నెప్పుడైనా జ్ఞాపకం చేసుకుంటావా ?"

"మిమ్మల్ని అసలు ఇక్కడనుంచి పోనీయను. ఇక్కడే ఒక నౌకరీ చూసుకోండి....మీరూ, నేనూ హాయిగా వుండవచ్చు !"

"జోహరా, నువ్వు మనస్ఫూర్తిగా అంటున్నావా ? తరువాత మాట తప్పు కోవుకదా ? నాతోడూ ?"

"మీ కంత నమ్మకం లేకపోతే నిఖా కట్టుకోండి. పోనీ మాపద్ధతి మీకు పనికిరాకపోతే, మీ పండితుల్ని పిలిపించి మంత్రాలతో పెండ్లి చేయించండి .... ఇంతకన్నా ఇంకేం చెప్పనూ ?"

ఈ మాటతో రమానాథుడు పొంగిపొయ్యాడు. అతని చెవుల్లో ఎవరో అమృతాన్ని గుమ్మరించినట్టయింది. ఒకసారి జాలపని జోహరాతో పోల్చుకు చూసుకున్నాడు. జాలపతో జీవితం రసరహితంగా వుంటుంది. అంతులేని కర్తవ్య పథంగా వుంటుంది. ఇంకా వివరంగా చెప్పాలంటే. అమావాస్యరాత్రిలా దారీ తెన్నూ, వెలుగూ లేకుండా తయారౌతుంది. జోహరాతో మాత్రం అలా కాదు. జీవితం వుజ్వలంగా వెలుగుతుంది. ఇహలోకపు సర్వసుఖాలూ, ఆనందాలూ అర చేతుల్లోకి వస్తాయి. యోగిలా సాత్వికగుణాలను వర్ధించడం తన జీవితలక్ష్యం కానేకాదు ! తను రసికుడు. జోహరా రసికురాలు. ఇద్దరూ కలిస్తే జీవితం రస మయం అవుతుంది.

మెల్లగా అతని హృదయంలో జోహరామీద అనురక్తి కలగసాగింది. వేశ్యల్లోవున్న విశ్వాసపాత్రు లెందరో అతనికి రోజూ జ్ఞాపకానికి వచ్చేవాళ్ళు. అలాగే సంసార స్త్రీలల్లోవున్న విశ్వాసఘాతకురాళ్ళుకూడా జ్ఞాపకానికి వచ్చే వాళ్ళు. ఈ విధంగా అనేక ఉదాహరణలలో జోహరాను తను ఆశించడం వుచి తమే అని హృదయానికి నచ్చచెప్పుకునేవాడు.

# 47

జోహరామీద, రమానాథుడికి ప్రేమ ఎక్కువ అవుతున్నకొద్దీ, పోలీసులకు అతనిమీదవున్న భయం పోతూవచ్చింది. క్రమేణా అతనిమీదవున్న ప్రతిబంధం సడలింది. ఒకరోజు కలెక్టరుగారు షికారుకుపోతూ తన కార్లో అతన్ని కూడా తీసుకుపోయారు. మళ్ళీ అతను బయటి ప్రపంచాన్ని చూడటం అదే ప్రథమం! కారు దేవీదీన్ కొట్టుమీదుగానే వెళ్ళింది. అక్కడికి వచ్చేసరికి రమానాథుడు సిగ్గుపడి, ఎవరైనా చూస్తారేమోనన్నట్టు తల లోపలికి పెట్టుకున్నాడు.

కొంతసేపు షికారుచేసిన తరువాత కారు హౌడా బ్రిడ్జీదగ్గిరకు చేరింది. అక్కడ రమానాథుడు ఒక స్త్రీని చూశాడు. ఆమె బిందె నెత్తిన పెట్టుకుని నీళ్ళు మోసుకుపోతున్నది. మనిషి చాలా బలహీనంగా వుంది. బట్టలు మాసివున్నై. బిందెబరువును మోయలేక పడిపోతుందా అనేట్టున్నది చూడటానికి.

ఆమె నడక జాలప నడకను పోలివున్నది. 'జాలప ఇక్కడికి యెలా వచ్చిందా ?' అని ఆలోచించాడు రమానాథుడు. ఒక్కక్షణం తరువాత కారు ఆమెకు బాగా దగ్గిరకు పోయింది. ముఖం స్పష్టంగా కనుపించింది. రమానాథుడికి గుండెలమీద ఎవరో బలంకొద్దీ కొట్టినట్టయింది. జాలపే! శరీరం శుష్కించి గుర్తించడానికి వీలులేకండా మారిపోయింది. వెనకటి కాంతి, నిగారింపు – అన్నీ మాయమైపోయినయ్యి. ఈ స్థితికి ఎందుకు వచ్చిందా ? అని చాలాసేపు యోచించాడు. ఒకవేళ దేవీదీన్ వెళ్ళగొట్టాడేమో ? అందువల్ల నీళ్ళు మోసుకు బ్రతుకుతున్నది గావును అనుకున్నాడు. దేవీదీన్ అలా చేయడని తనకు తనే సమాధానం చెప్పుకున్నాడు. ఒకవేళ జాలపే అక్కడ వుండకుండా ఇలా వచ్చివుంటుంది అనుకున్నాడు. అతని కళ్ళు అశ్రుపూరితాలైనయ్.

కారు చాలా దూరం పోయింది. రమానాథుడి మనస్సు పూర్తిగా వికలం అయింది. నీలి ఆకాశంలో స్వేచ్ఛగా విహరించే అతను, ఒక్కమాటుగా పాతాళంలో పడిపోయాడు. శుష్కించిన జాలప ఆకారం అతని కండ్లముందునుంచీ తొలగనంటోంది. జాలపను గురించిన వివరాల నతడు ఎలా తెల్సుకోవడం ? అసలు ఆ ఆలోచనకే స్థానంలేని విషమ పరిస్థితిలో వున్నాడు!

కొద్దిసేపటి తరువాత కారు బంగళాకు చేరుకున్నది.

జోహరా మామూలుగా అలంకరించుకుని కులుకుతూ, ఒయ్యారాన్ని వొలుకబోసుకుంటూ వచ్చింది. రమానాథుడు అన్యమనస్కంగానే వున్నాడు.

"ఏం అలావున్నారు? ఇంటిదగ్గరవాళ్ళు ఎవరైనా జ్ఞాపకంవస్తున్నారా?" అడిగింది జోహరా.

జోహరా, రమానాధుడికి బాగా దగ్గరకు వచ్చింది. మృదువుగా, కోమలంగా వున్న తన చేతుల్ని అతని మెడచుట్టూ పెనవేసింది. అతను అలసిపోయినవాడిలా ఆమె గుండెల్లో ముఖం దాచుకున్నాడు.

"నిజం చెప్పు, ఎందు కిలా విచారంగా వున్నావు? నామీద కోపం వచ్చిందా?"

"నీమీదనా, కోపం? లేదు జోహరా, నీవు నామీద ఎంతో దయచూపావు. నీ రుణం ఏవిధంగానూ తీర్చుకోలేను. అతిదారుణమైన పరిస్థితుల్లో నీవు నా జీవితంలో ప్రవేశించావు. నిజం చెపుతున్నాను; నువ్వే లేకపోతే, నేను పిచ్చివాడినై పోయేవాడిని!"

ఒక్క-క్షణం ఆగి దీర్ఘంగా నిట్టూర్చి, "ఇవ్వాళ జాలపను చూచాను. చినిగిన బట్టలు కట్టుకున్నది. బాగా చిక్కిపోయింది. నీళ్ళు మోస్తున్నది! నా మనస్సు ఇంతగా యెన్నడూ బాధపడలేదు?"

"మరి ఆ కూరలమ్మే ముసలివాడి యింట్లో వుందిగా?"

"అవును; వుంది. కానీ, నీళ్ళెందుకు మోస్తున్నదో తెలియడంలేదు. పక్కనే కలెక్టరుగారు వున్నారు. వారు లేకపోతే, కారు ఆపి, పలకరించేవాడిని. కనీసం ఏ బాధలుపడుతున్నదో తెల్సుకోనైనా తెల్సుకునేవాడిని! జోహరా! నీవు నన్ను ఏవిధంగా చూస్తున్నావో, నాకైతే తెలియదు. నేనుమాత్రం నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రేమించేవారినుండి సానుభూతిని కోరడం సహజమేకదా? ఇక్కడ మనస్సులో మాట చెప్పుకోడానికి నీవు తప్ప నా కింకెవ్వరున్నారు? నా బాధల్ని ఎవరికి చెప్పుకోను? ఇక్కడ, ఈ దెయ్యాల కొంపలో ఎవరు వింటారు? జాలప ఎక్కడ వుంటున్నదో, ఏం చేస్తున్నదో, నీవల్లనే తెలియాలి! నువ్వు ఒక్క సహాయం చేయి. జాలపని ఇలా - నీళ్ళు మోసుకునే స్థితిలో నేను చూడలేను. ప్రయాగ పోవడానికి ఇష్టపరుచు. పోనీ వెళ్ళడానికి ఏమైనా అభ్యంతరాలు వున్నాయేమో! అవైనా కనుక్కో. ఆడదాన్ని, ఆడదే అర్థం చేసుకోగలదు. నీవు పోయి అడిగితే జాలప తప్పకుండా చెబుతుంది. ఎవ్వరూ అనుమానించరుకూడాను."

జోహరా వేశ్య. రకరకాలైన వ్యక్తుల్ని తను చూసింది, మొదట ఇక్కడికికూడా డబ్బుకోసరమనే వచ్చింది. వచ్చిన రెండు మూడు రోజులకే, ఆమె మనస్సు రమానాధుడిమీద లగ్నమైంది. రమానాధుడిలో ఎన్ని లోపాలువున్నా, వాటన్నింటినీ మించి నిష్కపటంగా అనురాగాన్ని చూపే సహజమైన హృదయం కూడా వుంది, ఈ లక్షణమే జోహరాను ఎంతగానో ఆకర్షించింది. ఇంతవరకూ

ఆమెకు పరిచయం అయిన పురుషుల్లో, ఏ దాపరికమూ లేకుండా హృదయాన్ని విప్పి ముందు పెట్టిన ప్రథముడు రమానాధుడే.

జాలప ప్రస్తావనతో, జోహరాలో సహజంగా కలగవలసిన ఈర్ష్య కలగకపోగా, ఈవిధంగా రమానాధుని మెప్పించి, తన ప్రభావాన్ని అతనిమీద ఇంకా ఎక్కువగా వేయవచ్చు ననుకున్నది.

ధైర్యాన్నిస్తూ ఇలా అన్నది :

"ఈ మాత్రానికే ఇంత ఇదవుతా రెందుకు? రేపీపాటికి జాలపను కల్సుకుని, ఇక్కడ వుండటానికి ఇష్టపడితే తగిన యేర్పాట్లు చేస్తాను. లేదా, ప్రయాగకు పంపిస్తాను."

రమానాధుడు చాలా జాలిగా అన్నాడు : "నే నొక్కసారి దాన్ని కల్సుకోగలిగితే, కొంత హృదయబాధ తగ్గుతుంది."

"చాలా కష్టం! నిన్ను ఇక్కడినుండి కదలనీయరు."

"నువ్వే ఏమైనా వుపాయా న్నాలోచించాలి!"

జోహరా రెండు క్షణాలు యోచించింది. "నేను ఆమెను పార్కులో వుంచుతాను. నీవు కలెక్టరుగారితో పార్కుకు వెళ్ళు....తరువాత ఏదోవిధంగా వీలుచేసుకుని మాట్లాడు....అంతే! ఇక వేరే వుపాయం లేదు."

రమానాధుడు ఏదో అనబోతూవుండగా, బయటనుంచి సార్జంటు గొంతు వినిపించింది.

"నేనుకూడా లోపలికి రావచ్చునా?" సార్జంటు అరచాడు, బయటినుంచి.

జోహరా, రమానాధుడూ - ఇద్దరూ స్థిమితపడి తలుపు తెరిచారు.

"ఇవ్వాళేం? ఇంత నిశ్శబ్దంగావుంది? ఇదిగో, జోహరా, నీ బంగారు చేతుల్తో ఒక పెగ్గు ఈ గొంతులో పోశావా, జన్మ తరించిపోతుంది! రమానాధుగారూ! ఇందుకు మీరేమీ అనుకోకూడదు!"

రమానాధుడు కొంచెం అయిష్టంగా, "మీ సరసాల్ని కట్టిపెట్టండి. అసలే తాగినట్టున్నారు!" అన్నాడు.

సార్జంటు, జోహరా చేయిపట్టుకుని, "ఒక్క పెగ్గు; ఇంకేమీ అడగను, మర్చేపోయాను, ఇవ్వాళ మా ఇంటిదాకా రా! అంతే....ఇంకేమీ అడగను!" అన్నాడు.

రమానాధుడు కోపంగా, "సార్జంటుగారూ! నే నిక సహించను. మీరు పొండిక్కడినుంచి" అరిచాడు.

సార్జంటు మూతపడే కళ్ళతో చూస్తూ, "ఏం, మీరు గుత్తకు తీసుకున్నారా?" అన్నాడు.

"అవును.........!"

"అయితే, ఈ ఒక్కరోజుకూ వుపసంహరించుకోండి."

"మీరు వెళ్ళండి!"

"సరే, అయితే, మీరూ నిగ్గుతేలారన్నమాట! ఇదిగో! జోహరా, ఇతనితో మనకెందుకూ, మనం పోదాం పద" అంటూ జోహరా చేయిపుచ్చుకుని, సార్జంటు పైకి లేవదీశాడు.

రమానాధుడి కోపం ముదిరింది. సార్జంటు పట్టునుంచి జోహరా చేతిని విడదీసి, "మీకు మర్యాదగా చెబుతున్నాను, వెళ్ళండి! జోహరా రాదు. నా మాట వినకుండా మీ వెంట వచ్చిందా? దాని రక్తం, మీ రక్తంకూడా కళ్ళ చూస్తాను!" అన్నాడు.

తరువాత సార్జంటును బలవంతాన బయటికి నెట్టి, తలుపు లోపల్నించి గడియవేసుకున్నాడు. సార్జంటు చేసేదిలేక బయట నిలబడి, నోటికి వచ్చినట్టు తిట్టడం ప్రారంభించాడు.

రమానాధుడు జోహరాతో అన్నాడు :

"నువ్వు కొంచెం 'ఊఁ' అంటే చాలు; పందిముండాకొడుకుని మురుగ్గుంటలో పొర్లించివస్తాను!"

"పోనిద్దురూ, వాడే పోతాడు!"

"ఆఁ వెళ్ళినట్టున్నాడు."

"నువ్వు చాలా మంచిపని చేశావు, లేకపోతే, రాత్రంతా నన్ను బాధించేవాడు! మరి నీవు వాడిని కొట్టగలవా?"

"నా కేదో పిచ్చి ఆవేశం వచ్చింది. ఆ సమయంలో ప్రాణాలుకూడా తీసేవాడిని....మామూలు సమయంలో అయితే, అతన్ని నేను బయటికి నెట్టలేను."

"అది పోనీ, నన్ను వాడిక ఇక్కడికి రానీయకపోతే?"

"వాడా? కాల్చేస్తాను. అదుగో, పైన పిస్తోలు. దాంతో ఒక్కదెబ్బకు సఫాచేస్తాను. ఇక నీవు నాదానివి జోహరా; మనిద్దరినీ ఎవ్వరూ వేరుపరచలేరు. ఒకవేళ ఎవరైనా అలా మూర్ఖానికి తలపడితే, వాళ్ళో, నేనో ఈ ప్రపంచంలో లేకుండాపోవడం జరుగుతుంది. నా సర్వస్వం పోగొట్టుకుని, నిన్ను సంపాయించుకున్నాను. అందువల్ల నేను నిన్నింకెవ్వరికీ పోనీయను."

జోహరా కళ్ళు ఆనందంతో మెరిసినయ్యి. రమానాధుడి మెడచుట్టూ చేతులు వేసి, "ఏం మాటలండీ అవి!" అన్నది.

# 48

మర్నాడంతా రమానాధుడు చాలా వుద్రేకంగా గడిపాడు. రకరకాలైన ఆలోచనలు అతని బుర్రను అలుముకున్నై. కాసేపు విపరీతం అయిన నిరాశలో మునిగిపోయేవాడు. మళ్ళీ అంతలోకే సంతోషంతో వికసించేవాడు.

జోహరా నిజంగా వెళ్తుందా ? వెళ్ళినా, నాతో అక్కడస్థితి వున్నదున్నట్లు చెబుతుందా ? అసలు జోహరా ప్రవర్తన యధార్ధమేనా ? తన విషయాల్ని అధికార్లకు తెలియజేయడానికి ఇలా నాటకం ఆడుతున్నదేమో ? అనవసరంగా జాలపని ఇంకా బాధల్లోకి నెట్టినవాడినయ్యానే ? అయినా, జోహరా, అంత అన్యాయం చేస్తుందా? అన్యాయంచేసే స్వభావంవుంటే మొదట్లోనే తెలిసేది !

కాసేపు, మొదట్లోనే జాలప మాట విని, సాక్ష్యాన్ని మార్చుకుంటే ఈ బాధలూ, బెదరింపులూ, వ్యసనాలూ, వియోగాలూ ఏవీ వుండేవి కాదుగదా ! అనుకునేవాడు. జాలపలాంటి ఉన్నతాత్మను దూరంచేసుకున్న తరువాత, స్వర్గంకూడా నరకంగానే వుంటుంది. ఛీ....ఛీ....ఏం జీవితం ! అనుకునేవాడు.

ఇవ్వాళ అతను జాలపనూ, జోహరానూ చెరోవేపున పెట్టి చూచాడు. ఇద్దరూ తన జీవితానికి సమానంగా అవసరమైనట్టు కనిపించింది. అటు జాలపనీ వదలడం సంభవం కాదు. ఇటు జోహరానీ వదలడం సంభవం కాదు. కానీ, ఇద్దరినీ సంతోషంగా స్పర్ధలూ, కీచులాటలూ లేకుండా సమర్ధించుకు రాగలడా తను ? తను ఇలా వేశ్యసాంగత్యం చేయడం జాలప సహిస్తుందా ? సహించదు. ఈ సాంగత్యం తన మంచికే ఎక్కువగా వుపయోగపడినా జాలప సహించదు ! ఏ స్వల్పమైన స్వార్థంకోసమో, సుఖంకోసమో ఆత్మను అపవిత్రం చేసుకోవడానికి జాలప ఇష్టపడదు !

అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. భోజనంవేళకూడా దాటిపోయింది. అయినా జోహరా రాలేదు. ఆమెకోసం రమానాధుడు విపరీతమైన ఆకాంక్షతో ఎదురు చూస్తున్నాడు. సార్జంటుకూడా ఇవ్వాళ రాలేదు. పాపం రాత్రి సంఘటన వల్ల సిగ్గుపడిపోయాడేమో !

సామాన్యంగా దుర్బలమైన మనస్థితికలవాళ్ళు,ఏకాంతంలో తమ ఈ మనోదౌర్బల్యానికి చింతిస్తూ వుంటారు. రమానాధుడుకూడా తన మానసికమైన దౌర్బల్యానికి ఏకాంతంలో చింతిస్తూ వుంటాడు. మానసికంగా అతను ఎంత అనారోగ్యవంతుడైనా, మంచిచెడ్డల్ని నిర్ణయించుకొనేమాత్రపు స్వచ్ఛత ఇంకా

అతనిలో మిగిలివున్నది. ఆ స్వచ్ఛతనూ, వివేకాన్ని-సారాసీసాలూ, జోహరా, సార్జంటు-వీళ్ళంతా కల్సి అతనిలో ఒక్కక్షణంకూడా నిలవనీయడంలేదు.

రాత్రి పదిగంటలైంది. జోహరా ఆరోజుకు ఇకరాదని తీర్మానించుకున్నాడు. అయినా ఆశ కొట్టుకులాడుతున్నది ఇంకా!

నిరీక్షిస్తూ బాధగా ఇంకో అరగంట గడిపాడు. అతనికి తెలియకండానే కళ్ళు మూతలుపడ్డయ్యి. కళ్ళు తెరిచేసరికి తెల్లవారింది. మళ్ళీ తనూ తన ఆలోచలూ.... యథాస్థితికి వచ్చినయ్యి. జోహరాయింటికి ఎవరినైనా పంపితే బాగుండుననుకుంటున్నాడు.

సార్జంటు దగ్గిరకుపోయి ఇలా అన్నాడు :

"రాత్రి మీరు బాగా పట్టించినట్టున్నారు ?"

సార్జంటు ద్వేషాన్ని కప్పిపుచ్చుకుంటూ, "అబ్బే.... అదేం కాదు........ వూరికే మిమ్మల్ని గమ్మత్తుచేద్దామని....!" అన్నాడు.

"రాత్రి జోహరా రాలేదు. కోపం వచ్చిందేమో! ఎవరినైనా పంపించి విషయం ఏమిటో కనుక్కోండి."

"డబ్బు అవుసరం అయితే, అదేవస్తుంది! దానికోసం ఇంకోళ్ళని పంపడ మెందుకూ ?" సార్జంటు నిర్లక్ష్యంగా అన్నాడు.

సార్జంటు కోపంలో వున్నట్టు తేలిపోయింది. రమానాధు డింకేమీ మాట్లాడలేదు. ఇంకెవరిదగ్గిరకైనా పోయి జోహరావిషయం అడుగుదామంటే సిగ్గుగావుంది.

ఈవిధంగా వారంరోజులు గడిచినయ్యి. జోహరా రాలేదు. జోహరా రానందుకుకాదు, తన మనస్సులో విషయం ఆమెకు చెప్పానే అని ఎక్కువగా బాధపడసాగా డతను! ఇక రాదనే నిశ్చయించుకున్నాడు. కుంకుడుకాయల్లో తీపి వెదకినట్లయిం దతని పని!

వేశ్యని విశ్వసించి, ఎంత పొరబడ్డాను!.... ఒకవేళ అధికార్లు రానీయడం లేదేమో ? నిజంగా అధికార్లే రానీయకపోతే, ఒక ఉత్తరం ముక్క రాసి ఆ విషయాన్ని తెలియచేయనచ్చుగా!.... అసలు ఇల్లా నటించమని, నా కూపీ తీయడానికి అధికార్లే చెప్పారేమో ? నిజంగా అధికార్లే అలాచెప్పి, జోహరా నటనచేసి నా మనోభావాల్ని తెల్సుకున్నట్టయితే, ఇక జరగనున్న అనర్థాలను వూహించడం కష్టం! ఈ దుర్మార్గులు (అధికారులు) జాలపను నానాబాధలూ పెడతారు. అయినా జోహరా అలా చేస్తుందా ? ఎన్నటికీ చేయదు.

జోహరా మాటలూ, నిమీలితంగా ప్రేమగా చూసే చూపులూ జ్ఞాపకం వచ్చినయ్యి. అబ్బే....అలా చేయదు. ఆ చూపుల్లో, మాటల్లో ప్రేమతప్ప ఏ కృత్రిమమూ లేదు. రాకపోవడానికి ఏదో కారణం వుండి వుంటుంది.

చివరకు ఏదోరోజుకూడా గడిచిపోతున్నది. రాత్రి ఎనిమిది గంట లౌతుంది. ఏదో మంచి పిక్చర్ ఆడుతున్నదని సార్జంటు చెప్పడంవల్ల రమా నాధుడు అతనితో సినిమాకు వెళ్ళడానికి సిద్ధం అయ్యాడు. బట్టలు మార్చుకుని తల దువ్వుకోడానికి అద్దంముందు నిలబడ్డాడు. ఇంతలో జోహరా వచ్చింది. అతను ఒకమాటు వెనక్కి తిరిగి ఆమెవంక చూసి, చూడనట్టుగా తన పనిలో నిమగ్నమయ్యాడు. అతను పైకయితే ఏమీ మాట్లాడలేదుగాని, విచిత్రంగా మారి వున్న జోహరా వేషానికి లోలోన ఆశ్చర్యపడ్డాడు. నగలూ, అలంకారాలూ అన్నీ తీసివేసి అతి సాధారణంగా వచ్చింది. చెంచలంగాను, క్రీడాసక్తంగానూ వుండే ఆమె ముఖం గంభీరంగా వుంది. ఈ విధంగా ఆమెను చూడటం అతని కిదే ప్రధమం!

రెండు క్షణాల తరువాత దగ్గిరకువచ్చి, "ఏం నామీద కోపం వచ్చిందా ఇంతలోకే? ఏమీ తెల్సుకోకుండానే?" అన్నది జోహరా.

అప్పటికీ రమానాధుడు మాట్లాడలేదు. చెప్పులు తొడుక్కుంటున్నాడు. జోహరా దగ్గిరకుపోయి చేయిపట్టుకుని "ఈ కోపం నామీదేనా? ఇన్నాళ్ళనుంచీ రాలేదనేనా?" అన్నది.

"నా కెందుకూ, కోపం? ఏదో దయకలిగింది వచ్చావు. రాకపోతే మాత్రం నేను చేయగలిగింది ఏమున్నది?"

జోహరా నవ్వుతూ "మీ ఆజ్ఞను అనుసరించినా కోపమే? మీరేగా ఒక పనికి పురమాయించింది? మరి దాన్ని చేసుకు వచ్చేలోపు కోపం ఎందుకు వచ్చి నట్టు?" ఒక్క క్షణం ఆగి "జాలప అసాధ్యురాలు. పైకి మెత్తగా వున్నట్టు కనుపించినా, లోపల పాషాణంకంటే కఠినం! ఆమెదగ్గిరనుంచీ మాట తీసుకునే సరికి యిన్నాళ్ళు పట్టింది!" అన్నది.

ఇంకా కొంత అన్యమనస్కంతోనే ప్రశ్నించాడు రమానాధుడు "ఎక్కడ వుంటున్నది? ఏం చేస్తున్నది?"

"ఉరిశిక్ష పడ్డదే దినేశ్....ఆ ఇంటిదగ్గిరే వుంటున్నది! పాపం అతనికి ఇద్దరు పిల్లలూ, భార్యా, తల్లీ వున్నారు. వీళ్ళు అతని సంపాదనమీద బ్రతుకు తుండేవారు. అతను పోయాక వాళ్ళపని దుర్భరం అయింది. ఎవ్వరూ ఆదరించే వాళ్ళులేరు. ఒకరిద్దరు పరిచయులువున్నా, ఇలాంటి సమయంలో ఆదుకుంటారా? చివరకు చావసిద్ధమైన వాళ్ళను జాలప బ్రతికించింది. వాళ్ళకోసం పెద్ద పెద్ద వాళ్ళ దగ్గిరకుపోయి చందాలు తెస్తుంది. పిల్లల్ని ఆడిస్తుంది. నీళ్ళు మోస్తుంది!"

రమానాధుడి అన్యమనస్కత అంతా ఆవిరిలా ఎగిరిపోయింది. గబగబా చెప్పులు విప్పి కుర్చీలో కూర్చున్నాడు.

"నిల్చునే వున్నావేం? కూర్చో. అసలు మొదట్నుంచీ ఎలా వెళ్ళావో, ఏమిటో, సవిస్తరంగా చెప్పు!"

"మొదట్లో ఆ కూరలు అమ్ముకునేవాడి ఇంటికి పోయాను. అతను దినేశ్ ఇంటి అడ్రసు ఇచ్చాడు. అక్కడికి పోయాను!"

"వెళ్ళి ఏమని పిల్చావు? నిన్ను చూసి ఆశ్చర్యపడ్డదా?"

"నేను, మామూలు వేషంతో పోలేదు. దేవీదీన్ దగ్గిర అడ్రసు తెచ్చుకుని అక్కడినించీ ఇంటికిపోయి, బ్రహ్మసమాజపు లేడీలా డ్రస్ చేసుకున్నాను కానీ, ఎంత నేను బ్రహ్మసమాజికురాల్లా వేషాన్ని మార్చుకున్నా, అసలు స్థితిని దాయడం కష్టమే అయింది. నేనుకూడా వాళ్ళలాగానే అతి సాధారణమైన వస్త్రాభరణాలను ధరించాను. పళ్ళకుపట్టిన తమలపాకుల గార పోయ్యేటట్టు శుభ్రంగా తోముకున్నాను. నన్ను చూడగానే జాలప ఏ విద్యార్థినో లేక ఉపాధ్యాయినో అనుకోవాలని నా వుద్దేశ్యం! నేను ఎంత ఇదిగా తయారైనా బజార్న నడిచే ప్రతివాడి కళ్ళూ నామీదనే, నే నేమో తినే మిఠాయినైనట్టు?

సరే, ఈ విధంగా తయారై సానుభూతి చూపడానికన్న వంకతో దినేశ్ ఇంటికి పోయాను. వెంట పిల్లలకు మిఠాయీలూ, ఆటబొమ్మలుకూడా పట్టుకు పోయాను. నేను యూనివర్శిటీలో చదువుతున్నాననీ, ముంగిర్‌లో ఇల్లనీ చెప్పాను. పాపం అతని తల్లీ, భార్యా భోరున ఏడ్చారు. నేను పోయేప్పటికి జాలప లేదు. కొంతసేపటికి నీళ్ళబిందెను మోసుకువచ్చింది. నేను దినేశ్ తల్లిని వంగభాషలో 'ఈమె పనిమనిషా?' అనడిగాను. పనిమనిషి కాదనీ, సాయంచేయడానికి వచ్చిన అపరిచితురాలనీ........అనేక రకాలుగా - పిల్లల్ని ఆడించడం దగ్గరనుంచీ, చందాలు తేవడం, నీళ్ళు తేవడంవరకూ - సాయం చేస్తున్నదనీ అతని తల్లి చెప్పింది.

నేను ఇచ్చిన మిఠాయీలు పిల్లలకు పెట్టారు. వాళ్ళు మిఠాయీలు తింటూ ఎంతో అమాయకంగా ఆడుకుంటున్నారు. వాళ్ళ స్థితిని చూసి నా కడుపు చెరువై పోయింది.

ఆ పిల్లల్ని ఎదురుగావున్న పార్కులోకి తీసుకుపోయాము....అక్కడే నేనూ, జాలప కాసేపు మాట్లాడుకున్నాము.

రమానాథుడు కుర్చీని కొంచెం ముందుకు జరుపుకుంటూ "అసలెలా సంభాషణ ప్రారంభించావో చెప్పు" అన్నాడు.

"చెబుతూనే వున్నానుగా? పోతూనే, ఏమండీ, మీరు మహానిస్వార్థంగా త్యాగంచేస్తున్నారుట. అందువల్ల మీతో పరిచయం చేసుకుందా మనుకుంటు న్నాను. మీ నివాసస్థానం ఎక్కడండి?" అనడిగాను.

"అయితే మొదటగా ఇదే అడిగావన్నమాట?"

"చక్కని హిందూస్థానిలో మాట్లాడుతూండటంవల్ల జాలపకు ఆశ్చర్యం కలిగింది. నేను వంగయువతిని కానేమోననికూడా అనుకున్నది. ముంగీర్‌లో ముస్లిముల ఇళ్ళప్రక్కన వుంటున్నాననీ, అందుచేత హిందూస్థానీ చక్కగా మాట్లాడగలుగుతున్నాననీ చెప్పాను — తరవాత మీ నివాసస్థానం చెప్పండి: మిమ్మల్ని అప్పుడప్పుడూ కలుసుకుంటూ వుంటానని అడిగాను. ఈ మాటలకు జాలప నవ్వింది."

"కాలేజీల్లో చదువుకునే మీకు మాతో ఏమిటిపని? అయినా, ఇక్కడకి వస్తే కనుపిస్తాను" అన్నది.

"మీవారు చాలా మంచివారులా వుంది. కాబట్టే ఇంత స్వాతంత్ర్యాన్ని ఇచ్చారు....వారికి ఏదైనా ఆఫీసులో పనా?" అనడిగాను.

"పోలీసుల్లో పని."

"అయితే, ఇక్కడికి రానిచ్చారా?"

"వారు నన్నేమీ అనరు. అసలు ఇంటికి అంతగా రారు. అదీగాక నేను ఇక్కడికి వచ్చే విషయం వారికి తెలియదు" అన్నది జాలప.

నేను కొంచెం గమ్మత్తు చేద్దామని యిలా అన్నాను:

"అయితే, మీరు నాకు ఒక సాయం చేయాలి, మీ భర్తగారితో చెప్పి.... ఆ తప్పుడు సాక్ష్యం ఇచ్చిన ప్రబుద్ధుని ఒక్కసారి నాకు చూపిద్దురూ?"

"ఎందుకూ?" జాలప తీక్షణంగా చూస్తూ అడిగింది.

"ఆఁ ఎందుకూ లేదు. ఇంతమందిని నాశనంచేసి, నీ వేం బావుకున్నావయ్యా అని అడుగుతాను!"

"అతన్నడిగి ప్రయోజనం? నా స్వలాభంకోసం చేశానని స్పష్టంగా చెబుతాడు. కాకపోయినా, పోలీసులు ఇన్ని అత్యాచారాలు చేస్తూవుంటే అడిగేవారే లేరాయె! అతన్ని మాత్రం ఎందుకడగాలి?"

"సరే మీరన్నమాటకే వద్దాం, ఒకవేళ మీవారే ఇలాంటిపని చేస్తే మీరేం చేస్తారు?"

"ఆ మాట నన్నడగటం దేనికి? నీవూ ఆడదానివేగా, నీకు నీవే ఈప్రశ్న వేసుకో!"

"నేనైతే, ఇక ముఖమైనా చూడను."

"ఏమో, నే నంత గట్టిదనం చూపలేకపోయేదాన్నేమో! పోలీసువాళ్ళ భార్యలు ఎంతమంది లేరు. వాళ్ళందరూ తమ భర్తలకు తగినట్టుగా తత్వాలు మార్చుకోలే? నేనూ, అలాగా మారిపోయేదాన్నేమో!"

ఇంతలో పొద్దుగూకింది. జాలప లేస్తూ, "రేపు ఒకమాటు రండి. మీతో మాట్లాడినట్టేలేదు....ఇక్కడే కల్సుకొందాము" అన్నది. రెండడుగులు నడిచి ఆగి "ఇంతకూ మీ పేరు?" అనడిగింది.

"జోహరా."

అంతవరకూ చెప్పి జోహరా ఆపింది. రమానాథుడు సాశ్చర్యంగా, "అయితే నిజంపేరే చెప్పావా?" అన్నాడు.

"అవును! నష్టం ఏమిటి? బెంగాలీ ముస్లిము ననుకుని వుంటుంది" అంటూ జోహరా, తిరిగి జాలపకూ, తనకూ మధ్య జరిగిన కథను చెప్పసాగింది. "తరువాత ఆమెతో, నేనుకూడా మళ్ళీ దినేశ్ ఇంటికి పోయాను. అబ్బ....ఆ యిల్లు మహా ఇరుకు. జాలప రోజూ వాళ్ళకు అనేకవిధాల సేవ చేస్తూవుంటుంది. నేను వుండగానే ఆ పిల్లలకు నీళ్ళుపోసి, అన్నాలుపెట్టి, పక్కలువేసి పడుకోబెట్టింది. ఖాళీఅయిన అన్నపు గిన్నెలను తోమడం ప్రారంభించింది. నేను అంతవరకూ చూస్తూ కూర్చున్నాను. ఇక అల్లా కూర్చోలేకపోయాను. ఆమెలోవున్న సేవా ప్రవృత్తి నన్ను నిలువునా నీరుచేసింది. ఆమె చేతిలోనుంచి అంట్లు లాక్కొని నేను తోమ మొదలుపెట్టాను. జాలప నన్ను తోమనీయలేదు. నా చేతిలోవున్న అంట్లను లాక్కొని, "నీ వెన్నడూ చేసివుండవు. ఎందుకువచ్చిన శ్రమ?" అన్నది.

"మరి నీవుకూడా ఎన్నడూ చేసివుండవేమో?" అన్నాను.

"నా విషయం వేరు!"

"ఏం, ఎందుకనీ? నీ వెంతో, నేనూ అంతే. పోనీ ఒక దాసీదాన్ని పెట్టుకోకపోయారూ?"

"నెలకు ఎనిమిది రూపాయలు అడుగుతున్నారు."

"అయితే, ప్రతినెలా ఎనిమిది రూపాయలు నేను ఇస్తాను."

జాలప నావంక అతి కృతజ్ఞతతో చూసి, "నీకు ఆలస్యం అవుతున్నట్టుంది" అన్నది.

"లేదు నీతోపాటు మీ యింటిదాకా వచ్చి తరువాత వెళ్తాను."

జాలప ఇంటికి బయలుదేరేసరికి తొమ్మిగంటలైంది. దారిలోనే ఇలా అన్నాను: "జాలపా! నీవు నిజంగా దేవతవు!"

"ఎందుకూ? నేను వాళ్ళకు సేవ చేస్తున్నాననా? ఇది వాళ్ళకు సేవ చేయడం కాదు. నా పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాను. నాలాంటి దౌర్భాగ్యురాలు ఈ ప్రపంచంలో ఇంకొకతె వుండదు!"

"ఏమిటో; నీ వనేది నాకు అర్థం అవడంలేదు."

"ఒకప్పటికి తెలుసుకుంటావు. నా పాపానికి ప్రాయశ్చిత్తం ఒక జన్మతో తీరదు."

"నన్ను మభ్యపెడుతున్నావు. ఆ పాపమేమిటో, నీకు ప్రాయశ్చిత్తం ఎందుకో చెప్పనంతవరకూ వదలను."

కొంతసేపటివరకూ మేమిద్దరమూ మౌనంగా నడిచాము. తరువాత జాలపే మౌనాన్ని భగ్నపరుస్తూ మాట్లాడింది.

"నేనెవరినో తెలిస్తే, నీవు నన్నిలా సహృదయంతో చూడవు: ద్వేషిస్తావు!"

ఈ రెండు ముక్కలూ, నామీద విపరీతంగా పనిచేసినయ్యి. దహించుకుపోతున్న ఆమె హృదయంలోనుంచీ వచ్చిన ఈ మాటలు, సంస్కారమంటూ ఏమీలేని నన్నుకూడా కలచివేసినయ్యి. హృదయమంతా విశాలమై నేలమీద పరచుకొన్నట్లయింది. ఉన్న యదార్థాన్నంతా చెప్పేద్దామనిపించింది.

"నీవు పొరపడ్డావు జాలపా! తన తప్పులకే కాకుండా, తనవాళ్ళ తప్పులకుకూడా పశ్చాత్తాపపడగల హృదయం మహా గొప్పది. అలాంటి హృదయం నీకు వున్నది....భక్తితో కాళ్ళమీద పడేదాన్నేమో!"

"నిజమే, నీవు భక్తినీ, సానుభూతినీ చూపుతావు. అయినా నా కథను నేను చెప్పను. వింటే నీకు ఒరిగేదిమాత్రం ఏమున్నది?"

ఈ విధంగా చాలాసేపు నిజాన్ని చెప్పలేదు. చివరకు విషయాన్ని చెప్పి ఏడ్చింది.

తరువాత జోహరా ఒక్కక్షణం మౌనంగా కూర్చున్నది. మళ్ళీ ఇలా అన్నది:

"ఒకపని చేయనా?"

రమానాధుడు, "ఏమిటి?"

"కలెక్టరుగారితోచెప్పి, జాలపను ఎల్లాగయినా ఇక్కడినుంచి పంపేయనా? మాట్లాడుతూ మాట్లాడుతూ స్టేషన్‌దాకా తీసుకుపోయేది. రైలు రెడీగా వుంటుంది. కూర్చోబెట్టేది. పంపించేది! ఇంతకన్నా మార్గంలేదు. ఆమె పడే కష్టాన్ని చూడలేము!"

"అట్లా చెయ్యడం వుచితంగా వుంటుందా చెప్పు?"

"ఉచితంగా వుండనిమాట నిజమే."

రమానాధుడు చప్పున చెప్పులు వేసుకుని, "దేవీదీన్ ఇంట్లోనేనా వుంటున్నది?" అన్నాడు వెళ్ళడానికి వుద్యుక్తుడై.

"అయితే, ఇప్పుడు వెళ్తారా?"

"అవును. దానితో మాట్లాడి నా తప్పును సవరించుకుంటాను. నాకు బదులు అది ప్రాయశ్చిత్తం చేసుకోవడం సహించలేను."

"బాగా ఆలోచించుకున్నారా ?"

"ఆ, బాగా ఆలోచించుకున్నాను. అంతగా అయితే తప్పుడు సాక్ష్యం ఇచ్చినందుకు నాలుగైదు సంవత్సరాలు శిక్ష పడుతుంది. పరవాలేదు; వెళ్తున్నాను. బహుశా ఇక కలవనేమో, మర్చిపోబోక !"

రమానాధుడు లోపలినుంచి బయటకి వచ్చాడు. ఒక్క క్షణంలో గేటు దాటాడు.

కాపలావాడు, "సార్జంటుగోరికి చెప్పారా ?" అన్నాడు.

"అవుసరంలేదు."

"నేను అయ్యగోరికి చెప్పొస్తాను వుండండి....లేకుంటే, నా కూట్లో దుమ్ముపడుద్ది !"

రమానాధుడు సమాధానం చెప్పకుండా రోడ్డుమీదకు పోయాడు. జోహరా నిమీలితంగా అనిర్వచనీయమైన ఆనందంతో అతనివంక చూస్తున్నది.

కాపలావాడు పరుగెత్తుకుంటూపోయి సార్జంటుగారితో విషయాన్నంతా చెప్పాడు. అప్పుడే భోజనం చేస్తున్న సార్జంటు, "రమానాధుగారూ, ఒక్క మాట !" అంటూ వెంటపడటమూ, ఎదురుదెబ్బ తగిలి ముందుకు వాలడమూ ఒక్క తృటికాలంలో జరిగినయ్యి.

రమానాధుడు ఆగి ఆయన్ను లేవదీశాడు.

"ఎక్కడా దెబ్బతగల్లేదుకదా ?"

"లేదుగానీ, మీ రిప్పుడెక్కడికి బయల్దేరారు ? దీని పరిణామం ఎంత విషమంగా వుంటుందో ఆలోచించారా ?"

"నేను, ఇప్పుడే ఒక గంటలో వస్తాను. జాలపను ఎదుట పార్టీవాళ్ళు కలుపుకున్నారట. అప్పీలుకు హైకోర్టుకు పోతున్నారు. ఒద్దని చెప్పివస్తాను."

"ఇది మీ కెలా తెల్సింది....?"

"అయితే, మీకే వ్యతిరేకంగా వస్తున్నదన్నమాట ! అల్లాంటి ఆడదాన్ని కాయ్యాలి !"

"అందుకనే వెళ్తున్నాను. సరీగా బుద్ధిచెప్పివస్తాను. ఒక్కరాత్రి నాకు సెలవు ఇవ్వండి....దాన్నే ఏమిటి ? దాని తల్లో జేజినికూడా లాంగదీస్తాను !"

"అయితే, నేనూ వస్తాను, కొంచం ఆగండి."

"అబ్బే....లాభంలేదు. మీరు వచ్చేట్టు అయితే వ్యవహారం చెడిపోతుంది. ఇప్పుడే వస్తాను!"

సార్జంటు ఇంకేమీ మాట్లాడలేదు. క్షణం యోచించి జోహరాదగ్గిరకు పోయాడు. అక్కడనుంచీ పోలీసుస్టేషనుకు వెళ్ళాడు. రమానాధుడు జట్కా వేసుకుని నేరుగా దేవీదీన్ ఇంటికి పోయాడు.

జాలప అప్పుడే దినేశ్ ఇంటినుంచి వచ్చి జగ్గో, దేవీదీన్లతో మాట్లాడుతున్నది. ఇంతలో రమానాధ్ కేకవేశాడు.

"రమానాధ్‌గారులా వుంది" అన్నాడు దేవీదీన్.

"ఏంపనుందని వచ్చాడు? వచ్చినదారినే వెళ్ళమను!"

"త్వరపడబోకమ్మా! ఎందుకువచ్చాడో అడుగుదాం. అసలు ఈ సమయంలో ఎల్లా రాగలిగాడు?"

"ఆఁ, నాకు నచ్చచెప్పడానికి వచ్చివుంటాడు. ఇంకెందుకు వస్తాడు?"

దేవీదీన్ తలుపు తీశాడు.

రమానాధుడు లోపలికివస్తూనే "తాతా, నేనిలా, ఈ టైములో అకస్మాత్తుగా వచ్చినందుకు ఆశ్చర్యపడుతున్నావా? ఒక్క గంట టైము తీసుకువచ్చాను. చూడు తాతా! నే నేమైనా అపరాధాలు చేసివుంటే క్షమించు. మీ అందరిదగ్గరా క్షమార్పణ తీసుకోడానికే వచ్చాను. ఏదీ జాలప పైన వున్నదా?"

"ఆఁ వున్నది. ఇప్పుడే వచ్చిఁది. కూర్చో ఏమైనా ఫలహారం చేస్తావా?"

"వద్దు. అన్నం తినే వస్తున్నాను. జాలపతో రెండు మాటలు మాట్లాడి వెళ్తాను."

"ఏం ప్రయోజనం మాట్లాడి? నీవు ఎన్ని చెప్పినా వప్పుకోదు. అనవసరంగా మాట పోగొట్టుకోవడం జరుగుతుంది!"

"పోనీ, నన్నసలు మాట్లాడటానికి రమ్మంటుందో, వద్దంటుందో నీవు పోయి కనుక్కురా!"

"దీన్లో నేను కనుక్కునే దేముంది? ఇద్దరూ కూర్చున్నారు. వెళ్ళు. వెనకటిలా ఇప్పుడూ ఇది నీ ఇల్లే నాయనా!"

"అలాకాదు. నువ్వుపోయి కనుక్కురా మొదలు."

దేవీదీన్ పైకిపోయి రమానాధుడు తనతో మాట్లాడటానికి నిల్చున్నాడని జాలపతో చెప్పాడు.

జాలప రమానాధుకు వినిపించేట్టు పెద్దగా అన్నది.

"అంత చెప్పవల్సిన విషయం ఏమిటో చెప్పమను. నేనేం నోరు కట్టేశానా?"

జాలప గొంతు అతి కఠినంగావుంది. ఆ గొంతు విన్నతరువాత రమా

నాధుడి వుత్సాహమంతా విరిగిపోయింది. పైగా తనతో మాట్లాడుతుందనే నమ్మకంకూడా సడలిపోయిండి. ఆమెకు వినబడేట్లు పెద్దగా ఇలా అన్నాడు :

"తాతా ! అది నాతో మాట్లాడదు పోనీ, నేను ఇన్నాళ్ళనుంచీ మత్తులో పడివున్నాను. స్వార్థంతో కళ్ళు మూసుకు పోయినయ్యి. కానీ దాని ప్రవర్తన నా కళ్ళు తెరిచింది. నేను ఇప్పుడు జడ్జీదగ్గరకు పోతున్నాను. యథార్థాన్నంతా వప్పుకుంటాను. బహుశా ఐదారు సంవత్సరాలపాటు జైలుకు పోవచ్చు.... ఇక మళ్ళీ కనుపిస్తానో కనుపించనో చెప్పలేను ! నేను మీ అందరికీ అన్యాయం చేశాను క్షమించండి. దానితో చెప్పు, దాని నగలు దొంగలు తీసుకుపోలేదు. షరాబుకు ఇయ్యడానికి డబ్బు లేకపోతే నేనే దొంగిలించాను. ఈ విషయాన్ని ఆనాడే చెప్పివుంటే పరిస్థితులు ఇంత మిషమించేవికావు. తాతా ! నేను నీకు కూడా అబద్ధం చెప్పాను. నేను బ్రాహ్మణ్ణికాను. అన్యకులస్తుడిని.... శెలవు.... బ్రతికివుంటే మళ్ళీ కలుసుకుంటాను.... !"

జాలప గబగబా మెట్లు దిగివచ్చింది. రమానాధుడు అప్పటికే వెళ్ళి పోయాడు.

"తాతా ! వారెటుపోయారు ?" రుద్ధకంఠంతో అడిగింది జాలప.

"నేను చూడలేదమ్మా, పరుగెత్తుకుంటూ పోయాడు."

జాలప బజార్లోకి వచ్చి చూసింది. కాని, అతను కనుపించలేదు. ఆమె హృదయం అనురాగంతో, ప్రేమతో తొణికిసలాడింది. ఈ రెండున్నర సంవత్సరాల వైవాహిక జీవితంలో ఇంత పవిత్రమైన అనురాగం ఆమె కెన్నడూ భర్త మీద కలగలేదు.

రోడ్డుమీద నిల్చుని ఎటుపోయారా ? అని ఆలోచిస్తూవుండగా, జోహరా వచ్చి "ఇక్కడ నిల్చున్నావేం ? లోపలికిరా, నీతో చాలా విషయాలు మాట్లాడాలి !" అంటూ లోపలికి తీసుకుపోయింది.

# 49

రమానాధుడు వెళ్ళిన తరువాత ఒక గంటసేపటివరకూ సార్జంటు నిశ్చింతగా ఎదురుచూస్తూ కూర్చున్నాడు. తరువాత అతనిలో కలవరం బయలుదేరింది. గుర్రానెక్కి దేవీదీన్ ఇంటికి వెళ్ళాడు. అరగంట క్రితమే రమానాధుడు అక్కడినుంచి వెళ్ళినట్టు తెల్సుకుని బంగళాకు తిరిగివచ్చాడు. రమానాధుడు ఇంకా బంగళాకు రాలేదు. దేవీదీన్ దాచిపెట్టి అబద్ధం చెప్పాడనుకున్నాడు. వెంటనే సైకిలు వేసుకొని దేవీదీన్ ఇంటికివెళ్ళి అతన్ని బెదిరించసాగాడు.

చివరకు విసిగి దేవీదీన్ ఇలా అన్నాడు :

"మీకు నమ్మకంలేకపోతే ఇంట్లో వెతుక్కోండి."

"సరే. నీ ఇంట్లోలేడు ఒప్పుకుంటాను. మరి ఎక్కడికిపోయాడో చెప్పు."

"నాకు తెలిస్తేనా చెప్పడం ? ఇక్కడికి వచ్చాడు. ఆమెతో కీచులాడాడు. వెళ్ళిపోయాడు. ఇంతకుమించి నాకేమీ తెలియదు."

"అయితే, ఆమె ప్రయాగకు ఎప్పుడుపోతుంది ?"

"ఇప్పుడప్పుడేపోదు. హైకోర్టు తీర్పు వెలువడేవరకూ, ఇక్కడినుంచీ కదలదు !"

"ఏమో ! నీ మాటలమీద నమ్మకం కలగడంలేదు" అంటూ సార్జంట్ క్రింది గదిలోకిపోయి ప్రతివస్తువునూ పరిశీలనగా చూశాడు. తరవాత పైకి పోయాడు. పైన ముగ్గురు ఆడవాళ్ళుండటంచూసి మొదట ఆశ్చర్యపడ్డాడు. ఇతన్ని చూడగానే జోహరా ముసుగు కప్పుకుంది. ముసుగు కప్పుకుని ఘోషాను అభినయిస్తున్నది రమానాధుడేనని సార్జంటుకు అనుమానం కలిగింది.

సార్జంటు పక్కనేవున్న దేవీదీన్‌ని అడిగాడు :

"ఈ మూడోమనిషి ఎవరు ?"

"నాకు తెలియదు. అప్పుడప్పుడూ అమ్మాయితో మాట్లాడటానికి వస్తూవుంటుంది !"

"నా దగ్గిర వేషాలువేయకు. సర్కారు అపరాధికి చీరెకట్టిస్తావా ? వీళ్ళల్లో జాలప ఎవరో క్రిందకు పొమ్మను. మిగిలిన ఇద్దరూ అడుగైనా కదలకూడదు."

జాలప వెంటనే క్రిందకుపోయింది. సార్జంటు జోహరా దగ్గరకు పోయి ఇలా అన్నాడు "ఏం మిష్టర్ ? మంచివేషమే వేశావు ! ఒకగంటలో వస్తానని ఇక్కడికివచ్చి మజా వుడాయిస్తున్నావ్? పోదాంపద! అంటూ సార్జంటు జోహరా

ముసుగు లాగాడు. జోహరా చప్పట్లు చరుస్తూ పెద్దగా నవ్వింది. సార్జంటుగారి ఆశ్చర్యం హద్దుల్ని దాటింది.

"నువ్వా జోహరా! ఇక్కడి కెలా వచ్చావు?"

"అవును, వచ్చాను. మరి నా పని నేను చేయవద్దా?"

"మరి రమానాధుడేడీ?"

"నేను ఇక్కడికి రాకముందే వెళ్ళాడు."

"అయితే, కొంచం నాతో రా, అత నెక్కడ వున్నాడో వెతుకుదాం!"

కృత్రిమమైన ఆశ్చర్యాన్ని అభినయిస్తూ:

"అయితే, ఇంతవరకూ బంగళాకు రాలేదన్నమాట!"

"రాలే, మరెక్కడున్నాడో!"

దారిలో ఇన్‌స్పెక్టరు అడిగాడు:

"జాలప ఎప్పు డిక్కడినుంచి వెళ్తుంది?"

"ఎప్పుడువెళ్ళినా ఫరవాలేదు. నేను రమానాధుకు బాగా పురెక్కించాను.... ఇక్కడికి వచ్చి నానాతిట్లూ తిట్టాట్ట. పాపం ఏడుస్తున్నది. ఇక దారికి వచ్చినట్టే!"

"మరి....మనకిక వ్యతిరేకం చేయదని నమ్మకమేనా?"

"ఆ హా."

"మరి, ఇత నెక్కడికి పోయినట్టు?"

"ఏమో!"

"నేను వెంటనే దీన్ని......ఇన్‌స్పెక్టరుగారికీ, కలెక్టరుగారికీ తెలియ చెయ్యాలి. తాగి పోయాడా?"

"పూర్తిగా పట్టించాడు."

"అయితే ఎక్కడైనా పడిపోయాడేమో! కొంచెం అటుపోయి వెతుకు తాను. నిన్ను నీ ఇంటిదగ్గిర దిగబెట్టనా?"

"దిగబెడితే మంచిదే!"

సార్జంటు జోహరానుకూడా సైకిలుమీద కూర్చోబెట్టుకుని రెండు నిమిషాల్లో వాళ్ళ యిల్లు చేర్చాడు, అయితే అక్కడినుంచీ ఒంటరిగా తిరిగి రావడానికి మనస్సొప్పలేదు.

"జోహరా! నీతో ఒంటరిగా గడిపి....చాలా రోజులైంది. అతన్ని రేపు వెతకవచ్చుగానీ, ఈ ఒక్కరాత్రికి నేను మీ ఇంట్లో......!"

జోహరా మెట్లు ఎక్కుతూ "నేను రోజూ వుండేదాన్నేగా? మొదలు ఇన్‌స్పెక్టరుగారికి ఈ వార్త తెలియచెయ్యండి" అన్నది.

"ఉహుం ఇక నేను పోలేను. ఉదయం చూడవచ్చునులే!"

జోహరా మాట్లాడకుండా రివ్వున పైకిపోయి, తలుపులోపల్నుంచి గడియలు వేసుకుని, కిటికీలోనుంచి తొంగిచూస్తూ "నమస్తే. ఇక సెలవు!" అన్నది.

# 50

సార్జంటు ఇంటికిపోయి పడుకునేసరికి పసకొండు కొట్టారు. అందువల్ల తెల్లవారి ఎనిమిది గంటలకు నిద్రలేచాడు. నిద్ర లేస్తుండగానే ఎవరో ఫోనులో పిలిచారు. రిసీవర్ తీసుకున్నాడు. మాట్లాడేది కలెక్టరు.

"ఈ రమానాధుడు కొంపముంచాడు. అతన్ని ఇంకెక్కడైనా కొత్తచోట వుంచాలి. అతని సామానంతా కమీషనర్‌గారి దగ్గిరకు పంపండి.... అతడు రాత్రి బంగళాలో వున్నాడా?"

"లేడండి, రాత్రి నన్ను మోసగించి భార్యదగ్గిరకు పోయాడు!"

"ఎందుకు పోనిచ్చారు? అతను జడ్జీతో సర్వం చెప్పేసినట్టుంది! పోనీయకుండా వుంచాల్సింది. చాలా పొరపాటు చేశారు. పడ్డ శ్రమంతా వృధా అయింది."

"అవునండీ వెళ్ళాడు. వెళ్ళడమేకాదు మన గుట్టంతా చెప్పాడు! జడ్జి మళ్ళీ కేసును విచారిస్తాడు. ఈసారి రమానాధుడు తన సాక్ష్యాన్ని మార్చుకుంటాడు. అది....ఆ జోహరా....ఇదికూడా మోసంచేసింది. ఇదంతా మీ పొరపాటువల్ల ఇలా అయింది."

వెంటనే సార్జంటు రమానాధుడి సామాన్లన్నీ తీసుకుని కమీషనర్‌గారి బంగాళావైపు నడిచాడు. అతనికి, రమానాధుమీదా, జోహరామీదా, జాలపమీదా దేవీదీన్‌మీదా మింగేద్దామా అన్నంత కోపంగా వుంది.

ఒక వారంరోజులవరకూ పోలీసులపని మహా సందడిగా వుంది. కేసు గెలుస్తుందా లేదా, అనే విషయాన్ని వదిలి ఎవరికివారు ఎల్లా తప్పుకోవటమా అని యోచించసాగారు. చివరకు ఇన్‌స్పెక్టరూ, కలెక్టరూ తెలివిగా తప్పుకున్నారు. నేరమంతా సార్జంటుమీద పడ్డది.

మామూలు జనంకూడా దీన్నిగురించే మాట్లాడుకుంటున్నారు. ఆంగ్లేయ ప్రభుత్వకాలంలో తీర్పుచెప్పిన కేసు తిరిగి విచారణకురావటం ఇదే మొదలు. అదీ ఈ విధంగా విచారణకు రావడం! ప్రజలూ, ప్లీడర్లూ అందరూ ఏదో గొప్ప విచిత్రం జరుగుతుందన్నట్టు నోళ్ళు తెరచుకు ఎదురుచూస్తున్నారు. పోలీసులు సాధ్యమైనంతవరకు కేసును విచారణలేకుండా చేయాలని చూశారు. కానీ, వాళ్ళ మాట నెరవేరలేదు. జడ్జీగారికి, కొద్దిమంది పోలీసుల గౌరవ ప్రతిష్ఠల కోసం పదిహేను జీవితాల్ని నాశనం చేయడం నచ్చలేదు.

పోలీసులు రమానాధుని తిరిగి పట్టుకోవడానికి భూమినంతా గాలించారు. అయినా దొరకలేదు.

దేశంలో వున్న పత్రికలన్నీ కొన్నాళ్ళపాటు ఇదే విషయాన్ని తీసుకుని తమ సర్క్యులేషన్ పెంచుకున్నై. ఒక ఎడిటర్ జాలపనికల్సుకుని ఆమె చెప్పిందంతా ప్రకటించాడు. ఇంకో ఎడిటర్ జోహరాను కల్సుకున్నాడు. రమానాధుని మభ్యపరచడానికి తనకు రోజుకు యాభై రూపాయలు ఇస్తూవుండేవారని చెప్పింది. ఇదంతా చదివి పోలీసులు చేసేదిలేక కళ్ళెర్రచేసి వూరుకునేవారు. జాలపా, జోహరాలుకూడా ఎక్కడో దాక్కున్నారు.

ఈ విధంగా రెండునెల్లు గడిచినై. కేసు విచారణకు వచ్చింది. ఈసారి విచారణ వూరి చివరిబంగాళాలో జరప నిశ్చయించారు. కొంతమంది నగరపు పెదమనుష్యులుకూడా జడ్జీలుగా వుంటారు. సాధ్యమైనంతవరకూ ప్రజలు ఎక్కువమంది రాకుండా వుండేటట్టు చూశారు. అయినా ఐదారువందలమంది పోగయారు.

సార్జంటు తల్చుకుంటే బయటనుంచి కొన్ని సాక్ష్యాలను తయారుచేసేవాడే. కానీ, కలెక్టరు. ఇనస్పెక్టర్ల స్వార్థపరత్వాన్ని చూసి మండిపడి మెదలకండా ఊరుకున్నాడు.

పోలీసులు మిగిలిన పదిహేనుమంది నేరస్థుల్లోనుంచి ఒకడినైనా చీలుద్దామని విశ్వప్రయత్నం చేశారు. కానీ సాగలేదు.

ఇలాంటి పరిస్థితుల్లో కేసు ఎత్తివేసుకోవడంకంటే గత్యంతరం లేదు.

తప్పుడు కేసులు పెట్టిన అధికారుల్ని దూరప్రాంతాలకు మార్చారు.

నేరస్తు లనబడ్డ పదిహేనుమంది రాత్రి తొమ్మిదిగంటలాచాయల విడిచి పెట్టబడ్డారు. వారికి స్వాగతం ఇయ్యడానికి వూరి ప్రజానీకం అంతా వచ్చింది. జాలప ధైర్యసాహసాలను, సద్బుద్ధినీ ప్రతివాడూ మెచ్చుకుంటున్నాడు.

పోతే రమానాధునిమాత్రం ఇంకా విడిచిపెట్టలేదు. అతనిమీద తప్పుడు సాక్ష్యం ఇచ్చినట్టుగా కేసు పెట్టారు.

# 51

మరునటిరోజు అదే బంగళాలో రమానాధుడి కేసు విచారణకు వచ్చింది. శ్రావణమాసం కావడంవల్ల చినుకులు రాల్తున్నై. అయినా ఎదురుగావున్న మెల్లాలో అశేషంగా ప్రజలు పోగుపడ్డారు. వాళ్ళలో దినేశ్ భార్యకూడా వున్నది. విచారణ పదిపదిహేను నిమిషాల్లో ప్రారంభిస్తారనగా జాలప, జోహరాలు తెరల కట్టిన బండల్లో వచ్చారు. ఆడవాళ్ళకు లోపలికి పోవడానికి అనుమతి ఇచ్చారు.

పోలీసుల సాక్ష్యాలు ప్రారంభం అయినయ్యి. అధికారులందరూ తమ తమ సాక్ష్యాల్ని ఇచ్చారు. ఉభయపక్షాల ప్లీడర్లూ వాదించుకున్నారు. రమానాధుని వాఙ్మూలంకూడా అయిపోయింది.

రమానాధుడు జోహరా, జాలపలవల్ల తనెలా కళ్ళు తెరిచిందీ, తను చేసిన పనిని గురించి ఎల్లా పశ్చాత్తాపపడ్డదీ చెప్పాడు. తరువాత జోహరా, జాలప, దేవీదీన్‌ల సాక్ష్యాలనుకూడా తీసుకున్నారు. జోహరా చాలా ప్రభావోత్పాదకంగా తన సాక్ష్యాన్ని ముగించింది. తను ఎందుకు నియమింపబడ్డదీ, జాలప సేవాప్రవృత్తి తన కళ్ళనెలా తెరిచిందీ ఆద్యంతం వర్ణించింది. శ్రోతలు మంత్రముగ్ధులైనారు.

జాలప సాక్ష్యం మరీ గొప్పగా వుంది. తమ దాంపత్య జీవితంలోని పొరపులదగ్గర్నుంచీ, తనకు నగలమీద మమకారం, రమానాధుడి అభిమానపు మనస్తత్వం, దాన్ని పోలీసులు ఎంత అన్యాయంగా తమ స్వార్థానికి వినియోగించుకున్నదీ వివరంగా చెప్పింది. శ్రోతలు అశ్రుపూరిత నయనాల్తో జాలపను మహాదరంగా చూశారు.

తరువాత ప్రాసిక్యూటరు తన అభిప్రాయాన్ని వెల్లడించాడు. రమానాథుడు మోసగాడనీ, సమాజాన్నీ, ప్రభుత్వాన్నీ, పోలీసుల్నీ, చివరకు జడ్జీగార్నికూడా మోసగించాడనీ, అతనే స్వయంగా ఈ కేసుతో సంబంధంవున్నదని పోలీసులదగ్గరకు వెళ్ళాడనీ, తన వాక్చాతుర్యంవల్ల పోలీసుల్ని లోబరచుకున్నాడనీ, ఇప్పు డింకేదో అంతకుమించిన లాభం వస్తూండటంవల్ల ఇలా యెదురు తిరుగుతున్నాడనీ — సుదీర్ఘంగా మాట్లాడి తన అభిప్రాయాన్ని ముగిస్తూ — ఇలాంటివాళ్ళను శిక్షించకుండా ఎంతమాత్రం విడువకూడదన్నాడు.

ముద్దాయితరపు ప్లీడరు రమానాథుడు నిరపరాధని నిరూపించడానికి తనూ ఒక సుదీర్ఘమైన వాదన చేశాడు.

అన్ని వాదనల్నీ విని చివరకు సహృదయుడైన జడ్జీ, రమానాథుడు నిరపరాధనే తన అభిప్రాయాన్ని వెల్లడించి, అతనిని విముక్తునిచేశాడు.

# 52

మూడు సంవత్సరాలు గడిచిపోయినయి. దేవీదీన్ ప్రయాగకు ప్రక్కనే వున్న ఒక పల్లెటూర్లో కొంత పొలం కొన్నాడు. కొన్ని పశువుల్నికూడా కొని వ్యవసాయాన్ని సాగించాడు. దయానాధుడి ఉద్యోగం పోయింది. అతనుకూడా సంసారాన్ని పల్లెకు చేర్చాడు. దేవీదీన్, దయానాధులు ఇద్దరూ ఉమ్మడిగా వ్యవసాయాన్ని చేస్తున్నారు.

దయానాధుడు ఇప్పటికీ తీరికసమయాల్లో పత్రిక చదివి, ఊరివాళ్ళకు వినిపిస్తూ వుంటాడు. రమానాధుడు ఉద్యోగం మాని, అక్కడే కొంత స్థలంలో ఒక తోట వేశాడు. తోటలో రకరకాల పళ్ళచెట్లూ వేశాడు. కొద్ది సంవత్సరాల్లో మంచి ఆదాయం రావచ్చు! ఈ మూడు సంవత్సరాల్లో కొన్ని వైద్య గ్రంథాలు చదివాడు. చిన్న చిన్న జబ్బులకు ఊరివాళ్ళకు మందులిస్తూ వుంటాడు.

ఉదయాన్నే లేచి, మొదట వ్యాయామం చేస్తాడు. తరువాత కడుపునిండా పాలు తాగి, రోగులకు మందులిస్తాడు. రోగులపని ముగిసిన తరువాత తోటను చూచుకోడానికి పోతాడు ఈ విధంగా రమానాధుడి జీవితం మహా ప్రశాంతంలో పడ్డది.

జోహరా, రత్తన్‌కూడా అక్కడే వుంటున్నారు. రత్తన్ ఒక సంవత్సరం నుంచీ జబ్బుగా వుంటున్నది.

సాయంత్రం అయింది. దేవీదీన్, దయానాధుడు – ఇద్దరూ అప్పుడే పొలంనుంచి వచ్చారు. పక్కనే వున్న మర్రిచెట్టుక్రింద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు.

ఇంతలో రాజేశ్వరి ఆదుర్దాగా వచ్చి "తాతా, కొంచెం రత్తన్ దగ్గిరకు పో, ప్రమాదంగా వుంది. జోహరా, జాలపలు కన్నీళ్ళు పెట్టుకుంటున్నారు. అబ్బాయి ఎక్కడికి పోయాడో ఇంకా రాలేదు!" అన్నది.

"పదండి పోయి చూద్దాం" దయానాధుతో అన్నాడు దేవీదీన్.

"ఆయ నెందుకు? చూస్తూనే వణుకుతాడు" అన్నది రాజేశ్వరి.

దేవీదీన్, రత్తన్ గదిలోకిపోయి ఆమెను చూశాడు.

ఒక చిన్న కుక్కి మంచంలో అస్తవ్యస్తంగా పడుకుని వున్నది రత్తన్. కన్నులు మూతలు పడివున్నై. శరీరంతో చమటతో తడిసివున్నది. జోహరా, జాలపలు పక్కన వున్నారు.

జబ్బుపడ్డ ఈ సంవత్సరంనుంచీ జోహరే ఆమెకు సేవచేస్తున్నది.

దేవీదీన్‌ని చూసి, కన్నీళ్ళు తుడుచుకుంటూ "తాతా, చెయ్యి జూడు. డాక్టర్ను పిలుచుకువస్తానని వెళ్ళారు. ఇంతవరకూ రాలేదు" అన్నది జాలప.

దేవీదీన్ పెదవి విరచి "ఇక డాక్టరు అనవసరమమ్మా!" అన్నాడు.

తరువాత లోపలినుంచి విభూతి తెచ్చి, రత్తన్ మాడుకు రాచి ఏమిటో గొణుక్కుంటూ "అమ్మా! రత్తన్, కళ్ళు తెరువమ్మా!" అన్నాడు దేవీదీన్.

రత్తన్ కళ్ళు తెరచింది. కానీ, మన చూపు కాదు.

"ఏదీ, నా కారు వచ్చిందా? వా రెక్కడికి పోయారు? ఎవరు? జోహరా! మనం తోట చూడటానికి పోదామా?" అస్పష్టంగా పలవరించింది.

జోహరా, జాలపలు - ఇద్దరూ భోరున ఏడిచారు. దేవీదీన్ కళ్ళవెంట రెండు కన్నీటిబిందువులు రాలినయ్యి. రత్తన్ మళ్ళీ బాధగా కళ్ళు మూసింది. అంతే, మళ్ళీ తెరవలేదు.

ఆమె ఇహలోకపుయాత్ర ముగిసింది.

రత్తన్ మృత్యువువల్ల జోహరా హృదయానికి బాగా దెబ్బతగిలింది. ఈ మూడు సంవత్సరాలలో ఇద్దరూ ఎంతో సన్నిహితులయారు. తినడం, కూర్చోవడం, నిద్రపోవడం అన్నీ ఒకేచోట! తాము కలిసి తిరిగిన ప్రదేశాలు, చేసిన పనులూ జ్ఞాపకం చేసుకుని జోహరా దుఃఖిస్తూ వుండేది.

జాలప ఎప్పుడూ ఏదో ఒక పనిలో వుండేది. ఎప్పుడైనా తీరిక చేసుకుని జోహరాతోపాటు కలిసి విశ్రాంతిగా కూర్చుంటే ఆ నాలుగు క్షణాలూ రతన్ జీవితపు గడచిన అధ్యాయాలను జ్ఞాపకం చేసుకు దుఃఖించడంతో జరిగిపోయేవి!

అప్పుడప్పుడూ రత్తన్ దిగుల్ని మర్చిపోవడానికి జోహరా, జాలపలు గంగానది ఒడ్డుకుపోయి కొంతకాలాన్ని సంతోషంగా గడిపి వస్తుండేవారు.

భాద్రపదమాసం వచ్చింది. గంగానది వుధృతంగా ప్రవహిస్తున్నది. బల్లకట్టు నడిపే పల్లెకారికి తీరికే వుంటంలేదు. నదిలో అప్పుడప్పుడు పీనుగలూ, పశుకళేబరాలుకూడా కొట్టుకువస్తున్నై.

ఒకరోజు సాయంత్రం రమానాథుడు, జోహరా, జాలపలు నది వద్దున ...్చుని వున్నారు. సూర్యాస్తమయ సమయం కావడంవల్ల నదికి అవతలవున్న ...ళ్ళు త్వరగా ఇవతలకువచ్చి వూరు చేరుకోవాలని ఆదుర్దా పడుతున్నారు. పల్లెకారి ఎంతవద్దన్నా వినిపించుకోకుండా అవతలిగట్టున వున్నవాళ్ళంతా ఒక్కసారి బల్లకట్టుమీద ఎక్కారు. దిగి రెండోసారి రావడానికి ఎవరూ సిద్ధంగా లేరు. పల్లెకారి వివశుడై విపరీతం అయిన జనంతోవున్న ఆ బల్లకట్టును నడపడానికి గడ చేతపట్టాడు.

నది పురవళ్ళు తిరుగుతూ ప్రవహిస్తూండడంవల్ల బల్లకట్టు అటూ ఇటూ వూగిసలాడుతున్నది. పైన ఎక్కిన జనం ఎక్కడ నదిలో పడతామోనని అటూ ఇటూ తిరుగుతున్నారు. బరువు ఎక్కువైనవేపు బల్లకట్టు పూర్తిగా నదిలో మునిగిపోతున్నది.

ఇవతలివొడ్డునవున్న రమా, జాలపలు, మరి ఇతరులు 'జాగ్రత్త జాగ్ర అని అరుస్తున్నారు. కానీ, వినిపించుకునే దెవరు? నట్టనడుమ నదిలోకివచ్చి బల్లకట్టు పూర్తిగా ఒకవైపుకు ఒరిగింది. లోపలి మనుషులు చీమల్లా నదిలో రాలారు. వాళ్ళ ఆర్తనాదాలతో ఒడ్డునవున్నవారి గుండెలు జలదరించినై.

బల్లకట్టు మనిషితోసహా అందరూ మునిగారు.

ఒక్క క్షణం తరువాత ఒక్కొక్కళ్ళే తేల్తూ మునుగుతూ కొట్టుకుపోసా గారు. ఒడ్డువైపుకి కొట్టుకు వస్తున్న కొంతమందికి, ఒడ్డునవున్నవాళ్ళు చేతులు అందిస్తున్నారు.

అంతవరకూ దూరంగా నిల్చుని ఆశ్చర్యంగా చూస్తున్న జోహరా అ యత్నంగా అరిచింది. కొట్టుకుపోతున్నవాళ్ళల్లో ఒక స్త్రీ కూడా వున్నది. ఆ చంకలో ఒక పసిబిడ్డ వున్నాడు. అవ్యక్తంగా సహాయంకోసం అరుస్తున్నది. ఎవ్వరూ ఆమెవైపు చూడటం లేదు.

జోహరా పరుగెత్తుకుంటూ పోయి వాలుగా వున్న ఒడ్డున నిల్చుని చెయ్ అందించింది.

"అరెరె....జోహరా! పడతావు!!" పెద్దగా అరిచాడు రమానాధుడు.

జోహరా ఆమెను తీయడానికి చేతులు అందించింది. రమానాధుడూ సాయం చేద్దామని రెండడుగులు ముందుకు వేశాడు. ఇంతలో....జోహ్రారా వాలు ఒడ్డునుంచి నీళ్ళల్లో పడిపోయింది.

అంతే....రమానాధుడికి, జోహరా కడసారి దర్శనం అదే.

సమాప్తం

Cı



# మా నూతన ప్రచురణలు

| | |
|---|---|
| రంగభూమి<br>— ప్రేమ్‌చంద్ | 13-50 |
| పాతరోజులు<br>— గొల్లపూడి నారాయణ | 5-50 |
| గంగు<br>— వట్టికోట ఆళ్వారుస్వామి | 6-00 |
| ఎండమావులు<br>— హరికిషన్ | 4-50 |
| సాగర సంగీతం<br>— విహారి, శాలివాహన | 3-00 |
| విస్మృత యాత్రికుడు<br>— రాహుల్జీ | 7-00 |

ప్రతులకు :

విశాలాంధ్ర ప్రచురణాలయం
ఏలూరు రోడ్డు : : విజయవాడ-2

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada - 4.